# మహావాక్యదర్పణము

శ్రీ గణపతి సచ్చిదానంద ప్రశస్తి అవార్డు గ్రహీత
విశిష్ఠ విద్యాశిరోమణి, ప్రముఖ శ్రీవిద్యా ప్రచారకులు,
చతుర్వేద భాష్యకారులు, శ్రీవిద్యాబ్రహ్మసూత్ర భాష్యకారులు
అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు,
ఇండియా కల్చరల్ సెంటర్ & టెంపుల్, అమెరికా ఆస్థాన
విద్వాంసులు, కనకాభిషేకగ్రహీత, గండపెండేర సన్మానిత,
సువర్ణ ఘంటాకంకణ, శ్రీవిద్యారత్నాకర, శ్రీవిద్యావిశారద
స్వామి పరమానందనాథ

**డా॥ క్రోవి పార్థసారథి**


ప్రకాశకులు :

భారతీ గ్రంథమాల

41-22/4-36, భ్రమరాంబాపురం, కృష్ణలంక,

విజయవాడ-520 013, ఫోన్ : 0866-2522824

# మహావాక్యదర్పణము

**స్వామి పరమానందనాథ**

**డా॥ క్రోవి పార్థసారథి**

ప్రథమ ముద్రణ : హేమళంబి నామ సంవత్సర వైశాఖ శుద్ధ పంచమి,
ఆదివారం 30-4-2017 శ్రీ శంకర జయంతి

ప్రతులు : 1000



**వెల : రూ. 150-00**

ప్రతులకు :

1. **శివకామేశ్వరి గ్రంథమాల**
   41-22/4-36, భ్రమరాంబాపురం,
   కృష్ణలంక, విజయవాడ-520 013.
   ఫోన్ : 0866-2522824

2. **శివకామేశ్వరి ఆర్ష గ్రంథమాల**
   27-18-59, కాంగ్రెస్ ఆఫీస్ రోడ్డు,
   గవర్నర్‌పేట, విజయవాడ-520 002.
   ఫోన్ : 0866-6661777

ముద్రణ :
నిర్మలా ఆఫ్‌సెట్ ప్రింటర్స్,
గాంధీనగర్, విజయవాడ-3.

# ప్రణతులు

శంకర భగవత్పాదుల వారు వ్రాసిన గ్రంథాలలో 'మహావాక్యదర్పణము' ఒకటి. ఇది పూర్తిగా అద్వైత సిద్ధాంతపరమైన గ్రంథము. ఇందులో మొత్తం 309 శ్లోకాలున్నాయి. అజ్ఞాని అయిన సాధకుడు మంచి గురువుకు శుశ్రూష చేసి, గురువు అనుగ్రహంతో మోక్షం పొందాలి. **బ్రహ్మసత్యం జగన్మిథ్య** అనే విషయం తెలుసుకుని, మనసును జయించి, వాసనాక్షయం చేసి, ప్రకృతి నిలయం చేసి, మహావాక్యాలలో ఒకటైన **'తత్త్వమసి'** నేనే పరబ్రహ్మను అనే విషయం తెలుసుకున్న సాధకుడు మోక్షం పొందుతాడు.

ఈ గ్రంథాన్ని వికృతినామ సంవత్సర భాద్రపద శుద్ధ పూర్ణిమ 23-9-2010 రోజున ప్రారంభించటం జరిగింది. కారణాంతరాల వల్ల వాయిదా పడుతూ వచ్చింది. ఈ లోపల అనేక పుస్తకాలు వ్రాయటం, ఉపన్యాసాలు, ప్రపంచ రికార్డులు, మహాయాగాలు చాలా జరిగాయి. 16-1-2017న ప్రత్యగింరా మహాయాగం పూర్తయింది. అప్పుడు అనిపించింది. ఈ గ్రంథం పూర్తి చేస్తే బాగుండును అని అప్పటివరకు కేవలం 40 శ్లోకాలే పూర్తయినాయి. 20-1-2017న గ్రంథం వ్రాయటం మళ్ళీ ప్రారంభించాను. 15-2-2017 నాటికి గ్రంథం పూర్తయింది. అంతా పరమేశ్వరుడి లీల. నేను సామాన్యుణ్ణి.

ఈ పుస్తకం కేవలము సామాన్యులకోసం అత్యంత సులభశైలిలో వ్రాయబడింది.

ఈ గ్రంథాన్ని పొట్టి శ్రీరాములు జిల్లా పెనుశిలకోనలోని మణిద్వీప మహాసంస్థానాధిపతి శ్రీశ్రీశ్రీ మాతా విజయేశ్వరి దేవికి అంకితం చేస్తున్నాను. ఈ గ్రంథ ముద్రణకు నడుం కట్టిన శివకామేశ్వరీ గ్రంథమాల అధిపతి శ్రీగందూరి చంద్రమౌళి గారికి కృతజ్ఞతలు తెలియజేస్తూ...

జీవితంలో నాకు అన్నివిధాలా సహాయ సహకారాలందించిన నా భార్య స్వర్గీయ రమాదేవిని స్మరిస్తూ గతంలో లాగానే ఈ గ్రంథాన్ని కూడా ఆదరిస్తారని భావిస్తూ....

బుధజనవిధేయుడు

హేమళంబి నామ సంవత్సర వైశాఖ శుద్ధ పంచమి **క్రోవి పార్థసారథి**

ఆదివారం (శ్రీశంకరజయంతి)

30-4-2017

ఈ గ్రంథం



పొట్టిశ్రీరాములు జిల్లా,

పెనుశిలకోన మణిద్వీప మహాసంస్థానాధిపతి

మాతా విజయేశ్వరీ దేవికి

అంకితం చేయబడింది.



జననం
25.10.1952

శ్రీమతి క్రోవి రమాదేవి గారు

మరణం
12.01.2014

## విషయ సూచిక

# మహావాక్యదర్పణము

"ఇష్టప్రాప్తిని, అనిష్ట పరిహారాన్ని సాధించటానికి అలౌకికమైన ఉపాయాన్ని చెప్పేదే వేదము. ఈ వేదము మానవులెవ్వరిచేతా చెప్పబడలేదు. సాక్షాత్తు పరబ్రహ్మ ముఖం నుంచే వచ్చింది. మొదటగా వేదమంతా ఒకటిగానే ఉండేది. రానురాను వేదం చదివి దానిని అర్థం తెలుసుకోవటం కష్టమై పోయింది. అందుచేత ద్వాపరయుగంలో బ్రహ్మమానసపుత్రుడైన అపాంతరతముడు వేదాన్ని నాలుగు భాగాలుగా విభజించాడు. ఇలా ప్రతి మహాయుగంలోను వేదవిభజన జరుగుతోంది. ప్రస్తుతం 28వ మహాయుగంలో ఉన్నాం. ఈ మహాయుగంలో వేదాలను విభజించిన వాడు కృష్ణద్వైపాయనుడు. అతడే మనకు తెలిసిన వేదవ్యాసుడు. వ్యాసుడు నాలుగు వేదాలను తన శిష్యులైన 1. పైలుడు 2. వైశంపాయనుడు 3 జైమిని 4 సుమంతుడు అనే వారికి అప్పగించాడు. కాలక్రమేణా గురుశిష్యపరంపరగా ఈ వేదాలు శాఖోపశాఖలుగా వృద్ధిచెందాయి. ఋగ్వేదానికి-21, యజుర్వేదానికి-109, సామవేదానికి-1000, అధర్వవేదానికి - 50 శాఖలు ఉన్నాయని పండితులు చెబుతుంటారు.

వేదము నాలుగు భాగాలుగా ఉంటుంది. 1.సంహిత 2.బ్రాహ్మణము 3.ఆరణ్యకము 4.ఉపనిషత్తు. వీటిలో

1. సంహిత - మంత్రభాగము. ఇందులో దేవతా స్తోత్రాలు ఉంటాయి. వీటినే సూక్తాలు అంటారు.

2. బ్రాహ్మణము - సంహితలోని విషయాన్ని వివరించేది బ్రాహ్మణము.

3. అరణ్యకము - బ్రాహ్మణాలకు, ఉపనిషత్తులకు మధ్య స్థాయిలో ఉంటాయి. కర్మవిధులను ప్రతిపాదిస్తాయి.

4. ఉపనిషత్తు – ఉప–సమీపము నందు, ని–దిగువ స్థానంలో, షద్– కూర్చునుట. గురువు గారి దగ్గర ఆయనకన్న దిగువ స్థానంలో కూర్చుని వారు చేసే బ్రహ్మోపదేశాన్ని జాగ్రత్తగా వినటం.

ఉపనిషత్తు అంటే – బ్రహ్మవిద్య. బ్రహ్మవిద్యా పరిశీలకులైన విద్వాంసులకు కర్మ జన్మ మరణాలు లేకుండా చేసేది. జనన మరణాలను నశింపచేసేది. బ్రహ్మపదార్ధ లాభం కలుగజేసేది. వేదంలోని ప్రతిశాఖకు చివర ఒక ఉపనిషత్తు ఉంటుంది. వేదములో అంతమందు, చివరి భాగము నందు ఉంటుంది కాబట్టే దీన్ని వేదాంతము అంటారు. **వేదాంతము అంటె అద్వైత సిద్ధాంతమే అనే మాట గుర్తుంచుకోవాలి.**

ఈ రకంగా 1180 ఉపనిషత్తులు ఉన్నాయని చెబుతున్నారు. ప్రతి ఉపనిషత్తులోను పరబ్రహ్మతత్త్వాన్నే చెప్పారు. నిరాకారుడు, నిర్గుణస్వరూపుడగు పరబ్రహ్మ ఆదిమధ్యాంతాలు లేనివాడు, శాశ్వతుడు, స్వతంత్రుడు, ధర్మాధర్మాలు లేనివాడు, నిమిత్తమాత్రుడు, ఆనందస్వరూపుడు, జీవుల కర్మల ననుసరించి వారికి ఉత్తమ జన్మలు ప్రసాదిస్తాడు. సృష్టి స్థితి లయాలకు కారణం అతడే. పిపీలికాది బ్రహ్మ పర్యంతము నిండి ఉన్నాడు. చరాచర జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. సర్వవ్యాపి.

ఈ విధంగా పరబ్రహ్మ స్వరూపాన్ని ప్రతిపాదించటంలో ఉపనిషత్తులు చాలా వరకు సఫలీకృతమైనాయి. ఉపనిషత్తుల సారమే మహావాక్యాలు. ఇవి మొత్తం నాలుగు.

| | | | |
|---|---|---|---|
| 1. | ప్రజ్ఞానం బ్రహ్మ | ఐతరేయోపనిషత్తు | ఋగ్వేదము |
| 2. | అహం బ్రహ్మోస్మి | బృహదారణ్యకోపనిషత్తు | శుక్లయజుర్వేదము |
| 3. | తత్త్వమసి | ఛాందోగ్యోపనిషత్తు | సామవేదము |
| 4. | అయమాత్మాబ్రహ్మ | మాండూక్యోపనిషత్తు | అధర్వణవేదము |

ఈ మహావాక్యాలు **"చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. ఆ పరమేశ్వరుడు ఎవరో కాదు నువ్వే"** అనే విషయాన్ని వివరిస్తాయి. మహావాక్యాల అర్థం తెలియాలి అంటే ఈ నాలుగింటిని చదవవలసిన పనిలేదు. **'తత్త్వమసి'** అనే మహావాక్యానికి అర్థం తెలుసుకుంటే చాలు. మిగిలిన మహావాక్యాల అర్థం పూర్తిగా తెలుస్తుంది. **శుకరహస్యోపనిషత్తు**లో ఈ విషయం చెప్పబడింది. మహావాక్యార్థం

అందరికీ తెలియజెయ్యాలనే ఉద్దేశ్యంతోనే శంకర భగవత్పాదుల వారు **'మహావాక్య దర్పణము'** అనే గ్రంథాన్ని వ్రాశారు. ఇందులో మొత్తం 309 శ్లోకాలు ఉన్నాయి. ఈ గ్రంథంలో **'తత్త్వమసి'** అనే మహావాక్యాన్నే వివరించటం జరుగుతుంది.

ముందుగా నా గురుదేవులైన విరజానందనాథ, సదానందనాథ, శుకానంద నాథులకు నమస్కరించి, నన్ను ఆస్థాన విద్వాంసునిగా నియమించిన అవధూత, దత్త పీఠాధిపతి శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామివారికి సాష్టాంగదండ ప్రణామా లాచరించి అలాగే ఇండియా కల్చరల్ సెంటర్ & టెంపుల్, మెంఫిస్, యు.ఎస్.ఎ. వారికి కృతజ్ఞతలు తెలియజేసి, ధర్మసంస్థాపన కోసం ఏర్పాటయిన శృంగేరీ, బదరి, ద్వారక, పూరి పీఠాధిపతులకు వందనాలర్పించి, దేశంలోని స్వామీజీలకు, మాతాజీలకు, ఆధ్యాత్మికవిద్యాసంపన్నులకు అందరికీ నమస్కరించి మహావాక్యాల అర్థం సామాన్యులకు కూడా అర్థం కావాలనే ఉద్దేశ్యంతో అత్యంత సులభశైలిలో, **పరమానందనాథ** దీక్షానామం కలిగిన వెలనాటి బ్రాహ్మణుడు, హరితస గోత్రీకుడనైన **క్రోవి పార్థసారథి** అనే నేను ఈ గ్రంథానికి వివరణ వ్రాయటానికి ఉపక్రమిస్తున్నాను. దీన్ని ఆడియో సి.డిగా కూడా మీకందిస్తానని తెలియజేస్తూ, మీరందరూ నా యీ ప్రయత్నాన్ని మన్నించి నన్ను ఆదరిస్తారని, గతంలో వ్రాసిన గ్రంథాలలాగానే దీన్ని కూడా మన్నించి సద్వినియోగం చేసుకుంటారని భావిస్తూ – సాక్షాత్తు శంకరుడే ఈ గ్రంథ వివరణ పూర్తి గావిస్తాడని భావిస్తూ – వికృతినామ సంవత్సర, భాద్రపద పూర్ణిమ, గురువారం ఉదయం 6.00 గం॥లకు 'మహావాక్యదర్పణము' అనే గ్రంథానికి వివరణ ప్రారంభిస్తున్నాను.

**దర్శనం శ్రవణం జ్ఞానం । యత్రనాన్యస్య విద్యతే ।**
**అఖండైకరసం శాంతం । బ్రహ్మ తత్సముపాస్మహే ॥** 1

దేనిని గురించి తెలుసుకున్న తరువాత మానవుడు రెండవ దానిని వినలేడో, చూడలేడో, తెలుసుకోలేడో, ఆ పరమాత్మ తత్త్వాన్ని ధ్యానిస్తున్నాను. దానియొక్క కృపవల్ల నా బుద్ధి వికసించి, పరతత్త్వము నాకు బాగా బోధపడుగాక.

మహావాక్య దర్పణము అనే గ్రంథాన్ని ప్రారంభిస్తూ శంకర భగవత్పాదుల వారు మొదటి శ్లోకంలో పరతత్త్వాన్ని ప్రార్థిస్తున్నారు. దేన్ని గురించి తెలుసుకున్నంత మాత్రం చేత జగత్తులో ఇంకా తెలుసుకోవలసింది ఏదీ ఉండదో, అదే ఆత్మ. దేన్ని

గురించి తెలుసుకుంటే జగత్తులో అన్ని విషయాలు తెలుస్తాయో అదే ఆత్మ. ఈ ఆత్మ తనకు తానే సాక్షి. తనకు తానే తెలియబడుతుంది. ఈ ఆత్మే పరబ్రహ్మ. అంతకుమించినది, వేరైనది ఇంకొకటి లేదు. ఈ ఆత్మపురుషుడే సృష్టి స్థితి లయాలకు కారణమైన వాడు. ఆద్యంతములు లేనివాడు. నిరాకారుడు, నిర్గుణుడు, నిరంజనుడు, సత్యము నిత్యము శాశ్వతము అయినవాడు. సర్వాంతర్యామి. సర్వవ్యాపి. తలవెంట్రుకలో వెయ్యోవంతుగా అణుస్వరూపుడై ఉన్నాడు. అతడు జన్మించడు, మరణించడు, తడుపబడడు, శుష్కించడు, దహించబడడు, కదలింపబడడు, బేధించబడడు. జగత్తుకంతటికీ సాక్షీభూతుడు. ఆ పరమాత్మ పరిశుద్ధుడు. అతడికి ఏ రకమైన ఆకారము లేదు. అవయవాలు లేవు. అహంకార మమకారాలు లేవు. శబ్ద స్పర్శ రూప రస గంధాలు లేవు. నిష్కాముడు, ఆప్తకాముడు, పూర్ణకాముడు, ఊహించటానికి వీలుకానివాడు. అపవిత్రాన్ని పవిత్రంగా చేయగలవాడు. రాగద్వేషాలు లేనివాడు. అతడే ఆత్మసంజ్ఞ గలవాడు. అతడు ఒక్కడుగానే ఉన్నాడు. అతనితో సమానమైన వారు గాని, అతన్ని కన్నా అధికులు గాని ఎవరూలేరు. సమస్త జగత్తు రూపంలో ప్రకాశించేది అతడే. ఉపాధి భేదంతో అనేక రూపాలుగా దర్శనమిస్తున్నాడు. అతన్ని తెలుసుకోవటానికి వేరే ప్రమాణాలు ఏవీ లేవు. కేవలము జ్ఞానంతో మాత్రమే తెలుసుకోవాలి. ఆ పరమాత్మని గురించి తెలుసుకున్న తరువాత ఇంక తెలుసుకోవలసినది ఏదీ ఉండదు. శంకర భగవత్పాదుల వారు **'ఆత్మబోధ'** అనే పుస్తకం చివరలో ఆత్మని గురించి కొన్ని శ్లోకాలు చెబుతూ

**యల్లా భానపరోలాభో యత్సుఖాన్నా పరం సుఖం ।**
**యద్ జ్ఞానాన్నా పరం జ్ఞానం తద్ బ్రహ్మే త్యవధారయేత్ ॥ 54**

దేనిని పొందిన తరువాత ఇంక పొందవలసినది ఏదీ ఉండదో, ఏ సుఖాన్ని మించిన సుఖం ఇంకొకటి లేదో, ఏ జ్ఞానాన్ని మించిన జ్ఞానం మరొకటి ఉండదో అదే పరబ్రహ్మము. అంటే పరబ్రహ్మను మించిన జ్ఞానము గాని, లాభము గాని, సుఖముగాని ఏదీ లేదు.

**యద్ దృష్ట్వా నపరందృశ్యం యద్భూత్వా నపునర్భవః ।**
**యద్జ్ఞాత్వా నపరంజ్ఞేయం తద్ బ్రహ్మేత్యవ ధారయేత్ ॥ 55**

దేనిని చూసిన తరువాత ఇంకా చూడవలసినది ఏదీ ఉండదో, ఏ రూపాన్ని పొందిన తరువాత మరుజన్మ ఉండదో, దేన్ని తెలుసుకున్న తరువాత ఇంక తెలుసుకోవలసినది ఏదీ ఉండదో అదే ఆత్మ.

**తిర్యగూర్ధ్వ మధః పూర్ణం సచ్చిదానంద మద్వయమ్ ।**

**అనంతం నిత్యమేకం యద్ తద్ బ్రహ్మే త్యవధారయేత్ ॥ 56**

పైన క్రింద, ప్రక్కన అన్ని వైపులా అంతటా వ్యాపించి, సదా సుఖస్వరూపము, అద్వితీయము, అనంతము, నిత్యము, అద్వయము అయినదే బ్రహ్మము. అదే ఆత్మ.

**అతద్వ్యావృతిరూపేణ వేదాన్తై ర్లక్ష్యతే ద్వయమ్ ।**

**అఖండానందమేకం యత్తద్ బ్రహ్మేత్యనధారయేత్ ॥ 57**

'తత్త్వమసి' మొదలైన మహావాక్యాలు దేనిని బ్రహ్మము అని ఘోషిస్తున్నాయో, అద్వితీయము, అఖండానందైకరసము అయినది ఏదో, అదే ఆత్మ.

**అనణ్వమస్థూలమహ్రస్వ మదీర్ఘ మజ మవ్యయమ్ ।**

**అరూపగుణ వర్ణాఢ్యం తద్ బ్రహ్మేత్యవధారయేత్ ॥ 60**

పరబ్రహ్మము సూక్ష్మము కాదు. స్థూలము కాదు. పొడవు కాదు. పొట్టి కాదు. చావు పుట్టుకలు లేనిది. రూపము, గుణము, వర్ణము లేనిది, నాశనము లేనిది పరమాత్మ.

**యద్భాసా భాస్యతేర్కాదిః భాస్యైర్యత్తున భాస్యతే ।**

**యేన సర్వమిదం భాతి తద్ బ్రహ్మేత్యవధారయేత్ ॥ 61**

ఆ పరబ్రహ్మ యొక్క కాంతి వల్లనే సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు అన్నీ ప్రకాశిస్తున్నాయి. కాని పరమాత్మ మాత్రం స్వయంప్రకాశి. ఈ జగత్తంతా దేనివల్ల ప్రకాశిస్తోందో అదే ఆత్మ.

**తద్యుక్త మఖిలం వస్తు వ్యవహారస్తదన్వితః ।**

**తస్మాత్ సర్వగతంబ్రహ్మ క్షీరేసర్పిరివాఖిలే ॥ 59**

పాలలో నెయ్యిలాగా పరమాత్మ ఈ జగత్తంతా ఆవరించి ఉన్నాడు.

అటువంటి పరమాత్మను ధ్యానం చేస్తున్నాను. ఆ పరబ్రహ్మ అనుగ్రహంతోనే 'మహావాక్యదర్పణము' అనే ఈ గ్రంథానికి నేను వివరణ వ్రాస్తున్నాను అంటున్నారు పరమానందనాథులు.

ఇక్కడ నుండి పది శ్లోకాలలో జనుల అజ్ఞానాన్ని వివరిస్తున్నారు.

**మిథ్యేతి మన్యతే స్వప్నం జాగరం సత్యమీక్షతే ।**
**బుద్ధేర్విలాసవైచిత్ర్యం ఆహో అజ్ఞ జనాజ్ఞతా ॥** 2

జాగ్రద్స్వప్నావస్థలు బుద్ధి విలాసాలు. ఈ విషయం అందరికీ అనుభవమే. ఆ బుద్ధి బాహ్యేంద్రియాల వల్ల, బాహ్య పదార్థాలను ప్రకాశింప చేసినప్పుడు దాన్ని జాగ్రదావస్థ అంటారు. బాహ్యేంద్రియాలను వదలి స్వయంగా విషయాలను కల్పించుకుని, వాటిని ప్రకాశింప చేసే స్థితినే స్వప్నావస్థ అంటారు. ఈ రెండు అవస్థలూ కల్పితాలే. అసత్యాలే. కాని వీటిలో జాగ్రదవస్థ సత్యమని, స్వప్నావస్థ అసత్యమని భావిస్తుంటారు. బుద్ధిచేత కల్పించబడిన ఈ రెండు అవస్థలకు లయస్థానం సుషుప్తి. ఆ సుషుప్తిలో ప్రకాశించే తత్త్వమే సత్యము అని తెలుసుకోలేక పోతున్నారు. అటువంటి ఈ మానవుల అజ్ఞానాన్ని ఏమని వర్ణింపగలను? అంటున్నారు.

## 1. అజ్ఞానము

'అజ్ఞానం' అనే మాట మనం అనేకసార్లు చెబుతుంటాం. అసలు అజ్ఞానం అంటే ఏమిటి? అది ఎందుకు వస్తుంది? జ్ఞానం లేకపోవటమే అజ్ఞానం. జ్ఞానమనేది రెండు రకాలు.

**1. విషయపరిజ్ఞానము :** లోకంలో మనకు కనుపించేవస్తువుల, మనం ఉపయోగించేవస్తువుల విషయపరిజ్ఞానం. దీన్నే సామాన్యజ్ఞానము అంటారు. దైనందిన జీవితంలో దీని అవసరం ఎంతైనా ఉంది.

**2. పరాజ్ఞానము :** పరమేశ్వరుడు, పరబ్రహ్మను గురించినజ్ఞానము. చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే ఆ పరమేశ్వరుడే ఈ జగత్తును సృష్టించాడు. అతడే పరబ్రహ్మ. సృష్టి ప్రారంభం కాక ముందు ఈ జగత్తంతా శూన్యంగా ఉండేది. ఆ శూన్యాన్ని పరబ్రహ్మ ఆక్రమించి ఉన్నాడు. సృష్టి జరిగిన తరువాత తానే 84

లక్షల రకాలయిన జీవరాసిగా మారాడు. ఈ రకంగా మళ్ళీ జగత్తంతా ఆక్రమించి ఉన్నాడు. మొత్తం మీద **చరాచర జగత్తంతా పరమేశ్వరమయం. జగత్తే పరమేశ్వరుడు, పరమేశ్వరుడే జగత్తు.** వేదాంత పరిభాషలో దీన్నే జ్ఞానము అంటారు. ఈ రకమైన జ్ఞానం లేకపోవటాన్నే అజ్ఞానం అంటారు.

పరమేశ్వరుడు మానవ శరీరాన్ని సృష్టించిన తరువాత ఈ శరీరంలో నేను లేకపోతే ఎలాగ? అనుకుని బ్రహ్మరంధ్రం గుండా మానవ శరీరంలో ప్రవేశించి, దానితో తాదాత్మ్యం చెంది, నవరంధ్రాలతోను అన్ని సుఖాలు అనుభవిస్తూ, వచ్చిన త్రోవ కూడా మరచిపోయి, నేను అంటే దేహము అని భావన చేశాడు. ఈ శరీరంతో అనుభవించే లౌకిక సుఖాలే నిజమైన సుఖాలు అనుకుని పంజరంలో బంధించబడిన పక్షిలాగా ఈ దేహంలోనే ఉండిపోయి, అజ్ఞానాంధకారంలో మునిగిపోయి, దిక్కు తోచక, బయటకు వచ్చే దారి తెలియక, అజ్ఞానాన్ని ఎలా వదిలించుకోవాలో తెలియక, అందులోనే శ్లేష్మంలోపడ్డ ఈగలాగా కొట్టుమిట్టాడుతున్నాడు. అయితే అజ్ఞానం ఎందుకు వస్తుంది? అనేది చాలా పెద్ద ప్రశ్న. అజ్ఞానం రెండు కారణాల వల్ల వస్తుంది. 1. అగ్రాహ్యము 2. అన్యథాగ్రాహ్యము.

**1. అగ్రాహ్యము :** ఏదైనా వస్తువును చూసినప్పుడు దానియొక్క యథార్థ స్థితిని గ్రహించలేకపోవటం, మానవదేహం పాంచభౌతికమైంది. ఇందులో రక్తమాంసాలు, మలమూత్రాలు, ఎముకలు, నరాలు అన్నీ ఉండి, పైనమాత్రం చర్మంచేత కప్పబడి ఉంటుంది. శరీరమంతా ఉండేవి ఇవే. కాని ఈ శరీరంలో ఒక్కొక్క భాగాన్ని చూసినప్పుడు మానవుడు ఒక్కో రకంగా స్పందిస్తాడు. అక్కడ ఏదో ఉన్నది. దాన్ని అందుకోవాలి. అనుభవించాలి. ఆనందించాలి అనుకుంటాడు. ఈ ఆనందానికి తృప్తి ఉండదు. ఎంతగా ఆనందించినా ఇకచాలు అనడు. ఇంకా ఇంకా కావాలి అనుకుంటాడు. ఇది నిజమైనఆనందంకాదు. ఈ ఆనందం తరువాత దుఃఖము ఉంటుంది. లోకంలో విపరీతమైన ఆనందాన్నిచ్చేది రతిసౌఖ్యము అనుకుంటారు. కాని మైథునక్రియ తరువాత స్త్రీ పురుషులిద్దరూ బడలిక పొందుతారు. ఆ బడలిక స్త్రీ విషయంలో ఇంకా ఎక్కువ ఉంటుంది. లౌకికమైన ఆనందాలన్నీ దుఃఖాన్ని మిగిల్చేవే. మానవుడు అజ్ఞానంవల్ల వీటిని తెలుసుకోలేడు. మసక చీకటిలో త్రాడునుచూసి పాము అనుకుంటాడు, దీన్నే **రజ్జుసర్పభ్రాంతి** అంటారు. అలా

స్థాణువును చూసి దొంగవాడని, ముత్యపుచిప్పను చూసి వెండిగిన్నె అని భ్రమిస్తాడు. తన చుట్టూ ఉన్నవాటిలో ఏదిసత్యం, ఏదిఅసత్యం అనే విషయం తెలుసుకోలేడు. ఏది శాశ్వతమైనది? ఏది అశాశ్వతమైనది అనే విషయం గుర్తించలేడు. **దృశ్యమానమైన జగత్తులో కంటికి కనిపించేదంతా నశించేదే** అని గ్రహించలేడు.

అజ్ఞానానికి రెండవ కారణం **అన్యధాగ్రాహ్యము**, వస్తువును చూసినప్పుడు దాని యథార్ధ రూపం తెలుసుకోలేడు సరికదా, దాన్ని ఇంకొక రకంగా భావిస్తాడు. త్రాడును చూసి పాము అనుకున్నాడు. అంతేకాని ఎప్పుడూ పామును చూసి త్రాడు అనుకోడు. ఈ రెండు కారణాల వల్లనే అజ్ఞానం వస్తుంది. అయితే ఈ అజ్ఞానం ఈ జన్మలో వచ్చింది కాదు. కొన్ని లక్షలు, కోట్లజన్మలనుంచి మనని అంటి పెట్టుకుని ఉంది. ఈ కారణం చేతనే దీన్ని వదిలించుకోవటం అంతతేలిక కాదు. తెల్లటి వస్త్రాన్ని తెచ్చి ఇల్లు తుడిచాం. ఆ వస్త్రం కాస్తా మట్టి పట్టిపోతుంది. ఎంత ఉతికినా దాని అసలు స్థితికి రాదు. అదే వస్త్రంతో అనేకసార్లు ఇల్లు తుడిచాం. ఆ వస్త్రానికి మట్టి బాగాఅంటింది. దానిలో జీర్ణించుకుపోయింది. ఇప్పుడు ఆ వస్త్రాన్ని శుభ్రం చెయ్యటం పూర్వంలాగా తెల్లగాచెయ్యటం సాధ్యంకాదు. ఇలా జరగాలంటే విపరీతమైన పరిశ్రమ కావాలి. అలాగే ఇన్నిజన్మలనుంచి పేరుకుపోయిన అజ్ఞానాన్ని వదిలించు కోవటం అంతతేలికకాదు. ఈపని జరగాలిఅంటే వేదాంతాన్ని ఆశ్రయించాలి.

ఒకసారి వర్షాకాలం. జోరున వాన కురుస్తోంది. వాగులు, వంకలు పూర్తిగా నిండిపోయినాయి. నదులు పొంగుతున్నాయి. ఒక ఊళ్ళో వర్షానికి నీరంతా కాలవలాగా ప్రవహిస్తోంది. అందులో ఒక పెద్ద తేలు కొట్టుకుపోతోంది. చూశాడు ఒక సన్యాసి. ఆ తేలును జాగ్రత్తగా పట్టుకుని వడ్డున వదిలిపెట్టాడు. వదిలి పెట్టగానే ఆ తేలు ఆ సన్యాసిని కుట్టి మళ్ళీ పెరుగెత్తుకుంటూ నీళ్ళలోకి వెళ్ళిపోయింది. ఈ సన్యాసి ఆ తేలును మళ్ళీ వడ్డుకు చేర్చాడు. అది అతణ్ణి మళ్ళీ కుట్టింది. ఇలా కొనసాగుతోంది. దారిన పోయే ఒకరైతు అదంతా చూసి సన్యాసితో "స్వామీ! అది తేలు. కుడుతుంది. ఒక దెబ్బవేసి చంపెయ్యచ్చు కదా? నువ్వు రక్షించిన ప్రతిసారి నిన్ను కుడుతూనే ఉంది. ఎందుకిలా చేస్తున్నావు? అన్నాడు. అప్పుడు ఆ సన్యాసి "నాయినా! అది తేలు. కుట్టటం దాని నైజం. దాన్నిరక్షించటానికి నేను ప్రయత్నిస్తున్నాను అని తెలుసుకోలేకపోతోంది. నేను సన్యాసిని. ఇతర జీవులకు కష్టం కలగకుండా

సహాయపడటం నా కర్తవ్యం. అందుకే ఇలా చేస్తున్నాను" అన్నాడు. ఆ తేలు అజ్ఞానంతో తనను రక్షించటానికి వచ్చిన సన్యాసికి హాని కలిగిస్తోంది. అలాగే అజ్ఞానంలో కూరుకుపోయిన వాడు తనను ఉద్ధరించటానికి వచ్చిన వారిని హేళన చేస్తాడు. అవమానిస్తాడు. అంతేకాని అంది వచ్చిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకోడు.

ఒక పండితుడు బాట వెంబడి పోతున్నాడు. దారి ప్రక్కన పెద్ద మురుగుగుంట భరించలేని దుర్వాసన వస్తోంది. ముక్కు మూసుకుని నడుస్తున్నాడు పండితుడు. ఇంతలో ఒక పెద్ద పంది వచ్చి ఆ మురుగులో కలయతిరిగి హాయిగా అందులో పడుకుంది. దుర్వాసన మరీ ఎక్కువైంది. అప్పుడు ఆ పండితుడు పందితో భరించలేని చెడు వాసన వస్తున్న మురుగులో ఎందుకు దొర్లుతావు? బయటకు రావచ్చు కదా?" అన్నాడు. దానికి ఆ పంది "ఓ పండితోత్తమా! ఈ మురుగులో పడుకుంటే ఎంత హాయిగా ఉంటుందో తెలుసా? నువు కూడా వచ్చి ఇక్కడ పడుకుని చూడు. ఇందులోని సుఖమేమిటో నీకు తెలుస్తుంది." అన్నది.

అజ్ఞానంలో కూరుకుపోయిన వాడు అందులోనే ఆనందం ఉన్నది అనుకుంటాడు. అందులోంచి బయటకు రావటానికి ఇష్టపడడు.

**క్రిమి సంహార సంకులము కేవలనింద్యము పూతిగంధహేయము**
**ఖరాంగు భువంబగు నెమ్ము కుక్క తానమలుచు**
**చెంతనున్న సురరాజును కనుగొని సిగ్గు చెందదది.**

ఒక గాడిద చచ్చి కుళ్ళిపోయింది. శరీరమంతా పురుగులు పడి, భరించలేని దుర్వాసన వస్తోంది. ఇంతలో ఒక కుక్క ఆ గాడిద కాలి ఎముక పట్టుకుపోయి పీక్కు తింటున్నది. ఆకాశమార్గాన వెడుతున్న ఇంద్రుడు అది చూసి క్రిందికి వచ్చి కుక్క దగ్గర ఆగాడు. అయినా సరే. తన ఎదుట దేవరాజైన ఇంద్రుడు ఉన్నాడు అనే జ్ఞానంకూడా లేకుండా, ఆ కుక్క ఆ ఎముకను తింటున్నది. అలాగే అజ్ఞానులు కూడా తాము చేసే పని చాలా గొప్పది అని భావిస్తారు. తామున్న పరిసరాలు కూడా గమనించరు. యుక్తాయుక్త విచక్షణ ఏ మాత్రం ఉండదు. ఎందుకని అంటే వారు అజ్ఞానులు. అజ్ఞానం కొన్ని కోట్లజన్మలనుంచి జీవిని ఆశ్రయించి ఉంది. దాన్ని వదిలించుకోవటం అంత తేలికకాదు.

జగత్తంతా పరమేశ్వరుని నుంచే ఆవిర్భవించింది. ఆయన వల్లనే పోషింపబడుతోంది. తిరిగి ఆయనలోనే లీనమవుతున్నది. సృష్టి స్థితి లయాలకు కారణం ఆ పరమేశ్వరుడే. పరమేశ్వరుడేజగత్తు. జగత్తేపరమేశ్వరుడు. ఈ విషయం మరిచిపోయి జగత్సృష్టికి కారణం ఇంకేదో ఉన్నది అని చెబుతుంటారు. 'ప్రకృతి పురుషుల వల్లనే జగత్తు ఆవిర్భవిస్తోంది' అంటారు **సాంఖ్యులు.** మీమాంసకారుల దృష్టిలో జగత్తు ఎవరిచేతా సృష్టించబడలేదు. శాశ్వతంగా అలాగే ఉంటుంది. పరమాణవులు కలయికతో జగత్తు ఏర్పడుతోంది అంటాడు **కణాదుడు.** "కొన్ని పదార్థాల కలయిక వల్ల క్రొత్త పదార్థం ఏర్పడుతుంది. పసుపు, సున్నం కలిస్తే పారాణి అవుతుంది. అలాగే ఈ జగత్తు కూడా" అంటారు **చార్వాకులు.** ఇదంతా అజ్ఞానమే. **జగత్తుకు కారణం పరమేశ్వరుడు.** ఈ విషయాన్ని గుర్తించలేకపోవటమే అజ్ఞానం.

మనం చెప్పే శాస్త్రాలు, ప్రమాణాలు, సూత్రాలు ఇవన్నీ అవిద్యతో కూడిన దేహానికే గాని జ్ఞానికి మాత్రం కాదు. అజ్ఞాని అయిన మానవుడు పశుప్రాయుడు. కర్మమార్గం అంటే యజ్ఞాలు, యాగాలు, పూజలు, జపతపాలు, అర్చన, హోమం, ఇవన్నీ అజ్ఞానులకే. జ్ఞానికి వీటితో పనిలేదు. ఆత్మకు కులము, మతము, జాతి, లింగభేదాలు ఉండవు. కష్టసుఖాలుండవు. మానవుడు తాను చేసిన పనులన్నింటికీ తానే కర్త, భోక్త అనుకుంటాడు. ఇదే అధ్యాస. **ఒక దాని లక్షణాలు వేరొక దానిలో ఆరోపించటాన్నే వేదాంత పరిభాషలో "అధ్యాసము" అంటారు**. దీన్ని పోగొట్టి జగత్తులో ఆత్మ ఒక్కటే సత్యము, నిత్యము, శాశ్వతము. **బ్రహ్మసత్యం జగన్మిధ్య** అని చెబుతున్నారు శంకర భగవత్పాదులవారు ఈ గ్రంథంలో

ఈ శ్లోకంలో అవస్థాత్రయాన్ని చెబుతూ, వాటిలో ఏది సత్యము? ఏది అసత్యము? అనే మాటను వివరిస్తున్నారు. ముందుగా జాగ్రదవస్థ చూద్దాం. ఇది జీవుడు మేల్కొని ఉన్న స్థితి. దీన్ని అనుభవించేది స్థూలదేహము. ఇది రక్తము, మాంసము, ఎముకలు, నరాలు, మలమూత్రాలతో ఏర్పడి, పైన చర్మము కప్పబడి ఉంటుంది. మానవుడు తాను చేసిన కర్మ ఫలితాన్ని అనుభవించటానికే ఈ దేహము ఏర్పడింది. సుఖదుఃఖాలు, మానావమానాలు అనుభవించేది ఈ దేహంతోనే. ఈ అవస్థలోనే వర్ణాశ్రమ ధర్మాలు, వివిధ దశలు ఉన్నాయి. స్థూలశరీరం ఎప్పుడూ

జాగ్రదవస్థలోనే అనుభవాలు పొందుతుంది. జాగ్రదవస్థకి అభిమాని విశ్వుడు. అతడే వైశ్వానరుడు. జాగ్రదవస్థ ఇతని సంచార స్థానం. ఇతనికి ఏడు అంగాలు, పందొనిమిది ముఖాలు ఉంటాయి. ఈ ముఖాలతోనే తాను చేసిన కర్మ ఫలితాన్ని అనుభవిస్తాడు. జాగ్రదవస్థలో స్థూలశరీరాభిమాని అయిన పరమేశ్వరుడు విశ్వుని రూపంలో ఉంటాడు. **జీవుడు నేత్రంలో ఉన్న దశే, ఈ అవస్థ.** ఇక్కడ నేత్రము అంటే, ఆపాదమస్తకము అని అర్థం. కాబట్టి చిద్రూపి అయిన జీవుడు జాగ్రదవస్థలో శరీరమంతా వ్యాపించి, మేల్కొని ఉన్నాడు. ఈ దేహంతో తాదాత్మ్యం పొందిన జీవుడు సుఖిస్తున్నాడు, దుఃఖిస్తున్నాడు. అంతేకాదు ఒక్కొక్కసారి ఉదాసీనంగా కూడా ఉంటాడు. ఈ స్థితిలో బుద్ధి బాగా పని చేస్తుంది. కంటికి కనిపించే వస్తువులను చక్కగా చూస్తాడు. చెవులతో వింటాడు. ఇంద్రియ జ్ఞానం పూర్తిగా ఉంటుంది.

నిద్రలో కలలు కనేస్థితిని స్వప్నావస్థ అంటారు. జాగ్రదవస్థలోని పురుషుని అనుభవాలే స్వప్నంలో సాక్షాత్కరిస్తాయి. **ఈ స్థితిలో జీవుడు కంఠ స్థానంలో ఉంటాడు.** మనస్సు చిత్ర విచిత్రమైన కల్పనలు చేస్తుంది. రాజులు, రాజ్యాలు, రథాలు, గుర్రాలు, ఏనుగులు వీటన్నింటినీ సృష్టించుకుంటుంది. తాను రాజైనట్లుగా భావిస్తుంది. ఒక్కొక్కసారి కష్టాలు వస్తాయి. ఈ రకంగా సుఖము, దుఃఖము, భయము అన్నీ అనుభవిస్తుంది. ఏడుస్తుంది. ఆనందిస్తుంది. స్వప్నావస్థకు అభిమాని తేజసుడు. జాగ్రదవస్థలో కలిగిన అనుభవాలు బీజరూపంలో ఉండి, స్వప్నకాలంలో సాక్షాత్కరిస్తాయి. జాగ్రదవస్థలో ఇంద్రియ జ్ఞానం స్థిరంగా ఉంటుంది. స్వప్నావస్థలో ఇంద్రియ జ్ఞానం స్థిరంగా ఉండదు. మనస్సే ఇంద్రియాల పనులన్నీ చేస్తుంది. నిద్రలో విషయాలు తెలుస్తాయి. కలలు వస్తాయి. మెలకువ రాగానే అన్నీ మాయమవుతాయి. ఇలా సూక్ష్మ శరీరంతో అనుభవాలు పొందుతాడు. అయితే మెలకువ రాగానే కలకరిగిపోతుంది. కాబట్టి జాగ్రదవస్థ సత్యమని, స్వప్నావస్థ అసత్యమని నమ్ముతాడు.

అంతఃకరణలో చిత్తాన్ని, అహంకారాన్ని వదలి మనోబుద్ధులతో **జీవుడు హృదయ స్థానంలో ప్రవేశించినప్పుడు దాన్ని సుషుప్తి అంటారు.** ఇక్కడ ఇంద్రియాలు వ్యాపార శూన్యమవుతాయి. గాఢనిద్ర ఆవరిస్తుంది. బాహ్యవస్తు జ్ఞానము ఏ మాత్రము ఉండదు. ఈ స్థితిలో అతని అనుభవాలన్నీ ఏకమై పోతాయి. గ్రహణశక్తి అస్పష్టంగా

నిలిచిపోతుంది. సుషుప్తిలో ప్రాజ్ఞుడికి బ్రహ్మభావన కలుగుతుంది. జీవుడు పరమ సత్తను పొందుతాడు. అంటే తన నిజస్వరూపాన్ని పొందుతాడన్న మాట. తన ఆత్మని తాను పొందుతాడు. ఈ స్థితిలో క్రియ అనేది ఉండదు. క్రియాఫలం అంతకన్నా ఉండదు. కాబట్టి ఆత్మ తన నిజస్థితిలో ఉంటుంది. బుద్ధిచేత కల్పించబడిన జాగ్రదవస్థ. స్వప్నావస్థ రెండూ సుషుప్తిలో లయమయి పోతాయి. ఇప్పుడు సుషుప్తిలో ప్రకాశించే ఆత్మతత్త్వమే సత్యమైనది. మానవుడు తన అజ్ఞానంతో ఈ విషయం తెలుసుకోలేకపోతున్నాడు. అతని అజ్ఞానాన్ని నేను ఏమనగలను? అంటున్నారు భగవత్పాదులవారు.

**శుద్ధిమిచ్ఛంత్య శుద్ధస్య నిత్యదుఃఖాత్మనః సుఖమ్ ।**
**అనిత్యస్యైవ నిత్యత్వ మహో అజ్ఞజనాజ్ఞతా ॥** **3**

ఈ శరీరం పంచభూతాల వల్ల ఏర్పడింది. ఆ భూతాలన్నీ అవిద్యతోనే కల్పించ బడినాయి. కాబట్టి అవన్నీ అసత్యాలు. అపరిశుద్ధాలు. దుఃఖరూపాలు. పరబ్రహ్మ సాన్నిధ్యం వల్లనే ఈ జగత్తు ఉన్నదని చెప్పబడుతోంది. దీనివల్ల నాకు ఆనందం కలుగుతోంది అనుకుంటున్నారు. పాంచభౌతికమైన శరీరం కూడా ఇలాంటిదే. దీన్ని తెలుసుకోలేక అజ్ఞానులైన వారు "నేను అంటే – దేహము" అని భావిస్తూ, ఆత్మస్వరూపమైన నిర్మలత్వము, నిత్యత్వములను ఈ శరీరానికే ఆరోపిస్తున్నారు. వారి అజ్ఞానానికి ఏమనగలను? ఈ శ్లోకంలో పంచభూతాలు శాశ్వతమైనవి కాదు. అలాగే ఆ భూతాల వల్ల ఏర్పడ్డ శరీరం కూడా శాశ్వతమైనది కాదు అని చెబుతున్నారు. ముందుగా పంచభూతాలు ఏ రకంగా ఏర్పడినాయో చూద్దాం.

సృష్టి ప్రారంభంలో ఈ జగత్తంతా శూన్యంగా ఉండేది. ఆ శూన్యాన్ని పరమేశ్వర స్వరూపం ఆక్రమించి ఉన్నది. కొంత కాలానికి, ఆ పరమాత్మ సృష్టి చెయ్యాలని సంకల్పించింది. అప్పుడు మొదటగా పరమేశ్వరుణ్ణించి సత్వగుణము బయటకు వచ్చింది. అదే మాయ, అవ్యక్తము. ఆ తరువాత సత్త్వగుణం నుంచి రజోగుణం వచ్చింది. అదే మహతత్త్వము, హిరణ్యగర్భుడు. ఆ తరువాత రజోగుణం నుంచి తమోగుణం వచ్చింది. అదే అహంకారము. విరాడ్రూపము. ఈ రకంగా ముందు త్రిగుణాలు ఆవిర్భవించినాయి. అవే అవ్యక్త మహతత్త్వ అహంకారాలు, వాటినుంచి తన్మాత్రలుగా పిలువబడే శబ్ద స్పర్శ రూప రస గంధాలు వచ్చినాయి.

ఆ తరువాత తన్మాత్రల స్థూలరూపాలయిన పంచభూతాలు ఏర్పడినాయి. శబ్ద స్పర్శ రూప రస గంధాలు వీటి గుణాలు. ఈ గుణాలు వరుసగా ఆకాశంలో – ఒకటి, వాయువు నందు – రెండు, అగ్నియందు – మూడు, జలము నందు – నాలుగు, భూమి యందు – ఐదు ఉన్నాయి. ఈ పంచభూతాలు శాశ్వతమైనవి కాదు. ఎందుకంటే ప్రళయ కాలంలో భూమి – జలంలోను, జలం – అగ్నిలోను, అగ్ని – వాయువునందు, వాయువు ఆకాశము నందు, ఆకాశము – అహంకారము నందు, అహంకారము – మహతత్త్వము నందు, మహతత్త్వము – అవ్యక్తము నందు, అవ్యక్తము – పరమాత్మ యందు లీనమై పోతాయి. కాబట్టి ఇవన్నీ నాశనమై పోయేవే. పంచభూతాలు శాశ్వతం కాదు.

ఇక దేహము సంగతికి వస్తే, పాంచభౌతికమైనది ఈ దేహం. అంటే పంచభూతాల వల్ల ఏర్పడింది. శబ్ద స్పర్శ రూప రస గంధాలనేవి పంచభూతాల గుణాలు. శరీరంలో జ్ఞానేంద్రియాలు ఈ పనులు చేస్తుంటాయి. ఇంద్రియాలు భూతాల లక్షణాలు ఏ రకంగా కలిగి ఉన్నాయో చూద్దాం.

1. ఆకాశము యొక్క గుణము – శబ్దం. ఈ శబ్దాన్ని గ్రహించే ఇంద్రియం – చెవి.
2. వాయువు యొక్క గుణం – స్పర్శ. ఈ స్పర్శని గ్రహించే ఇంద్రియం – చర్మము.
3. అగ్ని యొక్క గుణం – తేజస్సు, కాంతి. ఈ కాంతిని గ్రహించే ఇంద్రియం – కన్ను.
4. జలము యొక్క గుణం – రుచి. ఈ రుచిని గ్రహించే ఇంద్రియం – నాలుక.
5. భూమియొక్క గుణం – గంధం. వాసన చూసే ఇంద్రియం – ముక్కు.

ఈ రకంగా కన్ను, ముక్కు, చెవి, నాలుక,చర్మము అనే జ్ఞానేంద్రియాలు పంచభూతాల గుణాలను కలిగి ఉన్నాయి. అంతేకాదు. అసలు పంచభూతాలే ప్రత్యక్షంగా శరీరంలో కనిపిస్తాయి. హృదయాకాశమే – ఆకాశము. ఉశ్వాస నిశ్వాసలు జరిగేటప్పుడు శరీరమంతా ప్రసరించేది వాయువు. తిన్న ఆహారాన్ని అరిగించేది జఠరాగ్ని. ద్రవరూపంలో ఉన్న రక్తము మొదలైనవి జలము. గట్టితనం గల ఎముకలు మొదలైనవి భూమి. ఈ రకంగా పంచభూతాలలోను నిర్మించబడినదే ఈ శరీరము.

అందుకే దీన్ని పాంచభౌతికము అంటారు. అసలు పంచభూతాలే శాశ్వతం కానప్పుడు, వాటివల్ల ఏర్పడిన ఈ శరీరం ఏ రకంగా శాశ్వతమవుతుంది?

నేను అంటే దేహంకాదు. ఈ దేహము అశాశ్వతమైనది. నశించిపోయేది. భగవానుడు గీతలో చెప్పినట్లుగా ఆత్మ జీర్ణమైన ఈ దేహాన్ని వదలి, ఇంకొక దేహం చేరుతుంది. మరణించిన తరువాత ఈ శరీరంలోని గాలి గాలిలోను, ఆకాశం ఆకాశంలోను, నిప్పు నిప్పులోను, నీరు నీటిలోను కలవగా మిగిలినదంతా భూమిలో కలిసిపోతుంది. కాబట్టి అటువంటి దేహము శాశ్వతం కాదు. **బృహదారణ్యకోప నిషత్తు**లో చెప్పినట్లుగా, **అజ్ఞానులు మాత్రమే ఈ దేహమే ఆత్మ అని భావన చేస్తారు.**

పూర్వకాలంలో ప్రజాపతి ఇంద్రుడికి ఆత్మతత్త్వాన్ని వివరించాడు.

పూర్వకాలంలో ఒకసారి ప్రజాపతి ఆత్మతత్త్వాన్ని గురించి ఒక ప్రకటన చేశాడు.

"ఆత్మకు పాపం అంటదు. ముసలితనం రాదు. మృత్యువు దాన్ని కబళించదు. శోకం తాకదు. దానికి ఆకలి దప్పికలు లేవు. మానవుడు సత్యకామడు, సత్య సంకల్పుడు అయి ఆత్మజిజ్ఞాసను అలవరచుకోవాలి. ఆత్మకోసం అన్వేషించినవాడు, ఆత్మను అనుభవించినవాడు ఆత్మస్వరూపాన్ని పొందుతాడు. పూర్ణస్థితి అతనికి వస్తుందన్నమాట."

దేవతలు, రాక్షసులుకూడా ఆ మాటలు విన్నారు. "ఆత్మను గురించి మనంకూడా అన్వేషిద్దాం. ఆత్మవల్ల అన్ని కోరికలు తీరతాయని బ్రహ్మచెప్పాడు కదా!" అని వారు భావించారు.

దేవతలరాజు ఇంద్రుడు, రాక్షసుల రాజు విరోచనుడు ఇద్దరూ ఆత్మజ్ఞానం సంపాదిద్దామని చేతితో దర్భలు పట్టుకుని బ్రహ్మవద్దకు వెళ్ళారు. బ్రహ్మ వీరిద్దరినీ ముప్పైరెండు సంవత్సరాలు, బ్రహ్మచర్యదీక్ష వహించమని చెప్పాడు. దీక్ష పూర్తి చేశారిద్దరూ.

"వత్సలారా ! మీరు నాకోసం దేనికి వచ్చారు?" అన్నాడు బ్రహ్మ.

"భగవాన్ ! ఆత్మ తత్త్వాన్ని గురించి చెప్పిన విషయాలు విన్నాం. ఆత్మను గురించి ప్రత్యక్షంగా తమ నోటిమీదుగా వినాలని వచ్చాం" అన్నారు. ఇంద్ర విరోచనులు.

"మనుష్యుల కనుపాపలలో మెదలుతూ కనుపించే పురుషుడే ఆత్మ. ఆత్మ అభయం. అమృతమయం. అదే బ్రహ్మం" అన్నాడు బ్రహ్మ.

అదివిన్నవారు "భగవాన్ ! నీటిలో కనుపించే ప్రతిబింబం, అద్దంలో కనిపించే ప్రతిబింబం. ఈ రెంటిలో ఏది ఆత్మరూపం?" అని అడిగారు.

"నేను మొదటగా కళ్ళలో మెరిసే ఏపురుషుని వర్ణన చేశానో వీటన్నింటిలోనూ ప్రతిఫలించేది ఆ పురుషుడే. ఒకసారి నీళ్ళలోను, అద్దంలోను మీ రూపాలు చూసుకుని మీ అనుభవాలు నాకు చెప్పండి" అన్నాడు బ్రహ్మ. ఇంద్ర విరోచను లిద్దరూ అలాగే చేసి ప్రజాపతి దగ్గరకు వెళ్ళారు. ప్రజాపతి వీరిని చూసి "మీరు ఏం చూశారు." అన్నాడు.

"నఖశిఖ పర్యంతము కేశపాశాలతో మా శరీరాల ప్రతిరూపమే మాకు నీళ్ళలోనూ, అద్దంలోనూ కూడా కనిపించింది" అన్నారు వారు.

"నాయనలారా ! శరీరాలు శుభ్రపరచుకుని, మంచి వస్త్రాలు ఆభరణాలు ధరించి నీటిలో మీ ముఖాన్ని చూసుకోండి. తరువాత ఏం చేశారో నాకు చెప్పండి" అన్నాడు బ్రహ్మ 'అలాగే' అని చెప్పి ఇద్దరూ వెళ్ళిపోయారు. మరునాడు తిరిగి వచ్చి "స్వామీ ! ఈ చక్కని వస్త్రాలతో ఆభరణాలతో అలంకరించిన మా శరీరాలే నీటిలో కనిపించాయి" అన్నారు.

"అభయమూ, అమృతమయమూ అయిన ఆత్మ అదే. అదే బ్రహ్మము" అన్నాడు ప్రజాపతి

అదివిన్న ఇంద్ర విరోచనులు ఆత్మను గురించి తమకు అంతా తెలిసిందనుకుని తిరిగి వెళ్ళిపోయారు. అలా వెళ్ళిపోతున్నవారిని చూసి" అసలు ఆత్మజ్ఞానం లభించకుండానే వారు తెలిసింది అనుకుని వెళ్ళిపోతున్నారు. వారు దేవతలైనా, రాక్షసులైనా **శరీరాన్నే ఆత్మ అని భావించటం పతన హేతువు"** అనుకున్నాడు.

ఆ రోజున ప్రజాపతి చేసిన ఉపదేశంవిని రాక్షసరాజైన విరోచనుడు 'దేహమే ఆత్మ' అని ప్రచారం చేశాడు. కాని ఇంద్రుడు మళ్ళీ దాన్ని శోధించి ఆత్మతత్వాన్ని తెలుసుకున్నాడు. కాబట్టి ఈ దేహము ఆత్మకాదు. నిర్మలత్వము, నిత్యత్వము అనేవి శరీరానికి ఉండవు. ఆత్మకే ఉంటాయి. కాని తెలియని వారు వీటిని శరీరానికి ఆపాదిస్తున్నారు. అంటూ వారి అజ్ఞానానికి చింతిస్తున్నాడు శంకరుడు.

**ఆత్మన్యనాత్మతాం కృత్వా హ్యనాత్మన్యాత్మతాంపునః ।**
**మృగత్యే పుస్తకేష్వాత్మా అహో అజ్ఞజనాజ్ఞతా ॥** 4

పరమాత్ముని యందు అనాత్మభావాన్ని, అనాత్మ అయిన దేహమందు పరమాత్మ భావాన్ని చెబుతూ, నేతి నేతి అనే వాక్యాలతో ఆత్మతత్త్వాన్ని తెలుసుకోవటానికి ప్రయత్నిస్తున్నారు. వీరి అజ్ఞానము ఎంత ఆశ్చర్యకరము?

నిత్యము సత్యమైనది ఆత్మ. ఆదిమధ్యాంతములు లేనిది. సృష్టికి ఆధారమైనది. సృష్టికి మూలకారణమైనది. సృష్టి ప్రారంభానికి ముందు, ప్రళయం తరువాత కూడా ఉండేది. వికారాలు లేనిది. అందరిలోను, అన్నింటి యందు అంతర్లీనంగా ఉండేది. స్వయంప్రకాశమైనది ఆత్మ. అదే పరబ్రహ్మ స్వరూపం. జగత్తులో ఉన్నదంతా పరమేశ్వర స్వరూపమే. జగత్తులో ఆత్మ కానిదంతా అనాత్మే. అనిత్యము, అసత్యము అయినది. ఆదిమధ్యాంతములు గలది. వికారాలు గలది, జడమైనది అనాత్మ. ఈ జగత్తులో శరీరము, ఇంద్రియాలు, మనస్సు, ప్రాణాలు, భోగవస్తువులు, సమస్త భోగాలు, పంచభూతాలు, తన్మాత్రలు అన్నీ అనాత్మే. దృశ్యమానమైన జగత్తంతా అనాత్మే. మానవుడు అజ్ఞానము వల్ల ఆత్మని-అనాత్మ గాను, అనాత్మని ఆత్మగాను భావన చేస్తున్నాడు. **'బ్రహ్మసత్యం-జగన్మిథ్య'**. జగత్తులో సత్యము, నిత్యము, శాశ్వతమైనది పరబ్రహ్మ ఒక్కటే. మిగిలిన జగత్తంతా మిథ్య. దృశ్యమానమైన జగత్తంతా మిథ్య. ఈ విషయం అందరికీ తెలుసు. జగత్తులో పుట్టిన ప్రతిజీవి మరణిస్తుంది. ప్రతి జీవికి షడ్విధ వికారాలుంటాయి. పుట్టుక నాశనము అనేవి ప్రకృతి ధర్మాలు. రాజ్యాలు, రాజులు, అడవులు, కొండలు, బండలు ఏవీ శాశ్వతం కాదు. కట్టిన కట్టడాలు కూలిపోతున్నాయి. రాజ్యాలు నాశనమై పోతున్నాయి. ముత్తాతలు, తాతలు, తండ్రులు అందరూ మరణించారు. రేపు మనం కూడా మరణిస్తాము అంతే. కాబట్టి లోకంలో శాశ్వతమైనది ఏదీ లేదు. ఎవరూ లేరు. మన కోరికలు తీర్చే దేవతలు కూడా శాశ్వతం కాదు. సృష్టికర్త అయిన బ్రహ్మ కూడా కల్పాంతం దాకానే ఉంటాడు. కాబట్టి అతడు కూడా శాశ్వతం కాదు. ప్రళయ కాలంలో పంచభూతాలు కూడా నాశనమై పోతాయి. అన్నీ పరబ్రహ్మలో లీనమై పోతాయి. ఈ సృష్టిలో శాశ్వతమైనది. ఏదీ లేదు. అన్నీ నాశనమై పోయేవే. కాకపోతే కొంచెం ముందు, వెనకా, కాలభేదం అంతే. ఇటువంటి జగత్తులో మానవుడు అశాశ్వతమైన వాటిని శాశ్వతమనుకుంటున్నాడు. అనాత్మ వస్తువులను

చూసి, అవే ఆత్మ అనుకుంటున్నాడు. బృహదారణ్యకోపనిషత్తులో ఒక కథ ఉంది. ఒకసారి ప్రజాపతి పరబ్రహ్మను గురించి ఒక ప్రకటన చేశాడు. ఆ ప్రకటన విని దేవతల రాజైన ఇంద్రుడు, రాక్షసుల రాజైన విరోచనుడు బ్రహ్మ దగ్గరకు వచ్చి, ఆత్మతత్త్వాన్ని చెప్పమని అడిగారు. అయితే బ్రహ్మ చెప్పిన దాన్ని తన అజ్ఞానంతో, తప్పుగా అర్థం చేసుకున్న విరోచనుడు, 'దేహమే ఆత్మ' అని నిశ్చయించుకున్నాడు. ఇలాగే లోకంలో అనేకమంది దేహమే ఆత్మ. నేను అంటే ఈ శరీరమే అని భావన చేస్తుంటారు. నేను అంటే అశాశ్వతమైన దేహంకాదు. దేహం వేరు, ఆత్మ వేరు. గృహస్తుకు గృహంలాగా, ఆత్మకు ఈ శరీరము ఆలవాలమై ఉన్నది. ఆయువు తీరగానే, ఈ దేహాన్ని వదలి ఇంకొక దేహాన్ని ఆశ్రయిస్తుంది ఆత్మ. ఈ దేహం నశించిపోతుంది. పాంచభౌతికమైన దేహం పంచభూతాలలో కలిసిపోతుంది. జగత్తంతా నాశనమై పోయినా మిగిలేది ఆత్మ ఒక్కటే. మానవుడు ఏది ఆత్మో, ఏది అనాత్మో తెలుసుకోలేక అనేక కష్టాలు పడుతున్నాడు. దుఃఖనివృత్తి కావాలంటే సత్యం తెలుసుకోవాలి. ఇది తెలియని మానవుడు నేతి నేతి అనే వాక్యాల ద్వారా ఆత్మతత్త్వాన్ని తెలుసుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు. అని మానవుడి యొక్క అజ్ఞానానికి చింతిస్తున్నారు భగవత్పాదుల వారు.

**హిత్వాత్మానం సదానంద మాత్మనః సుఖకామ్యయా ।**
**యజంతి దేవాన్యజ్ఞాద్యై రహో అజ్ఞజనాజ్ఞతా ॥ 5**

జీవాత్మ స్వయంగా ఆనంద స్వరూపం గలది. ఈ విషయం తెలియక, సుఖం కావాలనే కోరికతో, ఇంద్రాది దేవతలను వివిధ కర్మలచేత పూజిస్తున్నారు. మానవుల అజ్ఞానము ఆశ్చర్యకరమైనది.

ఆకాశమనేది ఒక్కటే. అది బయట అంతటా వ్యాపించి ఉంటే మహదాకాశమని, ఘటంలో ఉంటే ఘటాకాశమని, హృదయంలో ఉంటే దహరాకాశమని వివిధ పేర్లతో పిలువబడుతుంది. అలాగే ఆత్మ అనేది ఒక్కటే. చరాచర జగత్తంతా వ్యాపించి ఉంది. ప్రళయం తరువాత కొంత కాలానికి, గతంలో, అంటే ప్రళయ కాలంలో కర్మక్షయం కాని జీవులు, తమ కర్మను తమతో బాటుగా మూట కట్టుకున్నవై పరమేశ్వరునిలో లీనమై పోయినాయి. ఇప్పుడు ఆ జీవులకు కూడా కర్మక్షయం చేసి, మోక్షం ప్రసాదించాలనే సంకల్పంతో, ఈ జగత్తును సృష్టి చేసింది ఆ పరమేశ్వర స్వరూపం. ఈ విధంగా, మానవ శరీరాన్ని, ఇంద్రియాలను, ఇంద్రియాధి దేవతలను

సృష్టించిన తరువాత, ఇంద్రియాలతో కూడిన ఈ శరీరంలో ప్రవేశించాలనుకున్నాడు. బ్రహ్మ రంధ్రం ద్వారా ప్రవేశించాడు. ఈ విధంగా శరీరంలో ప్రవేశించిన పరమేశ్వరుడు, పంచభూతాలను తాదాత్మ్య భావంతో గ్రహించాడు. నేను నాది అనే అహంకార మమకారాలను పెంచుకున్నాడు. అంటే నిరాకారుడైన ఈశ్వరుడు సాకారుడైనాడు అని చెబుతోంది **ఐతరేయోపనిషత్తు.** ఇక్కడ గుర్తించాల్సిన విషయం ఏమంటే, జీవాత్మ, పరమాత్మ రెండూ ఒక్కటే. పరమాత్మ ఆనంద స్వరూపుడు. కాబట్టి జీవాత్మ కూడా అంతే. జీవాత్మ స్వయంగా ఆనందరూపుడు. ఇంద్రియాలతో తాదాత్మ్యం చెందటం వల్ల అహంకార మమకారాలు పెరిగినాయి. రాగద్వేషాలు కలిగినాయి. అజ్ఞానము ఆవరించింది. తాను పరమేశ్వర స్వరూపాన్ని అనే మాట మరచిపోయాడు. బయటకు వెళ్ళే మార్గం తెలియక, పంజరంలో బంధించబడిన పక్షిలాగా ఈ శరీరంలో బందీ అయిపోయాడు. ఇలా అజ్ఞానం ఆవరించటం చేత, శరీరం చేసే కర్మలన్నింటికీ తానే కర్తని భోక్తని అనుకుంటున్నాడు. తద్వారా వచ్చే కష్టాలు, సుఖాలు అన్నీ తనవే అనుకుంటున్నాడు. అవి తానే అనుభవిస్తున్నాను అనుకుని సంసార సాగరంలో మునుగుతూ తేలుతూ ఉన్నాడు. సుఖం కోసం, ఆనందం కోసం యజ్ఞయాగాది కర్మలు చేస్తూ, ఇంద్రాది దేవతలను అర్చిస్తున్నాడు.

సుఖము రెండు రకాలుగా ఉంటుంది. 1. క్షణికమైన సుఖము 2. శాశ్వతమైన సుఖము. లౌకికమైన జగత్తులో పొందేదంతా క్షణికమైనదే. ఈ సుఖము అంతా దుఃఖానికే దారి తీస్తుంది. ఆలుబిడ్డలు, బంధువులు, మిత్రులు ఇవన్నీ బంధనాలు. దుఃఖ హేతువులు. కాని తన అజ్ఞానంతో మానవుడు ఇవే సుఖమనుకుంటున్నాడు. సిరిసంపదలు, బోగభాగ్యాలు, పదవులు, అధికారం, గౌరవం వీటి కోసం యజ్ఞయాగాది క్రతువులు చేసి ఇంద్రాది దేవతలను అర్చిస్తున్నాడు. కర్మలు చెయ్యటం వల్ల పుణ్యం వస్తుంది. తద్వారా స్వర్గసుఖాలు కలుగుతాయి. తరువాత కర్మ శేషాన్ని అనుభవించటానికి పునర్జన్మ ఎత్తవలసి ఉంటుంది. కాబట్టి **కర్మల వల్ల పునర్జన్మ ప్రాప్తిస్తుంది. అంతేకాని మోక్షం రాదు.** కర్మలు చెయ్యటం ద్వారా ఇంద్రాది దేవతలను అర్చిస్తాడు. వీరెవరూ శాశ్వతమైన సుఖాన్నివ్వలేరు. అసలు దేవతలకే శాశ్వతత్త్వము లేదు. అటువంటి వాళ్ళు దాన్ని మనకెలా ఇవ్వగలరు? శాశ్వతమైన ఆనందాన్నివ్వ గలవాడు పరమేశ్వరుడొక్కడే. అందుకే ఆయననే ఆరాధించాలి. శాశ్వతమైన సుఖం కోసం ప్రయత్నించాలి. **ఆత్మానందం కోసం ప్రయత్నించాలి.**

# ౨. ఆత్మానందము

బృహదారణ్యకంలో ఒక కథ ఉంది. యాజ్ఞవల్క్యుడు అనే మహర్షి ఉన్నాడు కదా ! ఈయనకు ఇద్దరు భార్యలు అని గతంలో చెప్పుకున్నాం. పెద్ద భార్య కాత్యాయని. పూర్తిగా లౌకిక వ్యవహారాలలో కూరుకుపోయి ఉంటుంది. రెండవ భార్య మైత్రేయి. ఈమె జనకుని మంత్రియైన మైత్రేయుని కుమార్తె. యాజ్ఞవల్క్యుని దగ్గర ఉన్న బ్రహ్మవిద్యకు ఇష్టపడి, ఆయనను వివాహం చేసుకుంది. ఒకరోజున యాజ్ఞవల్క్యుడు తన భార్యలిద్దరినీ పిలిచి, "నేను సన్యాసాశ్రమం స్వీకరించాలి అనుకుంటున్నాను. నాకున్న ఆస్తిపాస్తులు , మీకిద్దరికీ సమానంగా పంచేస్తాను" అన్నాడు. ఆ మాటలు విన్న మైత్రేయి "నాథా ! వెలలేని సిరిసంపదలు, ఆస్తిపాస్తులు నాకెందుకు? ఇవన్నీ అక్కగారికే చెయ్యండి. నాకు శాశ్వతమైన బ్రహ్మవిద్యను ప్రసాదించండి" అంది. ఆవిడ చెప్పిన ప్రకారమే ఉన్న ఆస్తినంతా కాత్యాయనికి ఇచ్చేసి మైత్రేయికి బ్రహ్మవిద్యను ఉపదేశించటం ప్రారంభించాడు.

ఓ మైత్రేయీ, భార్య, భర్త, సంతానము, ధనము, పశువులు, లోకాలు, దేవతలు, పంచభూతాలు ఇవన్నీ కూడా ఆత్మార్థమే ప్రియమైనవి అవుతున్నాయి. వీటన్నింటినీ మానవుడు తన కోసమే కోరుతున్నాడు. అంతేకాని వాటికోసం వాటిని కోరటం లేదు. భార్యకు భర్తమీద కోరిక కలిగినప్పుడు అతన్ని ప్రేమిస్తుంది. భర్తయొక్క ఇష్టాన్ని బట్టి అంటే అతనికి ఆకలి వేసినప్పుడు, జపం చేసుకునేటప్పుడు, అనారోగ్యంగా ఉన్నప్పుడు, ఇలాంటి సమయాలలో అతన్ని కోరదు. తన కోసమే అతన్ని కోరుతుంది. అతని కోసం కాదు. ఆవిడ వ్యక్తం చేసే ప్రేమ భర్త ప్రయోజనం కోసం కాదు. అలాగే భర్త కూడా, భార్యయొక్క ప్రయోజనం కోసం ఆవిణ్ణి ప్రేమించడు. తన ప్రయోజనం కోసమే ప్రేమిస్తాడు. ఇలా భార్యాభర్తలు ఒకరినొకరు ప్రేమిస్తున్నప్పుడు కూడా, అది తమ కోసమే ఎదుటి వారిని ప్రేమించటం జరుగుతుంది. ఇద్దరూ ఆత్మార్థమే ప్రేమయందు ప్రవృత్తులవుతున్నారు. అంతేకాని ఒకరి ఇచ్ఛకోసం మరొకరు ఆ పని చెయ్యటం లేదు.

మైత్రేయీ ! తండ్రి అడవిలో నివసించే తాపసి. కాబట్టి నెత్తిన జుట్టు, గడ్డాలు, మీసాలు బాగా పెరిగిపోయి ఉంటాయి. ముఖంమీద ఉండే గడ్డాలు, మీసాలు బిరుసుగా ఉండి ముళ్ళులా ఉంటాయి. ఇలాంటి తండ్రి కుమారుడు కలిగినప్పుడు

మహా ఆనందంతో ఆ పిల్లవాణ్ణి ఎత్తుకుంటాడు. ముద్దులాడతాడు. ముళ్ళులా ఉన్న గడ్డం గ్రుచ్చుకుని పిల్లవాడు ఏడుస్తున్నాడు. అయినా వదలడు తండ్రి. అలాగే ముద్దుడలాడతాడు. ఇక్కడ మనకి తెలిసేది ఏమంటే, పిల్లవాడి ఆనందం కోసం తండ్రి వాణ్ణి ముద్దు పెట్టుకోవటం లేదు. తన ఆనందం కోసం ఆపని చేస్తున్నాడు. అందుకే పిల్లవాడు ఏడ్చినా వదలకుండా ముద్దులాడుతున్నాడు. ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. చేతనాల్లో అయితే ఇలా ఉంది. మరి అచేతనాల విషయంలో ఎలా ఉంటుంది? ఒక మానవుడు అంతులేని ధనరాసుల్ని కాపలా కాస్తున్నాడు. వాటికి రక్షణ కల్పిస్తున్నాడు. ఎందుకు? తనకు ఏదో ప్రయోజనం సిద్ధిస్తుందని. అతని ప్రేమ అనేది ఆ ధనం మీద కాదు. అతడికి ధనం మీద ప్రేమ ఉండదు. ఆ ధనం తన అవసరాలకు ఉపయోగిస్తుంది కాబట్టి. అందుకే దాన్ని అంత జాగ్రత్తగా చూస్తాడు. ఆ ధనం తనకు ఉపయోగపడదు అని తెలిసినప్పుడు ఆ ప్రేమ ఉండదు. కాబట్టి ధనాన్ని కూడా తన ప్రయోజనం కోసమే ప్రేమిస్తున్నాడు. ఒకవేళ ధనాన్నే ప్రేమిస్తున్నాడు అంటే, ఎవరి ధనాన్నైనా సరే ప్రేమించాలి. కాని అలా చెయ్యడు. ఎందుచేతనంటే, ఇతరుల ధనం అతనికి ఉపయోగపడదు కదా!

ఎద్దును బండికి కట్టి, బండిమీద ధాన్యపు బస్తాలు వేసి లాగిస్తున్నాము. ఎద్దు విషయంగా ఆలోచిస్తే, ఎద్దుకు బండి లాగాలనే కోరిక ఎందుకుంటుంది? అయినా ఎద్దు బండిలాగుతూనే ఉంది. దీనికి కారణము–వ్యాపారస్థుడు లేదా వ్యవసాయదారుని స్వార్థబుద్ధి. అంతేకాని ఇందులో ఎద్దుయొక్క స్వార్థచింతన ఏదీలేదు. చేతన పదార్థాల్లో ఈ రకమైన స్వార్థచింతన ఉంటుంది. "నాలో బ్రాహ్మణత్వం ఉంది. నేను పూజింపదగినవాడను" అనే భావన ఉన్న వ్యక్తి తాను గౌరవించబడినప్పుడు చాలా ఆనందిస్తాడు. అచేతనాల్లో ఈ రకమైన సంతృప్తి, ఆనందము ఉండవు "నేను క్షత్రియుణ్ణి రాజ్యపాలన చేస్తున్నాను" అన్నప్పుడు, రాజుగా అతను అనుభవించే భోగము క్షత్రియుడిది. అంటే వ్యక్తికి సంబంధించినది. అంతేకాని క్షత్రియజాతికి సంబంధించినది కాదు.

మానవుడు యజ్ఞయాగాది కర్మలు చేస్తున్నాడు స్వర్గలోకం పొందుతున్నాడు. ఉపాసన చేసి బ్రహ్మలోకం పొందుతున్నాడు. ఇలా స్వర్గలోకం కాని, బ్రహ్మలోకం కాని పొందటం ఆ లోకాలను ఉద్ధరించాలనే కోరికతో కాదు. అక్కడ ఉండే భోగాలు

అనుభవించాలనే కాంక్షతో. అక్కడ ఏ రకమైన భోగాలు ఉండవు అని తెలిసిన మరుక్షణంలో వాటిని కోరడు. దేవతార్చన చేస్తున్నాడు. వివిధ రకాలైన దేవతలను అర్చిస్తున్నాడు. సూర్యోపాసన చేస్తున్నాడంటే ఆరోగ్యం కోసం. శనికి అభిషేకం చేస్తున్నాడు అంటే శనిదోషం పోగొట్టుకోవటానికి ఇలాగే శివుడు, విష్ణువు, మొదలైన దేవతలను కూడా ఆరాధిస్తున్నాడు. ఇదంతా దేవతలమీద ప్రేమతో కాదు. తన కోరికలు తీరాలనే స్వార్థంతో ఉపనయనం అయిన తరువాత వేదాధ్యయనం చేస్తున్నాడు. వేదాలు అధ్యయనం చెయ్యకపోతే 'వ్రాత్యదోషం' వస్తుంది. దాన్నించి తప్పించుకోవటానికి వేదాధ్యయనం చేస్తున్నాడు. అంతేకాని వేదాలను రక్షించాలనే కోరికతో మాత్రం కాదు. పంచభూతాలను సేవిస్తున్నాడు. ఇదికూడా స్వార్థంతోనే. ఉండటానికి చోటు కావాలి. త్రాగటానికి నీరు, అన్నం వండుకోవటానికి అగ్ని, శ్వాసించటానికి గాలి, స్వేచ్ఛగా తిరగటానికి అవకాశం కల్పించే ఆకాశము. ఇవన్నీ కావాలి. దీని కోసమే పంచభూతాలను సేవిస్తున్నాడు. అంతేకాని వాటికి ఉపకారం చెయ్యటం కోసం మాత్రం కాదు. అంతేకాదు. యజమాని, సేవకుడు వీరి మధ్యన కూడా ఈ స్వార్థమే తాండవం చేస్తోంది. యజమాని సేవకుడికి ధనం ఇస్తున్నాడు. కారణం అతను సేవ చేస్తున్నాడు కాబట్టి. అలాగే సేవకుడు యజమానిని గౌరవిస్తున్నాడు. దీనికి కారణం అతను ధనాన్ని ఇస్తున్నాడు. జీవనోపాధి కల్పించాడు కాబట్టి. ఈ రకంగా ఈ జగత్తులో అన్నీ మన కోసమే, మన స్వార్థంతోనే చేస్తున్నాము. ఆత్మార్థమే చేస్తున్నాము. ఆత్మ అనేది అన్నింటికన్న మిక్కిలి ప్రియమైనది. మరి ఆ ప్రీతి యొక్క స్వరూపం ఏమిటి? అంటే ప్రీతి.

1. రాగస్వరూపం కలదైతే – భార్యాబిడ్డల యందు మాత్రమే కనిపించాలి.

2. శ్రద్ధాస్వరూపం కలదైతే – యజ్ఞయాగాది కర్మలయందు మాత్రమే కనిపించాలి.

3. భక్తిస్వరూపం కలదైతే – దేవతలు, గురువుల యందు మాత్రమే కనిపించాలి.

4. ఇచ్ఛా స్వరూపం కలదైతే – ప్రాప్తించని వస్తువులందు మాత్రమే కనిపించాలి.

కాని అలా లేదు. అది అన్నింటి యందు కనిపిస్తోంది అన్ని పదార్థాలలోను వేరువేరుగా ఉంది. అందుచేతనే ప్రీతి అనేది సుఖస్వరూపం కల సాత్త్వికీ వృత్తి అని భావించాలి. సాత్త్వికీ వృత్తి అంటే – సుఖాన్ని విషయంగా చేసే, సత్త్వగుణ

పరిణామంగా ఉండే అంతఃకరణ పరిణామము. సాత్త్వికీ వృత్తి రూపంలో ఉండే ప్రీతి ఒక వస్తువు లభించినప్పుడు, నష్టమై పోయినప్పుడు కూడా ఆ వస్తువునందు కనిపిస్తుంది. ఇలా ప్రీతి అనేది అంతఃకరణ వృత్తి అయినప్పటికీ ఇచ్ఛకన్న భిన్నమైనది.

అన్నపానాదుల్లాగా ఆత్మ, సుఖానికి సాధనం కాదు. విషయాల వల్ల కలిగే సుఖం కేవలము 'ప్రీతి'. అంతే కాని ఆత్మ అనేది నిరతిశయ ప్రేమాస్పదమైనది. విషయ సుఖంలాగా ఆత్మభోక్త యొక్క కార్యంలో ఉపకారవస్తువు కాదు. ఆత్మహేయము కాదు ఉపాధేయము కాదు. అంటే దేన్నీ తీసుకోదు, ఇవ్వదు. ఈ రకంగా హేయోపాథేయము లేని ఆత్మ ఉపేక్షించదగినదా? అంటే కాదు. ఉపేక్షించే వ్యక్తికి అది ఆత్మస్వరూపం కాబట్టి ఉపేక్షించటానికి వీలుకానిది. రోగం వచ్చినప్పుడు కాని, మితిమీరిన కోపం వచ్చినప్పుడు కాని మానవుడు చచ్చిపోవాలని కోరుకుంటాడు. అలాగే చేస్తాడు అనుకుందాం. అలాంటప్పుడు పోయేది ఆత్మ కాదు దేహం. శరీరాన్ని వదిలే జీవుడే – ఆత్మ.

అన్ని వస్తువుల మీద ఉండే ప్రేమ ఆత్మకోసమే. అన్ని రకాల వస్తువులూ ఆత్మోపకారం చేసేవే. అన్నీ ప్రియమైనవే. అయినప్పటికీ, స్వస్వరూపమైన ఆత్మ అత్యంత ప్రియమైనది. తండ్రి ఎప్పుడూ తన కుమారుని ప్రేమించినంతగా, అతని స్నేహితుణ్ణి ప్రేమించదు. ఇది అనుభవం. నా అస్తిత్వం నాకుండాలి. నేను ఎప్పుడూ ఉండాలి. ఈ రకమైన భావన మానవులందరిలోనూ ఉంటుంది. దీనివల్ల ప్రతిజీవికి ఆత్మయందున్న నిరతిశయమైన ప్రీతి వ్యక్తమవుతుంది. ఈ రకంగా శ్రుతులద్వారా, యుక్తిద్వారా, అనుభవం ద్వారా కూడా ఆత్మయందున్న నిరతిశయమైన ప్రీతి వ్యక్తమవుతుంది.

ఈ లోకంలో పొందే సుఖానికి పుత్రుడే కారణం. మర్త్యలోకంలో సుఖమనేది కేవలం పుత్రుని వల్లనే కలుగుతుంది. లౌకికులు కూడా పుత్రుని ప్రాధాన్యతను అంగీకరిస్తారు. పుత్రునివల్ల ఇహలోకము, పరలోకము కూడా సిద్ధిస్తుంది. తాను పోయినా భార్యాబిడ్డలు తన ఆస్తులత జీవనం సాగించాలని మానవుడు కోరుతుంటాడు. ఈ కారణంచేత కూడా పుత్రుని యొక్క ఆవశ్యకత తెలుస్తోంది.

ఆత్మ మూడు రకాలుగా ఉంటుంది. 1.గౌణాత్మ 2.మిధ్యాత్మ 3.ముఖ్యాత్మ. సందర్భాన్ని బట్టి అర్థం గ్రహించాలి. ఇందులో పుత్రాదులు గౌణాత్మ. గౌణము

అంటే అప్రధానము అని అర్థం. చీకట్లో స్థాణువుని చూసి దొంగవాడు అనుకున్నాం. ఇక్కడ రాతికున్న చోరరూపం మిథ్య. వెలుతురు ప్రకాశించగానే చీకట్లు తొలగి పోతాయి. పంచకోశాలకున్న సాక్షిరూపత్వం – మిథ్య. పంచకోశాలు మిథ్యాత్మలు. సాక్షి అయిన ఆత్మకు దేనిలోనూ భేదం లేదు. అందరిలోనూ ప్రతీతమవుతూ ఉంటుంది కాబట్టి సాక్షినే ముఖ్యాత్మ అంటారు. అయితే. ఏ వ్యవహారంలో ఏ రకమైన ఆత్మ అవసరమవుతుందో అదే ముఖ్యాత్మ. మిగిలిన రెండూ గౌణాత్మలు.

చనిపోయిన వాడి ఆస్తిపాస్తులు రక్షించేది కుమారుడే. అందుకే పుత్రుడు ఇక్కడ ముఖ్యాత్మ కాగా, మిగిలిన రెండూ గౌణాత్మలవుతాయి. 'నేను చిక్కిపోయాను' అన్నప్పుడు చిక్కిపోయేది. సన్నబడేది శరీరము అంతేకాని పుత్రుడు కాదు. అందుచేత ఇక్కడ మిథ్యాత్మే ప్రాధాన్యత సంతరించుకుంటుంది నేను మోక్షం పొందుతాను అన్నప్పుడు నేను అనే పదానికి అర్థం చిదాత్మయైన ముఖ్యాత్మే అని గ్రహించాలి. ఇలా ఏచోట, ఏ ఆత్మ. ఏ వ్యవమారానికి ఉపయోగిస్తుందో, ఆ సమయంలోనే దాన్ని ఉపయోగించాలి. ముఖ్యాత్మ మీద నిరతిశయమైన ప్రీతి ఉంటుంది. మిగిలిన వాటి యందు ఈ రకమైన ప్రీతి ఉండదు.

1.ఆత్మ 2.ఆత్మకన్న భిన్నమైన వస్తువులు అని రెండు రకాలుగా ఉంటాయి. ఆత్మకన్న భిన్నమైన వస్తువులు మళ్ళీ మూడు రకాలుగా ఉంటాయి. ఆ రకంగా మొత్తం నాలుగు రకాలుగా ఉంటాయి. అవి 1.అత్యంత ప్రీతిపాత్రమైన ఆత్మ 2. ప్రియమైన భార్యాపుత్రులు 3.ఉపేక్షించదగిన గడ్డి, రాళ్ళు మొ॥వి 4.ద్వేషించదగిన పులి మొ॥వి. ఒకే వస్తువు పరిస్థితులను బట్టి 1.ప్రియము 2.అప్రియము 3.ఉపేక్షణీయము అవుతుంది. ఉదాహరణకు మన ఎదురుగా పెద్ద పులి వచ్చింది. అప్పుడు అది తప్పకుండా ద్వేషింపతగినది. 2.అదే పులి మనల్ని ఏమీ అనకుండా ప్రక్కగా వెళ్ళిపోతోంది. అప్పుడది ఉపేక్షించతగ్గది అవుతుంది. అదే పులి మనపెంపుడు జంతువనుకోండి. అప్పుడది మనకు అత్యంత ప్రియమైనది అవుతుంది. ఇలా పరిస్థితిని బట్టి ఒకే వస్తువు ప్రియము. అప్రియము ఉపేక్షించతగినది అవుతుంది. లోకంలో మూడు రకాల ధర్మాలున్నాయి. 1.అనుకూలరూపం 2. ప్రతికూల రూపం 3.ఉపేక్షణీయం. వీటిలో అనుకూలము ప్రతికూలము కానటువంటిది ఉపేక్షణీయం. ఆత్మ అత్యంత ప్రియమైనది. మిగిలినవన్నీ ఆత్మకు ఉపకారకాలు కాబట్టి అవి

ప్రియమైనది. అంతే. అందుచేతనే పులి మొదలైన క్రూరజంతువుల్ని ద్వేషించటం. గడ్డి, రాళ్ళు వీటిని ఉపేక్షించటం జరుగుతుంది. ఈ విషయాన్నే యాజ్ఞవల్క్యుడు మైత్రేయికి వివరించాడు. ఇదే విషయం పురుషవిధ బ్రాహ్మణంలో కూడా వివరించబడింది. ఆత్మ అనే పుత్రుడు మిగతా అన్నింటికన్నా ధనముకన్నా కడా అత్యంతప్రియమైనవాడు. అంటే ఆత్మ అనేది అన్నింటికన్నా ఎక్కువ ప్రీతికరమైనది. **ఆత్మవై పుత్రనామాసి** అంటే ఇదీ అర్థం.

అన్నమయాది పంచకోశాలను విడదీసి చూసినట్లైతే సాక్షియైన ఈ కూటస్థుడే ముఖ్యాత్మ అని తెలుస్తుంది. పంచకోశాలను విడదీసి చూడటమంటే అంతర్‌దృష్టితో చూడటం అని అర్థం. మనకి అవస్థలు మూడు అని చెప్పుకున్నాం కదా! అవే జాగ్రద్ స్వప్న సుషుప్తులు. మానవుడు వీటిని ఒకదాని తరువాత ఒకటి పొందుతాడు. ఒక్కొక్క అవస్థను వదిలి ఇంకొక దానిలో ప్రవేశిస్తాడు. అప్పుడు వీటి సంబంధించిన జ్ఞానం ఏ నిత్యచైతన్య రూపమైన సాక్షివల్ల కలుగుతుందో, ఆ స్వప్రకాశము, చిద్రూపము అదే ముఖ్యాత్మ. ప్రాణాల దగ్గర నుంచీ ధనందాకా ఉన్న సుఖసాధన పదార్థాలన్నీ తరతమ భేదాలతో ఒకదానికన్న ఒకటి ప్రియమైనవవుతాయి. ఆత్మకి దగ్గరగా ఉండేది అత్యంత ప్రియమైనది. ఆ తరువాత మిగిలినవి. ఆత్మకు అత్యంత సమీపంలో ఉండేవి ప్రాణాలు. వాటి తరువాత ఇంద్రియాలు, తరువాత శరీరము, తరువాత పుత్రుడు, ఆ తరువాత ధనం. అందుకే ధనం కన్న కొడుకు ప్రియమైన వాడు. కుమారుని కన్న – శరీరము, శరీరము కన్న – ఇంద్రియాలు, ఇంద్రియాల కన్న – ప్రాణాలు ప్రియమైనవి. అన్నింటికన్నా అత్యంత ప్రియమైనది ఆత్మ అందుకే మన కంటికి కనిపించే వివిధ పదార్థాలకన్నా అన్నింటికీ సాక్షియైన ముఖ్యాత్మయే మిక్కిలి ప్రియమైనది అంటారు జ్ఞానులు. అయితే సాక్షియైన ఆత్మ ఈ సుఖాలు అనుభవించటానికి పుత్రుని రూపంలో అవతరిస్తున్నది అని అవివేకులు చెబుతుంటారు.

ఇక్కడ ఒక్క విషయం గుర్తుంచుకోవాలి. శిష్యుడు, ప్రతివాది. ఇద్దరూ కూడా ఆత్మకన్న వేరైనవారే. వీరియిద్దరికీ ఇచ్చే సమాధానం వేరుగా ఉండాలి. శిష్యుడికి జ్ఞానోపదేశంలో ఉండాలి. ప్రతివాదికిచ్చే సమాధానం అభిశాప రూపంలో ఉండాలి. ఎందుకంటే అతని పొరపాటును చెప్పినా వినడు. అతడి ఫలం అతడే అనుభవిస్తాడు.

ఇక్కడ ప్రతివాది అంటే – కర్మల కోసం భార్యాపుత్రులు అవసరమని వాదించేవారు. అయితే తత్త్వవేత్త ఎవరినీ శపించడు. ఇద్దరినీ ఒకే రకంగా చూస్తాడు. అతని దృష్టిలో "ప్రియమైన వారుగా భావించే భార్యాబిడ్డలు అందరూ నిన్ను ఏడిపించేవారే" జ్ఞాని ఇలా ఎందుకంటాడు? అతడి ఆంతర్యం ఏమిటి? పుత్రుడు కలిగేదాకా తల్లిదండ్రులకు కొడుకు పుట్టలేదని బాధ. గర్భధారణ జరిగిన తరువాత ప్రసవవేదన. ఇది తల్లికి బాధ. తద్వారా తండ్రికి వేదన. కుమారుడు పుట్టిన తరువాత బాలారిష్టాలు. రోగాలు వీటివల్ల బాధ. పిల్లవాడు పెరుగుతున్న కొద్దీ వాడికి తెలివితేటలు తక్కువ మిగిలిన వాళ్ళతో పాటుగా లేడని బాధ. ఉపనయనం చేసి గురుకులానికి పంపిన తరువాత అక్కడ చదువు రాకపోతే రాలేదని బాధ. విద్యాభ్యాసం పూర్తి అయిన తరువాత వివాహం కోసం బాధ. యవ్వనంలో స్త్రీ లోలుడవుతున్నాడని బాధ. వివాహం అయిన తరువాత అతనికి పిల్లలు కలగలేదని బాధ. ఈ రకంగా పుత్రాదుల వల్ల కలిగే బాధలు అనేకం. శిష్యుడైన వాడు గురువు చేసిన ఉపదేశం విని, అర్థం చేసుకుని, పుత్రాదుల మీద ఉన్న భ్రాంతిని వదిలి, నిరంతరము ఆత్మానుసంధానంలో నిమగ్నుడవుతాడు. అదే ప్రతివాది అయిన వాడు "పిల్లలే నా ప్రాణం. వారిని నేను వదలను" అనే పట్టుదలతో తన మార్గాన్ని వదలడు. ఫలితంగా కష్టాలు, నరకం అనుభవిస్తాడు. ఈ విధంగా బ్రహ్మవేత్త చెప్పిన మాటలు ప్రతివాదికి ఒక రకంగా, శిష్యుడికి ఒక రకంగా అనిపిస్తాయి. ఎందుచేత? అంటే ఆత్మనే అత్యంత ప్రియమైనదిగా భావించి ఉపాసన చేసేవాడు ఎన్నడూ మరణధర్ముడు కాదు. అతనికి మరణముండదు. అతడు బ్రహ్మజ్ఞాని. తనను తాను ఈశ్వరునిగా భావించుకుని ఎవరి విషయంలో ఏదంటే అదే జరుగుతుంది. శిష్యునిచేత సర్వోత్తమమైనదిగా భావింపబడే సాక్షిరూపమైన ఆత్మ శాశ్వతమైనది. నాశనము లేనిది. అదే పుత్రుని రూపంలో ఆత్మ అశాశ్వతమైనది.

ఆత్మ అనేది పరమప్రేమకు విషయం. అందుచేతనే అది పరమానంద స్వరూపం. **తైత్తిరీయోపనిషత్తు**లో చెప్పినట్లుగా ఒక స్థాయి నుంచి ఇంకా ఇంకా పైకి పోతున్న కొద్దీ దాని ఆనందం పెరుగుతుంది. దేనియందు నిరతిశయమైన ప్రీతి ఉన్నదో, దాని యందు అధికమైన ఆనందము ఉంటుంది. అలాగే అధికమైన ఆనందం ఉన్న వాటిలో నిరతిశయమైన ప్రీతి కూడా ఉంటుంది. శ్రేష్ఠమైన కర్మలవల్ల

పుట్టిన సత్త్వగుణ రూపమైన బుద్ధిలో చైతన్యము ఆనందము రెండూ కనిపిస్తాయి. దీనికి కారణం సత్త్వగుణం నిర్మలంగా ఉండటం. రజోగుణ తమోగుణాలు మలినమైనవి. కాబట్టి అక్కడ ఆనందం తగ్గిపోతుంది. ఉప్పు కలియటం వల్ల మామిడికాయలో పులుపు కొంత తగ్గినట్లే, రజస్తమో గుణాల వల్ల ఆనందం కొంత వరకు తగ్గుతుంది.

కాబట్టి శుద్ధ సత్త్వగుణం కలవాడే ఆత్మానందాన్ని పూర్తిగా పొందగలుగుతాడు. 'ఆత్మయే ప్రీతికి విషయం' అని తెలుసుకున్న వాడికి విషయాల మీద ఆసక్తి ఉండదు. అందుచేత అతడు రాగానికి అతీతుడు. విషయాలమీద ప్రతికూల జ్ఞానము ఉండదు. కాబట్టి వాటియందు ద్వేషము ఉండదు. అతడికి రాగద్వేషాలు ఉండవు. యోగికి లాగానే జ్ఞానికి కూడా పులి, పాము, తేలు వంటి జీవులందు ద్వేషము ఉండదు. ద్వైతజ్ఞానము ఉండదు. ఈ రకంగా పొందుతూ, ఈ జగత్తును ఉదాసీనంగా చూస్తూ, ఆత్మానంద స్థితుడై ఉంటాడు. అదే శాశ్వతమైన ముక్తి.

ఈ విధంగా స్వయంగా తాను ఆనంద స్వరూపుడను, అనే విషయం తెలుసుకోలేక, స్వరూప జ్ఞానం లేక, క్షణికమైన సుఖాల కోసం వివిధ కర్మలను ఆచరించే అజ్ఞానులైన వారిని చూసి, వారి అజ్ఞానానికి విచారిస్తున్నాడు శంకరుడు.

**స్వమేవాకృత్రిమం దేవ మజ్ఞాత్వా ప్రతిమాం జడాః ।**
**భజంతి దేవతా బుద్ధ్యా అహో అజ్ఞజనాజ్ఞతా ॥ 6**

తన ఆత్మనే స్వభావ సిద్ధమైన దేవతగా తెలుసుకోలేక, మూఢులై, శిలానిర్మితము, లోహనిర్మితము అయిన ప్రతిమలను "ఇది దేవత" అనే భావనతో ఆరాధిస్తున్న అజ్ఞానుల యొక్క అజ్ఞానాన్ని ఏమనగలను?

**ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా, ఆ పరమేశ్వరుడు బ్రహ్మరంధ్రం ద్వారా మానవ దేహంలో ప్రవేశించాడు. అతడే జీవాత్మ. ఈ రకంగా తన ఆత్మే పరమేశ్వర స్వరూపము **'అయమాత్మా బ్రహ్మ'** నేనే పరమేశ్వర స్వరూపాన్ని **'అహం బ్రహ్మాస్మి'** అనే విషయం తెలుసుకోలేక, అంటే జీవాత్మ, పరమాత్మ రెండూ ఒక్కటే అనే విషయం తెలియక, తాను వేరు, భగవంతుడు వేరు అని భావన చేస్తున్నాడు. అంటే ద్వైతంలోకి పోతున్నాడు. ఈ కారణం చేతనే రాళ్ళతోను, లోహంతోను తయారుచేసిన విగ్రహాలను

ఎగుదురుగా పెట్టుకుని, ఇదే దేవత అని భావన చేస్తున్నాడు. తనకన్నభగవంతుని వేరుగా భావించి అర్చిస్తున్నాడు. **ఉత్తర గీత**లో భగవానుడు అర్జునుడితో చెబుతాడు.

**శిలామృద్దారు పాత్రేషు దైవబుద్ధిః ప్రకల్పితః ।**

**అకల్పిత స్వయంజ్యోతిరాత్మనో దేవతానకిమ్ ॥**

అర్జునా ! మట్టితోను, చెక్కతోను, రాళ్ళతోను చేయబడిన విగ్రహములందు దేవతాబుద్ధి కల్పితమైనది. స్వయంప్రకాశమానమైన ఆపరమాత్మే దేవుడు.

ఆ పరమాత్మ నీయందే ఉన్నాడు. ఈ విషయం జనులు తెలుసుకోలేక పోతున్నారు.

ఇది అజ్ఞానము. ఈ రకమైన అజ్ఞానం తొలగిపోనంత వరకు మోక్షం రాదు. ముక్తి అంటే విముక్తి. ఐహిక బంధనాల నుంచి విముక్తి. జీవాత్మ పరమాత్మల ఏకీభావము. బంధనాల నుంచి విముక్తి. జీవాత్మ పరమాత్మల ఏకీభావము. బంధనాల నుంచి విముక్తి పొందిన జీవాత్మ గాలిలో గాలిలాగా పరమాత్మను చేరుతుంది. జీవాత్మ పరమాత్మలు ఒకటవుతాయి. ఇది అద్వైత సిద్ధాంతము. ఇదే సాయుజ్యము లేదా ముక్తి. ఈ విషయాన్ని గుర్తించలేని అజ్ఞాని భగవంతుడు వేరు, భక్తుడు వేరు అని భావన చేస్తూ, విగ్రహారాధన చేస్తున్నాడు. అతని అజ్ఞానాన్ని నేను ఏమనగలను? అంటున్నారు భగవత్పాదుల వారు.

**అజ్ఞాత్వా ముక్తమాత్మానం ఆత్మనో ముక్తసిద్ధయే ।**

**పుణ్యక్షేత్రేషు నివసం త్యహో అజ్ఞజనాజ్ఞతా ॥** **7**

ఆత్మ పరమ పవిత్రమైనది. దానికి సంసార బంధనాలు లేవు. ఈ విషయం తెలుసుకోలేక కాశి, రామేశ్వరము, ప్రయాగ మొదలైన పుణ్యక్షేత్రాలు తిరుగుతూ, మోక్షం వస్తుందనే భావనతో అక్కడే నివశిస్తున్నాడు. అటువంటి మానవుని అజ్ఞానానికి ఏమనగలను?

ఆత్మ అనేది సర్వసాక్షి. ఆత్మకు మాయలతో గాని, కర్మలతో గాని సంబంధము ఉండదు. **లలితా అష్టోత్తరము**లో చెప్పినట్లుగా "జాగ్రస్స్వప్న సుషుప్తీనాం సాక్షిభూత్యై నమో నమః" ఆత్మ జాగ్రస్స్వప్న సుషుప్తులలో అన్నింటికీ సాక్షీభూతమై ఉన్నది. ఆత్మ దేనికీ కర్త కాదు భోక్త అంతకన్నా కాదు. సర్వానికీ సాక్షి మాత్రమే. సాక్షిని గురించి

అద్వైతంలోని భిన్నమతాలు వివిధ రకాలుగా చెబుతున్నాయి. పారమార్థికంలో అంతర్యామి, జీవుడు, ఈశ్వరుడు, కూటస్థుడు. ఇవన్నీ పర్యాయపదాలే. మాయతో కూడిన చైతన్యం ఈశ్వరుడు. అవిద్యతో కూడిన చైతన్యం జీవుడు, శుద్ధ చైతన్యం సాక్షి. అయితే జీవేశ్వరులకు ఉపాధి వల్ల భేదం ఉన్నట్లుగా సాక్షికి కూడా భేదం ఉన్నదా? అనే అనుమానం వస్తుంది. ఉపాధులలో భేదం ఉన్నా సాక్షికి భేదం లేదు. సాక్షి సర్వానుసంధాత, సర్వానుగతుడు. ఈ సాక్షికే **"తురీయుడు"** అని పేరు. సాక్షి కన్న ఇతరమైన జగత్తు తుచ్ఛమైనది. జగత్తులో ఉన్నవి రెండే పదార్థాలు. 1. సాక్షి 2. సాక్ష్యము. ఈ సాక్ష్యం మిధ్య, కాబట్టి ఇక ఉన్నది ఒక్కటే అదే సాక్షి. అదే ఆత్మ. సాక్షికి, అతనిచే ప్రకాశింప చేయబడే వస్తువులకు సంబంధము ఉండదు. చూసే వాడికి చూడబడే వస్తువుకు సంబంధము ఉండదు. అదే విధంగా ఆత్మకు దేనితోనూ సంబంధము ఉండదు. ఆత్మ సర్వకాల సర్వావస్థల యందు ముక్తస్థితిలోనే ఉంటుంది. దానికి ఏ విధమైన బంధాలు ఉండవు. అజ్ఞానియైన మానవుడు ఈ విషయాన్ని తెలుసుకోలేక పోతున్నాడు. ఆత్మకు బంధాలు ఉన్నాయని భావించి, దానికి మోక్షాన్ని కలిగించాలనే ఉద్దేశ్యంతో కాశీ, ప్రయాగ వంటి పుణ్యక్షేత్రాలను దర్శిస్తున్నాడు. ఇక్కడ ఒక్క విషయాన్ని గుర్తుంచుకోవాలి. ఏమంటే, క్షేత్రదర్శనము, అర్చనలు, వ్రతాలు ముక్తిని కలిగించలేవు. అంతేకాదు తత్త్వవేత్తలు అభిమానించటం వల్లనే కాశి మొదలైన ప్రదేశాలు పుణ్యక్షేత్రాలయినాయి. మనస్సాక్షియైన ఆత్మకు ఈ క్షేత్రాలు మోక్షాన్ని ప్రసాదించలేవు **ఉత్తరగీత**లో చెప్పినట్లుగా

**బహిర్భ్రామ్యతి యఃకశ్చిత్త్యక్త్వా దేహస్థ మీశ్వరమ్ ।**
**స్వగృహే పాయసంత్యక్త్వా భిక్షామటతి దుర్మతిః ॥**

దేహమందున్న పరమేశ్వరుని వదలి బయట ఉన్న దేవుని వెతుకుతూ తిరిగేవాడు తన ఇంట్లో వండిన క్షీరాన్నము వదలి, భిక్షాన్నము కోసం పొరుగు ఇళ్ళకు తిరిగేవాడితో సమానము.

పరమేశ్వరుడు ఎక్కడో లేడు. తానే పరమేశ్వరుడు. ఈ విషయం తెలుసుకోలేక కాశీ, రామేశ్వరం వంటి క్షేత్రాలు తిరుగుతున్నాడు. తీర్థాలలో స్నానం చేస్తున్నాడు.

కృష్ణయజుర్వేదానికి సంబంధించిన **స్కందోపనిషత్తు**లో చెప్పినట్లుగా

**దేహో దేవాలయః ప్రోక్తో, జీవోదేవస్సనాతనః ।**

**త్యజే దజ్ఞాన నిర్మాల్యం సోऽహంభావేన పూజయేత్ ॥**

మానవదేహమే దేవాలయము. అందులో ఉన్న జీవుడే సనాతనమైన పరమేశ్వరుడు. అజ్ఞానాన్ని వదలి 'సోహం' అని ధ్యానించినట్లైతే ఆత్మసాక్షాత్కార మవుతున్నది. **నారాయణ సూక్తం**లో చెప్పినట్లుగా

**పద్మకోశప్రతీకాశగ్ం హృదయంచాప్యతోముఖమ్ ।**

కంఠానికి దిగువ, నాభికి పైన ముకుళించిన పద్మము ఆకారంలో హృదయమున్నది. అక్కడ జఠరాగ్ని ఉన్నది

**నీలతో యదమధ్యస్తా ద్విద్యుల్లేఖేవ భాస్వరా ।**

**నీవార సూకమర్త్తన్వి పీతాభాస్వత్యణూపమా ॥**

ఆ జఠరాగ్ని మధ్యన అతిసూక్ష్మమైన అగ్నిశిఖ ఉన్నది. అది నీలమేఘంలోని మెరుపులాగా ప్రకాశిస్తున్నది. అణుస్వరూపంతో నీవార ధాన్యపుగింజ ములిగిలాగా ఉండి పచ్చనికాంతితో ప్రకాశిస్తున్నది.

**తస్యాశిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః ।**

**సబ్రహ్మ సశివ సహరి స్సేన్ద్ర సోక్షర పరమస్వరాట్ ॥**

ఆ అగ్ని శిఖ మధ్యలో పరమాత్మ ఉంటాడు. అతడే బ్రహ్మ, అతడే శివుడు, అతడే విష్ణువు, అతడే ఇంద్రుడు. అతడు నాశనము లేనివాడు. అతడే పరమాత్మ.

కాబట్టి పరమాత్మ ఎక్కడో లేడు. నీ హృదయమందే ఉన్నాడు. ఈ విషయాన్ని మరచిపోయి కాశీప్రయాగ వంటి క్షేత్రాలు తిరుగుతున్నారు ఈ విషయం తెలుసుకోలేని మానవుని అజ్ఞానాన్ని ఏమని వర్ణించగలను?

**సర్వజ్ఞాతార మాత్మానం విస్మృత్య జ్ఞాతు మిచ్ఛయా ।**

**అభ్యస్యంతి మహాశాస్త్రా ణ్యహో అజ్ఞజనాజ్ఞతా ॥** **8**

సర్వాన్ని తెలుసుకుంటున్న స్వస్వరూపాన్ని (ప్రత్యగాత్మను) మరచిపోయి, ఆత్మను గురించి తెలుసుకోవాలనే కోరికతో లెక్కలేనన్ని శాస్త్రాలు అభ్యాసం చేస్తున్నారు. వీరి అజ్ఞానము చాలా ఆశ్చర్యకరమైనది.

దేహాత్మబుద్ధితో ఉన్న వాడు - **జీవుడు**

స్వయంప్రకాశము గల శుద్ధ చైతన్యమే - **సాక్షి**

పిపీలికాది బ్రహ్మ పర్యంతము - **సకల ప్రాణుల యొక్క బుద్ధి**

గుహలో అధిష్ఠించి ఉన్నవాడు - **కూటస్థుడు**

సకల దేహములందు మణులలో దారంలాగా లోపల ఉండి వాటిని నియంత్రించే వాడు - **అంతర్యామి**

సత్యజ్ఞానానంద స్వరూపమైనది, ఏ రకమైన శరీర ఉపాధులు లేనిది, కటక మకుటాది భూషణాలు లేని బంగారుముద్ద వంటిది, విజ్ఞాన ఘనమైనది, చిత్ స్వభావమైనది, ఆత్మ చైతన్యమైనది, బ్రహ్మమైనది, ప్రకాశించేది, అవిద్యోపాదిలో పడనిది, అయిన 'త్వం' పదార్ధమే - **ప్రత్యగాత్మ.**

సత్యజ్ఞానానంతమైనది - **పరబ్రహ్మ.**

ఆ పరబ్రహ్మ ఉత్పత్తి, వినాశనము లేనిది. స్వయంప్రకాశమైనది, ఎడతెగక ఉండేది, అనంతమైనది. కుండ యందు మట్టిలాగా, ఆభరణాలలో బంగారం లాగా, వస్త్రములో దారములాగా, ప్రపంచమందు సంపూర్ణముగా వ్యాపించిన చైతన్యమే అనంతము. ఆనందము అంటే - సుఖచైతన్య స్వరూపము. అదే ఆత్మస్వరూపం. స్వస్వరూపం.

అజ్ఞానులైన మానవులు తమ స్వరూపమేఆత్మ అంటే తామే పరమేశ్వర స్వరూపము అని మరచిపోయి, ఆత్మ ఎక్కడో విడిగా ఉన్నది అనుకుని, ఆ ఆత్మను గురించి తెలుసుకోవాలనే కోరికతో తర్కము, వేదాంతము మొదలైన అనేక శాస్త్రాలను చాలా శ్రమపడి చదువుతున్నారు. వీరి అజ్ఞానానికి ఏమనగలను?

**ఆత్మనః స్థూలభిన్నత్వం సప్నేదృష్ట్వాపి మోహితాః ।**
**స్థూలేష్వహంతాం నోముంచం త్యహో అజ్ఞజనాజ్ఞతా ॥** **9**

స్వప్నావస్థలో ప్రత్యగాత్మ సూక్ష్మరూపం ధరిస్తుంది. స్థూలదేహం ఉండదు. ఈ విషయం తెలిసి కూడా మానవులు మోహము చేత దేహము, ఇంద్రియాల యందు ఆసక్తిని విడువలేకున్నారు.

మానవదేహము మూడు రకాలుగా ఉంటుంది. అవే 1.స్థూలదేహము 2. సూక్ష్మదేహము 3. కారణదేహము. వీటిలో పంచీకరణ చెందిన పంచభూతాల వల్ల ఏర్పడినదే స్థూలదేహము. ప్రారబ్ధకర్మ ఫలితంగా వచ్చే సుఖదుఃఖాలను అనుభవించేది ఈ స్థూలదేహమే. పూర్వకర్మల ఫలితంగానే ఈ దేహం ఏర్పడుతుంది. జాగ్రదావస్థలో సమస్తమైన అనుభవాలు పొందుతుంది. మిగిలిన అవస్థలు ఏవీ దానికి తెలియవు. జరామరణాలు, బాల్య యౌవనాది దశలు, చతురాశ్రమాలు, వాటి ధర్మాలు మానావమానాలు, అన్నీ ఈ శరీరానికే చెందుతాయి.

పాంచభౌతికమైనది ఈ దేహము. తల్లితండ్రులు తీసుకున్న ఆహారం వల్లనే పుట్టి, ఆహారం వల్లనే వృద్ధి చెందుతుంది. ఆహారం లేకపోతే నశించిపోతుంది. ఈ దేహము క్షణికమైనది. జననానికి ముందు లేదు. మరణానికి తరువాత కూడా ఉండదు. అశాశ్వతమైనది. గృహస్థుకు గృహంలాగా జీవాత్మకు ఇది ఆవాసము. అనుభవాలు పొందే నిలయము. అంతేకాని స్థూలదేహము ఆత్మకాదు.

పంచప్రాణాలు, మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు ఈ పదిహేడింటితోను కూడినది. అపంచీకృత మహాభూతాల వల్ల ఏర్పడినది సూక్ష్మశరీరము. దీన్నే లింగశరీరము అంటారు. ఈ శరీరం పూర్తిగా వాసనలతో నిండి ఉంటుంది. వాసనలతో కూడిన ఈ సూక్ష్మశరీరము ఆత్మను మరుగుపరచి వ్యక్తిగత అహంకారాన్ని సృష్టిస్తుంది. వండ్రంగి వాడికి బాడిసలాగా ఆత్మకు ఈ సూక్ష్మశరీరము కార్యకలాపాల నిర్వహణలో ఉపయోగిస్తుంది. ఈ మెలకువ రాగానే ఈ సూక్ష్మశరీరం అంతరించి పోతుంది. అందుచేతనే సూక్ష్మశరీరం కూడా ఆత్మకాదు.

వాక్కు చేత చెప్పనలవి కానిది, అజ్ఞానమయమైనది కారణ శరీరము. గుణత్రయమే ఆత్మయొక్క కారణ శరీరము, ఇది సుషుప్తిలో ఉంటుంది. సుషుప్తి అంటే గాఢనిద్ర. ఈ స్థితిలో అన్ని రకాలయిన జ్ఞానము నశిస్తుంది. బుద్ధి కేవలము బీజరూపంలో ఉంటుంది. ఈ స్థితిలో అన్ని అవయవాలు పూర్తిగా విశ్రమిస్తాయి. మనస్సు, బుద్ధి, ఇంద్రియాల కార్యకలాపాలన్నీ పూర్తిగా ఆగిపోతాయి. ప్రాణం మాత్రమే ఉంటుంది. బాహ్య ప్రపంచం గోచరించదు. అలా అని సత్య స్వరూపం అంతకన్నా గోచరించదు. పూర్తిగా తమోగుణ ప్రధానమైన స్థితి. సంపూర్ణమైన అజ్ఞానమే ఈ స్థితి ధర్మం. బుద్ధి ఉండదు కాబట్టి బుద్ధి రూపమయిన ప్రపంచము ఉండదు. దేనినీ తెలుసుకోలేని అవస్థ ఇది. అందుకే కారణ శరీరం కూడా ఆత్మకాదు.

మానవుడు ఒక స్థితినుంచి వేరొక స్థితికి వచ్చేటప్పుడు అతని ఆత్మ రూపాంతరం చెందుతుంది. జాగ్రదావస్థలో విశ్వుడు అనబడుతుంది. స్వప్నావస్థలో తైజసుడుగా, సుషుప్తిలో ప్రాజ్ఞుడుగా పిలువబడుతుంది. ఒక అవస్థలో ఉన్నవాడు మిగిలిన అవస్థలను చూడలేడు. జాగ్రదావస్థలో ఉన్న వాడికి మిగిలిన రెండు అవస్థలు తెలియవు. స్వప్నావస్థలో కాని, సుషుప్తిలో కాని ఉన్నప్పుడు జాగ్రదావస్థ ఉండదు. అంటే ఆత్మకి స్థూలత్వము లేదు. పాంచభౌతికమైన దేహము, ఇంద్రియాలు, ఏవీ శాశ్వతం కాదు. అవి ఆత్మకాదు. మరణానంతరము ఇవన్నీ నశించిపోతాయి. ఈ విషయం తెలిసి కూడా దేహాదుల యందు ఆత్మాభిమానాన్ని వదలలేకుండా ఉన్నాడు. నేను అంటే స్థూలదేహమే అని భావన చేస్తున్నాడు. అటువంటి వారి అజ్ఞానాన్ని ఏమని వర్ణింపగలను.

**మలమాంసమయం దేహం స్వం మత్వాஉశుచి మస్యతు ।**

**శుద్ధిం కుర్వంతి తో యాద్యై రహో అజ్ఞ జనాజ్ఞతా ॥ 10**

మలమూత్ర మాంసములతో కూడినది, అపరిశుభ్రము, అసహ్యాకరము అయిన ఈ స్థూలశరీరాన్ని ఆత్మగా భావించి, జలము మొదలైన వాటితో శుభ్రం చేస్తున్నారు. అట్టి ఈ జనుల అజ్ఞానము ఆశ్చర్యకరమైనది.

ఇక్కడ స్థూలశరీరాన్ని గురించి చెబుతున్నారు. చర్మము, రక్తము, మాంసము, నరాలు, మేధ, మజ్జ, ఎముకలు, మలమూత్రాలతో కూడినదే స్థూలదేహము. ఇది అసహ్యాకరమైనది. జుగుప్సాకరమైనది. రక్తమాంసాలు, మలమూత్రాలతో నిండి పైన అందమైన చర్మంతో కప్పబడి ఉంటుంది. ఈ చర్మాన్ని గనక తీస్తే, లోపల ఉండేవన్నీ అసహ్యాకరమైన పదార్థాలే. ఈ శరీరంలో నుంచి రక్తము, మాంసము, మలము, మూత్రము, కఫము ఏ ఒకటి బయటకు వచ్చినా మనం భరించలేము. వాటిని అసహ్యించుకుంటాం. అవి శరీరం లోపల ఉన్నప్పుడు మాత్రం ఆ శరీరం మీద అత్యంతమైన ప్రేమను చూపిస్తాం. పాంచభౌతికమైన ఈ దేహం శాశ్వతం కాదు. నశించిపోయేది. ఆ మాట అందరికీ తెలుసు. తన కళ్ళ ఎదురు గానే తాత, తండ్రి, బంధువులు చాలామంది గతించారు. రేపో మాపో తానూ మరణిస్తాడు. అయినా భ్రాంతి. తెలియని భ్రాంతి. “ఈ దేహమే నేను” అనే భ్రాంతి. దేహమే ఆత్మ అనే భ్రాంతి. అందుకే శరీరాన్నిప్రతిరోజూ నీటితో శుభ్రం చేస్తాడు. సుగంధ

పరిమళాలు, లేపనాలు రాస్తాడు. చక్కగా పోషిస్తాడు. ఎంత చేసినా, ఏం చేసినా శుద్ధమైన పదార్థమే శుద్ధం అవుతుంది. అంతేకాని అపరిశుద్ధమైనది శుద్ధం కాదు. ఎలుకతోలు తెచ్చి, ఎన్నాళ్ళు ఉతికినా నలుపు నలుపే కాని తెలుపు కాదు. కొయ్య బొమ్మను తీసుకువచ్చి ఎంత కొట్టినా దానికి బుద్ధి రాదు. కాకిని తెచ్చి గంగా స్నానం చేయించినంత మాత్రం చేత, అది హంసగా మారదు. అలాగే ఈ దేహాన్ని శుద్ధి చేసినంత మాత్రం చేత, అది ఆత్మ కాదు. ఈ విషయం తెలుసుకోలేని వారి అజ్ఞానానికి చింతిస్తున్నాను.

**ద్వయోరన్నస్య కార్యత్వే హంతాం వపుషి కుర్వతే ।**

**న మలే బుద్ధివైచిత్ర్య మహో అజ్ఞజనాజ్ఞతా ॥** 11

దేహానికి, మలానికి ఆహారమే కారణమైనప్పటికీ అంటే ఈ రెండూ ఆహారము వల్లనే పుట్టినప్పటికీ, జనులు ఈ దేహము మీదనే ఆత్మభావన ఉంచుతున్నారు. ఇది ఎంత ఆశ్చర్యము?

తల్లిదండ్రులు తీసుకున్న ఆహారం వల్ల జన్మించి, ఆహారము వల్ల పెరుగుతున్నది ఈ స్థూలదేహము. ఆహారము లేకపోతే నశిస్తుంది. అలాగే మలము కూడా ఆహారము వల్లనే కలుగుతున్నది. అంటే ఈ రెండూ ఒకే రకంగా ఉత్పత్తి అవుతున్నాయి. అయినప్పటికీ మానవుడు ఈ దేహం మీదనే ఎక్కువ మమకారం ఉంచుతున్నాడు. మలాన్ని అదే రకంగా అభిమానించటం లేదు. ఇది చాలా విచిత్రమైనది. మలము లాగానే ఈ దేహము కూడా అభిమానింపదగినది కాదు అని ఈ జనులు ఎందుకు తెలుసుకోవటం లేదో తెలియటం లేదు. వారి అజ్ఞానానికి చింతిస్తున్నాను.

ఈ రకంగా శంకర భగవత్పాదుల వారు రెండు నుంచి పదకొండు వరకు గల శ్లోకాలలో **"అహోఅజ్ఞజనాజ్ఞతా"** అజ్ఞానులైన ఈ జనుల అజ్ఞానానికి చింతిస్తున్నాను. అంటూ జగత్తంతా పరమేశ్వరస్వరూపమే అని చెబుతున్నారు 12వ శ్లోకంలో

**అసత్కల్పం మృషాప్రాయం స్వప్న తుల్యం భ్రమోదితం ।**

**జగత్సర్వమితి జ్ఞేయం పండితై స్తత్త్వదర్శిభిః ॥** 12

ఆత్మతత్త్వాన్ని తెలుసుకున్న బ్రహ్మజ్ఞానుల దృష్టిలో నామరూపాత్మకమైన ఈ జగత్తు కలలాంటిది. దీనికి సత్యత్వము ఏ మాత్రము లేదు. ఆత్మస్వరూపము తెలియని వారికి ఈ జగత్తు పరబ్రహ్మ కన్న వేరుగా కనిపిస్తుంది.

వాస్తవంగా చెప్పాలంటే జగత్తులో ఉన్నది పరమేశ్వర స్వరూపం ఒక్కటే. దృశ్యమానాత్మకమైన జగత్తు లేదు. అందుకే బ్రహ్మజ్ఞానుల దృష్టిలో **'బ్రహ్మసత్యం-జగన్మిథ్య'** ఇక్కడ కొన్ని పదాలు వాడుతున్నాం. వాటి అర్థాలు ఒకసారి చూడండి.

1. భ్రాంతి – తప్పు అభిప్రాయము, పొరపాటు పడటము.
2. భ్రమ – భిన్నంగా గ్రహించటము.
3. మిథ్య – అసత్యము, మోసము, తప్పు.
4. మాయ – దంభము, వంచన, మోసము, గారడీవిద్య.

ఈ జగత్తులో అజ్ఞాని అయినవాడు ఒక దానిని చూసి వేరొకటి అని భావన చేస్తున్నాడు. ఇదే అజ్ఞానం. అజ్ఞానము రెండు కారణాల వల్ల వస్తోంది. 1.అగ్రాహ్యాము 2.అన్యథాగ్రాహ్యాము. అగ్రాహ్యాము అంటే – వస్తువు యొక్క స్వరూపాన్ని సరిగా గ్రహించలేకపోవటం. అన్యథా గ్రాహ్యాము అంటే ఆ వస్తువుని ఇంకొకటిగా భావన చెయ్యటం. ఉదాహరణకు – మసక చీకటిలో త్రాడును చూసి పాము అనుకోవటం. ఈ అజ్ఞానంతోనే నామరూపాత్మకమైన జగత్తును శాశ్వతము అనుకుంటున్నాడు. అశాశ్వతమైన దేహమే తాను అని భావిస్తున్నాడు. పాంచభౌతికమైన ఈ దేహము నశించి పోతుంది. ఈ విషయం తెలిసికూడా, దేహాత్మభావాన్ని వదలలేదు. వస్తువు యొక్క యధార్థ రూపాన్ని తెలుసుకోలేక, భ్రాంతి చెందుతున్నాడు. స్థాణువును చూసి అది కదలలేని మొద్దు అని భావించటం లేదు. దొంగ అని భ్రమ చెందుతున్నాడు. అంటే అసలుదానికన్న వేరుగా భావన చేస్తున్నాడు. అందుచేతనే నామరూపాత్మకమైన ఈ జగత్తు సత్యము, నిత్యము, శాశ్వతము అనుకుంటున్నాడు. అతనికి జ్ఞానోదయమైనప్పుడు, అజ్ఞానం పటాపంచలైపోయి జగత్తంతా పరమేశ్వర స్వరూపమని తెలుస్తుంది. ఈ కారణం చేతనే జ్ఞానుల దృష్టిలో జగత్తు శాశ్వతం కాదు. ఉన్నట్లుగా అనిపిస్తుంది. అందుకే భ్రమ అనబడుతుంది. ఇక్కడ వాస్తవమైన పదార్థం ఏదీ లేదు. కాని ఉన్నట్లుగా అనిపిస్తుంది. ఈ జగత్తంతా కలలాంటిది. మెలకువ రాగానే కల కరిగిపోతుంది. అలాగే జ్ఞానం కలగగానే, అజ్ఞానం నశించిపోతుంది. **'బ్రహ్మ సత్యం-జగత్తు మిథ్య'** అనే విషయం బోధ పడుతుంది. అందుచేత జ్ఞానం గలవారందరూ తప్పనిసరిగా ఆత్మవిచారము చెయ్యాలి.

**జన్మభిః కోటిపర్యంతై ర్నిర్వృతైః పుణ్యకర్మభిః ।**
**శుద్ధాత్మనాం సతామేవ జిజ్ఞా సాత్మని జాయతే ॥ 13**

అనేకకోట్ల జన్మలుఎత్తి పుణ్యకర్మలు చేసి పవిత్రమైనమనస్సుగల సత్పురుషులకు మాత్రమే ఆత్మని గురించిన విషయాలు తెలుసుకోవాలనే కోరిక కలుగుతుంది.

ఆత్మవిద్య అంటే – బ్రహ్మవిద్య. మోక్షవిద్య. అది సామాన్యమైనది కాదు. అందరికీ అందుబాటులో ఉండదు. ఎన్నో జన్మలెత్తి, పవిత్రమైన పుణ్యకార్యాలు చెయ్యగా చెయ్యగా మనస్సు నిర్మలమవుతుంది. సామాన్యంగా ప్రతివారికి లౌకికమైన విషయాల యందు మాత్రమే ఆసక్తి ఉంటుంది. అందుచేతనే వారు ఈ లోకంలో దొరికే సుఖాలు, భోగభాగ్యాలు, సిరిసంపదలు వీటికోసమే ప్రాకులాడతారు. ప్రతి మానవుడు కూడా తనకు లేనిదాన్ని పొందటానికి ప్రయత్నిస్తాడు. అందం లేనివాడు అందంగా ఉండాలనుకుంటాడు. బలం లేనివాడు బలంగా ఉండాలనుకుంటాడు. ధనం లేనివాడు ధనవంతుడు కావాలనుకుంటాడు. ఈ రకంగా ఈ లోకంలో ఉన్న అన్నీ తనకు కావాలి. వాటన్నింటినీ తాను పొందాలి అనుకుంటాడు. అందరి కన్నా తాను ఉన్నతమైన స్థితిలో ఉండాలి. సుఖంగా జీవించాలి అనుకుంటాడు. అటువంటి సుఖము, ఆనందము పొందటానికి జీవితమంతా ప్రయత్నిస్తూనే ఉంటాడు. ఈ సుఖాలలో కూడా ఒకటి దొరికితే అంతటితో ఆగడు. ఇంకొకటి కావాలనుకుంటాడు. లోకంలో ఉండే సుఖాలన్నీ పొందాలనుకుంటాడు. సామాన్యమైన మానవుడు ధనవంతుడు కావాలనుకుంటాడు. ధనవంతుడు–రాజు కావాలనుకుంటాడు. రాజు–మహారాజు కావాలనుకుంటాడు. మహారాజు–చక్రవర్తి కావాలనుకుంటాడు. చక్రవర్తికి ఈ లోకంలోని అన్ని విషయాలు అతని అధీనంలోనే ఉంటాయి. ఇప్పుడు అంతకన్న గొప్ప విషయాలు, స్వర్గసుఖాలు పొందాలనుకుంటాడు. అలా స్వర్గసుఖాలు పొందిన తరువాత, అంతకన్న ఎక్కువ కావాలని ఆలోచిస్తాడు. అంటే ఈ సుఖాలన్నీ శాశ్వతంగా ఉండాలనే కోరిక. అప్పుడు అన్నింటికీ అతీతమైన శక్తి – ఆత్మను గురించి విచారణ చేస్తాడు. ఇలా ఆత్మవిచారణ చెయ్యాలంటే నిర్మలమైన మనస్సు కావాలి. యజ్ఞయాగాది క్రతువులు చెయ్యటం చేత, దానధర్మాలు, పూజలు, వ్రతాలు, అర్చనలు, జపతపాదులు చెయ్యటం వల్లనే మనసు పరిశుద్ధమవుతుంది. నిర్మలమైన అద్దంలో ప్రతిబింబం స్వచ్ఛంగా కనిపిస్తుంది.

అలాగే నిర్మలమైన మనసులో పరమాత్మ సాక్షాత్కరిస్తుంది. పరిశుద్ధమైన మనసు గలవాడికి దృశ్యమానమైన జగత్తు సత్యంకాదు. సత్యము నిత్యము శాశ్వతము అయిన పదార్ధము వేరే ఉన్నది. దాన్ని గురించి తెలుసుకోవాలనే ఆలోచన కలుగుతుంది. కాబట్టిఆధ్యాత్మిక విషయాల గురించి తెలుసుకోవాలనే కోరిక కలగాలంటే ఎన్నో జన్మలలో పుణ్యం చేసి ఉండాలి. అటువంటి వారికి మాత్రమే ఆధ్యాత్మిక విషయాల యందు ఆసక్తి కలుగుతుంది.

**ఛాందోగ్యోపనిష ద్యేత న్మహావాక్యమితీర్యతే ।**

**షష్ఠే ప్రపాఠకే తత్త్వ మసీతిప్రాయశో௨స్తియత్ ॥** **14**

ఛాందోగ్యోపనిషత్తులోని ఆరవ ప్రపాఠకంలో **'తత్త్వమసి'** అని ఒక వాక్యమున్నది. దాన్ని అందరూ **'మహావాక్యము'** అంటారు. దాన్ని గనక బాగా విమర్శించి చూసినట్లైతే ఆత్మజ్ఞానము, జీవబ్రహ్మైక్య జ్ఞానం దృఢమవుతుంది.

గ్రంథాలు వ్రాసేటప్పుడు, దానిలోని విషయాన్ని వివరించటానికి వీలుగా గ్రంథాన్ని కొన్ని భాగాలుగా చేస్తారు. వాటినే అధ్యాయాలు, అశ్వాసము, సర్గ, కాండ అంటారు. అలాగే ఉపనిషత్తులను వివరించేటప్పుడు ప్రత్యేకించి ఛాందోగ్యోప నిషత్తులో ప్రపాఠకము అంటారు. ఇక్కడ ఉన్న తత్త్వమసి అనే వాక్యాన్ని 'మహావాక్యము' అంటారు. దీనికి గనక అర్థం తెలుసుకుంటే మిగిలిన మహావాక్యాల అర్థం కూడా తెలుస్తుంది.

**తత్రత్యానాం పదానాంయ ద్వితీయం త్వంపదం స్థితమ్ ।**

**తస్యార్థ ప్రత్యగాత్మైష యో௨హమిత్యనుభూయతే ॥** **15**

'తత్త్వమసి' అనే మహావాక్యంలో తత్, త్వం, అసి అని మూడు పదాలున్నాయి. తత్–అది, త్వం–నీవు, అసి–అయి ఉన్నాయి. ఈ పదాలలో రెండవ పదానికి 'నేను' అని ఎవడు అనుభవింపబడుతున్నాడో, అతడే కూటస్థుడు.

లోక వ్యవహారంలో ప్రతివాడు నేను, నేను అని ఏ పదార్థాన్ని వ్యవహరిస్తున్నాడో, దాన్ని ఇతరులు 'నీవు' అని వ్యవహరిస్తారు. ఈ విషయం అందరికీ తెలిసిందే. ఒకచోట ఇద్దరు వ్యక్తులు తారసపడ్డారు. అందులో మొదటివాడు రెండవ వాడిని 'నువ్వు ఎప్పుడు వచ్చావు?' అని అడిగాడు. 'నేను ఇవాళ ప్రొద్దునే వచ్చాను'

సమాధానం చెప్పాడు. రెండవ వాడు. జాగ్రత్తగా గమనిస్తే ఇక్కడ నువ్వు నేను అనే రెండు పదాలకు అర్థం ఒకటే. కాబట్టి నేను అనే పదానికి అర్థాన్ని పరిశీలించినట్లైతే, ఇది నా శరీరము ఇది నా కాలు. ఇది నా చేయి. వీటిని పట్టి చూసినట్లైతే, నేను అంటే ఈ దేహం కాదు. నేను అంటే ఇంద్రియాలు కాదు.

ఈ దేహము మూడు రకాలుగా ఉంటుంది. 1.స్థూలదేహము 2.సూక్ష్మదేహము 3.కారణదేహము. పంచీకృత మహాభూతాల వల్ల ఏర్పడి, ఆగామి, సంచిత ప్రారబ్ధములు కలిగిన స్థూలశరీరమే **స్థూలదేహము.** చర్మము రక్తము, మాంసము, ఎముకలు, మజ్జ, చీము, మలమూత్రాలతో కూడినదే స్థూలదేహము. ఇది అసహ్యకరమైనది. జీవి భోగాలు అనుభవించటానికి ఈ దేహమే ఆధారము. జాగ్రదావస్థలోనే స్థూలశరీరము అనుభవాలు పొందుతుంది. అన్ని రకాలయిన సుఖాలు, దుఃఖాలు పొందుతూ ఉంటుంది. ఆయువు ఉన్నంత వరకు జీవించి, ఆ తరువాత నశించి పోతుంది. కాబట్టి నేను అంటే స్థూలశరీరము కాదు.

పంచప్రాణాలు, మనస్సు, బుద్ధి, ఇంద్రియాలతో కూడినది, అపంచీకృత మహాభూతాల వల్ల ఏర్పడినది సూక్ష్మశరీరము. దీన్నే **లింగశరీరము** అంటారు. సూక్ష్మభూతాలతో ఏర్పడిన ఈ శరీరం పూర్తిగా వాసనలతో నిండి ఉంటుంది. జీవుడికి గతంలో తాను చేసిన కర్మలకు అనుగుణమైన అనుభవాలు కలగటానికి ఈ వాసనలే కారణం. ఇవేవీ శాశ్వతమైనవి కావు. కాబట్టి నేను అంటే సూక్ష్మశరీరం కాదు.

వాక్కుచేత చెప్పనలవి కానిది, ఆది లేనిది, అయిన అజ్ఞానమే **కారణ శరీరము.** గుణత్రయమే ఆత్మయొక్క కారణ శరీరము. ఇది సుషుప్తిలో ఉంటుంది. ఆ స్థితిలో కేవలము అజ్ఞానమే ఉంటుంది. ఈ అవస్థే రాబోయే దుఃఖాలకు కారణం అవుతున్నది. అజ్ఞానం వల్ల ఏమీ తెలియక సర్వము నష్టమై పోయినట్లు అనిపించటం, రాబోయే సుఖదుఃఖాలకు కారణం అవటం, ఇవన్నీ కారణ శరీరానికి కలిగే తాపాలు. నేను అంటే ఈ కారణశరీరం కూడా కాదు. ఈ రకంగా నేను అంటే స్థూలశరీర కాదు, సూక్ష్మశరీరం కాదు. కారణశరీరం అంతకన్నా కాదు. మొత్తం మీద నేను అంటే ఈ దేహంకాదు. అలాగే నేను అంటే మనస్సుకాదు, బుద్ధికాదు, చిత్తం కాదు, అహంకారంకాదు. మరి నేనుఅంటే ఎవరు. సర్వానికీ సాక్షియై, శరీరముచే

ఆవరించబడిఉన్న **'చైతన్యమే'** నేను. ఈ **చైతన్యాన్నే కూటస్థుడు** అంటారు. "బుద్ధి వృత్తుల యొక్క సంధులు, ఆ బుద్ధివృత్తుల యొక్క అభావము కూడా ఏ నిర్వికారమైన చైతన్యం వల్ల ప్రకాశితమవుతున్నాయో, ఆ చైతన్యాన్నే **కూటస్థ చైత్యము** అంటారు." (వేదాంత పంచదశి, కూటస్థ దీప ప్రకరణము శ్లోకం 21) శరీరము ఇంద్రియాలు, మనస్సులతో కూడిన చిదాభాస రూపుడైన జీవుని యొక్క భ్రమకు అధిష్టానమైన చైతన్యాన్నే వేదాంత శాస్త్రంలో కూటస్థుడు అంటారు. (వేదాంత పంచదశి, కూటస్థ దీపప్రకరణము శ్లో. 48) కూటస్థుని మాయగా భావించరాదు. కూటస్థ స్వరూపం అసంగమైనది. జన్మమృత్యు జరాదులతో దానికి ఏ రకమైన సంబంధము లేదు. దానికి ఏ విధమైన అతిశయము, వికారము ఉండదు. ఆత్మోపనిషత్తులో చెప్పినట్లుగా మాయాకల్పితమైన బంధమోక్షాలు యధార్థంగా బ్రహ్మమందు లేవు. ఈ పదార్థాలు ఉన్నాయని, లేవని చెప్పే భావాలు బుద్ధి యొక్క గుణాలు. నిత్యవస్తువైన పరమాత్మలో అస్తి, నాస్తి అనేవి లేవు. ఆత్మలో చెప్పబడిన బంధమోక్షాలు మాయాకల్పితాలు. నిజంగా చెప్పాలంటే కూటస్థానాకి ఉత్పత్తి లేదు, మరణం లేదు. సుఖం లేదు, దుఃఖం లేదు. దానికి శ్రవణాదికమైన సాధనాలు లేవు. మోక్షవిషయకమైన ఆకాంక్ష లేదు. కాబట్టి 'త్వం' అంటే కూటస్థ చైతన్యమే తప్ప వేరు కాదు.

**సహజం తు పరం బ్రహ్మ కేవలానంద లక్షణమ్ ।**
**తత్పదస్య భవేదర్థో యః పరాత్మేతి గీయతే ॥ 16**

ఈ శ్లోకంలో 'తత్' అనే పదానికి అర్థం చెబుతున్నారు. ఏకమైనది, ఆనందమే స్వరూపముగా గలది, స్వభావ సిద్ధమైనది, సర్వాధికారమైన బ్రహ్మమే 'తత్' అనే పదానికి అర్థము. సృష్టి ప్రారంభానికి ముందు ఈ చరాచరజగత్తంతా పరమేశ్వర స్వరూపంగా ఉండేది. ఆ పరమాత్మ ఏకమైనది. అపరిచ్ఛిన్నమైనది. అఖండముగా ఉండేది. ఖండములుగా, ముక్కలుగా లేనిది, అంతా ఒకటిగానే ఉండేది. ఆనందమే స్వరూపంగా గలది. పరమేశ్వరుడు చిదానందుడు. **"చిదానందరూపం శివోహం శివోహం"** ఈ ఆనందాన్నే బ్రహ్మానందం అంటారు. ఈ లోకంలో ధనధాన్యాలు, భోగభాగ్యాలు, పుష్కలంగా ఉన్నవాడు, విద్యావంతుడు, ఆరోగ్యవంతుడు మంచి లక్షణాలు గలవాడు, అనుభవించాలన్న కోరిక ఉన్నవాడు పొందే ఆనందాన్నే 'మానుషానందము' అంటారు. మానుషానందానికి నూరు రెట్లుంటుంది మానవగంధర్వానందం.

దానికి నూరు రెట్లు - గంధర్వానందం

నిజగంధర్వానందానికి నూరురెట్లు - చిరలోక పితరానందం

దానికి నూరు రెట్లు - అజానజదేవానందం

దానికి నూరు రెట్లు - దేవానందం

దేవానందానికి నూరు రెట్లు - ఇంద్రుడు పొందే ఆనందం.

దానికి నూరురెట్లు - బృహస్పతి పొందే ఆనందం

దానికి నూరురెట్లు - ప్రజాపతి పొందే ఆనందం

దానికి నూరు రెట్లుంటుంది - పరబ్రహ్మ పొందే ఆనందం.

దాన్నే బ్రహ్మానందము అంటారు. బ్రహ్మానందమనేది ఐదు రకాల ఆనందాల కలయిక. 1.జ్ఞానానందం 2.విషయానందం 3.ఆత్మానందం 4.అద్వైతానందం 5.యోగానందం. వీటన్నింటి కలయికే బ్రహ్మానందం. ఈ కారణం చేతనే ఆ పరమేశ్వరుడు ఆనందమయకోశము నందుంటాడు. అటువంటి ఆ పరమేశ్వరుడు అపరిచ్ఛిన్నుడు. ఒకటిగానే ఉంటాడు. అంటే చరాచర జగత్తంతా వ్యాపించి ఉంటాడు. ఆ పరమాత్మ స్వరూపమే 'త్వం' అనే పదానికి అర్థం.

**అసీత్యేకత్వమన యో రఖండత్వం ముహుర్ముహుః ।**
**తాత్పర్యేణ శ్రుతిర్వక్తి సర్వజ్ఞా సత్యవాదినీ ॥ 17**

ఈ శ్లోకంలో 'అసి' అనే పదానికి అర్థం చెబుతున్నారు. అన్నీ తెలిసినటువంటిది, యథార్థమైనది అయిన ఆ పరమేశ్వరుడవు నీవే అయి ఉన్నావు. తత్త్వమసి అనే మహావాక్యానికి 'నీవే బ్రహ్మవై ఉన్నావు'. కూటస్థునికి, బ్రహ్మకు భేదం లేదు. ఈ ఐక్యత స్వతఃసిద్ధమైనది. అంటే కొంతకాలం విడిగా ఉండి, ఏదో కారణాల చేత ఏర్పడినది కాదు. కూటస్థుడు పరబ్రహ్మ కన్న వేరుకాదు. ఘటాకాశం మహదాకాశం కన్న వేరు కాదు. ఆకాశం ఘటంలో ఉన్నది కాబట్టి ఘటాకాశం అనబడుతోంది. ఘటం గనక పగిలిపోతే, ఘటాకాశం మహదాకాశంలో లీనమై పోతుంది. అలాగే ఆత్మకూడా. ఐతరేయోపనిషత్తులో చెప్పినట్లుగా చరాచర జగత్తును సృష్టించిన తరువాత, మానవదేహాన్ని కూడా సృష్టించిన తరువాత, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలతో కూడిన ఈ దేహంలో నేను ప్రవేశించకపోతే ఎలా? అనుకున్నది

పరమాత్మ. మరుక్షణంలోనే బ్రహ్మరంధ్రం గుండాలోనికి ప్రవేశించి, దశేంద్రియాల తోను అన్ని రకాలైన సుఖాలు అనుభవించటానికి అలవాటుపడి, శరీరంచేసే కర్మలన్నింటికీ తానే కర్తా, భోక్తా అని భావన చేస్తూ అజ్ఞానంలో కూరుకుపోయి, శరీరము నుంచి బయటకు పోయే మార్గం కూడా మరచిపోయి, పంజరంలో బంధించబడిన పక్షిలాగా, దేహంలో బందీ అయిపోయింది. జీవిలో ఉన్న ఆత్మనే జీవాత్మ అంటున్నాం. నిజానికి జీవాత్మ పరమాత్మ కన్న వేరుకాదు. అజ్ఞానంవల్ల ఈ రెండూ వేరు వేరు అని భావిస్తోంది. జ్ఞానం కలిగిన మరుక్షణంలో ఈ రెండూ ఒకటే అనే విషయం తెలుస్తుంది. అప్పుడు ఇక రెండు ఉండవు. ఉండేది ఒకటే. అదేఆత్మ. అందుకే బ్రహ్మజ్ఞాని అయిన ఉద్దాలకుడు, బ్రహ్మజిజ్ఞాసి అయిన శ్వేతకేతువుకు ఈ విషయం చెబుతున్నాడు. శ్వేతకేతూ ! ఆకాశంలో సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. అతనిలో ఏ తత్త్వమైతే ఉన్నదో అదే నీలోనూ ఉన్నది. తత్త్వమసి. అదే నీవై ఉన్నావు. చంద్రుడు లోకంలోని ప్రజలందరికీ చల్లదనాన్ని ప్రసాదిస్తున్నాడు. అతనిలో ఏ తత్త్వమయితే ఉన్నదో, అదే నీలోనూ ఉన్నది. తత్త్వమసి. ఈ రకంగా చరాచరజగత్తులోని ప్రతిజీవిలోను, ప్రతిప్రాణిలోను, ప్రతివస్తువులోను ఏ తత్త్వమయితే ఉన్నదో అదే నీలోనూ ఉన్నది. అంటే జీవాత్మ పరమాత్మ రెండు ఒక్కటే.

కృష్ణయజుర్వేదంలో 'శుకరహస్యోపనిషత్తు' చెప్పబడింది. దీనిలో వ్యాసమహర్షి తన కుమారుడైన శుకుడికి ఉపనయనం చేస్తూ, ఆ సమయంలో బ్రహ్మోపదేశం చెయ్యమని సదాశివుణ్ణి అడుగుతాడు. సదాశివుడు శుకుడికి బ్రహ్మోపదేశం చేస్తాడు. అప్పుడు మహావాక్యాలను షడంగాలతోనూ జపం చెయ్యాలి అని చెబుతూ, 'తత్త్వమసి' అనే మహావాక్యంలోని మూడు పదాలను మూడు మంత్రాలుగా ఉపదేశించి, వాటిని వివరిస్తాడు సదాశివుడు.

**శ్రుత్యా సమీరిత స్త్వర్థో మోహాన్నాద్రియతే జనైః ।**
**సంసారాబ్ధౌ పతంత్యంధా ఇవ తేనైవ దోషతః ॥ 18**

ఈ విధంగా జీవాత్మ పరమాత్మలు రెండూ ఒకటే అనే విషయాన్ని **'జీవబ్రహ్మైక్యయోగము'** అంటారు. ఇది వేదంలో చెప్పబడినప్పటికీ, అజ్ఞానంతో మానవులు దీనిని అంగీకరించటం లేదు. అందువల్ల గ్రుడ్డివారిలాగా సంసారమనే మహాసముద్రంలో పడిపోతున్నారు.

జీవబ్రహ్మైక్యయోగము వేదంలో అనేకసార్లు చెప్పబడింది. అంటే ఇది అత్యంత ముఖ్యమైనది అని అర్థం. ఐనప్పటికీ మానవులు దీన్ని అంగీకరించరు. వాళ్ళకి అన్నీ సందేహాలే. దీనికి కారణం పూర్తిగాఅజ్ఞానము. వేదాంత సంబంధమైన విషయాలు ఎన్నిసార్లు చదివినా, ఎన్నిసార్లు విన్నా వాటిమీద నమ్మకం ఏర్పడదు. దీనికి కారణం ఏమిటంటే సత్యము నిత్యము శాశ్వతము అని చెప్పబడే పరమేశ్వరుడు కంటికి కనిపించడు. మిధ్య అనబడే జగత్తు మాత్రం కనిపిస్తోంది. అందులోను అజ్ఞానమనేది ఏదో ఇవాళ్ళ క్రొత్తగా వచ్చింది కాదు. ఎన్నో లక్షల జన్మల నుంచే జీవుణ్ణి ఆవరించి ఉన్నది. అందుచేతనే దాన్ని అంత తేలికగా వదిలించుకోవటం కుదరదు. ఈ కారణం వల్లనే మానవుడు సంసారబంధనాలలో చిక్కుకుపోతున్నాడు.

**అద్యాష్టమీతి నవమీతి చతుర్దశీతి జ్యోతిష్కవాచోపవసంతి భక్త్యా ।**
**శ్రుతే స్త్వహో తత్త్వమసీతివాక్యం న విశ్వసంత్యద్భుత మేతదేవ ॥ 19**

**దుష్టస్య వేద ప్రతిబోధితార్థో విజ్ఞాయతే నైవ యథావదత్ర ।**
**కిం త్వన్యథైవ ప్రతిభాతి తద్వ త్పలంచ తద్రూపకమేవ తస్య ॥ 20**

ఇవాళ్ళ అష్టమి, నవమి, చతుర్దశి అని అల్పజ్ఞుడైన శాస్త్రజ్ఞుడు చెప్పే మాటను నమ్మి ఉపవాసముంటారు. నీకు బ్రహ్మకు భేదు లేదు అని వేదంలో చెప్పిన మాటను మాత్రం నమ్మరు. ఇది అత్యంతాశ్చర్యమైన విషయము అంటున్నారు భగవత్పాదుల వారు.

ఇక్కడ ఒక చిన్న ఉదాహరణ చూడండి. పూర్వకాలంలో ఒకసారి అడవిలో కొన్ని కోతులు తిరుగుతున్నాయి. అది నిండు శీతాకాలం. బాగా చలిగా ఉంది. చలి నుంచి బయటపడటానికి మార్గం కోసం వెతుకుతున్నాయి కోతులు. వాటికి కొన్ని గురివింద గింజలు కనిపించాయి. వాటిలో కొంత భాగం ఎర్రగా ఉంది. ఇప్పుడు ఆ గింజలు ఒక కుప్పగా పోసి ఉన్నాయి. ఎర్రని కాంతులు ప్రసరిస్తున్నాయి. ఆ కాంతులు అగ్నిజ్వాలలుగా భావించి, దాని చుట్టూ చేరినాయి కోతులు. ఇదంతా చూసిన ఒక పిల్లి అది అగ్ని కాదు. దానివల్ల చలి తగ్గదు. అని చెప్పింది ఆ మాటలకు కోపగించిన కోతులు, ఆ పిల్లిని చంపి అక్కడ పారేసి వెళ్ళిపోయాయి. పిల్లి చెప్పిన మాటలు వినకపోగా అది హేళన చేస్తోంది అని భావించి, ఆ పిల్లిని కూడా చంపేశాయి కోతులు. కాబట్టి మూర్ఖుడైనవాడు తనకుతెలిసిందేనిజం

అనుకుంటాడు అంతే కాని ఇంకొకరు చెప్పింది మాత్రం వినరు. అందుకే వీళ్ళని అజ్ఞానులు అంటారు. వాళ్ళకి ఏ విషయం చెప్పినా నమ్మరు. ఈ కారణంతోనే తామే పరమేశ్వర రూపమనే మాట మరచిపోయి, సంసారబంధాల్లో చిక్కుకుంటున్నారు.

**ప్రస్తుతం తే ప్రవక్ష్యామి తీవ్రమోక్షే చ్ఛయా శృణు ।**

**మోక్షేచ్ఛయాకృతం సమ్య క్ఫలతి శ్రవణాదికమ్ ॥ 21**

ఓ శిష్యా ! ఇప్పుడు నేను నీకు జీవబ్రహ్మైక్యాన్ని పూర్తిగా వివరిస్తాను. నువ్వు కూడా మోక్షము పొందాలనే కోరికతో విని, ఆ విషయాన్ని బాగా విచారించినట్లైతే శీఘ్రముగ ఫలితము వస్తుంది.

ఈ శ్లోకంలో భగవత్పాదులవారు తన శిష్యుడికి చెబుతున్నారు. ఓ శిష్యుడా! నీకు ఇప్పుడు జీవబ్రహ్మైక్యాన్ని వివరిస్తాను. అంటున్నారు. జీవబ్రహ్మైక్యమనే విషయం ఆయన తన శిష్యుడు ఒకడికే చెప్పటం లేదు. ఇక్కడ శిష్యుడు అంటే – లోకంలో అద్వైతసిద్ధాంతాన్ని అనుసరించేవారంతా ఆయనశిష్యులే. అందుచేతనే ఈ సిద్ధాంతాన్ని బహిరంగంగా అందరికీ తెలిసేటట్లుగా చెబుతున్నారు. ఆ విషయాన్ని ఎలా వినాలో కూడా చెబుతున్నారు చూడండి. **తీవ్రమోక్షేచ్ఛయా** – మోక్షం పొందాలనే తీవ్రమైన కోరికతో **శృణు** వినవలసినది. ఇది బ్రహ్మవిద్య, మోక్షవిద్య. శాస్త్రాలు చదవటం, క్షేత్రాలు సేవించటం, దానధర్మాలు, యజ్ఞయాగాది క్రతువులు చెయ్యటం వల్ల మోక్షం రాదు. గురువు చేసిన బోధనలు విని, వాటిని గురించి ఆలోచించటం వల్లనే ఆత్మజ్ఞానం వస్తుంది. ఆత్మనిష్ఠ కలగాలంటే విద్యాంసుడికి నాలుగు లక్షణాలు ఉండాలి. వాటినే సాధన చతుష్టయము అంటారు. అవి 1.నిత్యానిత్య వివేకము 2.వైరాగ్యము 3.షట్సంపత్తి 4.ముముక్షుత్వము. మోక్షము పొందాలనే తీవ్రమైన కోరికనే ముముక్షత్వము అంటారు. అహంకారం దగ్గర నుండి శరీరానికి ఉన్న సమస్తము అజ్ఞానం చేత కల్పించబడిన బంధనాలే. ఆత్మజ్ఞానం ద్వారా ఈ బంధనాలను త్రెంచుకోవాలనే కోరిక సాధకుడిలో ఉండాలి. దాన్నే ముముక్షత్వము అంటారు. మోక్షాపేక్ష లేక పోయినట్లైతే విషయం మీద శ్రద్ధ ఉండదు. అందుచేతనే తీవ్రమైన మోక్షాపేక్షతో, అత్యంతమైన శ్రద్ధతో దానిని వినవలసిన అంటున్నారు. ఆ శ్రద్ధ అనేది ఎలా ఉండాలంటే **శృణుమోక్షేచ్ఛయాకృతం శ్రవణాదికమ్**. తీవ్రమైన మోక్షేచ్ఛతో, శ్రవణాదికమ్ – శ్రవణ, మనన, నిధిధ్యాసనములతో వినవలసినది.

అసలు శ్రవణాదికము అంటే ఏమిటి? అవే శ్రవణ, మనన, నిధిధ్యాసనములు అంటారు. వీటిని విడివిడిగా చూద్దాం. వీటిలో మొదటిది శ్రవణము. మహావాక్యాలను అనుసంధానం చెయ్యటమే శ్రవణము. మహావాక్యాల అర్థం తెలుసుకున్న తరువాత వాటిని అనుసంధానం చెయ్యాలి. మహావాక్యాలన్నింటికీ అర్థం ఒక్కటే.

ప్రజ్ఞానం బ్రహ్మ – జ్ఞానమే పరబ్రహ్మ

అహంబ్రహ్మాస్మి – నేనే పరబ్రహ్మనై ఉన్నాను

అయమాత్మాబ్రహ్మ – నా ఆత్మయే పరబ్రహ్మ

తత్త్వమసి – జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే.

అధ్యాసము అంటే–తప్పుగా తెలుసుకోవటము అనిఅర్థం. అదే మిధ్యాజ్ఞానము. దేహంలో ఉన్న **'అహం'** అనే దాన్నే **'మమ'** అనుకోవటమే అధ్యాసము. అదే మిధ్యాజ్ఞానము. విద్వాంసుడు ఈ మిధ్యాజ్ఞానాన్ని బ్రహ్మజ్ఞానంతో జయించాలి. ఈ దేహము, ఇంద్రియాలే నేను అనే భ్రాంతిని, వాసనాత్రయాన్ని (లోకవాసన, దేహవాసన, శాస్త్రవాసన) త్యజించి నేనే పరమాత్మ స్వరూపాన్ని అని గ్రహించాలి. దీన్నే **'శ్రవణము'** అంటారు. విన్న విషయాలను యుక్తితో అనుసంధానం చెయ్యటమే **'మననము'** ఈ విధంగా శ్రవణమననాదులు చేసి నిస్సశయంగా తెలిసిన వస్తువునందు ప్రీతిని నిల్పి, తదేక ధ్యానం చెయ్యటమే **'నిధిధ్యాసనము'** ఈ రకంగా జీవబ్రహ్మైక్యాన్ని అత్యంత శ్రద్ధతో వింటే మంచిఫలితము ఉంటుంది. అంటున్నారు. ఇలా చెప్పి ముందుగా జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే అని వివరిస్తున్నారు.

**ఏకస్య బ్రహ్మణః శుద్ధ సత్వో పాధిసమన్వయాత్ ।**
**ఈశతా జీవతాప్యస్య మలినోపాధి యోగతః ॥** **22**

ఈ లోకంలో ప్రసిద్ధమైన వాడు ఆ పరమేశ్వరుడు ఒక్కడే. ఉన్నది కూడా అతనొక్కడే. అయినప్పటికీ జీవుడు ఈశ్వరుడు ఇద్దరున్నారు అని భావన చేస్తున్నాము.

ఉన్నది పరమేశ్వరుడు ఒక్కడే. అతడే పరబ్రహ్మ. అతడే చైతన్యము. అయితే ఆ పరబ్రహ్మ మాయతోకలిస్తే ఈశ్వరుడు, అవిద్యతోకలిస్తే జీవుడు అని భావించ బడుతున్నాడు. ఇక్కడ మాయ, అవిద్య రెండూ సత్త్వగుణమే. కాకపోతే త్రిగుణాలలోను కేవలము సత్త్వగుణము (దాన్నే శుద్ధ సత్త్వగుణము అంటారు) కలిస్తే ఈశ్వరుడు

అనబడతాడు. అదే మలిన సత్త్వగుణంతో (రజోగుణము, తమోగుణములతో కలసిన సత్త్వగుణము దీన్నే అవిద్య అంటారు) కలిస్తే జీవుడు అంటారు. అంతేకాని జీవేశ్వరులకు భేదం లేదు. వారు భిన్నులు కారు. పరబ్రహ్మ సత్త్వరూపుడు. సర్వ పదార్థాలతోను వ్యవహరింపబడే ఉనికే స్వరూపంగా గలవాడు. కాబట్టి ఆయనలో భేదము ఉండటానికి వీలులేదు. రెండు రకాలైన సత్త (ఉనికి) ఉన్నదని చెప్పటం కూడా అప్రమాణికమే. ఎందుకంటే ఈ రెండింటికీ మధ్యలో గల భేదాన్ని నిరూపించటము ఎప్పటికీ వీలుకాదు. అంతేకాదు. పరమేశ్వరుడు జ్ఞానమే స్వరూపంగా గలవాడు. కాబట్టి ఆయన యందు భేదము ఉండదు. ఒక జ్ఞానానికి సాక్షిగా ఇంకొక జ్ఞానమున్నది. దానికి సాక్షిగా ఇంకో జ్ఞానమున్నది అని ఇలా చెప్పుకుంటూ పోతే అనేకమైన జ్ఞానాలున్నాయని అంగీకరించాల్సి వస్తుంది. దీన్ని **'అనవస్థాదోషము'** అంటారు. బ్రహ్మానికి అటువంటి దోషం లేదు. ఉన్నది బ్రహ్మమొక్కటే.

**ఉపాధే రేవ మహాత్మ్యా జ్జీవాచ్ఛ్రేష్టత్వమీశితుః ।**

**యథా సామ్రాజ్యమహాత్మ్యా త్సేవ కాచ్చక్రవర్తినః ॥ 23**

సామాన్యమైన సేవకుడికన్న మహారాజుకు గొప్పతనము లేదా అధికత్వము వస్తోంది. దీనికి కారణము అతనికి గల రాజ్యము, అధికారము. అలాగే ఆవరణము యొక్క సామర్థ్యము వల్లనే జీవుడి కన్న ఈశ్వరుడికి అధికత్వము సంభవిస్తోంది.

చక్రవర్తి, సేవకుడు. ఇద్దరూ మనుష్యులే. అయినప్పటికీ, రాజ్యం ఉంది కాబట్టే చక్రవర్తికి ఆధిక్యత ఉంటుంది. అధికారం ఉన్నది కాబట్టే అతనికి విలువ ఉంటుంది. ధనం ఉన్నది కాబట్టే అతనికి పలుకుబడి ఉంటుంది. అతని మాట చెల్లుబాటవుతుంది. అలాగే జీవుడు, ఈశ్వరుడు ఇద్దరూ పరబ్రహ్మ స్వరూపులే. కాని శుద్ధ సత్త్వోపాధి గలవాడు ఈశ్వరుడు. మలినసత్త్వోపాధి గలవాడు జీవుడు. చక్రవర్తికీ సేవకుడికీ తేడా ఏమిటి అంటే – కేవలము రాజ్యము. రాజ్యమున్నది కాబట్టే చక్రవర్తి అధికుడు. అది లేదు కాబట్టే సేవకుడు అల్పుడు. అలాగే జీవుడు మలినసత్త్వోపాధి గలవాడు. ఈ కారణం చేతనే ఈశ్వరుని కన్న హీనుడవుతున్నాడు. ఇక్కడ చిత్రం ఏమంటే మనుష్యత్వాన్ని బట్టి చూస్తే, చక్రవర్తి సేవకుడు ఇద్దరూ ఒకటే. అలాగే బ్రహ్మత్వాన్ని బట్టి చూస్తే ఈశ్వరుడు, జీవుడు ఏకస్వరూపులే. మరి లోకంలో జీవుడు, ఈశ్వరుడు

ఇద్దరున్నారు కదా ! అంటే అది ఈ లోక వ్యవహారం వల్ల కల్పించబడిన తేడాను బట్టి వచ్చిందే కాని వేరుకాదు.

**సంసార బంధోऽయమ బోధమూలః కర్మప్రవృద్ధో బహుదుఃఖహేతుః ।**

**న కర్మకోట్యాస్య నివృత్తిరిష్యతే తత్త్వావ బోధేన వినా ముముక్షోః ॥24**

ఈ లోకంలో సంసారము అనేది కేవలము అజ్ఞానము వల్లనే కలుగుతున్నది. వాస్తవంగా చూస్తే సంసారమనేది లేదు. కాని ఉన్నట్లుగా అనిపిస్తుంది. దీనికి కారణము అజ్ఞానం. అది అంటే సంసారము కర్మలవల్ల వృద్ధి చెందుతుంది. ఈ కారణం చేత మోక్షం కావాలనుకునే వారు. తత్త్వజ్ఞానాన్ని పొందకుండా ఎన్ని కర్మలు చేసినప్పటికీ, ఈ సంసార బంధనాలకు అంతముండదు.

ఈ శ్లోకంలో సంసారబంధనాల గురించి వివరిస్తున్నారు. నిజంగా చెప్పాలి అంటే సంసార బంధనాలు అనేవి ఎక్కడా లేవు. అవి ఎవరినీ బంధించటం లేదు. ఈ బంధనాలనేవి నిజంగా లేకపోతే, మానవుడు వాటిలో ఏరకంగా బందీ అవుతున్నాడు? **మన ఏనమనుష్యాణాం కారణం బంధమోక్షయోః** మానవుడి యొక్క బంధ మోక్షాలకు కారణం అతడి మనస్సే. పట్టుపురుగు తన నోటి నుంచి వచ్చిన దారంతోనే తన చుట్టూ గూడు అల్లుకుని, అందులో తాను బందీ అవుతుంది. అలాగే మానవుడు కూడా తన మనసులోని భావనలతోనే ఈ బంధాలు ఏర్పాటు చేసుకుంటున్నాడు. ఈవిడ నా భార్య. వీళ్ళు నాపిల్లలు, వీరు నాబంధువులు, మిత్రులు. ఇలా బంధము ఏర్పరచుకుంటున్నాడు. వారు లేకుండా తాను జీవించలేనని భావిస్తున్నాడు. పదేపదే మననం చెయ్యటం వల్ల ఆ భావన బలపడుతోంది. ఈ బంధాల కోసమే కర్మలు చేస్తున్నాడు. కర్మలవల్ల బంధాలు ఇంకా పెరుగుతాయి. ఏదో ఒక కోరిక తీరాలని కర్మచేస్తాడు. ఆ కోరికతీరింది. ఇంకోకర్మ చేస్తాడు. ఇలా కర్మలు చేస్తూనే ఉంటాడు. వాటివల్ల బంధాలు ఇంకా ఇంకా పెరుగుతున్నాయి. బలపడుతున్నాయి. యజ్ఞయాగాది క్రతువులు చేస్తున్నాడు. దానివల్ల పుణ్యం వస్తుంది. మరణానంతరం స్వర్గసుఖాలనుభవించి, మళ్ళీ ఉత్తమయోనులందు జన్మిస్తాడు. మళ్ళీ కర్మలు చేస్తాడు. ఈ రకంగా కర్మలు చేస్తాడు. వాటి ఫలితం అనుభవించటానికి మళ్ళీ జన్మిస్తాడు. మళ్ళీ కర్మ చేస్తాడు. ఇలా సంసారమనే బండిచక్రంలోపడి గిరగిరా తిరుగుతుంటాడు. దీనికి అంతం లేదు. మోక్షం కావాలనుకునే వారు ఎన్ని

కర్మలనాచరించినా మోక్షం రాదు. కర్మలు చెయ్యటం వల్ల సంసారబంధనాలు త్రెగిపోవు. **ఈశావాస్యోపనిషత్తు**లో చెప్పినట్లుగా

**అంధం తమః ప్రవిశన్తియేవిద్యాముపాసతే ।**

**తతోభూయ ఇవతే తమోయ ఉవిద్యాయాగ్ం రతాః ॥**

అవిద్యను ఆరాధించే వారు గాఢాంధకారంలో ప్రవేశిస్తారు. యజ్ఞతత్త్వాన్ని (కర్మకాండను) ఆరాధించే వారు అంతకన్న నిబిడమైన అంధకారంలో ప్రవేశిస్తారు. కాబట్టి కర్మలవల్ల బంధాలుతెగిపోవు. ఇంకా బలపడతాయి.

**తత్త్వావబోధస్తు విచార్యమాణే సమ్యక్ పదార్థే సముదేతి పుంసః ।**

**శ్రుతి స్మృతి న్యాయబలేన బుద్ధ్యా న స్నానమంత్రార్చనకీర్తనాద్యైః ॥25**

ఈ శ్లోకంలో తత్త్వజ్ఞానము అంటే ఏది? అది ఏ విధంగా పుడుతుంది? అనే విషయాన్ని వివరిస్తున్నారు. వేదంలో చెప్పిన విషయాలను బాగా పరిశీలిస్తూ, వేదార్థాన్ని తెలుసుకుని, శ్రుతులు, స్మృతులు చదివి, వాటి అర్థం తెలుసుకుని, దర్శనశాస్త్రాన్ని తరచిచూసినప్పుడు తత్త్వజ్ఞానము అనేది కలుగుతుంది. అంతేకాని కీర్తనలు, స్నానాలు, మంత్రజపాలు, దేవతారాధనలవల్ల తత్త్వజ్ఞానము కలగదు.

లోకంలో సత్యమైనపదార్థమేది అనే విషయాన్ని బాగా విచారించి తెలుసుకోవటమే తత్త్వజ్ఞానము. భ్రాంతివల్ల అనిత్యమైన వస్తువులను నిత్యమైనవి అనుకుంటాం. అందుకే ముందుగా నిత్యానిత్య వివేక జ్ఞానము సంపాదించాలి. ఈ జగత్తులో సత్యము, నిత్యము, శాశ్వతము అయిన వస్తువేదో తెలుసుకోవాలి. ముందుగా అనిత్యము అశాశ్వతము అయిన వస్తువులను నిషేధిస్తూ పోతే, మిగిలేదే సత్యమైన వస్తువు. దీనికి శాస్త్రపరిజ్ఞానము, గురూపదేశము, విచారము తప్పనిసరిగా కావాలి. నేతి నేతి అనే నిషేధ వాక్యాలవల్ల తత్త్వాని తెలుసుకోవాలి. అంతేకాని స్నానాలు చేసినంత మాత్రం చేత, పూజలు, జపాలు, అర్చనలు, భజనలు చేసినంత మాత్రాన తత్త్వం తెలియదు. భ్రాంతితొలగనంతవరకు తత్త్వజ్ఞానం లభించదు. కర్మలుఆచరించటంవల్ల తత్త్వం తెలియదు.

**న హి స్నానశతేనాపి రజ్జు సర్పభ్రమో నృణాం ।**

**భయకంపప్రదో యాతి వినావస్త్వవమర్శనమ్ ॥** **26**

స్నానాలు చేసినంత మాత్రంచేత భ్రాంతి తొలగిపోదు. మసకచీకట్లో తాడును చూసి పానుని భయపడ్డాడు. గడగడ వణికిపోయాడు. ఈ భ్రాంతి విచారణ వల్లనే నశిస్తుంది. అంతేకాని స్నానాలు చేసినంత మాత్రం చేత పోదు.

లోకంలో అనేక రకాలైన భ్రాంతులు ఉన్నాయి. వీటిలో రజ్జు సర్పభ్రాంతి ఒకటి. మసకచీకట్లో తాడును చూసి పాము అనుకోవటం. అలాగే స్థాణువును చూసి దొంగవాడని, ముత్యపుచిప్పను చూసి వెండిపాత్ర అనుకోవటం. ఇవన్నీ భ్రాంతులే. మానవుడు ఈ రకమైన భ్రాంతికి లోనయినప్పుడు విచారణ చెయ్యాలి. ముత్యపుచిప్పను చూసి వెండిపాత్ర అనుకున్నాడు. ఇది భ్రాంతి. ఇటువంటి సమయంలో సముద్రం మీద వెండిపాత్ర ఎలా ఉంటుంది? ఎందుకు ఉంటుంది అని ఆలోచన చెయ్యాలి. అప్పుడు అదివెండిపాత్రకాదు ముత్యపు చిప్ప అని తెలుస్తుంది. ఇలాగే లోకంలో అనిత్యమైనది, అశాశ్వతమైనవి ఏవో తెలుసుకోవాలి. వాటిని వదిలేసి సత్యము నిత్యము శాశ్వతము అయిన పరబ్రహ్మను గురించి తెలుసుకోవాలి. మహావాక్యాలను విశదీకరించి వినాలి. శ్రవణ మనన నిధి ధ్యాసల ద్వారా పరతత్త్వాన్ని తెలుసుకోవాలి. పరతత్త్వం తెలుసుకున్న మరుక్షణంలోనే భ్రాంతి పూర్తిగా తొలగిపోతుంది. కేవలము స్నానాలు చేసినంత మాత్రం చేతనే భ్రాంతి తొలగిపోయేట్లైతే జలచరాలకు ఏ రకమైన భ్రాంతి ఉండరాదు.

**సంసారవర్ధకం కర్మ తన్నివృత్త్యై న కల్పతే ।**
**న హి పంకస్య పంకేన నివృత్తి రవలోక్యతే ॥** **27**

కర్మవల్ల భ్రాంతి పెరుగుతుంది. అంతేకాని తగ్గదు. కర్మలనాచరించటం వల్ల సంసార బంధనాలు పెరుగుతాయి. శరీరానికి బురదఅంటితే నీళ్ళతో కడిగి వెయ్యాలి. అంతేకాని బురదతో బురద పోదు.

భేదదృష్టి లేకపోతే అసలు కర్మలు చెయ్యవలసిన పనేలేదు. అంతా పరమేశ్వర స్వరూపమే అన్నప్పుడు ఇంక కర్మలు ఎవరికోసంచెయ్యాలి? సంసారము అంటే నేను నాది అనే అహంకార మమకారాలు. రాగద్వేషాలు. వీటివల్లనే భేదదృష్టి, దానివల్ల సంసారము బలపడతాయి. కర్మలుచెయ్యటంవల్ల ఈ భేదదృష్టి పెరుగుతుంది. అంతేకాని కర్మవల్ల ఈ భేదదృష్టి నశించదు. కాబట్టి బురదతో బురదను శుభ్రం చెయ్యటం ఎలా జరగదో, అలాగే **కర్మలవల్ల సంసారం నశించదు.**

**అపి కోట్యజకల్పానాం కర్మణా ముక్తిరిష్యతే ।**
**నాంతరా బ్రహ్మవిజ్ఞానం ప్రసాదాదంతరాత్మనః ॥** **28**

ఆ పరమేశ్వరుని అనుగ్రహం వల్ల కలిగిన బ్రహ్మజ్ఞానం లేకుండా కల్పాంతము కర్మలు చేసినా ముక్తి కలగదు. **'జ్ఞానాదేవతుకైవల్యం'** జ్ఞానం వల్లనే మోక్షం సిద్ధిస్తుంది. పరబ్రహ్మతత్త్వాన్ని తెలుసుకోవాలనేకోరిక ఎవరికిబలంగా ఉంటుందో, అతడికి ఆతత్త్వం తెలుస్తుంది. ఎవరైతే పరమేశ్వరుని అంతర్యామిగా గ్రహించి, ఆయన అనుగ్రహానికి పాత్రులవుతారో, వారికి బ్రహ్మజ్ఞానం కలుగుతుంది. నిరంతము ఆ పరమేశ్వరస్వరూపాన్నే చింతిస్తూ, ఆయన్ను గురించే మాట్లాడుతూ, ఆయన గురించే వింటూ ఉండే తత్పరుడికి బ్రహ్మజ్ఞానం కలుగుతుంది. కేవలము జ్ఞానంవల్లనే ముక్తి కలుగుతుంది కాని కర్మల నాచరించటం వల్ల కలగదు. అంటూ కర్మ సిద్ధాంతాన్ని ఖండించారు శంకరులవారు.

**అబ్రహ్మత్వభ్రమో చ్ఛిత్త్యా త్వహం బ్రహ్మేతి నిశ్చయః ।**
**జాయతేఽర్థవిచారేణ పురుషస్య విపశ్చితః ॥** **29**

ఈ శ్లోకంలో తత్త్వజ్ఞాన స్వరూపాన్ని వివరిస్తున్నారు. విద్వాంసుడు సత్యపదార్థాన్ని విమర్శించి చూసినట్లైతే, 'నేను బ్రహ్మను కాను' అనే భ్రాంతి పోతుంది. దానితో "నేనే పరబ్రహ్మను" అనే విషయం తెలుస్తుంది.

ఇంతవరకు మనం కర్మలవల్ల ముక్తి రాదు అనే విషయం చెప్పుకున్నాం. కర్మలవల్ల బంధాలు ఏర్పడతాయి. బలపడతాయి. కాబట్టి మోక్షార్థియైన వాడు కర్మల నాచరించరాదు. అందులోను కామ్యకర్మలు పూర్తిగా నిషిద్ధము. ఇప్పుడు కర్మలను వదిలి, వివేకంతో సత్యమైన పదార్థం ఏది? అని ఆలోచించాలి. అది కూడా నిషేధ వాక్యాలతో ఈ విచారణ జరగాలి. ఒక్కొక్క వస్తువునే నిషేధించుకుంటూ పోగా, ఇది కాదు, ఇది కాదు. నయితి, నయితి నేతి, నేతి, అంటూ అన్నింటినీ నిషేధిస్తూ ఉంటే చివరకు మిగిలేదే పరబ్రహ్మ. అదే బ్రహ్మము. అనే విషయం తెలుస్తుంది. తరువాత అదే నేను అనే నిశ్చయంకూడాకలుగుతుంది. ఈ రకంగా నేనే పరమేశ్వరుణ్ణి అని తెలుసుకుంటాడు. నేను అంటే దేహము, ప్రాణము, మనస్సు ఇలాంటి భావాలున్నంత వరకు భ్రాంతిపోదు. నేనే పరమేశ్వరుణ్ణి అనే నిరంతర

స్మరణతోనే తత్త్వాన్ని తెలుసుకోగలుగుతాడు. దృశ్యమానమైన జగత్తంతామిథ్య అని తెలుసుకుంటాడు. ఇదే తత్త్వజ్ఞానము.

**మిథ్యాజ్ఞానస్య విచ్ఛిత్తిః సమ్యజ్ఞా నేనసిద్ధ్యతి ।**

**సమ్యజ్ఞానం పదార్ధస్య విచారేణైవ నాన్యథా ॥ 30**

భ్రాంతిజ్ఞానము యధార్ధజ్ఞానము వల్లనే నశిస్తుంది. మరి యధార్ధజ్ఞానము ఎలా వస్తుంది? యధార్ధమైన వస్తువు యొక్క విచారంతోనే సిద్ధిస్తుంది. అంతేకాని ఇంకా దేనివల్లా సిద్ధించదు. యధార్ధమైన పదార్ధాలను విమర్శించి చూస్తేనే మంచి జ్ఞానము కలుగుతంది. అజ్ఞానము కూడా నశిస్తుంది. ఇక్కడ బాగా గుర్తుంచుకోవలసిన విషయం ఏమంటే పరమేశ్వర తత్త్వము కేవలము విమర్శతోనే తెలుస్తుంది. కాని కర్మలు ఆచరించటంవల్ల తెలియదు. అందుకే గతంలో చెప్పుకున్నాం. జ్ఞాన సముపార్జన చెయ్యాలి అంటే శాస్త్రపరిజ్ఞానము, గురూపదేశము, సత్సంగత్యము, విచారము అనేవి తప్పనిసరిగా కావాలి. కర్మలుచేస్తే బంధాలు పెరుగుతాయి అంతేతప్ప జ్ఞానంమాత్రంరాదు.

**అతో విచారః కర్తవ్యః కర్మ సన్యస్య ధీమతా ।**

**బ్రహ్మాత్మైకత్వ బోధార్ధం సంసారో యేన శామ్యతి ॥ 31**

జ్ఞానం కలిగినట్లైతే దృశ్యరూపమైన సంసారం నశిస్తుంది. అటువంటి జ్ఞానం కలగాలంటే కర్మలను వదిలి, సద్విమర్శ చెయ్యాలి.

ఆత్మజ్ఞానం గనక లేకపోతే సంసారబంధనాలు, దుఃఖాలు నాశనం కావు. కాబట్టి మోక్షం కావాలనుకునే వాడు ఆత్మతత్త్వాన్ని విచారము చెయ్యాలి. అలా విచారణ చేస్తే జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే అనే విషయం బోధ పడుతుంది. జీవుడు పరబ్రహ్మ కన్న వేరు కాదు అనే విషయం అనుభవంలోకి వస్తుంది. అప్పుడు జీవుడికి సంసారము లేదు అనే విషయం పూర్తిగా అవగతమవుతుంది. **ఐతరేయోప నిషత్తు**లో చెప్పినట్లుగా మానవదేహాన్ని సృష్టించిన తరువాత, ఆ పరమేశ్వరుడు, ఈ శరీరంలో తాను లేకపోతే ఎలా? అనుకున్నాడు. బ్రహ్మరంధ్రం ద్వారా మానవ దేహంలోకి ప్రవేశించాడు. అలాప్రవేశించి నవరంధ్రాలతోను అన్ని రకాలయిన సుఖాలు అనుభవిస్తూ, శరీరంతోచేసేకర్మలన్నింటికీ తానే కర్త భోక్త అనుకుంటున్నాడు. నిజానికి అతడు దేనికీ కర్త కాదు భోక్త కూడా కాదు. కాని అజ్ఞానంతో తానే కర్తని

భోక్తని అనుకుంటున్నాడు. ఈ అజ్ఞానం పోవాలి అంటే యధార్ధం తెలియాలి. నేనుఅంటే దేహముకాదు. నేనుఅంటేఆత్మ అనే విషయం తెలియాలి. ఇది సద్విచారము వల్లనే తెలుస్తుంది. యధార్ధజ్ఞానం కలిగిందంటే, భ్రాంతివల్లకలిగిన సంసారము, బంధాలు నశిస్తాయి. మసకచీకటిలో త్రాడును చూసి పాము అనుకున్నాడు. దీపంతెచ్చి జాగ్రత్తగా పరిశీలించి చూశాడు. అది పాముకాదు త్రాడే. ఈ విషయం విచారణవల్లనే తెలిసింది. ఇది తెలిసిన మరుక్షణంలో 'అది పాము' అనే భ్రాంతి నశిస్తుంది. ఈ విషయం తెలుసుకోవటానికి కర్మలు ఏ రకంగానూ సాయపడవు. **అందుకే కర్మలను పరిత్యజించాలి.**

**తత్త్వం పదార్థౌ సువిచారణీయౌ సమ్యఙ్మహావాక్యగతౌ ముముక్షుణా ।**

**తయోర్వివేకోదయబోధవహ్నిః సంసారబంధం ప్రదహత్యశేషమ్ ॥ 32**

మోక్షం కావాలనే కోరిక గలవాడు 'తత్త్వమసి' అనే మహావాక్యంలోని తత్, త్వం పదాలను బాగా విచారించాలి. ఇలా విచారణ చేస్తే జీవబ్రహ్మైక్య జ్ఞానం కలుగుతుంది. దానివల్ల సంసారంలోని దుఃఖాలు, బాధలు, భయంపూర్తిగా నాశనమవుతాయి.

మోక్షం కావాలనుకునే వాడు మహావాక్యాలను అర్ధాన్ని తెలుసుకుని, వాటిని అనుసంధానం చెయ్యాలి. అప్పుడు పరమాత్మ తత్త్వం పూర్తిగా అవగతమవుతుంది. 'అహంబ్రహ్మాస్మి'. నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని అనే విషయం తెలుస్తుంది. ఇదే ఆత్మతత్త్వవిచారణ. శ్రుతులు, స్మృతులు, పురాణాలు వేదాలు, శాస్త్రాలు ఆధారంగా తత్, త్వం పదాల అర్ధం తెలుసుకోవాలి. జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే. వీటి మధ్య ఏ రకమైన తేడా లేదు. అనేవ విషయం గట్టిగా తెలిస్తే, జీవబ్రహ్మైక్య జ్ఞానం కలుగుతుంది. దానివల్ల సంసారంలో ఉండే దుఃఖాలు, బాధలు పూర్తిగా నశిస్తాయి.

**తత్త్వంపదార్థౌ సువిచార్య యేన బ్రహ్మాహమిత్యేవ ధియా త్వనాత్మని ।**

**ప్రధ్వంసితోఽహంమతిరత్ర సమ్యక్ స ఏవ కైవల్యసుఖం సమశ్నుతే ॥33**

తత్, త్వం పదాల అర్ధాన్ని బాగా తెలుసుకుని, నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని అని తెలుసుకున్న వాడికి దేహాభిమానము ఉండదు. అటువంటి వాడే లోకంలో మోక్షసుఖం పొందుతాడు.

ఈ రెండు పదాలను బాగా విమర్శించి చూస్తే, పరబ్రహ్మ యందు ఆత్మాభిమానము కలుగుతుంది. మహావాక్యాలు అర్థం తెలుసుకోవటం వల్ల ఉపయోగం ఇదే. ఈ రకంగా బ్రహ్మజ్ఞానం కలిగిన మరుక్షణంలోనే భ్రాంతి జ్ఞానం పూర్తిగా నశిస్తుంది. భ్రాంతి జ్ఞానం నశించి, నేనే పరబ్రహ్మ అని తెలుసుకున్న వాడు ముక్తి పొందుతాడు. **"బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి"** బ్రహ్మమును తెలుసుకున్న వాడు, సాక్షాత్తు బ్రహ్మమే అవుతాడు.

**ప్రత్యక్తత్వం మయా సమ్య గ్బోధ్యతే శ్రూయతాం త్వయా ।**

**యద్విజ్ఞానేన సంసారః సహమూలం వినశ్యతి ॥ 34**

ఏ ప్రత్యగాత్మ యొక్క తత్త్వాన్ని తెలుసుకోవటం చేత సంసార బంధనాలు సమూలంగా నాశనమవుతాయో, అటువంటి కూటస్థుని యొక్క యథార్థ స్వరూపము నాచే చక్కగా వివరించబడుతోంది. సావధాన చిత్తుడవై వినవలసినది.

ఈ శ్లోకం నుంచి మహవాక్యముయొక్క అర్థాన్ని వివరించటానికి పూనుకుంటూ, ముందుగా త్వం పదార్థాన్ని శోధన చేస్తూ, ప్రత్యగాత్మ స్వరూపాన్ని చెబుతున్నారు. 'త్వం' అనే పదానికి 'ప్రత్యగాత్మ' అని అర్థం. ఆ ప్రత్యగాత్మని గనక చక్కగా గ్రహించ గలిగితే లోకంలో సిద్ధించనిది అనేది లేదు జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే. వేరు కాదు. కాబట్టి ప్రత్యగాత్మ స్వరూపుడైన జీవుని స్వరూపం తెలుసుకుంటే సర్వము తెలుసుకున్నట్లే ఈ చరాచర జగత్తంతా పరమేశ్వరమయం. అంతా పరమేశ్వర స్వరూపమే. కుమ్మరివాడు మట్టితో వివిధరకాలయిన పాత్రలు తయారుచేస్తాడు. పాత్రల ఆకారం వేరైనా, పేర్లు వేరైనా వాటిలో ఉన్నది మట్టే. కాబట్టి మట్టిని గురించి తెలుసుకుంటే అన్ని పాత్రల గురించి తెలుస్తుంది. అలాగే పరమేశ్వర స్వరూపమైన ప్రత్యగాత్మను గురించి తెలుసుకుంటే అన్ని ఇంక తెలుసుకోవలసినది ఏదీ ఉండదు.

పూర్వకాలంలో **పుణ్యానందుడు** అనే మునీశ్వరుడు తన ఆశ్రమంలో ఒక చెట్టు క్రింద కూర్చుని తపస్సు చేసుకుంటున్నాడు. ఆ సమయంలో ఆకాశంలో రెండు హంసలు ఎగిరివెడుతూ వాటిలో అవి మాట్లాడుకుంటున్నాయి. ఆడుహంస అడుగుతోంది. నాథా! జగత్తులో అన్నింటినీ, ప్రతివస్తువుని, ప్రతివిషయాన్ని గురించి తెలుసుకొనే ఉపాయం ఏది? దానికి మగహంస సమాధానం చెబుతోంది. ఓ దేవీ!

మట్టితో అనేక పాత్రలు తయారుచేస్తారు. పాత్రలు వేరైనా, వాటి పేర్లు వేరైనా వాటిలో ఉన్నది మట్టే. బంగారంతో అనేక వస్తువులు, ఆభరణాలు తయారుచేస్తారు. ఆభరణాలు వేరైనా, వాటిలో ఉండే బంగారం ఒక్కటే అంది. ఆ మాటలు విన్న ఆడహంస" తెలిసింది. **చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. ఆ పరమేశ్వర తత్త్వాన్ని తెలుసుకుంటే, లోకంలో ఇంక తెలుసుకోవలసింది ఏదీ ఉండదు.**" అన్నది. ఇలా మాట్లాడుకుంటూ హంసలు ఆశ్రమ ప్రాంగణంమీదుగా ఎగిరిపోయినాయి.

తలెత్తి చూశాడు ఆ మాటలు విన్న మునీశ్వరుడు. ఆ హంసలు 'శివశక్తులు'. తనకు ఆత్మ తత్త్వాన్ని బోధించటానికే ఇలా వచ్చారు అని భావించి, తాను విన్న విషయాన్ని 55 సూత్రాలుగా **కామకలావిలాసము.** అనే పేరుతో ఒక గ్రంథం వ్రాశాడు. శ్రీవిద్యలో చాలా ప్రాధాన్యత ఉన్న గ్రంథమది. దానికి నేను వ్రాసిన వివరణయే **శ్రీవిద్యా సర్వస్వము** అనే పేరుతో ప్రచురితమయింది.

## 3. ప్రత్యగాత్మ

ఇక్కడ నుంచి ప్రత్యగాత్మను వివరిస్తున్నారు. దేహంలో నేను అనే అజ్ఞానానికి మూలమై జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, అంతఃకరణ చతుష్టయము వాటివాటి పనులు చెయ్యటానికి కారణమైనదే ప్రత్యగాత్మ. నేను అనే వ్యవహారానికి ఆధారమైన వాడే ప్రత్యగాత్మ. అన్ని ఇంద్రియాలకు ఆధారభూతమైన జ్ఞానం ఏదైతే ఉన్నదో అదే ప్రత్యగాత్మ. నడవటము, ఇవ్వటము, పుచ్చుకోవటము, తినటము వంటి పనులను చేయించే జ్ఞానమే ప్రత్యగాత్మ. నేను అనే పదానికి అర్థం స్వస్వరూపమైన ప్రత్యగాత్మ కన్న ఇంకొకటి లేదు. జగత్తంతా ప్రత్యగాత్మ అనుగ్రహం వల్లనే నిజమవుతున్నది. ఎవరి ప్రకాశాన్ని ఆశ్రయించి సూర్యచంద్రులు ప్రకాశిస్తున్నారో అతడే ప్రత్యగాత్మ. ప్రమాణాలను గ్రహించే శక్తి ఇంద్రియాలకు ఎవరివల్ల వచ్చిందో అతడే ప్రత్యగాత్మ. ఎవరు సాక్షియై సర్వాన్నీ గ్రహిస్తున్నాడో అతడే ప్రత్యగాత్మ. అన్నింటికీ ఆయన సాక్షిమాత్రమే. ఇంద్రియాలకు ఉన్న వికారాలేవీ ఆయనకు అంటవు. బుద్ధి మొదలైనవి ఎవరి శక్తివల్ల పనిచేస్తూ, అవి స్వతంత్రంగా పనిచేస్తున్నట్లు కనిపిస్తాయో, అతడే ప్రత్యగాత్మ. పంచకోశముల లోపల ఉండేవాడు. అన్నింటికన్న వేరుగా ఉన్నవాడు, సాక్ష్యముకన్న వేరైన సాక్షియే ప్రత్యగాత్మ. సర్వసాక్షియై సర్వానుభవ

సిద్ధుడై ఉన్న తత్త్వమే ప్రత్యగాత్మ. అన్ని అవస్థల యందు అన్ని కాలాలయందు సాక్షియైన వాడు ప్రత్యగాత్మ. అహంకారావరణ వల్ల ఎవరిని తెలుసుకోలేరో అతడే ప్రత్యగాత్మ. అహంకారమే ఆత్మ అని భావించి ఎవరిని మరచిపోతున్నారో అతడే ప్రత్యగాత్మ. విషయాలను చూడగలిగే ప్రకాశాన్ని మనకు ఇచ్చేవాడే ప్రత్యగాత్మ.

ప్రత్యగాత్మకు అజ్ఞానంతో సంబంధం లేదు. అజ్ఞానంతో కల్పించబడిన ఈ సంసారంతో సంబంధం లేదు. అది ఇది, వీడు, వాడు అనే విభాగాలుండవు. అన్ని సమయాలలోను ప్రత్యగాత్మ నిర్మలుడు. ఎప్పుడూ ఏరకమైన కర్మ చేయడు. అతనికి ఏ రకమైన బంధాలు ఉండవు. ఒకసారి బంధాలు కల్పించుకోవటం, వాటినుంచి విముక్తిపొందటం ఉండదు. ప్రత్యగాత్మ నిత్యముక్తుడు. దీనికి వ్యతిరేకంగా ఉండేదంతా భ్రాంతి. ప్రత్యగాత్మ బ్రహ్మముకన్న వేరుకాదు. బ్రహ్మముకు ప్రత్యగాత్మకు భేదం లేదు.

ఒక్క మాటలో చెప్పాలంటే సత్యజ్ఞానమనంతమైనది, ఆనందమయమైనది, ఏ రకమైన శరీరఉపాధులు లేనిది, కటకమకుటాది భూషణ భేదములు లేని బంగారుముద్ద వంటిది, విజ్ఞానఘనమైనది, చిత్స్వభావమైనది, ఆత్మచైతన్యమైనది, ప్రకాశించేదిఅయిన త్వంపదార్థమే ప్రత్యగాత్మ. ఆ ప్రత్యగాత్మను ఇక్కడ వివరిస్తున్నారు.

**యో స్మిన్ దేహే త్వహమ హమితి ప్రత్యయాలంబనస్స**
**న్నాస్తేన్నిత్యం సకలకరణ గ్రామ చేష్టా నిదానం ।**
**సాక్షాజ్జానన్వివిధవికృతీః ప్రాణబుద్ధీం ద్రియాణాం**
**సో యం ప్రత్యఙ్ఞహమధిగతస్వాత్మనా శుద్ధబోధః ॥ 35**

దేహంలో నేను అనే జ్ఞానానికి ఆధారభూతమై సమస్తమైన జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, అంతఃకరణచతుష్టయము, వాటివాటి పనులు చెయ్యటానికి కారణమైన దానినే ప్రత్యగాత్మ అంటారు. ప్రత్యగాత్మ అంటే క్రొత్తవాడు కాదు. **నేను అనే వ్యవహారానికి ఆధారమైన వాడే ప్రత్యగాత్మ.** లోకంలో నేను అనే పదానికి అర్థము 'దేహము' అని భ్రాంతి చెందుతున్నారు. జాగ్రత్తగా ఆలోచిస్తే నేను అంటే ఈ దేహం కాదు అనే విషయం తెలుస్తుంది. ఇక్కడ నా దేహము అన్నప్పుడు నేను వేరు, దేహం వేరు అని తెలుస్తుంది. అలాగే నా ఇంద్రియాలు అన్నప్పుడు నేను వేరు, ఇంద్రియాలువేరు అనితెలుస్తుంది. కాబట్టి దేహము మొదలైన పదార్థాలన్నింటినీ

తెలుసుకున్నవాడే, నేనుఅనే పదానికి ఆనందస్వరూపమైన పరబ్రహ్మమే అర్థము అని తెలుసుకోగలుగుతాడు. బ్రహ్మానికి రూపం ఏమిటి అనే అనుమానం వచ్చినప్పుడు, అది జ్ఞానమే అని గుర్తించండి. అఖండమైన జ్ఞానమే పరబ్రహ్మస్వరూపం. ఆ **బ్రహ్మమునకు, ప్రత్యగాత్మకు భేదము లేదు.** జీవాత్మ పరమాత్మ రెండూ ఒక్కటే. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, పరబ్రహ్మ కాదు. కాని పరబ్రహ్మ సహాయం లేకపోతే ఈ ఇంద్రియాలు సక్రమంగా పని చేయవు. గతంలో చెప్పుకున్నట్లుగా కంటికి చూసే శక్తినిచ్చేది ఆత్మ. చెవికి వినేశక్తినిచ్చేది ఆత్మ. అంటే జ్ఞాన సహాయము లేకపోతే కన్ను చూడలేదు. చెవి వినలేదు. నోరు మాట్లాడలేదు. అలాగే శరీరంలోని ఏ ఇంద్రియాలు పని చెయ్యలేవు. ఒక్కొక్క ఇంద్రియానికి ప్రత్యేకమైన జ్ఞానం ఉంది అని చెప్పకూడదు. అది తప్పు. ఇలా చెబితే ఒక జ్ఞానము ఇంకొక జ్ఞానముకన్న విరుద్ధము అని చెప్పాలి. జ్ఞానేంద్రియాలు మనసుకు లోబడి ఉంటాయి. కర్మేంద్రియాలు జ్ఞానేంద్రియాలకు, మనసుకు బుద్ధికి లోబడి ఉంటాయి. అనుభవంలో ఈ విషయం అందరికీ తెలిసేదే. జ్ఞానము ఒకటే. ఇదే అన్ని ఇంద్రియాలను ఆశ్రయించి, వాటితో ఆ పనులు చేయిస్తుంటుంది. ఈ రకంగా **అన్ని ఇంద్రియాలకు ఆధారభూతమైన జ్ఞానం ఏదైతే ఉన్నదో అదే నేను అనబడే ప్రత్యగాత్మ.** నేను వింటున్నాను అంటే నా చెవులు వింటున్నాయి. నేను చూస్తున్నాను అంటే నా కనులు చూస్తున్నాయి. నేను నడుస్తున్నాను. అంటే పాదాలు నడుస్తున్నాయి. నేను తాకుతున్నాను. అంటే నా చేతులు తాకుతున్నాయి. **ఈ పనులన్నీ ఏ జ్ఞానమైతే చేయిస్తోందో, అదే ప్రత్యగాత్మ.** ఇతర పదార్థాలను గ్రహించటంలో జ్ఞానానికి సహాయమక్కర్లేదు. కాబట్టి **నేను అనే పదానికి అర్థం స్వస్వరూపమయిన ప్రత్యగాత్మే కాని వేరు కాదు.**

సత్యజ్ఞానమనంతమైనది, అన్ని రకాలైన శరీర ఉపాధులు లేనిది, కటక మకుటాది భూషణ భేదాలు లేని బంగారుముద్ద వంటిది, విజ్ఞానఘనమైనది, చిత్స్వభావమైనది, ఆత్మచైతన్యమైనది, బ్రహ్మమైనది, ప్రకాశించేది అవిద్యోపాధికి లోబడినది అయిన 'త్వం' పదార్థమే ప్రత్యగాత్మ అని చెబుతోంది **'సర్వసారోపనిషత్తు'.**

**స్వయం త్వనిత్యా అపినిత్యతాం గతా వ్యోమాదయోఽమీ యదనుగ్రహేణ।**
**యద్భాన మాశ్రిత్య విభాంతి నిత్యం భాన్వాద్వయః ప్రత్యగయం చిదాత్మా॥ 36**

వాస్తవంగా చూసినట్లైతే ఈ జగత్తంతా అసత్యమే. సుషుప్తిలో ఇంద్రియాలన్నీ, మనసుతోసహా లయంఅయిపోతాయి. అప్పుడు ఈజగత్తు ఎక్కడుంది? లేదు. సుషుప్తిలోలేనిజగత్తు మళ్ళీ జాగ్రదవస్థలో కనిపిస్తోంది. జాగ్రదావస్థలో మనసు పని చేస్తుంది. ఆ సమయంలోనే జగత్తు కనిపిస్తోంది. అంటే ఈ జగత్తంతా మనోబుద్ధులను ఆశ్రయించి ఉంటుంది. మనసు, బుద్ధి ఇవే తమలో వ్యాపించి ఉన్న పరబ్రహ్మ ప్రకాశంలోనే అనేక రకాల భావాలు చెట్లు, చేమలు, పశువులు, పక్షులు, మనుషులు, క్రిమికీటకాలు మొదలైన వాటిని ఆరోపిస్తున్నాయి. అంటే ఈ జగత్తంతా మనోబుద్ధుల వల్లనే కలుగుతున్నది. ఈ కారణంచేతనే మనోబుద్ధులు లయమయిన స్థితిలో అంటే సుషుప్తిలో ఈ జగత్తు కనిపించదు. ఇది అందరికీ తెలిసిన విషయమే. ప్రపంచానికి జ్ఞానంకన్న వేరైనరూపం ఏదీలేదు. ప్రపంచము యొక్కఉనికిజ్ఞానాన్ని ఆశ్రయించి ఉంటుంది. అందుకనే జ్ఞానరూపుడైన ప్రత్యగాత్మ ఈ ప్రపంచానికి సత్తను కలిగిస్తున్నాడు. ఈ రకంగా చూస్తే స్వభావరీత్యా అసత్యమైనప్పటికీ, జగత్తంతా ప్రత్యగాత్మ అనుగ్రహం వల్లనే నిజమవుతోంది. అందుకే ప్రపంచము లేదా జగత్తుకు భ్రాంతి, మిధ్య అని పేరు. ఇంకా చెప్పాలంటే, **ఎవరి ప్రకాశాన్ని ఆశ్రయించి సూర్యచంద్రులు ప్రకాశిస్తున్నారో అతడే ప్రత్యగాత్మ.**

**ప్రామాణ్యం వేదశాస్త్రాణాం త్వగ్ఘ్రాణశ్రుతిచక్షుషాం ।**
**ఘటతే యత్ప్రసాదేన సోऽయం ప్రత్యగశేషదృక్ ॥ 37**

లోకంలో ఏదైనా ఒక విషయాన్ని చెప్పాలంటే దానికి ప్రమాణం కావాలి. ప్రమాణము అంటే సత్యము, దృష్టాంతము, హేతువు. ఏ విషయమైనా సప్రమాణమైతేనే నమ్మటానికి వీలుంటుంది. ఈ ప్రమాణాలు ముఖ్యంగా నాలుగు.

**1. ప్రత్యక్ష ప్రమాణము :** ఇంద్రియాల సాయంతో కలిగే జ్ఞానం. గాలి వేడిగా ఉన్నది. నీరు చల్లగా ఉంది. ఇలా చెప్పినప్పుడు ఆ విషయం నిజమో కాదో మన కళ్ళతో చూసి లేదా ఇంద్రియాలతో అనుభూతిని పొంది ఆ విషయం తెలుసుకుంటాం.

**2. అనుమాన ప్రమాణము :** ఒకదాన్ని చూసి రెండవది ఉన్నది అని ఊహించటం. అడవిలో దూరంగా ఒక చెట్టు వెనక పులితోక కనిపించింది. తోక ఉన్నది కాబట్టి అక్కడ పులి ఉన్నది అని నిశ్చయం చేసుకోవటం.

ఎక్కడో కొండమీద పొగ వస్తోంది. నిప్పు లేనిదే పొగరాదు. అక్కడ పొగ వస్తోంది కాబట్టి తప్పనిసరిగా నిప్పు ఉండి ఉంటుంది. అని ఊహిస్తాం ఇది అనుమాన ప్రమాణం. అనుమాన ప్రమాణము మూడు రకాలుగా ఉంటుంది.

**I. గతానుభవము :** గతంలో ఉన్న అనుభవాన్ని బట్టి రాబోయే పరిస్థితి ఊహించటం. గతంలో వర్షం వచ్చేముందు ఆకాశంలో దట్టంగా మేఘాలు కమ్మేశాయి. ఇప్పుడు కూడా కారుమేఘాలు కమ్ముకున్నాయి కాబట్టి వర్షం వస్తుంది అని ఊహిస్తాం.

**II. ప్రస్తుతస్థితి :** ప్రస్తుతము ఉన్న స్థితిని బట్టి జరిగిందిఏదో ఊహిస్తాం. వర్షం వస్తే యేరు బాగా పొంగింది కాబట్టి బాగా వర్షం కురిసి ఉంటుంది అనుకుంటాం.

**III. ఊహ :** ఒక వస్తువులో కొంత భాగం చూసి మిగిలిన భాగం ఊహించటం. తోకను చూసి పులి ఉన్నది అని ఊహించటం. కొమ్ములున్న జంతువును చూసి దానికి తోక కూడా ఉన్నది అనుకోవటం.

తల్లి ప్రత్యక్ష ప్రమాణం. తండ్రి అనుమాన ప్రమాణం. అనుమానం ప్రతిసారీ నిజం కావాలని లేదు. పొగను చూసి నిప్పు ఉన్నదని ఊహించాం. కాని అది పొగ మంచు కూడా కావచ్చు.

**3. ఉపమానము :** ఇది పూర్తిగా పోలిక మీద ఆధారపడి ఉంటుంది. క్రొత్త దంపతులను 'సీతారాములలాగా' జీవించండి అంటాం. ఇక్కడ సీతారాములు అంటే ఆదర్శ దంపతులు అని అర్థం.

**4. శబ్దప్రమాణం :** పెద్దలు చెప్పే విషయాలు. ఇది గతానుభవంతో చెప్పబడ్డాయి. ఇవి రెండు రకాలుగా ఉంటాయి. 1.వేదప్రమాణము 2.ఆప్తవాక్యం.

వేదంలో చెప్పిన ప్రతి మాటా ప్రమాణమే. గతంలో చాలామంది దీన్ని పరీక్షించి చూశారు. కాబట్టి మళ్ళీ మనం పరీక్షించవలసిన అవసరం లేదు.

ఆప్తవాక్యము అంటే మన శ్రేయోభిలాషులైన వారు చెప్పిన విషయము. ఇది వారి గతానుభవం ఆధారంగా చెప్పినది. కాబట్టి పరీక్షించవలసిన అవసరం లేదు. అందుకే ఈ రెండింటినీ (వేద ప్రమాణము, ఆప్తవాక్యము) ప్రత్యక్షమాణంతో

సమానంగానే పరిగణించటం జరుగుతుంది. ఈ ప్రమాణాల వల్లనే మనకు విషయం తెలుస్తుంది.

లోకంలో యధార్థ విషయాలను చెప్పేవి ప్రమాణాలు. అంటే విషయం ఉన్నది ఉన్నట్లుగా చెప్పేవి ప్రమాణాలు. చెప్పిన దానికి, విషయానికీ తేడా ఉంటే అది అప్రమాణం అవుతుంది. ఇది యధార్థము, ఇది యధార్థం కాదు అనే విషయం ప్రమాణంలో ఉండాలి. అలాగే ఆ ప్రమాణాన్ని గ్రహించే శక్తి ఇంద్రియానికి కూడా ఉండాలి. సర్వజ్ఞుడైన పరమేశ్వరుడే ఇంద్రియాలకు, వేదాలకు ఆ శక్తిని (వేదాలకు ప్రమాణశక్తిని, ఇంద్రియాలకు ప్రమాణాన్ని గ్రహించేశక్తిని) ఇచ్చాడు. ఆ పరమేశ్వరుడు మహాజ్ఞాని. జ్ఞానస్వరూపుడు. ఆయనకు అన్నివిషయాలు తెలుసు. అన్నింటికీ ప్రమాణాలు చూపగలడు. వాటిని గ్రహించే శక్తిని ఇంద్రియాలకు ఇవ్వనూ గలడు. కాబట్టి ఆ సర్వేశ్వరుని వల్లనే వేదాలు అత్యంత ప్రమాణాలయినాయి. **ప్రమాణాలను గ్రహించే శక్తి ఇంద్రియాలకు ఎవరి వలన కలుగుతున్నదో అతడే 'ప్రత్యగాత్మ'.**

**య ఇంద్రియార్థేంద్రియ సన్నిధాన సంజాయమానాఖిలబుద్ధి వృత్తిః ।**
**సాక్షాత్మనా పశ్యతి నిర్వికార స్సప్రత్యగర్థఃసదసద్విభిన్నః ॥ 38**

ప్రత్యగాత్మ లేదా పరమాత్మ సర్వసాక్షి. ఈ జగత్తులో జరిగే ప్రతి విషయానికి ఆయన సాక్షి. మన కంటికి కనుపించని వస్తువులు, విషయాలు ఆయనకు కనిపిస్తాయి. ఆయనకు తెలుస్తాయి. ఇక్కడ ఒక చిన్న ఉదాహరణ చూడండి. మనకు రెండు రకాల ఇంద్రియాలున్నాయి. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు. ఈ ఇంద్రియాలు వేరువేరు పనులు చేస్తుంటాయి. కర్మేంద్రియాలతో చేసే పనులు మనకి కనిపిస్తాయి. జ్ఞానేంద్రియాలతో చేసే పనులు వేరుగా ఉంటాయి. ఒక నాట్య ప్రదర్శనకు వెళ్ళాం. నృత్యం బాగుంది. చూస్తున్నాం. ఈ నృత్యం చాలా బాగుంది. అంటాం. ఆ నృత్యం చూడటానికి ఆసక్తి కూడా చూపిస్తాం. అలాగే ఒక మంచి పాటవింటున్నాం. ఆపాట వింటుంటే నామనసు హాయిగాఉంది అంటాం. ఇక్కడ రూపము, శబ్దము, స్పర్శ మొదలైన చిత్తవృత్తులు ఇంద్రియాలకు తెలిసినప్పటికీ, ఆత్మకు కూడా తెలుస్తాయి. ఆత్మకు గోచరిస్తాయి. ఇలా లోకంలో జరిగే ప్రతి వ్యవహారము ఆత్మకు గోచరిస్తుంది. ఈ విధంగా ఎవరు సాక్షియై సర్వాన్నీ గ్రహిస్తున్నాడో, అతడే ప్రత్యగాత్మ. అన్నింటికీ ఆయన సాక్షి మాత్రమే. ఇంద్రియాలకు

ఉన్న వికారాలు ఏవీ ఆయనకు అంటవు. దేహేంద్రియాలకు ఉన్న బాధలు పరమేశ్వరుడికి ఉండవు. మనోబుద్ధుల యందుండే మోహము ఆయనకు ఉండదు. అందుకనే దృశ్య పదార్థాలు ఏవీ ఆయనను ప్రకాశింప చేయలేవు. ఈ కారణం చేతనే ఆయన ఉన్నాడు, లేడు అని చెప్పటానికి వీలు పడదు. ఇంద్రియాలకు కనిపించే పదార్థం ఉన్నది అని, ఇంద్రియాలకు కనిపించక పోతే ఆ పదార్థం లేదని అంటాం. మరి ఈ ప్రత్యగాత్మ ఇంద్రియగోచరుడు కాదు. ఆయన్ను గురించి ఏం చెబుతాం? అందుకే **యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ** ఇంద్రియాల వల్ల ఆత్మను గ్రహించలేము. ఈ విషయం కేనోపనిషత్తులో చెప్పటం జరిగింది.

**నతత్ర చక్షుర్గచ్ఛతి, నవాగ్గచ్ఛతినో మనః**

ఆ పరమేశ్వర స్వరూపం ఉన్న చోటికి కళ్ళువెళ్ళలేవు, వాక్కువెళ్ళలేదు, మనసువెళ్ళలేదు. అంటే ఇంద్రియాలద్వారా పరబ్రహ్మను తెలుసుకోవటం జరగదు.

**యద్వాచా నభ్యుదితం, యేన వాగభ్యుద్యతే**

**తదేవ బ్రహ్మత్వం విద్ధి, నేదం యదిదముపాసతే ॥**

ఏ ఆత్మ వాక్కు చేత గ్రహించబడదో, దేని శక్తివల్ల వాక్కు పని చేస్తుందో అదే పరమాత్మ.

**యన్మనసా నమనుతే, యేనాహర్మనోమతమ్**

**తదేవ బ్రహ్మత్వం విద్ధి, నే దంయదిదముపాసతే ॥**

మనసుచేత ఏది భావించబడదో, దేని శక్తివల్ల మనసు పనిచేస్తున్నదో అదే ఆత్మ.

**యచక్షుషా నపశ్యతి, యేన చక్షూగ్ంషి పశ్యతి**

**తదేవ బ్రహ్మత్వం విద్ధి, నేదం యదిదముపాసతే ॥**

దేనిని కళ్ళు చూడలేవో, దేనిశక్తి వల్ల కనులు పనిచేస్తున్నాయో, అదే ఆత్మ.

**యచ్ఛ్రోత్రేణ నశృణోతి, యేనశ్రోత్రమిదం శ్రుతమ్**

**తదేవ బ్రహ్మత్వం విద్ధి, నేదం యది దముపాసతే ॥**

దేనినైతే చెవులద్వారా వినలేమో, చెవులు దేనివలన పని చేస్తున్నాయో, అదే ఆత్మ.

**యత్ ప్రాణేనన ప్రాణితి, యేన ప్రాణః ప్రణీయతే ।**

**తదేవ బ్రహ్మత్వం విద్ధి, నేదం యది దముపాసతే ॥**

ప్రాణంవల్ల దేన్నితెలుసుకోలేమో; ప్రాణం దేనిశక్తివలన తనకార్యక్రమాలు నిర్వర్తిస్తోందో అదే ఆత్మ. అంతేకాని ఇంకొకటి ఆత్మకాదు. ఇక్కడ ఆత్మ అంటే పరబ్రహ్మ, ప్రత్యగాత్మ అని అర్థం. కాబట్టి ఇంద్రియాలకు అగోచరమైనది పరబ్రహ్మ.

**అచేతనా శ్చేతనతాం ప్రయాంతి బుద్ధ్యాదయో యస్యమహాప్రసాదాత్ ।**

**సర్వాంతరః సర్వవిలక్షణో య స్తం ప్రత్యగాత్మాన మవేహి విద్వన్ ॥39**

బుద్ధి మొదలైనవి అచేతనాలు. వాటికి జ్ఞానం లేదు. స్వయంగా ప్రకాశించలేవు. వీటికి జ్ఞానం ఉంటేనే, వీటితో జ్ఞానం కలిస్తేనే ఇవి ప్రకాశిస్తాయి. వీటికి జ్ఞానశక్తి లేదు కదా ! మరి ఎలా ప్రకాశిస్తాయి? అంటే ఆ పరమేశ్వరుని అనుగ్రహంతో, జ్ఞానరూపుడు బుద్ధ్యాదులలో ప్రవేశించి పూర్తిగా వ్యాపించిఉన్నాడు. కేవలము బుద్ధే కాకుండా మిగిలిన వాక్కు, శ్రోత్రము, చక్షువు, మనసు మొదలైన ఇంద్రియాలన్నింటి యందు అంతర్లీనంగా ఉన్నాడు. అవన్నీ ఆయన శక్తి వల్లనే పని చేస్తున్నాయి. జ్ఞానరూపుడయిన ఆ పరమేశ్వరుడు వ్యాపించి ఉండటం వల్లనే బుద్ధి మొదలైనవన్నీ పని చేస్తూ అవి స్వతంత్రంగా పని చేస్తున్నట్లుగా కనిపిస్తున్నాయి. ఈ విధంగా **బుద్ధ్యాదులు ఎవనిశక్తివల్ల పనిచేస్తూ అవి స్వతంత్రంగా పని చేస్తున్నట్లు కనిపిస్తున్నాయో అతడే ప్రత్యగాత్మ. ఎవరైతే పంచకోశముల లోపల ఉన్నాడో అతడే ప్రత్యగాత్మ. అన్నింటికన్నా వేరుగా ఉన్నవాడు, సాక్ష్యము కన్న వేరైన సాక్షియే ప్రత్యగాత్మ. తం ప్రత్యగాత్మానాం ఆవేహి ఓ విద్వాంసుడా! ఆ ప్రత్యగాత్మే నువ్వని తెలుసుకో.**

**అవిర్భావతిరోభావ స్థితయో యేన సర్వదా ।**

**బుద్ధ్యాదేరిహ బుధ్యంతే సోऽయమాత్మేతి బుధ్యతామ్ ॥ 40**

మనకు మూడు రకాల అవస్థలున్నాయి. 1. జాగ్రదావస్థ 2.స్వప్నావస్థ 3.సుషుప్తి వీటిలో

**1.జాగ్రదావస్థ :** ఇది మేలుకొని ఉండే స్థితి. ఈ స్థితిని అనుభవించేది స్థూలదేహము. మానవుడు తాను చేసిన కర్మ ఫలితం అనుభవించటానికే స్థూలదేహం

ధరిస్తాడు. మానావమానాలు, వర్ణాశ్రమధర్మాలు, సకలభోగాలు, సుఖదుఃఖాలు, అన్నీ ఈ దేహంతోనే అనుభవిస్తాడు. స్థూలశరీరం జాగ్రదావస్థలోనే అనుభవం పొందుతుంది.

**2.స్వప్నావస్థ :** నిద్రలో కలలుగనే స్థితి. ఈ స్థితిలో జీవుడు కంఠస్థానంలో ఉంటాడు. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, అంతఃకరణ చతుష్టయముతో వచ్చి కంఠస్థానం చేరినప్పుడు జీవుడు కనేది స్వప్నము. జాగ్రదావస్థలో అనుభవించిన విషయాలే స్వప్నంలో కనిపిస్తాయి.

**3.సుషుప్తి :** అంతఃకరణలో చిత్త అహంకారాలు వదలి మనోబుద్ధులతో జీవుడు హృదయ స్థానానికి వచ్చినప్పుడు దాన్ని సుషుప్తి అంటారు. ఇంద్రియాలన్నీ అవిద్యలో కలసిపోవటమే సుషుప్తి. ఇంద్రియాలన్నీ అచేతన స్థితిలో ఉన్నప్పుడు గాఢనిద్ర పోతున్నాడు అంటారు. అదే సుషుప్తి. ఇక్కడ బాహ్య వస్తుజ్ఞానముండదు. 'నేను హాయిగా నిద్రపోయాను. నాకేంతెలియదు' అంటాడు. ఇలా చెప్పటం వల్ల అవిద్యావృత్తులు మూడు చెప్పబడుతున్నాయి.

1.అజ్ఞానము 2.అహంభావము 3.సుఖము. ఈ మూడు అవస్థలు కలిసిందే సుషుప్తి. ఇదే **'నిర్వికార స్వరూపస్థితి'** దీన్ని **సంప్రాసాదావస్థ** అని కూడా అంటారు. మనసు, బుద్ధి కూడా హృదయంలో లీనమయ్యే స్థితి. ఈ స్థితిలో ఇంద్రియాలు బుద్ధి ముఖ్యప్రాణంతో లీనమవుతాయి. ఇలా మనసు బుద్ధి కూడా లయమయి నప్పటికీ జ్ఞానముంటుంది. మెలకువరాగానే తాను 'సుఖంగా నిద్రపోయాను' అని తెలుస్తుంది.

ఈ మూడు అవస్థలు ప్రతివారికి అనుభవంలో ఉన్నవే. ఈ అవస్థలే ఆవిర్భావము, తిరోగమనము అనబడతాయి. ఆవిర్భావము అంటే – సృష్టి. తిరోగమనము అంటే – లయము. జాగ్రదావస్థలో విషయాలన్నీ తెలుస్తాయి కాబట్టి ఆత్మచైతన్యమున్నది. స్వప్నావస్థలో కూడా ఆత్మచైతన్యమున్నది. ఇక పోతే సుషుప్తిలో ఏమీ తెలియదు. కాబట్టి ఆత్మ చైతన్యము లేదు. అనుకుంటారు. అది నిజం కాదు. సుషుప్తిలో "నేను హాయిగా నిద్రపోయాను. నాకు హాయిగా ఉంది. ఏమీ తెలియదు" కాబట్టి ఆత్మచైతన్యము లేదు అనుకుంటారు. అది నిజం కాదు. సుషుప్తిలో "నేను హాయిగా నిద్రపోయాను. నాకు హాయిగాఉంది. ఏమీతెలియదు" అనుకుంటున్నాము.

ఇక్కడ 'ఏమీ తెలియదు' అనుకుంటున్నాము. కాని ఇక్కడ 'ఏమీ  తెలియదు'. 'హాయిగా ఉంది' అనే విషయం తెలుస్తోంది. ఇది కూడా జ్ఞానమే. ఆత్మచైతన్యం గనక లేకపోతే ఈ విషయం తెలియదు. సుషుప్తిలో దృశ్యపదార్థాలు ఉండవు. అంతేగాని ద్రష్ట అంటే చూసేవాడు లేడు అని మాత్రం కాదు. సుషుప్తిలో కూడా ఆత్మచైతన్యము ఉన్నది. ఈ విధంగా **సర్వసాక్షియై సర్వానుభవ సిద్ధుడై ఉన్న తత్త్వమే ప్రత్యగాత్మ. అన్ని అవస్థల యందు సాక్షియై ఉన్నవాడు, అన్ని కాలముల యందు అవస్థాత్రయానికి సాక్షియైన వాడు. ఈ రకంగా అన్ని కాలాల్లోను అనేక రూపాలు ధరించి సర్వసాక్షి అయిన వాడే ప్రత్యగాత్మ.** ఓ మేధావీ! ఓ సాధకుడా! అతడే నీవు.

**చేతనత్వం చ బోద్ధృత్వం సర్వజ్ఞత్వం చ నిత్యతాం ।**
**ఆసద్రూపోఽప్యహంకారో యస్యధర్మాన్ స్వయం భజన్ ।**
**కరోతి ప్రావృతం తత్త్వం ప్రత్యంచం విద్ధి కేవలం ॥ 41**

ఈ శ్లోకంలో బ్రహ్మము 'అహం శబ్దవాచ్యుడు' కాదు. అని వివరిస్తున్నారు. అహం అంటే – బ్రహ్మ అని చెప్పటానికి లేదు. ఎందుకంటే, ఇది పంచభూతాల వల్ల జనించినది. అందుచేత అహం అనేది జడము అవుతుంది. దీనికి స్వయంగా ప్రకాశించే సామర్థ్యం లేదు. ఇతర పదార్థాలను ప్రకాశింప చెయ్యలేదు. ఈ కారణంతోనే అహంకారము తనకు తానుగా దేనినీ తెలుసుకోలేదు. ఇది పంచభూతాల వల్ల జనించింది. పూర్తిగా భౌతికమైనది. కాబట్టి ఇది నిత్యమైనది, సత్యమైనది కాదు. అయినప్పటికీ అంతఃకరణ చతుష్టయంలో (మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము) ఒకటైన ఈ అహంకారము ఆత్మకు చాలా దగ్గరగా ఉండి, ఆత్మయొక్క ధర్మాలను తనకు ఆపాదించుతుంటోంది. అంటే చేతనత్వము, ఇతరులను ప్రకాశింప చేయటం, నిత్యత్వము అనే ఆత్మధర్మాలు అహంకారానికి ఆపాదించబడటం చేత అందరూ 'అహంకారమే బ్రహ్మ' అనుకుంటున్నారు. ఈ కారణం చేతనే అహంకారము నిత్య శుద్ధుడైన ఆత్మని ఆవరిస్తోంది. దీనివల్ల అందరూ అహంకారాన్నే చూడగలుగు తున్నారు. కాని ఆత్మను దర్శించలేకపోతున్నారు. అహం అంటే ఆత్మకాదు.

**యోఽహంకారేణ విహితో మేఘేనేవ దివాకరః ।**
**న జ్ఞాయతే బుద్ధిశూన్యైః సో యమాత్మేతి బుద్ధ్యతామ్ । 42**

ఈ విధంగా అహంకారం ఆత్మను ఆవరించి ఉంటుంది. ఈ కారణం చేత ఆత్మని గురించి అజ్ఞానులు తెలుసుకోలేరు. ఇలా పామరులు లేదా అజ్ఞానులతో తెలుసుకోబడనివాడే ప్రత్యగాత్మ. బాగా ప్రకాశిస్తున్న సూర్యుణ్ణి మేఘాలు కమ్మేస్తాయి. అప్పుడు సూర్యుడి ప్రకాశం తగ్గిపోతుంది. ఇది చూపిన అజ్ఞానులు మేఘాలు ఆవరించటం చేత సూర్యుని కాంతి తగ్గిపోయింది అనుకోరు. సూర్యుడికి ప్రకాశం లేదు అనుకుంటారు. ఇది భ్రాంతి ఇలాగే అహంకారం ఆవరించటం చేత ఆత్మను దర్శించలేక, ఆత్మకే ప్రకాశము లేదు అని భావిస్తారు. ఇలా **అహంకారావరణ వల్ల ఎవరిని తెలుసుకోలేరో అతడే ప్రత్యగాత్మ. అహంకారమే ఆత్మ అని భావించి, ఎవరిని మరచిపోతున్నారో అతడే ప్రత్యగాత్మ.**

**స్వప్నప్రపంచో రవిణా న భాస్యతే నైవానలాద్యై ర్న చ చక్షురాదిభిః ।**
**ప్రత్యక్ప్రకాశేన విభాతి సర్వం తస్మాత్స్వయంజ్యోతి రయం చిదాత్మ ॥43**

ఈ ప్రత్యగాత్మను తెలుసుకోవటం కష్టం కదా ? అంటే ప్రత్యగాత్మను తెలుసుకోవటం ఏ మాత్రం కష్టం కాదు. చరాచర జగత్తు అంతటినీ ప్రకాశింపచేసేది ప్రత్యగాత్మ. జాగ్రస్వప్న సుషుప్తులలో దేన్నైనా ప్రకాశింపచేసేది ప్రత్యగాత్మ. దీనికి సంబంధించి **బృహదారణ్యకోపనిషత్తు**లో ఒక కథ ఉంది. మిధిలానగరానికి రాజు జనక మహారాజు ఆయన గురువుగారు యాజ్ఞవల్క్యుడు. వీరిద్దరి మధ్యనా ఒక ఒప్పందం ఉంది. జనకుడికి ఎప్పుడు ఏ అనుమానం వచ్చినా యాజ్ఞవల్క్యుడు తీర్చాలి.

ఒకసారి యాజ్ఞవల్క్యుడు జనక మహారాజు ఆ స్థానానికి వచ్చాడు. స్వాగత సత్కారాలు పూర్తి అయిన తరువాత జనకమహారాజు యాజ్ఞవల్క్యుణ్ణి అడుగుతున్నాడు.

జ : మహర్షీ ! లోకంలో మానవులు తమ పనులు ఏ రకంగా చేసుకో గలుగుతున్నారు?

యా : సూర్యుని యొక్క కాంతుల వల్ల.

జ : రాత్రిపూట సూర్యుడు ఉండడు కదా? మరి అప్పుడు ఏ రకంగా పనులు జరుగుతాయి?

యా : చంద్రుని కాంతుల వల్ల

జ : సంధ్య వేళల యందు సూర్యచంద్రులు ఇద్దరూ ఉండరు కదా ? మరి అప్పుడు ఎలా?

యా : అగ్నియొక్క (దీపము) కాంతుల వల్ల

జ : సూర్యుడు, చంద్రుడు, అగ్ని ఈ ముగ్గురూ లేని సమయంలో ఏ రకంగా పనులు జరుగుతాయి?

యా : వాక్కు వల్ల

జ : మరి వాక్కు కూడా లేని సమయంలో?

యా : పరమేశ్వరుని కాంతివల్ల.

ఓ జనక మహారాజా ! ఈ చరాచర జగత్తంతా పరమేశ్వరుని కాంతుల వల్లనే ప్రవర్తిల్లుతున్నది. అంటాడు.

పరమేశ్వర స్వరూపం అంటే అతిపెద్దదయిన కాంతిపుంజము. కొన్ని వేల కోట్ల సూర్యులకాంతితో ఉంటుంది. ఆ కాంతుల నుంచి సూర్యుడు 116, చంద్రుడు 136, అగ్ని 108 కిరణాలు తీసుకున్నారు. ఈ కాంతులతోనే వారు ప్రకాశిస్తూ, లోకాలను కూడా ప్రకాశింపచేస్తున్నారు. స్వప్నావస్థలో మనం అనేక విషయాలను చూస్తాం. **విషయాలను చూడగలిగే ప్రకాశాన్ని మనకు ఇచ్చేవాడే ప్రత్యగాత్మ.**

**బుద్ధిమాత్రేణ తిష్ఠగ్సర్గ ప్రత్యగేష ఉపాధినా ।**
**స్వప్నే విభాతి విజ్ఞాతుం శక్య స్సద్భిర్ముముక్షుభిః ॥ 44**

'స్వప్నావస్థ' అంటే కలలుకనే స్థితి. ఈ స్థితిలో జీవుడు కంఠస్థానంలో ఉంటాడు. జాగ్రదావస్థలోని అనుభవాలే మనకి కలలో కనిపిస్తాయి. ఇంద్రియాలన్నీ అంటే – జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, అంతఃకరణ చతుష్టయము అన్నీ కంఠస్థానానికి చేరినప్పుడు జీవుడు కలలుకంటాడు. జాగ్రదావస్థలో అతడు పొందిన అనుభవాలు జ్ఞాపకానికి రావటమే స్వప్నము కల అంటారు. ఈ స్థితిలో మనసు చిత్రాతిచిత్రమైన కల్పనలు చేస్తుంది. రాజులు, రాజ్యాలు, గుర్రాలు, ఏనుగులు, కాల్బలము, యుద్ధాలు, జయాపజయాలు అన్నీ ఊహించుకుంటుంది. తానే రాజైనట్లు భావించి మహదానందం పొందుతుంది. కష్టాలు కలిగితే ఏడుస్తుంది, భయపడుతుంది. ఇది స్వప్నావస్థ. స్వప్నావస్థలో కలిగే అనుభవాన్ని బట్టి ఆత్మను తెలుసుకోవచ్చు. అది

ఎలా? అంటే – స్వప్నావస్థలో ఇంద్రియాలన్నీ మనసులో లీనమవుతాయి. ఆ మనసు తనయందు ఉన్న బ్రహ్మప్రకాశముతో ఇక్కడ ఈ అవస్థలోని కల్పిత పదార్థాలను చూస్తుంటుంది. ఆ సమయంలో ఆత్మకు జాగ్రదావస్థలో ఉన్నట్లుగా అనేక ఉపాధులు ఉండవు. మనసు అనే ఉపాధి ఒకటి మాత్రమే ఉంటుంది. కాబట్టి అనుభవజ్ఞులు గనక జాగ్రత్తగా పరిశీలిస్తే, ఆ సమయంలో అంటే స్వప్నావస్థలో ఆత్మను గుర్తించటం చాలా తేలిక. ఇక్కడి నుంచి తరువాత అవస్థ సుషుప్తికి వెళ్ళినట్లైతే అక్కడ మనసు కూడా పనిచేయదు. అంటే ఆత్మకు ఉపాధి ఉండదు. కాబట్టి విషయ గ్రహణము అంటే విషయాలను తెలుసుకునేస్థితి మాత్రమే ఉంటుంది. అందుచేత అప్పటి స్థితిని అనుభవానికి తెచ్చుకోవటం కష్టము.

**బుద్ధ్యంశం భాస్యముత్సృజ్య భానమాత్రపరిగ్రహాత్ ।**
**ఆత్మావశిష్యతే శుద్ధో బోధమాత్రస్తు కేవలః ॥ 45**

స్వప్నావస్థలో ఆత్మకు ఉపాధి మనసుఒకటే. కొన్నిచోట్ల దీన్నే బుద్ధి అని కూడా చెబుతారు. ఆ బుద్ధికి లేదా మనసుకు జ్ఞానం లేదు. ఆత్మయొక్క జ్ఞానం తనయందు ప్రకాశించటం చేత ఇది అన్నివిషయాలను ప్రకాశింప చేస్తున్నది. కాబట్టి ఇక్కడ బుద్ధిని లేదా మనసును గనక వేరు చేసి చూడగలిగితే, ఇంక మిగిలేది ఆత్మే. అయితే ఇలా వేరు చేసి చూడగలగటం కేవలము జ్ఞానులకు మాత్రమే సాధ్యము. 'ఆత్మ' అంటే పరబ్రహ్మమే. ఆయన నిరాకారుడు, నిర్గుణుడు. కేవలము జ్ఞానస్వరూపుడు. పరమేశ్వరుడు అంటే ప్రత్యేకంగా ఎవరో కాదు. కేవలము జ్ఞానమే. బుద్ధి, మనసు అన్నీ ఆయన చేతనే ఆ ప్రత్యగాత్మ చేతనే ప్రకాశింపచేయబడతాయి.

**భక్ష్యస్థం యత్తు మాధుర్యం కేవలం సైవ శర్కరా ।**
**అవశిష్టం తు యద్ద్రవ్యం తత్ పిష్టం న తు శర్కరా ॥ 46**

ఒక మానవుడు లడ్డూ తింటున్నాడు. లడ్డూ అనేది శనగపిండి, పంచదారలతో తయారు చెయ్యబడుతుంది. దాన్ని తినేటప్పుడు నోటికి తియ్యగా ఉంటుంది. అయితే అందులో ఉన్న తీపిదనాన్ని, శనగపిండిని వేరు చేసి చూపలేడు. అయినప్పటికీ అందులో ఉన్న తీపి పదార్థమే చక్కెర, మిగిలినదంతా పిండి అని తన విచక్షణా జ్ఞానంతో తెలుసుకుంటాడు. అలా తెలుసుకునేదే ప్రత్యగాత్మ.

**తద్వదత్ర తు యద్భానం శుద్ధం న ప్రత్యగిష్యతే ।**

**యత్తు భాస్యం స బుద్ధ్యంశో న త్వాత్మాయం స్వయంప్రభః ॥ 47**

ఇలా తెలుసుకోవటం వల్ల పెద్దగా ఏ ఉపయోగము ఉండదు. కాని వివేకంతో ప్రత్యగాత్మను బుద్ధి లేదా మనసు నుంచి వేరు చేయవచ్చు. ఆత్మయొక్క అసలు రూపము జ్ఞానము. ఆ జ్ఞానంతోనే మనసు లేదా బుద్ధి అనేది పని చేస్తోంది. దాని కారణం చేతనే కలలోని విషయాలను మానవుడు గ్రహించగలుగుతున్నాడు. ఈ రకంగా కలలోని విషయాలను గ్రహిస్తూ, ఇంద్రియాలతో పని లేకుండా కేవలము బుద్ధి లేదా మనసు మాత్రమే ఆత్మకు ఉపాధిగా ఉన్నదనే విషయం చాలా తేలికగా తెలుసుకోవచ్చు.

ఈ రకంగా స్వప్నావస్థలో పరబ్రహ్మను, దానికి ఉపాధి అయిన బుద్ధిని విడదీయవచ్చు అని చెప్పి, ఈ విషయం మీద ఇంకా స్పష్టత కోసం తరువాత శ్లోకంలో సుషుప్తిని చెబుతున్నారు.

**ఉపాధివిరమే సుప్తౌ బోధమాత్రావశేషతః ।**

**స్వయమానందరూపేణ ప్రత్యగేష ప్రకాశతే ॥ 48**

ఉపాధి అయిన బుద్ధికి, అందులో ఉండే విషయగ్రహణానికి (స్ఫురణశక్తి) ఏ మాత్రము సంబంధంలేదనే విషయం ఖచ్చితంగా తెలుస్తోంది. స్వప్నావస్థలో బుద్ధి లేదా మనసుకు ఆత్మకు తేడా ఉన్నది. అని తెలుసుకున్నాం. కాని విషయాన్ని ఇంకా బాగా తెలుసుకోవాలంటే సుషుప్తిని చూడాలి.

అంతఃకరణలో చిత్తాహంకారాలను వదలి, మనోబుద్ధులతో జీవుడు హృదయ స్థానానికి వచ్చినప్పుడు, దాన్ని **'సుషుప్తి'** అంటారు. ఇంద్రియాలన్నీ అవిద్యలో కలిసిపోవటమే సుషుప్తి. ఇంద్రియాలన్నీ పని చెయ్యకుండా విశ్రాంతి తీసుకున్నప్పుడు నిద్రపోతున్నాడు అంటారు. అదే సుషుప్తి. ఇంద్రియ వ్యాపారము నశించిన స్థితే సుషుప్తి. దీన్నే మాయ, అజ్ఞానము అంటారు. ఇక్కడ బయట ప్రపంచం ఏ మాత్రం తెలియదు. 'నేను హాయిగా నిద్ర పోయాను' అంటాడు. ఇలా చెప్పటంలో మూడు విషయాలు తెలుస్తున్నాయి. 1.అజ్ఞానము 2.అహంభావము 3.సుఖము. ఈ మూడు కలిసినదే సుషుప్తి. అదే నిర్వికార స్వరూప స్థితి. దీన్ని **'సంప్రసాదావస్థ'** అని కూడా

అంటారు. మనసు, బుద్ధికూడా హృదయంలో లీనమయ్యే స్థితి. ఈ స్థితిలో ఇంద్రియాలు, బుద్ధి ముఖ్యప్రాణంలో కలిసిపోతాయి. ఇలా మనసు, బుద్ధి కూడా లయమయినప్పటికీ, మెలకువ రాగానే తాను సుఖంగా నిద్ర పోయాను అంటాడు. ఈ విషయం అతడికి తెలుస్తోంది. అంటే జ్ఞానం మాత్రం ఉంది. ఈ స్థితిలో జీవుడు వ్యష్టిగా ప్రాజ్ఞుడు సనుమిష్టిగా ఈశ్వరుడు. నిద్రలో ఏ రకమైన కలలు, కోరికలు లేని స్థితి. అదే సుషుప్తి. నిద్రలోంచి లేచిన తరువాత 'హాయిగా నిద్ర పోయాను. నాకు వళ్ళు తెలియలేదు.' అంటాడు. దీన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే 'అతడికి విషయ భావము తెలుసును' అనే విషయం మనకు తెలుస్తోంది. ఇప్పుడు అతడిలో ఆత్మకు ఉపాధి అయిన బుద్ధి, మనసు లేవు. కాని ఆత్మ మాత్రం ఉంది. లేకపోతే నేను ఇలా ఉన్నాను అనే విషయం అతడికి తెలియదు. ఈ జ్ఞానం అతడికి ఉండదు. దీనివల్ల పరమాత్మ జ్ఞానరూపుడని, సుషుప్తికి సాక్షియై ఉన్నాడని, ఆయనకు ఉపాధి ఏదీ లేదని తెలుస్తోంది. మనసుగాని, బుద్ధిగాని జాగ్రదావస్థలోనే పని చేస్తాయి. అంతేకాని గాఢనిద్రలో పని చెయ్యవు. ఈ స్థితిలో ఇంద్రియాలు ఉన్నప్పటికీ లేని వాటితో సమానమే. అవి ఏ మాత్రం పని చెయ్యవు. ఈ విధంగా ఉపాధి లేకుండా జ్ఞానానంద రూపంతో ఆత్మ సుషుప్తిలో ప్రకాశిస్తుంది. సుషుప్తిలో పొందే సుఖము ఆత్మకు స్వతహాగా ఉన్న ఆనందమే కాని వేరు కాదు. ఈ స్థితిలో విషయాలు లేవు. కాబట్టి స్వస్వరూపానందంతోను, జ్ఞానంతోను కలిసి ఆత్మ జ్ఞానానంద రూపమై, ఉపాధిశూన్యమై సుషుప్తిలో ప్రకాశిస్తుంది. కాబట్టి ఆత్మకు, ఉపాధికి సంబంధం ఏమీ లేదు అనే విషయం మనకు కచ్చితంగా తెలుస్తోంది.

**సుషుప్తి సాక్షిణం శుద్ధం చిదేకరస మవ్యయం ।**
**తం నిర్విశేషమాత్మనం సో హమిత్యేవనిశ్చను ॥ 49**

కాబట్టి ప్రత్యగాత్మ **'సర్వోపాధివినిర్ముక్తుడు'** అంటే ఏ రకమైన ఉపాధి లేనివాడు అని తెలుసుకోవాలి. ఈ విధంగా ప్రత్యగాత్మ జ్ఞానమాత్రరూపుడు అంటే జ్ఞానమే రూపముగా కలవాడు. సుషుప్తి అవస్థకు సాక్షి. సర్వానికీ ద్రష్ట. అన్నింటినీ చూస్తున్నాడు. దేనితోను సంబంధం లేనివాడు. భూత భవిష్య ద్వర్తమానాలు తెలిసిన వాడు. నిత్యుడు, ఏ గుణము లేనివాడు నిర్విశేషుడు. గుణము, రూపము, పని వంటివి విశేషణాలు అనబడతాయి. అటువంటి విశేషణాలు ఏవీ లేకపోవటం

చేత ‘ఇతడు ఇలాంటి వాడు’ అని నిర్ణయించటానికి, చెప్పటానికి వీలుకాని వాడే ప్రత్యగాత్మ. అతడే స్వస్వరూపము. ఆ ప్రత్యగాత్మయే నేను అని భావించుకుని దేహాభిమానం పూర్తిగా వదిలెయ్యాలి. శరీరాన్ని జీవమున్న శవంగా చూడాలి.

**శరీరమేవ స్వాత్మానం పశ్యతీతి పశుర్మతః ।**

**తద్ధర్శీ చేత్పండితో సి తస్యాపృస్య కిమంతరం ॥ 50**

పశువు అనేది జంతువాచకము. మనిషిని ఎవరూ పశువు అనరు. ఆవులు, గేదెలు, మేకలు మొదలైన వాటినే ‘పశువులు’ అంటారు. పశ్యతీతి పశుః – దేహమే ఆత్మ అని భావిస్తుంది కాబట్టి జంతువును పశువు అంటారు. జంతువుకు విచక్షణా జ్ఞానం లేదు. మంచి చెడులను విచారించలేదు. ఇది పశువు లక్షణం. ఈ లక్షణాలున్న మానవుడు కూడా పశుసమానుడే. మనిషికి విచక్షణా జ్ఞానం ఉంది. అయినప్పటికి జంతువు లాగానే ప్రవర్తిస్తున్నాడు. మానవుడికి రెండు కాళ్ళు, జంతువుకు నాలుగు కాళ్ళు. అంతే తేడా. అలాంటప్పుడు జ్ఞాన హీనుడైనవాణ్ణి, దేహమేఆత్మ అని భావించేవాణ్ణి మనిషి అనటంలో ఔచిత్యం లేదు కదా ! ఇక్కడ మనిషికి వివేకం ఉన్నది అనటం కేవలము నామమాత్రమే. అది ఏ మాత్రం కార్యరూపందాల్చదు. పని చేసేటప్పుడు జ్ఞానహీనుడైన మానవుడు, జంతువు రెండూఒకటే. జంతువుకు వివేకం లేదు. అజ్ఞానికి అది పనిచెయ్యదు. అందుకే వివేకం లేనివాడు, జ్ఞానం లేనివాడు ‘ద్విపాద పశువు’ రెండు కాళ్ళ జంతువు అన్నారు. **ఎవరైతే ప్రత్యగాత్మని స్వస్వరూపంగా తెలుసుకోలేక, దేహమే ఆత్మ అని భావిస్తాడో, అతడు పశుప్రాయుడు.**

**స్తోత్రస్యాపి చ నిందాయాః పాత్రం మలమయం వపుః ।**

**తయోర్న విషయస్స్వాత్మా నిర్వికారో నిరాకృతిః ॥ 51**

ఎవరైనా స్తుతించాలి అన్నా, నిందించాలి అన్నా దానికి విషయ రూపమైనది ఈ శరీరమే. ప్రత్యగాత్మ ఆధిక్యత, న్యూనత లేనివాడు. స్వరూపము, గుణము లేనివాడు. కాబట్టి నిందాస్తుతులకు అతీతుడు.

స్తోత్రము చెయ్యటానికి, నిందించటానికి విషయమైనది ఈ దేహమే. ఈ శరీరం చూడటానికి అందంగా ఉన్నది అనుకోండి. అతడు మంచి అందగాడు అంటారు. రూపసి అంటారు. నవమన్మథుడు అంటారు. అతడిలో మంచిగుణాలు మనకి

నచ్చిన గుణాలు ఉంటే మంచి గుణవంతుడు. నీతివంతుడు, ధర్మశీలి అంటారు. ఒకవేళ అవి లేవనుకోండి. అతడు అందంగా లేకపోతే కురూపి అంటారు. అతనిలో మంచి గుణాలు లేకపోతే దుర్మార్గుడు, దుష్టుడు, నీచుడు అంటారు. ఈ రకంగా అతణ్ణి స్తుతించటానికి, నిందించటానికి అతని రూపము, గుణాలే కారణము. అంటే, నిందాస్తుతులు శరీరానికే కాని ఆత్మకు కాదు. ఆత్మని స్తుతించటానికి, నిందించటానికి వీలులేదు. అజ్ఞాని దేహమే ఆత్మ అని భావన చేస్తున్నాడు. ఈ దేహాన్ని స్తుతి చేస్తే 'నన్నే స్తుతిస్తున్నారు' అనుకుంటున్నాడు. అతని మనసు సంతోషిస్తే 'నేను సంతోషిస్తున్నాను' అనుకుంటున్నాడు. ఒకవేళ దేహాన్ని నిందిస్తే 'నన్నే నిందిస్తున్నారు' అని బాధ పడుతున్నాడు. దుఃఖిస్తున్నాడు. కోపగిస్తున్నాడు. ఇదంతా దేహమే ఆత్మ అని భావన చెయ్యటం వల్ల జరుగుతోంది. అందుకే అతడు అజ్ఞాని. నిజానికి ఆత్మకు నిందాస్తుతులు గాని, మానావమానాలు, ఆవేశకావేశాలు, అహంకార మమకారాలు, సుఖదుఃఖాలు ఏవీ ఉండవు.

**మాంసాస్థిమజ్జామలమూత్రపాత్రే గాత్రే సమాత్మత్వమతిం జహీహి ।**
**విలక్షణం స్వం విమలం ప్రశాంతం చిన్మాత్రమానందఘనం విదిత్వా ॥ 52**

ఆత్మని అన్నింటికన్న వేరైనది, పరిశుద్ధమైనది, ఏ రకమైన సంక్షోభములు లేనిది, జ్ఞానరూపమైనది, ఆనంద రూపమైనదిగా తెలుసుకుని 'దేహమే ఆత్మ' అనే భావాన్ని వదలివెయ్యాలి.

పాంచభౌతికమైనది ఈ శరీరము. అంటే ఈ శరీరము పృథివి, ఆపః, తేజస్సు, వాయువు, ఆకాశములు అనే పంచభూతములచేతనే ఏర్పడింది. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు, పంచతన్మాత్రలు. ఇవి పంచభూతాల సూక్ష్మరూపాలు. కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము అనేవి జ్ఞానేంద్రియాలు. వీటి లక్షణాలే పంచతన్మాత్రలు.

**పంచీకృత మహాభూత సంభవం కర్మ సంచితం**
**శరీరం సుఖదుఃఖానాం భోగాయతనముచ్యతే ॥**

పంచీకరణ చేయబడిన పంచభూతాల వల్ల ఏర్పడి, ఆగామి, సంచిత, ప్రారబ్దములు కలిగిన శరీరమే సుఖదుఃఖాలకు ఉనికి పట్టు.

**త్వక్ మాంసరుధిరస్నాయు । మేధామజ్జాస్థి సంకులమ్ ।**

**పూర్ణం మూత్రపురీషాభ్యాం । స్థూలం నింద్యమిదం వపుః ॥**

చర్మము, రక్తము, మాంసము, నరాలు, మేధ, మజ్జ, ఎముకలు, మలమూత్రాలతో కూడి ఉంటుంది ఈ దేహము. ఇది చాలా అసహ్యకరమైనది. జుగుప్సాకరమైనది. పూర్వకర్మల ననుసరించి పంచభూతాల కలయిక చేత ఈ దేహము ఏర్పడింది. జీవి భోగాలు అనుభవించటానికి ఈ దేహమే ఆధారము.

ఆత్మకి ఉపాధి ఉండదు. ఆత్మ నిర్వికారి. ఆత్మ కర్మలు చేయదు. కాబట్టి దానికి కర్మఫలం ఉండదు. అన్నిటికీ సాక్షీభూతుడు. ఈ దేహము మనోవికారాలు పొందుతుంది. దానివల్ల సుఖదుఃఖాలు భావోద్రేకాలు కలుగుతాయి. ఆత్మకు ఇవేవీ ఉండవు. ఆత్మ పరమశాంతస్వరూపము. దేహము జ్ఞానశూన్యము. ఆత్మ జ్ఞానఖని దేహము దుఃఖరూపము. ఆత్మ ఆనందరూపము. ఈ విషయాలు పూర్తిగా తెలుసుకుని **'దేహమే ఆత్మ'** అనే భావాన్ని వదిలెయ్యాలి.

**యదేకస్మిన్న నేకత్వ కల్పనాకారణం పరే ।**

**తదజ్ఞానం విజానీహి కారణం వపురాత్మనః ॥** **53**

ఒకే రూపం కలిగిన పరబ్రహ్మ అనేక రూపాలు గలవాడు అని భావించటం కేవలము అజ్ఞానము. ఈ అజ్ఞానం చేతనే మానవుడు 'దేహమే ఆత్మ' అని భావిస్తున్నాడు.

దేహము యొక్క లక్షణాలు వేరు. ఆత్మయొక్క లక్షణాలు వేరు. నిజంగా చెప్పాలి అంటే ఆత్మకు ఏ రకమైన లక్షణాలు లేవు. దేహానికి అన్ని లక్షణాలు ఉన్నాయి. అయినప్పటికీ దేహమేఆత్మ అని భావించటానికి కారణం కేవలము అజ్ఞానము. ఈ అజ్ఞానము మొదటగా దేహాన్ని ఆశ్రయించి ఆత్మకు భేదము కలిగిస్తుంది. దానివల్ల మానవుడు మొదటగా భేదదృష్టికి వశుడై, ఉపాధి నుండి ఆత్మను వేరుచేయలేక, ఈ దేహమే ఆత్మ అని భావిస్తాడు. దేహాన్ని అభిమానించటం మొదలు పెడతాడు. ఈ కారణం చేతనే ఏకాకిగా ఉన్న పరమేశ్వరుణ్ణి అనేకులుగా, దేహం కన్న వేరైన వాణ్ణి దేహమాత్రునిగా భావిస్తాడు. లోక వ్యవహారంలో గనక చూస్తే **'సాధకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా'** భక్తుల కోరికల ననుసరించి ఒకడుగా ఉన్న

పరమేశ్వరుడికి అనేక రూపాలు ఆపాదించటం జరిగింది. ధనం కావాలంటే లక్ష్మీదేవి రూపాన్ని ఆపాదించారు. చదువు కోసం సరస్వతీ దేవి రూపాన్ని, మేధస్సుకోసం దక్షిణామూర్తి రూపాన్ని ఇలా పరమేశ్వరుడికి అనేక రూపాలు కల్పించబడ్డాయి. ఇదంతా లౌకికము. ఆకాశంలో ఉన్నది ఒకడే సూర్యుడు. పది కుండలలో నీరు పోసి ఉన్నది అనుకోండి. ఆ పది కుండలలోను సూర్యబింబం కనిపిస్తుంది. అంతమాత్రం చేత పదిమంది సూర్యులున్నారని కాదు. ఉన్నది ఒకడే సూర్యుడు. పది ఖాళీ కుండలు పెట్టారు. వాటినిండా గాలి ఉంది. ఈ పది కుండలలోని గాలి వేరు కాదు. ఆ గాలి అంతా ఒకటే. అలాగే సర్వవ్యాపకుడయిన పరమాత్మ అన్ని దేహముల యందు వ్యాపించి ఉన్నాడు. ఈ దేహములో ఉన్న ఆత్మ, ఆ దేహములోని ఆత్మ వేరు కాదు. అన్ని దేహాలలోని ఆత్మ ఒకటే. ఈ విషయం తెలుసుకోవాలి. కాని అజ్ఞానంతో మానవుడు ఈ విషయం తెలుసుకోలేక పోతున్నాడు.

## 4. ఆత్మ దేనికీ కర్తా కాదు భోక్తా కాదు

సృష్టి ప్రారంభంలో 84 లక్షల జీవరాసిని సృష్టించిన తరువాత మానవుడిని సృష్టించిన పరమేశ్వరుడు, ఈ దేహంలో నేను లేకపోతే ఎలాగ? అని భావించినవాడై, బ్రహ్మరంధ్రం ద్వారా మానవ శరీరంలో ప్రవేశించి, ఇంద్రియాలతో చేసే కర్మలన్నింటికీ తానే కర్త, భోక్త అని భావించి, కర్మఫలాలు అనుభవిస్తూ, పంజరంలో బంధించబడిన పక్షిలాగా ఈ దేహంలో బందీ అయిపోయాడు. దేహం నుంచి బయటకు వెళ్ళే మార్గం మరిచిపోయాడు. అలా దేహంలో బందీ అయిపోయి, ఇంద్రియాలు చేసే పనులన్నింటికీ తానే కర్తను అని భావిస్తూ, వాటి ఫలితాలు కూడా తానే అనుభవిస్తున్నాను. అనుభవించాలి. అని భావన చేస్తున్నాడు. ఈ భావన అజ్ఞానంతో వస్తోంది. నిజానికి ఇంద్రియాలు చేసే పనులకు ఆత్మపురుషుడు కర్తా కాదు, భోక్తా కాదు. ఇంద్రియాలు దేహానికి సంబంధించినవి. ఈ దేహంతో చేసిన కర్మలు దేహానికే వర్తిస్తాయి కాని ఆత్మకు కాదు. **ముండకోపనిషత్తు**లో చెప్పినట్లుగా సంసారమనే వృక్షంమీద ఒకే రూపము, వర్ణము, నామము గల రెండు పక్షులు కూర్చుని ఉన్నాయి. అందులో ఒకటి దొరికిన కాయలు, పండ్లు తింటున్నది. రెండవది ఏమీ తినకుండా దిక్కులు చూస్తూ కూర్చుంది. కాయలు, పండ్లు తింటున్నది జీవాత్మ. ఈ కాయలు పండ్లు కర్మఫలాలు. దిక్కులు చూస్తున్నది

పరమాత్మ. పరమాత్మ ఏ రకమైన కర్మలు చెయ్యదు కాబట్టి దానికి కర్మఫలాలు ఉండవు. అందుచేతనే ఏమీ తినకుండా దిక్కులు చూస్తూ కూర్చుంది. అయితే జీవాత్మ, పరమాత్మలు వేరు వేరా? అంటే అదేమీ కాదు. రెండూ ఒకటే. కాని అజ్ఞానంవల్ల జీవాత్మ పరమాత్మ వేరు వేరు అనుకుంటున్నాము. అజ్ఞానం వదలిపోతే ఆ రెండూ ఒకటే అనే విషయం తెలుస్తుంది. అప్పుడు అక్కడ మిగిలేది పరమాత్మ ఒక్కటే.

జరిగే పనులన్నీ ఈ దేహంతోనే జరుగుతాయి. అంతే గాని వీటిని ఆత్మ చెయ్యదు. కన్ను చూస్తుంది. చెవి వింటుంది. నోరు మాట్లాడుతుంది. నిత్యజీవితంలో జరిగే పనులన్నీ ఇంద్రియాలే చేస్తాయి. ఇంద్రియాలు అంటే దేహమే. దేహం లేకుండా ఇంద్రియాలుండవు. కాబట్టి కర్మలన్నీ దేహమే చేస్తోంది. అంతేకాని ఆత్మ చెయ్యటం లేదు. అయితే ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. ఇంద్రియాలు స్వయంగా ఏ పనీ చెయ్యలేవు. ఇంద్రియాలను చైతన్యాన్నిచ్చేది ఆత్మ. కంటికి చూసే శక్తినిచ్చేది ఆత్మ. చెవికి వినికిడి శక్తినిచ్చేది ఆత్మ. కాబట్టి పరోక్షంగా కర్మలన్నీ ఆత్మచేతనే చెయ్యబడుతున్నాయి కదా? దీనికి సమాధానం చూడండి. ఆత్మ ఇంద్రియాలలో ప్రవేశించి ఉండటమనేది కేవలము ఇంద్రియాలకు సంపూర్ణమైన శక్తినివ్వటానికే. ఆత్మ ఇంద్రియాలలో ప్రవేశించి, వాటి పనులు అవి చేసుకునే సామర్థ్యాన్ని ఇంద్రియాలకు ఇస్తోంది. అంతేకాని ఇంద్రియాలు చేసే పనులకు, ఆత్మ పురుషుడికీ ఏ సంబంధము లేదు. ఆత్మ స్వయంగా ఏ పని చెయ్యదు.

కర్మలు చేసేది ఆత్మకాదు. ఆత్మకన్న ఇతరమైన దేహము కర్మలు చేస్తుంది. అయినప్పటికీ అజ్ఞానంవల్ల, జీవుడు ఈ పనులన్నీ నేనే చేశాను అని భావిస్తున్నాడు. దీనివల్ల భవబంధాలు పెరుగుతున్నాయి. ఆ బంధాలలో చిక్కుకుపోయి, బయటకు రాలేక శ్లేష్మంలో పడ్డ ఈగల్లాగా కొట్టుమిట్టాడుతున్నాడు.

అనాత్మ అయిన దేహము చేసే అన్ని పనులు ఆత్మే చేస్తున్నది అని భావించే వారు పెద్ద అజ్ఞానులు. 'ఆత్మయే అన్నింటికీ కర్త' అని భావించేవాడికన్న అజ్ఞాని ఈ జగత్తులోనే ఉండడు. తాను చేసే కర్మలన్నింటికీ కర్త ఆత్మయే అని భావించి, ఆ కర్మల వల్ల కలిగే పాపపుణ్యాలు, సుఖదుఃఖాలు తనవిగా భావించే వాడు పెద్ద అజ్ఞాని. ఆత్మ ఏ కర్మా చెయ్యదు. దేనికీ కర్తగాని, భోక్తగాని అంతకన్నా కాదు.

**అనేన వపుషా చ్ఛన్నః ప్రత్యగాత్మా స్వయంప్రభః ।**
**అసంసార్యపి సంసారి వదేవా భాత్యవిక్రియః ॥** **54**

శరీరము చేత ఆవరింపబడిన వాడైన పరమాత్మ, వికారాలు లేకపోయినా వికారాలు ఉన్నట్లుగా, సంసారం లేకపోయినా సంసారం ఉన్నట్లుగా అనిపిస్తున్నాడు.

పరమాత్మ దేహము చేత ఆవరింపబడినాడు. అంటే దేహమే ఉపాధిగా గలవాడు. దేహము అంటే ఇంద్రియాల సమూహము. దేహాన్ని ఉపాధిగా గలిగి ఉన్నాడు అంటే ఇంద్రియాలతో కూడిన దేహము చేత ఆవరించబడినాడు అని అర్థం. దేహానికి వికారాలున్నాయి. పరమాత్మ నిర్వికారుడు అయినప్పటికీ, దేహంతో ఆవరించబడ్డాడు కాబట్టి దేహానికిఉన్న వికారాలన్నీ ఆత్మకు ఆపాదించబడుతున్నాయి. మానవుడికి మనసు కూడా ఒక ఇంద్రియమే. ఇంద్రియాలతోను, మనసుతోను చేసే పనులన్నింటికీ **'ఆత్మేకర్త'** అని భావించ బడుతున్నాడు. చేసిన కర్మ ఫలాన్ని అనుభవించేటప్పుడు దానివల్ల వచ్చే సుఖదుఃఖాలన్నీ ఆత్మయే అనుభవిస్తోంది అని భావిస్తున్నాడు. ఆత్మస్వయంప్రకాశి అయినప్పటికీ ఇతరులచేత ప్రకాశింపబడుతున్నట్లుగా భావించబడుతున్నది. అజ్ఞానమువల్ల దేహమేఆత్మగా భావించబడుతున్నది. దీనివల్ల దేహానికి సంబంధించిన అన్ని ధర్మాలు ఆత్మయందు ఆరోపించబడుతున్నాయి. కాబట్టి ఆత్మ స్వయంప్రకాశి, నిర్వికారుడు అయినప్పటికీ, సంసారంతో సంబంధం లేనివాడయి నప్పటికీ సంసారిగా భావించబడుతున్నాడు. ఇదంతా అజ్ఞానం వల్లనే జరుగుతోంది.

**కార్యకారణ సంఘాత కార్యం కర్మన చాత్మనః ।**
**తదజ్ఞాత్వా విమూఢాత్మా కర్తాహమితి మన్యతే ॥** **55**

లోకంలో జరిగే పనులన్నీ కార్య కారణ సంఘాతాలు. ఈ విషయం తెలుసుకోలేక మానవుడు వాటన్నింటికీ 'తానే కర్తని' అనుకుంటున్నాడు.

'కార్యకారణ సంఘాతములు' అంటే ఒకదాని వల్ల పుట్టిన ఇంకొకటి. సంఘాతము అంటే సమూహము. దేహము, అవిద్య వల్లనే లోకంలో పనులన్నీ జరుగుతున్నాయి.

జరిగే పనులన్నీ మంచి గాని, చెడుగాని అన్ని పనులు దేహంతోనే జరుగుతాయి. అంతేగాని వీటిని ఆత్మ చెయ్యదు. చూడటము – ఇది చేసేది కన్ను. వినటము – ఇది చేసేది చెవి. మాట్లాడటము – చేసేది నోరు. రుచి చూడటము – చేసేది నాలుక. ఇలా నిత్య జీవితంలో జరిగే పనులన్నింటినీ ఇంద్రియాలే చేస్తాయి. ఇంద్రియాలు అంటే దేహమే. దేహం లేకుండా ఇంద్రియాలు ఉండవు. కాబట్టి ఈ పనులన్నీ దేహమే చేస్తోంది. అంతేకాని ఆత్మ చెయ్యటం లేదు. సంకల్పం చెయ్యటం, ఆలోచించటం, నిశ్చయం చెయ్యటం వంటి పనులను అంతఃకరణ చేస్తుంది. నడవటం, పరుగెత్తటం వంటి పనులు చేసేది కాళ్ళు. ఇవ్వటం, పుచ్చుకోవటం చేసేది చేతులు. వీటిలో ఏ పనీ ఆత్మ చెయ్యదు. ఆత్మ అన్నింటి యందు వ్యాపించి ఉంటుందనేది నిజమే. ఇంద్రియాలలో కూడా ఆత్మ వ్యాపించి ఉంటుంది. కాని ఇంద్రియాలు చేసే పనులకు ఆ కర్త ఆత్మకాదు. సూర్యుని ప్రకాశము జనులందరి కనుల యందు వ్యాపించి ఉంటుంది. అంతమాత్రం చేత కనులు చూసే విషయాలకు కర్త సూర్యప్రకాశము కాదు. ఆత్మ ఇంద్రియాలలో వ్యాపించి ఉండటము అనేది కేవలము ఇంద్రియాలకు సంపూర్ణమైన శక్తిని ఇవ్వటానికే. కాబట్టి ఆత్మ ఇంద్రియాలలో ప్రవేశించి, వాటి పనులు అవి చేసుకునే సామర్థ్యాన్ని ఇంద్రియాలకు ఇస్తున్నది. అంతేకాని ఇంద్రియాలు చేసే పనులు ఆత్మపురుషుడు చెయ్యదు. ఆ పనులకు ఆత్మకు ఏ సంబంధము లేదు. ఆత్మస్వయంగా ఏ పని చెయ్యదు. ఈ విషయం తెలుసుకోలేక అజ్ఞాని అనినంటికీ 'నేను కర్తని' అనుకుంటున్నాడు.

**అన్యనిష్పాదితే కర్మ ణ్యయం మూఢమతిర్జనః ।**
**కర్తృత్వాభినివేశేన సంసారాబ్ధౌ నిమజ్జతి ॥ 56**

అజ్ఞాని అయిన పురుషుడు ఈ దేహముచే చేయబడిన పనులన్నింటికీ నేనే కర్తను అని భావించి, సంసారమనే సముద్రంలో ఇంకా ఇంకా మునిగిపోతున్నాడు.

కర్మలను ఆచరించేది ఆత్మకాదు. ఆత్మకన్న ఇతరమైన దేహాదులు. అయినప్పటికీ మానవుడు కేవలము అజ్ఞానంతో ఈ పనులన్నీ నేనే చేశాను అని భావిస్తున్నాడు. ఇలా భావన చెయ్యటం వల్ల భవబంధాలు పెరుగుతున్నాయి. దీంతో ఆ బంధాలలో చిక్కుకుపోయి కుడితి తొట్టిలో పడ్డ ఎలుకలాగా అందులో నుంచి బయటకు రాలేక కొట్టుమిట్టాడుతున్నాడు. బంధాలతో ఉక్కిరి బిక్కిరి అయి నిరర్ధకముగా దుఃఖిస్తున్నాడు.

ఆత్మ ఇంద్రియాలన్నింటితోను పనులు చేయిస్తుంది. అంతేకాని తాను స్వయంగా ఏమీ చెయ్యదు అని తెలుసుకోలేకపోతున్నాడు. ఈ రకమైన భ్రాంతియే అన్ని అనర్థాలకు కారణమవుతున్నది.

**యోవానాత్మకృతం కర్మ పశ్యత్యాత్మన్యవిక్రియే ।**

**స ఏవాజ్ఞతమో లోకే నగోపో నాపిబాలకః ॥ 57**

ఆత్మ కానటువంటి దేహాదులచేత చేయబడిన ఈ పనులను నిర్వికారమైన ఆత్మయే చేస్తున్నది అని భావించేవాడు లోకంలో ప్రసిద్ధి చెందిన అజ్ఞాని. వెర్రిగొల్లడు కాని, ఏమీ తెలియని పిల్లవాడు కాని అతనికన్న అజ్ఞానులు కారు.

ఇక్కడ చాలా జాగ్రత్తగా చూడండి. అనాత్మ అయిన దేహము చేసే అన్ని పనులను ఆత్మే చేస్తున్నది అని భావించేవారు లోకంలో అజ్ఞానులు. వీరికన్న అజ్ఞానులు ఇంక లేరు అంటున్నారు భగవత్పాదులవారు. దీనికి చిన్న ఉదాహరణ చెబుతూ **'స ఏవ అజ్ఞాతమో లోకే నగోపో నాపిబాలకః'** అంటున్నారు అంటే దేహం చేసే అన్ని పనులకు ఆత్మయే కారణము అని తలచే అజ్ఞానుల కన్న **నగోపో**–వెర్రిగొల్లడు, **నాపిబాలకః** – ఏమీ తెలియని వెర్రివెంగళప్ప కూడా అజ్ఞానులు కారు. సామాన్య భావన ఏమంటే లోకంలో పశువులను కాచుకునే గొల్లవారికి లోకజ్ఞానం పెద్దగా ఉండదు. తెల్లనివన్నీ పాలు నల్లనివన్నీ నీళ్ళు అనుకుంటారు. వారికి మాయామర్మాలు ఏమీ తెలియవు. వీరు పూర్తిగా అజ్ఞానులు. అలాగే ఏమీ తెలియని పిల్లవాడు చింత చిగురుపుల్లగా ఉంటుంది అని కూడా తెలియనివాడు. ఇతడు కూడా మాయామర్మములు, లోకరీతులు తెలియని అజ్ఞాని. ఇటువంటి వారు కూడా ఆత్మయే అన్ని పనులకు కర్త అని భావించే వాడికన్న అజ్ఞానులు కారు. ఖచ్చితంగా చెప్పాలి అంటే **ఆత్మయే 'అన్నింటికీ కర్త' అని భావించేవాడికన్న అజ్ఞాని ఈ ప్రపంచంలో ఇంకొకడు లేడు.**

**దేహేంద్రియప్రాణమనోఽహమాదిభి స్త్వనాత్మకై రాత్మని కల్పితైః కృతం।**

**అవిక్రియేత్వాత్మని శుద్ధబోధే త్వారోప్య యః శోచతి మూఢ ఏషః ॥ 58**

ఆత్మకన్న భిన్నమైనవి, ఆత్మ కానటువంటి దేహము జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము మొదలగు వానిచేత

చేయబడిన కర్మలన్నీ నిర్వికారుడైన ఆత్మపురుషుని యందు ఆరోపించి దుఃఖించే వాడే అజ్ఞాని.

ఈ శ్లోకంలో అజ్ఞాని అంటే నిర్వచనం ఇస్తున్నారు. దేహము, ఇంద్రియాలు, అంతఃకరణ చతుష్టయము అన్నీ జడములు ఇవన్నీ ఆత్మ పదార్థంకాదు. అజ్ఞానంతో ఆత్మయందే కల్పించబడినవి. అంటే అజ్ఞానంతో ఆత్మని తెలుసుకోలేక ఆత్మ అంటే దేహము అని భావన చేస్తున్నారు. మాయామయమైన ఈ ప్రపంచంలో ఆత్మ ఒక్కటే సత్యము నిత్యము శాశ్వతమైనది. దేహము ఇంద్రియాలు అన్నీ భ్రాంతిచేత సృష్టించబడినాయి. అన్ని కర్మలకు దేహము, ఇంద్రియాలే కారణము. అవే కర్త. దేహానికి ఆత్మకు భేదమున్నది అని భావిస్తే, అన్ని కర్మలకు దేహాదులే కర్త. ఒకవేళ ఈ రెండింటికీ భేదము లేదు అనుకుంటే అసలు కార్యములు లేవు కర్తా లేదు అంతా మిథ్య. కాబట్టి ఏ రకంగా ఆలోచించినా దేహానికి ఆత్మకి భేదమున్నదని భావించిన వాడికి 'అన్నింటికీ ఆత్మే కర్త' అని చెప్పటానికి వీలులేదు. ఈ కారణాన్ని పూర్తిగా విచారిస్తే, దేహాదులు చేసిన కర్మలను ఆత్మయందు ఆరోపించి, అంటే **అన్నింటికీ ఆత్మేకర్త అని భావించి, ఆ కర్మలవల్ల కలిగే పాపపుణ్యాలు, సుఖదుఃఖాలు తనవిగా భావించేవాడు పెద్ద అజ్ఞాని.** అతడి కన్న అజ్ఞాని ఇంక లేదు.

## 5. మనస్సు

మననం చేసేది మనస్సు. అంతఃకరణ చతుష్టయములో ఇది ఒకటి. మనస్సు రెండు రకాలు అని చెబుతోంది కృష్ణయజుర్వేదానికి సంబంధించిన **అమృతబిందూపనిషత్తు.**

**మనోహి ద్వివిధం ప్రోక్తం శుద్ధం చా శుద్ధమేవచ ।**

**అశుద్ధం కామసంకల్పం శుద్ధం కామవివర్జితమ్ ॥**

మనస్సు శుద్ధము అశుద్ధము అని రెండు రకాలు. కామసంకల్పాలు గలది అశుద్ధము. కామసంకల్పాలు లేనిది శుద్ధము.

**మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః ।**

**బంధయా విషయాసక్తం ముక్తైనిర్విషయగ్ం స్మృతమ్ ॥**

మానవుల బంధ మోక్షాలకు కారణం మనస్సు. విషయాసక్తి గల మనసు బంధాలవైపుకు, విషయాసక్తి లేని మనస్సు మోక్షం వైపుకు నడుస్తుంది.

**యతో నిర్విషయస్యాస్య మనసో ముక్తి రేవచ ।**

**అతోనిర్విషయం నిత్యం మనః కార్యం ముముక్షుణా ॥**

ఏ కారణం చేత విషయాసక్తము కాని మనసుకు మోక్షం చెప్పబడిందో, ఆ కారణం చేతనే ముముక్షువు యొక్క మనస్సుకు విషయ రాహిత్యం చెప్పాలి.

చరాచర జగత్తును సృష్టించేది మనస్సే. లయం చేసేది మనస్సే. సృష్టి అనేది రెండు రకాలుగా జరుగుతుంది. 1.వ్యష్టి సృష్టి 2.సమిష్టి సృష్టి

**1.వ్యష్టి సృష్టి :** ఇది గారడీవాడు చేసేది. గారడీవాడు సృష్టించిన వస్తువులు అతనికి కాక ఇంకా ఒకరిద్దరికే కనిపిస్తాయి.

**2.సమిష్టి సృష్టి :** ఇది బ్రహ్మదేవుడు చేసిన సృష్టి. ఇందులోని వస్తువులు, జీవులు అందరికీ ఒకేలాగా కనిపిస్తాయి. బ్రహ్మదేవుడు కూడా తన మనస్సుతోనే సృష్టి చేశాడు అని గుర్తించాలి. అయితే అతడిది సమిష్టి మనస్సు.

సంసారానికి కారణం మనస్సు. ఈ మనస్సు వల్లనే రాగద్వేషాలు, అహంకార మమకారాలు కలుగుతున్నాయి. **మమ** అనుకుంటే బంధం. **నమమ** అనుకుంటే మోక్షం. నా భార్య, నా పిల్లలు, నా మిత్రులు, నా శత్రువులు అనుకోవటం వల్లనే ఈ బంధాలు ఏర్పడుతున్నాయి. అదే సంసారం. ఈ బంధాలను మానవుడు కావాలని తగిలించుకుంటున్నాడు. నేను లేకపోతే నా భార్య బ్రతకలేదు. నేను ఇంటికి వెళ్ళకపోతే మా కుక్కపిల్ల కూడా బిస్కట్లు తినదు. ఇవన్నీ బంగారు సంకెళ్ళు. కావాలని కోరి మరీ తగిలించుకునేవి. చూడటానికి చాలా అందంగా కనిపిస్తాయి. మనస్సు లేనివాడికి బంధాలుండవు. పిచ్చివాడికి సంసార బంధాలుండవు. పసిపిల్లవాడికి కూడా ఈ బంధాలుండవు. వారిద్దరికీ మనసు, ఆలోచించే శక్తి ఉండదు. అలాగే ముముక్షువుకు కూడా బంధనాలు ఉండవు. సన్యాసం స్వీకరించిన వాడు అన్ని రకాల బంధనాలను వదిలేస్తాడు. అవధూత భోజనం కూడా చేయడదు. పిచ్చివాడిలాగా అడవుల వెంబడి పడి సత్యాన్వేషణలో తిరుగుతుంటాడు. కాబట్టి **మోక్షం కావాలంటే విషయ వాంఛలను పరిత్యజించాలి.** కామసంకల్పాలు లేని మనస్సు శుద్ధమవుతుంది.

**నిరస్త విషయాసంగం సంనిరుద్ధం మనోహృది ।**

**యదాయత్యాత్మనో భావం తధా తత్పరం పదం ॥**

విషయముల యందు ఆసక్తిని వదలిన వెంటనే హృదయంలో మనస్సు నిరోధించబడి, ఆత్మరూపము పొందుతున్నది.

**తావదేవ నిరోద్ధవ్యం యావద్ధృదిగతం క్షయమ్ ।**

**ఏతద్ జ్ఞానం చ ధ్యానం చ శేషోన్యాయశ్చ విస్తరః ॥**

హృదయంలో సంకల్పాలు నాశనమయ్యేదాకా మనసును నిరోధించాలి. ఇదే జ్ఞానము. ఇదే ధ్యానము. మిగిలినవన్నీ అనవసరమే.

సంకల్పాలు నాశనం చెయ్యటం, మనసులో విషయ వాసనలు నాశనం చెయ్యటం మనసును తన వశంలో ఉంచుకోవటం. మనసును జయించటము. "మనసును తన వశంలో ఉంచుకోగలిగిన వాడి ఇంద్రియాలు సమర్ధుడైన సారధి చేతిలోని అశ్వాలు లాగా అధీనంలో ఉంటాయి." అంటోంది **కఠోపనిషత్తు.** కాబట్టి ముముక్షువైన వాడు తన మనస్సును తన వశంలో పెట్టుకోవాలి. మనస్సును జయించాలి.

**స్వప్నేయథా నిర్విషయేపి సంసృతిం సూతే మనః స్వస్థితవాసనాబలాత్ ।**

**తథైవజాగ్రత్యపి పూరుషస్య సర్వం మనః కల్పయతే స్వశక్త్యా ॥ 59**

స్వప్నావస్థలో ఏ విషయాలు లేనప్పటికీ, జాగ్రదావస్థలోని విషయాలను మనసు ఏ రకంగా ఊహించుకుంటున్నదో, అలాగే ఆ మనస్సే జాగ్రదావస్థలో తనయొక్క జన్మాంతర సంస్కారము వలన ఈ సంస్కారాన్ని కల్పిస్తున్నది.

సంసారము అనేది శూన్యమైనది. కేవలము మనోవిచార రూపమైనది. లోకంలో ఈ బంధాలన్నీ ఉన్నాయి అని మనం భావిస్తున్నాం. కాబట్టి అవి ఉన్నాయి. ఈవిడ నా భార్య. వీరు నా పిల్లలు అని భావన చేస్తున్నాం. వారి యందు ప్రేమ, అనురాగము ప్రదర్శిస్తున్నాం. ఇవే బంధాలు. వీరు నా వారు అనుకుంటున్నాం కాబట్టే వారి యందు ప్రేమానురాగాలు పెంచుకుంటునానం. 'వీరు నా వారు కాదు. వీరికి నాకు ఏ సంబంధము లేదు' అనుకుంటే వారిపట్ల బంధాలు బాధ్యతలు ఉండవు. 'మమ' అనుకుంటే బంధం. 'నమమ' అనుకుంటే మోక్షం. ఇదంతా మనసుకు

సంబంధించినది. దీంట్లో సత్యము అనేది ఏదీలేదు. ఉన్నది అంటే ఉంది. లేదు అంటే లేదు. లోకంలోని బంధాలన్నీ అంతే. మనసుకు సంబంధించినవే. కల్పితాలు.

స్వప్నావస్థని చూడండి. ఇది అందరికీ తెలిసిందే. ఇందులో విషయాలు ఏవీ లేవు. అయినప్పటికీ ప్రతివాడు కలలు కంటూనే ఉంటాడు. అందులో అనేకానేక అనుభవాలు. ఒకసారి రాజకుమారుడౌతాడు. వీరుడౌతాడు. యుద్ధాలు చేస్తాడు. అందమైన రాకుమార్తెను వివాహం చేసుకుంటాడు. ఒకసారి ఎప్పుడూ చూడని ఏవో దూరప్రదేశాలకు వెడతాడు. ఒకసారి సుఖాలు అనుభవిస్తాడు. ఒకసారి దుఃఖాలు అనుభవిస్తాడు. ఏడుస్తాడు. ఇదంతా కల. కలలో సంసారం ఎలా వచ్చింది? ఎక్కడ నుంచి వచ్చింది? స్వప్నావస్థలోని ఈ విషయాలన్నింటినీ మనస్సే కల్పిస్తున్నది. ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. మనసుకు ఈ విషయాలు ఎలా తెలుసు? వాటిని ఎలా కల్పిస్తున్నది? జాగ్రదావస్థలోని జరిగిన విషయాలు, గత జన్మలలో జరిగిన విషయాలు మనసులో దాగి ఉంటాయి. స్వప్నావస్థలో అవి బయటకు వస్తాయి. ఇక్కడ మళ్ళీ అనుమానం వస్తుంది. జాగ్రదావస్థలోని విషయాలు మనసులో దాగి ఉంటాయి అన్నారు బాగుంది. కాని గతజన్మలలోని విషయాలు కూడా మనసులో దాగి ఉంటాయా? మానవుడు చేసిన కర్మల ఫలితాన్ని **'అపూర్వము'** అంటారు. ఇది సూక్ష్మరూపంలో మనసులోనే దాగి ఉంటుంది. సమయం వచ్చినప్పుడు బయటకు వస్తుంది. దాన్నే **'అదృష్టము'** అంటారు. అలాగే గతజన్మలలో చేసిన ముఖ్యమైన పనులు, వాటి అనుభవాలు కూడా మనసులో దాగి ఉంటాయి. మానవుడికి కలలో కనిపించే విషయాలలో కొన్ని గతజన్మలకు సంబంధించినవే.

స్వప్నంలో ఏ విషయమూ లేకపోయినప్పటికీ వాసనాబలము వల్ల అన్ని విషయాలను కల్పిస్తున్నట్లుగానే, జన్మాంతర సంస్కార బలం వల్ల జాగ్రదావస్థలో సంసారాన్ని కల్పిస్తున్నది. ఇదే సంసార స్వరూపము. అంటే గతజన్మలలో చేసిన కర్మలవల్లనే ఈ సంసారము ఏర్పడుతుంది. ఈ సంసారమంతా మనం కల్పించుకున్నదే అంతేకాని నిజం కాదు. కలలోని విషయాలన్నీ అప్పటికి అవి వాస్తవంలాగానే అనిపిస్తాయి. కాని అవి వాస్తవం కాదు. అలాగే ఈ సంసారం కూడా. లోకంలోని జనులందరూ లేని సంసారాన్ని నెత్తిన వేసుకుని దుఃఖిస్తున్నారు

తప్ప ఇంకేమీ కాదు. ఆత్మకు సుఖదుఃఖాలతో ఏ రకమైన సంబంధము లేదు. సంసారమంతా కేవలము కల్పితము.

**మన ఏవాఖిలం విశ్వం సృజత్యత్రతు నో విధిః ।**

**స్వప్నవన్న హి స్వప్నార్థో బ్రహ్మణా సృష్ట ఈక్ష్యతే ॥ 60**

స్వప్నంలో విషయాలను సృష్టించినట్లే మనస్సు ఈ ప్రపంచాన్ని కూడా సృష్టిస్తున్నది. సృష్టి చెయ్యటానికి ప్రత్యేకంగా బ్రహ్మదేవుడు లేడు. కలలోని విషయాలను బ్రహ్మదేవుడు సృష్టించటం లేదు కదా !

స్వప్నం ఎలా కల్పితమో అలాగే జాగ్రదావస్థలోని సంసారము కూడా కల్పితమే అంటున్నారు. ఇది యథార్థము. ఈ ప్రపంచాన్ని సృష్టించటానికి ప్రత్యేకంగా బ్రహ్మదేవుడు లేడు. మానవుడి మనస్సే సృష్టికర్త. స్వప్నంలోని విషయాలన్నీ మనస్సే సృష్టిస్తున్నది కదా ? అలాగే ఈ ప్రపంచానికి కూడా సృష్టికర్త మనస్సే. ఈ రకంగా ప్రపంచం అంతా కల్పనామాత్రము. కల్పించబడినది. కాబట్టి ఈ ప్రపంచం అంతా అసత్యము. ఎప్పుడైతే మానవుడు జ్ఞానసముపార్జన చేస్తాడో, అప్పుడు ఈ జగత్తంతా మిథ్య అని తెలుస్తుంది. దృశ్యమానమైన జగత్తు నశిస్తుంది. అలాకాక ఈ ప్రపంచము సత్యమే అయితే జ్ఞానసముపార్జన జరిగినా అది నాశనం కాదు. లోకంలో వినాశనము రెండు రకాలు. 1.యథార్థమైన వస్తువులు పగలగొట్టి ముక్కలు చెయ్యటం. 2.భ్రాంతి సిద్ధమైన వస్తువులు జ్ఞానముతో నశింప చెయ్యటము. ఈ రెండింటిలోను జ్ఞానసముపార్జనతో నశించే వస్తువులు అసత్యమైనవి. భ్రాంతి వలన కలిగినవి. **'జ్ఞానాదేవతుకైవల్యం'** జ్ఞానం వల్ల భ్రాంతి తొలగిపోతుంది. దానివల్ల సత్యం తెలుస్తుంది. తత్త్వం బోధపడి మోక్షం సిద్ధిస్తుంది.

**రూపం నామ చ జాతిం చ కల్పయిత్వా స్వశక్తితః ।**

**బ్రహ్మజ్ఞమపి వా చిత్తం సంసారయతి పూరుషమ్ ॥ 61**

మనస్సు నామరూపాత్మకమైన జగత్తును సృష్టిస్తున్నది. క్రిమికీటకాలు, పశువులు, పక్షులు, మృగాలు, మానవులు అని అనేక రకాలయిన జీవరాశిని సృష్టిస్తున్నది. తనయొక్క రచనాశక్తితో సంసారాన్ని ఏర్పాటుచేసి బ్రహ్మవేత్తను కూడా అందులో ముంచేస్తోంది.

**'మనయేన మనుష్యాణాం కారణం బంధమోక్షయోః'** బంధ మోక్షాలకు కారణం ఈ మనస్సే. మనస్సు చాలా శక్తివంతమైనది. అడవులు, కోనలు, కొండలు, ఎడారులు, నదులు, సముద్రాలతో కూడిన ఈ ప్రపంచాన్ని, అందులోని రకరకాల జీవరాశిని సృష్టిస్తున్నది మనస్సే. పరబ్రహ్మలో లేని నామరూపాలను ఈ మనస్సు సృష్టిస్తున్నది. ఇలా సృష్టించి బ్రహ్మవేత్త అయిన వాడిని కూడా సంసారమనే ఊబిలో దింపి ముంచేస్తోంది. చిన్న ఉదాహరణ చూడండి. విశ్వామిత్రుడు గంగానదీ ప్రాంతంలో పదివేల సంవత్సరాలు తపస్సు చేశాడు. ఒకరోజు తెల్లవారే సరికి ఎదురుగా ఉన్న సెలఏరులో స్నానం చేస్తూ కనిపించింది మేనక. ఆవిడ అప్సరాంగన. ఈ విషయాలేవీ అతడికి తెలియవా? అప్పటికి అతడు మహర్షి. అయినా సరే మాయలో పడిపోయాడు. మేనక దగ్గర ఏదో ఉన్నది. అనుభవించాలి అనుకున్నాడు. ఆవిడ వెనకాల వెళ్ళిపోయాడు. ఇన్ని సంవత్సరాల తపోఫలం నిష్ఫలం అయి పోయింది. మానవ శరీరం రక్తమాంసాలు, ఎముకలు, నరాలు, మలమూత్రాలు, మజ్జలతో నిండి ఉంటుంది. వీటన్నింటి మీదా అందంగా చర్మం కప్పబడి ఉంటుంది. ఇంద్రియాలన్నీ గుంటలలో ఉంటాయి. కళ్ళు, ముక్కు, చెవులు ఇతర ఇంద్రియాలు అన్నీ గుంటలే. శరీరమంతా నిండి ఉండేది రక్తమాంసాలే అయినప్పటికీ శరీరంలోని ఒక్కో భాగాన్ని ఒక్కో రకంగా ఊహించుకుంటున్నాడు మానవుడు. అక్కడ ఏదో ఉన్నది. దాన్ని బావుకోవాలి అనుకుంటున్నాడు. తాపత్రయ పడుతున్నాడు. దీనికంతటికీ కారణం మనస్సు. సంసారము వాస్తవము అనే భ్రాంతి కలిగిస్తుంది. కాబట్టే "బంధమోక్షాలకు కారణం మనస్సే" అనే విషయంగ్రహించాలి.

**సంసారో మనసాపుంసః కల్పితో స్తిన వస్తుతః ।**
**మనఃశూన్యే సుషుప్త్యాదౌ సంసారో నైవ దృశ్యతే ॥ 62**

ఈ సంసార మంతా మనసు చేతనే కల్పించబడుతోంది. యథార్థంగా చూస్తే సంసారం లేదు. మనసులేని సుషుప్తి, మూర్ఛ వంటి అవస్థలలో ఈ సంసారము అనేది ఎక్కడా కనిపించదు.

సంసారము అంటే ఈ ప్రపంచం నామరూపాత్మకమైన ఈ జగత్తంతా మనస్సు చేతనే కల్పించబడుతున్నది అనటంలో ఏ మాత్రం అనుమానం లేదు. మనస్సు జాగ్రదావస్థలోను, స్వప్నావస్థలోను ఉన్నప్పుడే ఈ సంసారం ఉంటుంది. సుషుప్తి

లోను, మూర్ఛయందు సంసారముండదు. అందుకే ఈ సంసారము నిజం కాదు. ఒకవేళ అదే నిజమైతే స్వప్నావస్థలో లాగానే సుషుప్తిలో కూడా ఉండాలి. స్వప్నావస్థలో మనసు ఉంటోంది. అందుచే మనస్సు ఈ స్వప్న సంసారాన్ని కల్పిస్తోంది. సుషుప్తిలో మనస్సు కూడా లీనమై పోతుంది. మనస్సుకూడా పని చేయని స్థితి. కాబట్టే సంసారము ఉండదు. మనసు లేకపోతే సంసారం లేదు. లౌకికంలో కూడా మనసు లేని పిచ్చివాడికి సంసార బంధాలు ఉండవు. కాబట్టి **సంసారము మనస్సుచేతనే కల్పించబడుతోంది.**

**యత్ర యత్ర మనస్స్ఫూర్తి స్తత్ర తత్ర జగత్రయం ।**
**యత్ర యత్ర మనో నాస్తి తత్ర తత్ర న కిం చన ॥ 63**

ఎక్కడైతే మనస్సు ఉన్నదో అక్కడే ముల్లోకాలు ఉన్నాయి. ఎక్కడ మనస్సు లేదో అక్కడ ఏదీ లేదు.

పైన చెప్పినట్లుగా మనస్సు చేతనే సంసారము కల్పించబడుచున్నది. మనసు లేకపోతే సంసారం లేదు ఈ ప్రపంచం కూడా లేదు. ఈ విషయం తెలిసిన వాడికి ఎప్పటికీ దుఃఖమే ఉండదు. ఆత్మకు ప్రపంచానికి సంబంధం లేదు. అంతా బ్రహ్మమే. ఈ జగత్తు కూడా పరబ్రహ్మ యందే కల్పించబడింది అని తెలిసినవాడికి ఎప్పటికీ దుఃఖమనేది ఉండదు.

**అహో బ్రహ్మమయా దృష్టిః పీయూషాంబుదవత్సదా ।**
**ఆనందమేవ సర్వత్ర ప్రవర్షతి నిరంతరమ్ ॥ 64**

బ్రహ్మరూపమైన యధార్ధ దృష్టి అమృతాన్ని కురిపించే మేఘంలాగా ఎడతెరపి లేకుండా అన్ని చోట్లా ఆనందాన్నే వర్షిస్తున్నది.

పై చెప్పిన కారణాల వల్ల జగత్తు బ్రహ్మకన్న వేరైనది అనే భావన వదిలెయ్యాలి. సర్వము బ్రహ్మమయమే అని తెలుసుకోవాలి. ఇదే నిజమైన దృష్టి, ప్రాపంచిక విషయాలపైన ఇటువంటి దృష్టి కలిగితే, అంతా ఆనందమయంగానే తోస్తుంది. మట్టితో చేసిన కుండ, మూకుడు, బాన, చట్టి మొదలైన పాత్రలన్నింటికీ నామరూపాలే వేరు. అంతేకాని వాటిలో ఉండేది మట్టే. అలాగే ఈ జగత్తంతా పరమాత్మ కన్న

వేరు కాదు. ఈ విషయం తెలిసిన వాడికి అంటే 'సర్వము బ్రహ్మమే' అని తెలిసిన వాడికి భేదభ్రాంతి నశిస్తుంది. లౌకికంలో దుఃఖాన్ని కలిగించే ప్రతి వస్తువు కూడా ఆనందరూపంగానే కనిపిస్తుంది. పరబ్రహ్మ సర్వమయుడు అని భావన చేసినప్పుడు ఇది సుఖము, ఇది దుఃఖము అనే తేడాలు ఉండవు. కాబట్టి యధార్ధ జ్ఞానాన్ని స్థిరం చేసుకోవాలి. అప్పుడు లోకంలో అన్నీ ఆనందంగానే కనిపిస్తాయి.

**సర్వానర్థనిదానం మన ఏవ భవత్యముష్య పురుషస్య ।**

**తస్మనసో నిగ్రహణం కర్తవ్యం బంధముక్తయే పుంసా ॥ 65**

సమస్తమైన చెడులకు గాని, మంచికి గాని మనస్సే కారణము. బంధ మోక్షాలకు కారణం మనస్సే. కాబట్టి ముందు మనస్సును జయించాలి.

**అమృతబిందూపనిషత్తులో** చెప్పినట్లుగా

**మనోహిద్వివిధం ప్రోక్తం శుద్ధం చాశుద్ధమేవచ**

**అశుద్ధం కామసంకల్పం శుద్ధం కామవివర్జితమ్ ॥**

మనస్సు శుద్ధము అశుద్ధము అని రెండు రకాలుగా ఉంటుంది. ఇందులో కామసంకల్పము అంటే కోరికలు గలది అశుద్ధము. కోరికలు లేనిది శుద్ధము.

**మనయేవ మనుష్యానాం కారణం బంధ మోక్షయోః**

**బంధయా విషయాసక్తం ముక్త్యై నిర్విషయగ్ం స్మృతమ్ ॥**

మానవుల బంధ మోక్షాలకు కారణము మనస్సే అవుతున్నది. విషయాసక్తి గల మనస్సు బంధాల వైపు, విషయాసక్తి లేని మనసు మోక్షం వైపు పరుగు పెడుతుంది.

కాబట్టి మోక్షాపేక్ష గలవాడు ముందుగా మనసును నిగ్రహించాలి. అంటే మనసుకు వికారాలతో సంబంధం లేకుండా చెయ్యాలి. దీనివల్ల మనస్సు ప్రపంచాన్ని కల్పించదు. ఒకవేళ కల్పించినా దాని యందు భేదదృష్టిని కలిగించదు. దుఃఖ పడేట్లుగా చెయ్యదు.

**సంకల్పోఽపి వికల్పః కామఃక్రోధో భయం విషాదశ్చ ।**

**మనసో హ్యేతే ధర్మా నైవ ద్రష్టుశ్చిదాత్మనః కో పి ॥ 66**

ఒక విషయాన్ని అనుకోవటం, దానిమీద ఆలోచించటం, లేని దాన్ని ఉన్నట్లుగా భావన చెయ్యటం ఉన్నది లేదా అనుకోవటం, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు ఇవన్నీ మనస్సు యొక్క ధర్మాలు. ఆత్మకు ఇలాంటివి ఉండవు.

సహజంగా జరిగే విషయం. లోకంలో మానవుడు ఏదో ఒక పని చెయ్యాలి అనుకుంటాడు. దానిమీద అనుకూలంగాను, ప్రతికూలంగాను ఆలోచిస్తాడు. మసక చీకటిలో త్రాడును చూసి పాము అనుకుంటాడు. భయపడతాడు. రాబోయే ఆపదలు తలచుకుని దుఃఖిస్తాడు. ఒకరిని చూసి ఈర్ష్య పడతాడు. ఇష్టం లేని వారిని ద్వేషిస్తాడు. ఈ లోపాలన్నీ మనసుకు సంబంధించినవే. ఈ విషయం అందరికీ తెలుసు. దీన్ని బట్టి మనకు తెలిసేదేమిటి అంటే **'సంకల్పం చేసేది మనస్సు'**. సంకల్ప వికల్పాలకు ఆధారమైనది, మూలమైనది మనస్సు. ఇక్కడ గుర్తించాల్సిన విషయం ఏమంటే ఈ లక్షణాలు ఏవీ ఆత్మకు ఉండవు. ఆత్మసర్వానికీ సాక్షి. నేను వెడుతున్నాను. నేను చదువుతున్నాను. నేను చూస్తున్నాను. ఇవన్నీ వ్యవహారాలు. ఈ వ్యవహారాలకు సాక్షి ఆత్మ. అందుకే ఆత్మ సర్వసాక్షి అంటున్నారు. చరాచర జగత్తులో కనుపించేవి, కనుపించనివి, తెలిసినవి, తెలియనివి, జరిగినవి, జరుగుతున్నవి అన్నీ ఆత్మకు తెలుసు. అందుకే ఆత్మ అన్నింటికీ సాక్షి. సర్వసాక్షి. జాగ్రస్వప్న సుషుప్తులలో జరిగే వాటన్నింటికీ ఆత్మే సాక్షి. ఇక్కడ ఒక విషయం గుర్తించాలి. చూసేవాడికి చూడబడే వాడికి ఉండే వికారాలు ఉండవు. ఎలా అంటే మనం విపరీతమైన నొప్పితో డాక్టరు దగ్గరకు వెళ్ళాం. ఆయన పరీక్షిస్తున్నాడు. మనకు నొప్పి ఎక్కడ? ఎంత నొప్పి ఉన్నది? అనే విషయాలు తెలుసుకుంటున్నాడు. గుర్తించాల్సిన విషయం ఏమంటే మనకుండే బాధ డాక్టరుకు ఉండదు. కారణం బాధని అనుభవించేది మనం. కాబట్టి సాక్షి అయిన ఆత్మకు, సాక్ష్యమయిన మనసుకు సంబంధం లేదు. మనసు సంకల్ప వికల్పాలు చేస్తుంటుంది. సుఖదుఃఖాలు అనుభవిస్తుంటుంది. ఆత్మ కేవలము వీటిని చూస్తుంటుంది. అంతే. అందుచేత ఆత్మను మనసును వేరు చెయ్యాలి. యథార్థ తత్త్వాన్ని తెలుసుకోవాలి. అప్పుడు మనోవికారానికి నాకు ఏ సంబంధము లేదు అని తెలుస్తుంది. ఎప్పుడైతే మనసును ఆత్మను విడదీశావో అప్పుడు మనోవికారాలన్నీ తొలగిపోతాయి. ప్రత్యేకంగా మనసును నిగ్రహించవలసిన పనిలేదు. దీనికి కారణము నేను అంటే ఆత్మ అంతేకాని దేహము, మనస్సు కాదు.

**జ్ఞానక్రియాశక్తి మదంతరంగం విజ్ఞానసంజ్ఞం ప్రథమం వికారం ।**
**అనాదిసాంసారిక వాసనాఢ్యం గుణప్రసాదాస్పదమాత్మలింగమ్ ॥ 67**

ఏదైనా విషయాన్ని గురించి తెలుసుకునేది, బుద్ధి అనే పేరు గలది, ఈ జగస్సృష్టికి మొదటి పదార్థమైనది, అనాదియైన సంసార బంధనాలతో కూడినది, గుణత్రయము యొక్క శుద్ధతత్త్వానికి ఆధారమైనది, ఆత్మ స్వరూపాన్ని ప్రకటించేది బుద్ధి.

ఇక్కడ ఒక విషయం గమనించాలి. అంతఃకరణ చతుష్టయము అంటే మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము.

| | | |
|---|---|---|
| మననం చేసేది | – | మనస్సు |
| నిశ్చయం చేసేది | – | బుద్ధి |
| చింతించేది | – | చిత్తము |
| అహంకరించేది | – | అహంకారము |

అయితే కొంత మంది దృష్టిలో మనస్సు, బుద్ధి రెండూ ఒకటే. ఇక్కడ కూడా మనస్సు అన్నా, బుద్ధి అన్నా ఒకటిగానే చెబుతున్నారు. ఈ రెండింటికీ అవస్థా భేదమేకాని ఇంకేమీ తేడా లేదు అంటున్నారు. కాబట్టి పాఠకులు ఈ విషయాన్ని గమనించగలరు. అంతఃకరణ అనేది సృష్టి ఆదినుంచీ ఉన్నది. అసలు మొదటగా వచ్చింది ఈ అంతఃకరణయే. సృష్టి ప్రారంభంలో పరమేశ్వరుణ్ణుంచి ముందుగా అవ్యక్తము వచ్చింది. ఇదే సత్త్వగుణము. మాయ, దాని నుంచి మహతత్త్వము వచ్చింది. ఇది రజోగుణము. హిరణ్యగర్భుడు. ఆ తరువాత మహత్తత్త్వము నుంచి అహంకారము వచ్చింది. ఇది తమోగుణము. విరాడ్రూపము. ఈ అహంకారము నుంచే తన్మాత్రలు, పంచభూతాలు వచ్చినాయి. చరాచర జగత్తు అంతా ఏర్పడింది. కాబట్టి జగత్సృష్టిలో మొదటగా వచ్చింది అహంకారము. ఇది అంతఃకరణలో భాగము. అందుకే సృష్టిలో మొదటగా వచ్చింది అంతఃకరణ అంటున్నారు. దీనినుంచే పంచతన్మాత్రలు ఆవిర్భవించాయి. అందుచేతనే పరబ్రహ్మకు ఇది దగ్గరగా ఉంటుంది. ఈ అంతఃకరణకు వినటము, చూడటము, తెలుసుకోవటము, ఇంద్రియాలతో పనులు చేయించటము మొదలైన శక్తులన్నీ ఉన్నాయి. సంసారానికి సంబంధించిన సంస్కారాలన్నీ దీనిలోనే ఉన్నాయి. ఇది నిశ్చయ రూపమైన బుద్ధిగా ఉంటుంది

కాబట్టి శుద్ధ సత్త్వమయము. అన్ని గుణాలు దీనిలోనే ఉన్నాయి. ఆ గుణాలన్నీ సమపాళ్ళలో ఉంటాయి. అంటే సమానంగా ఉంటాయి. ఒకటి ఎక్కువ, ఇంకొకటి తక్కువ ఉండవు. అందుకే గునాలన్నీ నిర్మలంగా ఉంటాయి. అంతఃకరణ ఆత్మకు దగ్గరగా ఉంది కాబట్టి ఆత్మని గురించే ఇదే చెబుతుంది. పరబ్రహ్మను గురించి తెలుసుకోవాలనుకునే వారు మొదటగా దీన్ని గురించి తెలుసుకుంటే, బ్రహ్మము గురించి తెలియటం తేలిక. ఎవరిని గురించైనా తెలుసుకోవాలి అనుకున్నప్పుడు వారికి దూరంగా ఉన్న వారిని విచారించే కన్న దగ్గరగా ఉన్నవారిని విచారించటం ఉత్తమం. ఈ సూత్రాన్ని అనుసరించి ఆత్మను గురించి తెలుసుకోవాలంటే దానికి అతిదగ్గరగా ఉన్న అంతఃకరణను ఆశ్రయించాలి. అంటే బుద్ధిని ఆశ్రయించాలి.

**ఇదం చిదాత్మస్ఫురణానువృత్యా విస్ఫూర్తి మత్యంత ముపైతి సన్నిధౌ ।**

**చిదాత్మనస్తుల్యతయా విభాతి సూర్యస్య దీప్త్యా స్ఫటికో యథాతథా ॥68**

అంతఃకరణ జ్ఞానరూపుడైన ఆత్మయొక్క ప్రకాశము వలన సూర్యునికాంతి చేత ప్రకాశిస్తున్న స్ఫటికము లాగా ప్రకాశిస్తున్నది.

అంతఃకరణలో భాగమయిన బుద్ధి సృష్టి ప్రారంభంలోనే ఆవిర్భవించింది కాబట్టి ఆత్మకు చాలా దగ్గరగా ఉంటుంది. సూర్యుని కాంతివల్ల స్ఫటికము ఏ రకంగా ప్రకాశిస్తుందో, అలాగే బుద్ధికూడా ఆత్మయొక్క ప్రకాశముతోనే ప్రకాశిస్తోంది. ఆత్మపురుషుడు బుద్ధి యందు వ్యాపించి ఉన్నాడు. అందుచేత బుద్ధి ఆత్మతో సమానముగా ఇదే ఆత్మ అనుకునేట్లుగా ప్రకాశిస్తోంది. బుద్ధి నిర్మలమైనది కాబట్టి, ఆత్మకు అతిదగ్గరగా ఉన్నది కాబట్టి, ఆత్మలాగానే ప్రకాశిస్తున్నది కాబట్టి వివేకహీనులు బుద్ధినే ఆత్మ అనుకుంటారు.

**అయం మహానహంకారో వృత్తిమాన్ కర్తృలక్షణః ।**

**సర్వసంసారనిర్వోఢా విజ్ఞానమయ శబ్దభాక్ ॥ 69**

విజ్ఞానమయమైన ఈ బుద్ధియే మహత్త్వము, అహంకారము అనే వ్యాపారాలు గలది. కర్త అంటే చేసేవాడు అని వ్యవహరింపబడేది. సమస్తమైన సంసారాన్ని నిర్వహించేది కూడా ఈ బుద్ధే. ఈ బుద్ధినే విజ్ఞానమయ కోశము అంటారు. శరీరంలో పంచకోశాలున్నాయి కదా. అవి 1.అన్నమయ 2.ప్రాణమయ 3.మనోమయ

4.విజ్ఞానమయ 5.ఆనందమయ కోశాలు. వీటిలో నాల్గవది అయిన విజ్ఞానమయ కోశమే బుద్ధి. దీన్ని వ్యష్టిగా బుద్ధి అని సమిష్టిగా మహతత్త్వము అని అంటారు. దీన్నే మహదహంకారము అని కూడా అంటారు. ఇక్కడ విషయం ఏమంటే వ్యష్టి అయినా, సమిష్టి అయినా బుద్ధి రూపంలో మార్పు ఏమీ ఉండదు. కాబట్టి బుద్ధియే మహదహంకారము అనబడుతున్నది. అన్ని పనులు చేసేది ఈ బుద్ధే. కర్తగా పిలువబడేది కూడా ఈ బుద్ధే. జగత్తంతా నిర్వహించేది బుద్ధియే కాని వేరు కాదు. దీనిలో ఆత్మకు ఏ మాత్రము సంబంధం లేదు.

**అహం మమేత్యేష సదాభిమానం కరోతి దేహే చ తదీయధర్మే ।**

**జీవాభిధానః పురుషో యమేవ కర్తా చ భోక్తా చ సుఖీ చ దుఃఖి ॥ 70**

ఈ బుద్ధియే దేహంలోను, దేహసంబంధమైన విషయాలలోను నేను నాది అనుకుంటున్నవాడు, సుఖదుఃఖాలు అనుభవిస్తున్న జీవుడు అనే పేరు గల పురుషుడు.

ఈ బుద్ధి దేహమందుంటుంది. దేహానికి సంబంధించిన పొడవు, పొట్టి, లావు, సన్నము, నలుపు, తెలుపు, ఆత్మాభిమానము లందు ఉంటుంది. జీవుడు, ఆనందించే పురుషుడు అంతా బుద్ధియే. చేసేవాడు, అనుభవించేవాడు, సుఖించే వాడు, దుః ఖించేవాడు, అంతా బుద్ధియే. మానవుడు 'నేను ఈ పని చెయ్యాలనుకుంటున్నాను' అంటాడు. ఇక్కడ ఎవరు చెయ్యాలనుకుంటున్నారు? అనే ప్రశ్న వచ్చినప్పుడు బుద్ధికి, ఆత్మకి మధ్య ఉన్న తేడా తెలియకపోవటం చేత బుద్ధి, ఆత్మ రెండూ ఒకటే అనుకుంటున్నాడు.

**పుణ్యం చ పాపం చ కరోతి తత్ఫలం భుఙ్క్తే స్వయం నందతి ఖిద్యతే చ।**

**సత్వాదిధర్మ స్ఫురేణేన జాగ్ర త్స్వప్నాద్యవస్థా అయమేవ యాతి ॥ 71**

ఈ బుద్ధియే కర్మలు చేస్తుంది. వాటి ఫలితం అనుభవిస్తుంది. సంతోషము, సుఖము, దుఃఖము పొందుతుంది. త్రిగుణములతోను కలుస్తుంది. మూడు రకాలైన అవస్థలు పొందుతుంది.

బుద్ధియే జీవుడు అనే మాట మనం చెప్పుకున్నాం. ఈ జీవుడే పుణ్యపాప కర్మలు చేస్తాడు. వాటి ఫలితమైన పాపపుణ్యాలు, సుఖదుఃఖాలు అనుభవిస్తాడు. గుణత్రయమును పొందుతాడు. అందులో సత్త్వగుణం ఎక్కువైతే జాగ్రదావస్థ,

రజోగుణం ఎక్కువైతే స్వప్నావస్థ, తమోగుణం పెరిగితే సుషుప్తి అవస్థలు పొందుతాడు. వ్యవహారికంలో నేను మేల్కొన్నాను, నిద్ర పోయాను, దుఃఖము పొందుతున్నాను అనే విషయాలన్నిటికీ బుద్ధికి, ఆత్మకు తేడా తెలియకపోవటమే కారణము. నిజం చెప్పాలంటే బుద్ధితో ఆత్మకు ఏ రకమైన సంబంధము లేదు. ఆత్మసాక్షి. బుద్ధి సాక్ష్యము. ఈ రెండింటికీ సంబంధం ఎలా ఉంటుంది? ఈ విషయం తెలుసుకోలేకనే జనులు భ్రాంతిని పొందుతున్నారు.

**విజ్ఞానకోశోఽయమతీవ శుద్ధః సత్త్వప్రధానశ్చితిసన్నిధానాత్ ।**

**చైతన్యమేత్యాత్మవదేవ భాతి హ్యయో యథా వహ్నిరివాగ్నితప్తమ్ ॥72**

బుద్ధి చాలా నిర్మలమయినది. నిప్పులో కాల్చిన ఇనుము ఎలా అగ్నిలా ప్రకాశిస్తుందో, అలాగే నిర్మలమైన ఆత్మకు దగ్గరగా ఉన్న బుద్ధి కూడా నిర్మలంగానే ఉంటుంది. జ్ఞానరూపమైన ఆత్మకు దగ్గరగా ఉండటం వలన, బుద్ధి కూడా ప్రకాశిస్తూ, బుద్ధే ఆత్మ అనే అభిప్రాయం కలిగిస్తుంది.

బుద్ధి అనే ఉపాధి చాలా పరిశుద్ధమై ఆత్మను ఆవరించి ఉన్నది. కాబట్టి బుద్ధికి ఆత్మకు తేడా తెలియటం లేదు. నిప్పులో ఎర్రగా కాలిన ఇనుమును కూడా నిప్పు అనే అంటాము. ముట్టుకోకండి. అది కాలుతుంది అని చెబుతాము. అంటే ఆ ఇనుము కూడా నిప్పే. అలాగే నిప్పు యొక్క ధర్మాన్ని ఇనుములో ఆరోపించినట్లే, ఆత్మ యొక్క ధర్మాలను బుద్ధిలో ఆరోపిస్తున్నారు. బ్రహ్మానికి అతిదగ్గరగా ఉన్నది కాబట్టి బుద్ధే ఆత్మ అనిపిస్తోంది. అద్దాన్ని శుభ్రంగా తుడిచి సూర్యుని ఎదురుగా పెట్టాము అనుకోండి. సూర్యకిరణాలు అద్దంమీద పడి ప్రతిబింబిస్తాయి. అప్పుడు ఆ కాంతి అద్దానికి సహజమైనది అనుకుంటాము. సూర్యకాంతిలో వజ్రము విపరీతంగా మెరుస్తుంది. అప్పుడు ఆ కాంతి వజ్రానిది అనుకుంటాం. అలాగే ఆత్మయొక్క ప్రకాశంతో బుద్ధి ప్రకాశిస్తోంది. అజ్ఞాని ఆ ప్రకాశం బుద్ధిదే అనుకుంటున్నాడు.

**చిద్దీప్తోఽయమహంకారోఽప్యాపాదతలమస్తకం ।**

**దేహం వ్యాప్నోతితేనైష దేహో భవతి చేతనః ॥ 73**

జ్ఞానరూపుడయిన పరబ్రహ్మచే ప్రకాశింప చేయబడుతున్న అహంకారము కూడా శిరస్సు దగ్గర నుంచి శ్రీపాదందాకా వ్యాపించి ఉన్నది. ఈ కారణం చేతనే ఈ దేహం జ్ఞానం గలది అవుతున్నది.

బ్రహ్మముతో ప్రకాశింపబడుతున్న ఈ బుద్ధి 'నేను' అనే అహంకారంతో అరికాలు నుంచి నెత్తిదాకా శరీరమంతా వ్యాపించి ఉన్నది. దీన్న మహదహంకారము అంటారు. 'మహదహంకారము' అంటే సమిష్టి అహంకారము అయితే వ్యష్టి అహంకారానికి, సమిష్టి అహంకారానికి తేడాలేదు. చేతనమైన బుద్ధిచేత వ్యాపించబడింది కాబట్టి ఈ దేహము కూడా చేతనమవుతున్నది. చేతనము అని భావించబడుతున్నది. ఇక్కడ దేహానికి ఉన్న చైతన్యము కూడా ఆత్మ వల్ల వచ్చినదే కాని వేరు కాదు.

## 6. నేను అంటే దేహము కాదు

పరమేశ్వరుడు మానవదేహాన్ని సృష్టించిన తరువాత, ఈ దేహంలో నేను లేకపోతే ఎలాగ? అనుకున్నాడు. అనుకున్నదే తడవుగా బ్రహ్మరంధ్రం ద్వారా మానవ దేహంలో ప్రవేశించాడు. అలా ప్రవేశించి జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సుల ద్వారా లౌకిక సుఖాలన్నీ అనుభవిస్తూ ఈ దేహం చేసే ప్రతిపనికీ కర్త, భోక్త కూడా తానే అని భావించాడు. సుఖాలు అనుభవిస్తూ దేహంలోనే ఉండిపోయి వచ్చిన దారి కూడా మరిచిపోయి పంజరంలో బంధించబడిన పక్షిలాగా దేహంలో బందీ అయిపోయి, అజ్ఞానంతో దేహమేఆత్మ. ఆత్మేదేహము అని భావన చేశాడు. ఇదంతా అజ్ఞానం వల్ల జరిగింది.

**బృహదారణ్యకోపనిషత్తు**లో ఒక కథ ఉంది. ఒకసారి బ్రహ్మదేవుడు ఆత్మని గురించి ఒక ప్రకటన చేశాడు. "ఆత్మకు పాపం అంటదు. ముసలితనం రాదు. మృత్యువు దాన్ని కబళించదు. శోకం తాకదు. ఆకలి దప్పికలు ఉండవు. ఆత్మకోసం అన్వేషించినవాడు, ఆత్మను అనుభవించిన వాడు ఆత్మ స్వరూపం పొందుతాడు."

ఈ మాటలు విన్న దేవతలు, రాక్షసులు ఆత్మతత్వాన్ని తెలుసుకోవాలనుకున్నారు. దేవతల తరుఫున ఇంద్రుడు, రాక్షసుల తరఫున విరోచనుడు బ్రహ్మవిద్య నేర్చుకునేందుకు బ్రహ్మదేవుని దగ్గరకు వెళ్ళారు. అక్కడ బ్రహ్మ కోరిక మీద ఒక

సంవత్సరం దీక్షలో ఉన్నారు. తరువాత బ్రహ్మదేవుడు "మీ కనుపాపలలో కనుపించే పురుషుడే బ్రహ్మము. వెళ్ళి కొలనులో మీ ముఖాలు చూసుకోండి" అన్నాడు. వారు అలాగే చేసి బ్రహ్మ దగ్గరకు వచ్చి "స్వామి! నీటి కొలనులో గడ్డాలు మీసాలతో అసహ్యంగా ఉన్న మా ముఖాలే కనుపించాయి" అన్నారు. 'మీ ముఖాలు శుభ్రం చేసుకుని వెళ్ళి చూడండి' అన్నాడు బ్రహ్మ. అలాగే చేశారు వారు. ఇప్పుడు అందంగా అలంకరించబడిన వారి ముఖాలు కొలనులో కనుపించాయి. అదే పరబ్రహ్మ స్వరూపము అని తలచి తిరుగు ప్రయాణమయ్యారు వారిద్దరూ. విరోచనుడు రాక్షసుల దగ్గరకు వెళ్ళి 'దేహమే ఆత్మ' అని చెప్పాడు. కాని ఇంద్రుడికి మార్గమధ్యంలో అనుమానం వచ్చి, మళ్ళీ బ్రహ్మని సేవించి పరబ్రహ్మ తత్త్వాన్ని తెలుసుకున్నాడు.

నేను అంటే దేహం కాదు. నేను అంటే ఆత్మ. దేహం వేరు ఆత్మ వేరు. మానవుడు అజ్ఞానంతో ఈ విషయం తెలుసుకోలేకపోతున్నాడు.

**అత ఏవాత్మసాదృశ్యాత్ తేషామత్రాత్మతామతిః ।**
**అనాత్మ న్యయసఃపిండే వహ్నిబుద్ధిర్యథా తథా ॥ 74**

ఇప్పటివరకు చెప్పినట్లుగా పరిశుద్ధమైన బుద్ధిచే వ్యాపింపబడిన దేహము బ్రహ్మము యొక్క ప్రకాశం పొందుతున్నది. ఆత్మతో సమానమైన ప్రకాశము కలిగి ఉన్నది. అందుకే దేహమే ఆత్మ అనిపిస్తున్నది. ఎర్రగా కాలిన ఇనుపముద్ద నిప్పు అని ఎలా అనిపిస్తోందో, అలాగే బ్రహ్మముచే ప్రకాశింపబడు దేహము, బుద్ధి కూడా అజ్ఞాని బ్రహ్మమే అని భావిస్తున్నాడు.

ఇప్పటివరకు చెప్పిన వాటిని బట్టి చూస్తే బుద్ధి, దేహములు ఆత్మ కాకపోయినా అవి ఆత్మయే అనిపిస్తున్నాయి. దీనివల్ల అజ్ఞానులు ఆత్మకు, అనాత్మకు తేడా తెలుసుకోలేక దేహమే ఆత్మ, బుద్ధే ఆత్మ అనుకుంటున్నారు. దేహము, బుద్ధి యొక్క ధర్మాలనే ఆత్మయొక్క ధర్మాలు అనుకుంటున్నారు. ఎందుకు ఇలా జరుగుతున్నది అంటే నిప్పు ఎర్రగా ఉంటుంది. నిప్పులో బాగా కాలిన ఇనుము ఎర్రగానే ఉంటుంది. నిప్పు కాలిన ఇనుము ఒకటి కాదు. అయినప్పటికీ అజ్ఞాని ఆ రెండూ ఒకటే అనుకుంటున్నాడు. అలాగే **వివేకహీనుడు దేహము ఆత్మ రెండూ ఒకటే అనుకుంటున్నాడు.**

**అహంకారమహం జానే విముక్తిప్రతిబంధకం ।**

**ఇతి జానాత్యహంకార మాత్మాహంపదలక్షణమ్ ॥ 75**

'నేను' అనే పదం అహంకారానికి గుర్తు. లౌకికంలో నేను అంటే 'అహంకారము' అని తెలుసుకుంటున్నాడు.

అంతర్యామి అంటే ఆత్మ. ఈ ఆత్మ ప్రేరణ లేకుండా ఏదీ లేదు. ఏ పనీ జరగదు. బుద్ధి ఆత్మయొక్క ప్రకాశముతోనే ప్రకాశిస్తున్నదనే విషయం కొద్దిగా వివేకమున్న వారికి కూడా తెలుసు. అందుకే వారు బుద్ధిని వదిలేస్తారు. కాని అహంకారంలో ఉన్న ఆత్మబుద్ధిని మాత్రం వదల్లేరు. అహంకారం కూడా ఆత్మయొక్క ప్రకాశంతోనే ప్రకాశిస్తున్నది అనే విషయం తెలుసుకోలేరు. వారు వివేకశూన్యులు. బాగా ఆలోచించి, శోధించినట్లైతే అహంకారము, ఆత్మ వీటిని విడదీయటం కూడా కష్టం కాదు. ఇక్కడ విషయం ఏమంటే 'నేను, నాది' అనేవి అహంకార మమకారాలు. ఇవి నశిస్తేనే గాని మానవుడు మోక్షం పొందడు. వీటిలో అహంకారానిది ఉన్నతమైన స్థానము. సంసారానికంతటికీ బంధాలన్నింటికీ ఇదే మూలం. సామాన్యంగా 'అహం' అనే శబ్దాన్ని వాడుతుంటాం. దీనికర్థము 'అహంకారము'. అయితే ఆత్మ వేరు అహంకారము వేరు. ఈ అహంకారం నుంచే చరాచర జగత్తంతా ఆవిర్భవించింది అని చెప్పుకున్నాం. ఈ అహంకారము కూడా ఆత్మశక్తి వల్లనే ప్రకాశిస్తున్నది. అహంకారానికి కూడా ఆత్మయే సాక్షి.

**తతో జ్ఞాతా భవత్యాత్మా హం పదార్థో విలక్షణః ।**

**జ్ఞేయో భవత్యహంకారోఽన్యస్య విజ్ఞాతురాత్మనః ॥ 76**

పైన చెప్పిన విషయాల వల్ల 'నేను అహంకారాన్ని తెలుసుకుంటున్నాను' అనే వాక్యంలో 'నేను' అనే శబ్దానికి అర్థం ఆత్మ అని తెలుస్తోంది. తనకన్న ఇతరుడైన ఆత్మకు ఈ అహంకారము తెలియదగినది.

లోకానుభవాన్ని బట్టి చూసినట్లైతే 'అహంకారానికి కూడా సాక్షి ఉన్నాడు' అని తెలుస్తోంది. అంటే అహంకారము వేరు ఆత్మ వేరు. ఆత్మ అహంకారం కన్న వేరుగా ఉండి, అహంకారాన్ని చూస్తూ ఉంటుంది. నేను అంటే సరియైన అర్థం ఆత్మ. అందుకే 'నేను అహంకారాన్ని చూస్తున్నాను' అన్నప్పుడు నేను అంటే ఆత్మ

అహంకారాన్ని చూస్తోంది. అహంకారానికి సాక్షిగా ఉన్నది. అహంకారము తనకన్న వేరైన ఆత్మకు తెలుస్తుంది. కనుపిస్తుంది. దీన్ని బాగా తర్కించి చూసినట్లైతే బ్రహ్మపదార్ధమే కాని అహంకారం కాదు అని తెలుస్తుంది. అహంకారానికి ఆత్మకి సంబంధం లేదు. అహంకారము ఆత్మకాదు.

**జ్ఞేయో జ్ఞాతా న భవతి యుక్తీనాం శతకోటిభిః ।**

**యతస్తతోఽహం శబ్దార్థ ఆత్మై వేత్యవనీయతామ్ ॥ 77**

ఎన్ని రకాల యుక్తులు ప్రయోగించి చూసినప్పటికీ, ఎన్ని రకాలుగా ఆలోచించినప్పటికీ, జ్ఞాత, జ్ఞానము ఒకటి కాదు. జ్ఞాత అంటే తెలుసుకునేవాడు. జ్ఞానము అంటే – తెలియబడదగినది. ఈ రెండూ ఒకటి కాదు. అందుచే నేను అంటే – అహంకారము కాదు. నేను అంటే ఆత్మ.

వాస్తవ స్థితిలో గనక చూసినట్లైతే ఎన్ని విధాలుగా వాదించినా, తర్కించినా, ఆలోచించినా జ్ఞాత, జ్ఞానము ఒకటి కావు. ఇది అందరకు తెలిసిన విషయమే. దీనివల్ల 'నేను' అంటే – 'సర్వవ్యాపి అయిన ఆత్మ' అని అర్ధం. 'నేను అహంకారాన్ని తెలుసుకుంటున్నాను' అంటే ఇక్కడ నేను అనే శబ్దం బుద్ధికి, అహంకారానికి ప్రతీక కాదు. నేను అంటే ఆత్మపురుషుడు. నేను అంటే అహంకారమే అని భావిస్తున్నారు అంటే అదంతా భ్రాంతి. ఈ విషయాలన్నీ జాగ్రత్తగా ఆలోచిస్తే నేను అంటే అహంకారం కాదు ఆత్మ. దేహము అంటే ఆత్మ ఎలా కాదో, అలాగే అహంకారమన్నా ఆత్మ కాదు అని తెలుస్తుంది.

**అహంపదార్థోఽయమఖండబోధో జ్ఞాతాహమాదే రఖిలస్య వస్తునః ।**

**సుప్త్యాద్యవస్థా త్రితయస్యసాక్షీ చాకాశ వత్సర్వ గతశ్చ నిత్యః ॥ 78**

బాగా ఆలోచిస్తే నేను అనే పదానికి అర్ధం ఆత్మ. అన్ని కాలముల యందు, అన్ని దేశముల యందు, ఒకే రూపముగా ఉండే జ్ఞానమే అదే నేను. అదే ఆత్మ. సర్వసాక్షి అతడే. అన్ని పదార్ధాల ఉనికి తెలిసినవాడు. అన్ని విషయాలు తెలసిన వాడు. జాగ్రస్వప్న సుషుప్తులకు సాక్షీభూతుడు. ఆ అవస్థలలో జరిగే అన్ని విషయాలు తెలిసినవాడు. ఆకాశంలాగా సర్వత్రా వ్యాపించిన వాడు, శాశ్వతమైన వాడు అతడే పరబ్రహ్మ, ఆత్మ.

అహం అనే శబ్దానికి అర్థమయిన ఆత్మ శుద్ధ బుద్ధ ముక్త స్వరూపుడు. సర్వాంతర్యామి. నిత్యము, సత్యము, శాశ్వతము అయినవాడు. అన్ని ప్రదేశములందు, అన్ని ప్రాంతము లందు, అన్ని కాలములందు ఒకే రకంగా ఎల్లప్పుడూ ఉండేవాడు. లోకంలో జరిగే విషయాలన్నింటికీ సాక్షి. భూత భవిష్యద్వర్తమానాలు తెలిసినవాడు. ఒకే దేహంలో ఉన్న అవస్థలను ఎలా చూస్తాడో, అలాగే జగత్తులో ఉన్న జీవకోటి యొక్క అవస్థలు అన్నీ చూస్తుంటాడు. సర్వత్రా, సర్వపదార్థములందు వ్యాపించిన వాడు, కాని ఇక్కడ చిత్రం ఏమంటే గుణాలు, కాలాలు, విషయాలు అన్నీ అతనిలోనే ఉంటాయి కాని వాటితో అతనికి ఏ సంబంధము ఉండదు. అన్నింటికీ సాక్షిగా మాత్రమేఉంటాడు. జాగ్రత్తగా ఆలోచిస్తే ఈ జగత్తంతా భ్రాంతి రూపమే. ఆత్మకన్న వేరైన పదార్థం ఏదీలేదు. ఆత్మ ముమ్మాటికీ సర్వవ్యాపి. ఆ **ఛాందోగ్యోపనిషత్తు**లో ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు ఆత్మజ్ఞానాన్ని వివరిస్తూ ఈ ఆత్మ పురుషుడు ఆకాశంలో ఉంటాడు. ఆకాశం అతన్నెరగదు. ఆకాశమే అతని శరీరం. ఆకాశంలో ఉంటూనే, ఆకాశాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే – ఆత్మ. అని చెబుతాడు. కాబట్టి ఆత్మ పురుషుడు సర్వత్రా వ్యాపించి ఉన్నాడు. అన్నింటికీ పని చేసే శక్తినిస్తున్నాడు. జనులు ఈ విషయం తెలుసుకోలేక ఆత్మకన్న భిన్నంకాని ఈ ప్రపంచము ఆత్మకన్న వేరు కాదు అని తెలుసుకోలేక పోతున్నారు. ఆత్మకు ఏ విధమైన వికారాలతోను సంబంధం ఉండదు. అందుకే నాశనము లేనివాడు ఆత్మ అవినాశి అని తెలుసుకోవాలి.

**అయంసదాంతర్భహిరేకరూపశ్చై తన్యమాత్రో నిబిడో నిరంశః ।**

**అంతర్భహిస్సైంధవభిల్వ ఏకరసో యథా తద్వదయం చిదాత్మా ॥79**

జ్ఞానరూపుడైన ఆత్మ సర్వకాల సర్వావస్థల యందు అన్నింటికీ లోపలా బయటా ఒకే రూపంలో ఉండేవాడు, అన్నిచోట్లా నిబిడంగా ఉండేవాడు. ఏ రకమైన విభాగాలు లేనివాడు, ఉప్పురాయి ఎటుచూసినా ఉప్పునే కలిగి ఉన్నట్లుగా పూర్తిగా జ్ఞానముతో నిండినవాడు  పరబ్రహ్మ.

ఆత్మ కేవలము జ్ఞానస్వరూపుడు. జ్ఞానమంతా ఒకరాశిగా పోస్తే అదే పరబ్రహ్మ. ఈ జ్ఞానరాశిలో లోపలా బయటా, పైన, క్రింద, ప్రక్కన అంతా ఉండేది జ్ఞానము తప్ప ఇంకేమీ కాదు. సైంధవలవణము అంటే ఉప్పు. ఒక రకమైన రాతి ఉప్పు.

ఆయుర్వేదంలో దీన్ని వాడతారు. మా చిన్నతనంలో సముద్రపు ఉప్పుకన్న సైంధవ లవణం మంచిది అని దాన్నే వాడేవారు. ఇప్పుడు కూడా ఇది ఆయుర్వేద షాపులలో దొరుకుతుంది. ఇది స్వతహాగా గడ్డలుగా ఉంటుంది. కాని దీన్ని పొడి చేసి 50 గ్రా. ప్యాకెట్లుగా ఆయుర్వేద షాపుల్లో అమ్ముతారు. అయితే ఈ మధ్యన 'రాక్‌సాల్ట్' అనే పేరుతో పచారీ షాపుల్లో కూడా కిలో పాకెట్లు అమ్ముతున్నారు. ఇది కూడా సైంధవ లవణమే అంటున్నారు.

మొత్తం మీద చూస్తే సైంధవ లవణం గడ్డలుగా ఉంటుంది. ఆ ఉప్పు రాయిని ఎక్కడ పట్టుకున్నా ఉప్పగానే ఉంటుంది. పైన, క్రింద, ప్రక్కన అంతా ఉప్పే. దాన్ని పగలకొట్టినా లోపల ఉండేది ఉప్పే. అలాగే పరబ్రహ్మ జ్ఞానరూపుడు. ఎక్కడ చూసినా జ్ఞానమే కలవాడు. ఆయన సర్వవస్తువుల యందు పూర్తిగా వ్యాపించి ఉన్నవాడు. పరబ్రహ్మకు దేశ కాలమాన పరిచ్ఛేదములు లేవు. అంటే ఒక దేశంలో ఒకలాగా ఇంకొక దేశంలో ఇంకొకలాగా ఉండదు. అలాగే కాలాన్ని బట్టి ఇతనిలో మార్పు అనేది ఉండదు. ఒకచోట ఉండటం, ఇంకొక చోట లేకపోవటం ఉండదు. దేశకాలమాన పరిస్థితులన్నీ భ్రాంతితో కూడినవి. పరబ్రహ్మ శాశ్వతుడు. అందుకే అవి ఏవి ఆత్మకు అంటవు.

**శుద్ధాత్మని చిన్మాత్రే కూటస్థే ప్రత్యగాత్మని భ్రాంత్యా ।**
**కల్పితమిహ జీవత్వం సన్నిధిదోషాదహంకారస్య ॥ 80**

నిర్మలమైన రూపం గలది, జ్ఞానమాత్రమైనది, నిర్వికారమైనది, అయిన అహంకార శబ్దంలోని అహం శబ్దానికి అర్థంగా చెప్పబడే అహంకారము యొక్క సాన్నిధ్య దోషమువల్ల, అహంకారానికి ఆత్మకి తేడా తెలుసుకోలేక 'ఆత్మయే జీవుడు' అనుకుంటున్నారు. ఆత్మకు దేనితోను సంబంధము లేదు. అయినప్పటికీ ఆత్మను జీవశబ్దంతోనే వ్యవహరిస్తున్నారు. ఆత్మ పరిశుద్ధుడు, జ్ఞానరూపుడు. అందుకే దృశ్యమానమైన పదార్థాల వికారాలతో సంబంధం లేనివాడు. నిర్వికారుడు. అయినప్పటికీ జనులు అజ్ఞానంతో ఆయనకు జీవత్వాన్ని ఆరోపిస్తున్నారు. జీవుడికి, ఆత్మకి తేడా లేదు. రెండూ ఒకటే అనుకుంటున్నారు. దీనికంతటికీ కారణం అహంకారము ఆత్మకు దగ్గరగా ఉండటమే. సామాన్యజనుల దృష్టిలో అహం అంటే

అహంకారము. అహంకారము అంటే జ్ఞానప్రకాశ సహితమైన అహంకారమే జీవుడు. అందుకే అహంకారాని ఆత్మకి మధ్యగల తేడాను గ్రహించలేకపోతున్నారు. ఆత్మయే అహంకారము, అహంకారమే ఆత్మ అనుకుంటున్నారు. వాస్తవస్థితిలో జీవప్రత్యగాత్మలకు భేదం లేదు. ఈ జీవత్వము అజ్ఞానముచే కల్పించబడినది. కాబట్టి ఇది అసత్యము. కాని జనులు అజ్ఞానంతో ఆత్మ, అహంకారము ఒకటే అనుకుంటున్నారు.

**జపాకుసుమసాన్నిధ్యా ద్రక్తత్వంస్ఫటికే యథా ।**

**తథాహంకార సాన్నిధ్యా జ్జీవత్వం ప్రత్యగాత్మని ॥ 81**

దానిమ్మపువ్వు ఎర్రగా ఉంటుంది. దానికి దగ్గరగా ఉండటంచేత స్పటికమణి కూడా ఎర్రగానే కనిపిస్తుంది. అలాగే అహంకారము యొక్క సామీప్యముచేత ప్రత్యగాత్మ జీవశబ్దముతో వ్యవహరించబడుచున్నది.

వాస్తవంగా చూసినట్లైతే జీవవ్యవహారమే భ్రాంతి. అహంకారంలో ఆత్మ గనక ప్రతిఫలించినట్లైతే, ఆ ప్రకాశము శుద్ధాత్మకన్న వేరు కాదు. కాబట్టి జీవశబ్దముతో వ్యవహరించాలి అని చెప్పబడిన 'సోపాధిక ఆత్మ' ఉపాధి కలిగిన ఆత్మ అహంకారంతో కూడిన ఆత్మకూడా జీవుడు కాదు. జీవశబ్దంతో వ్యవహరించటానికి గాని, సుఖదుః ఖాలు అనుభవిస్తున్నాడు అని చెప్పటానికి గాని వీలులేదు. జపాకుసుమము అంటే దానిమ్మ పువ్వు. ఇది ఎర్రగా ఉంటుంది. స్పటికం తెల్లగా స్వచ్ఛంగా ఉంటుంది. దానిమ్మపువ్వు దగ్గర స్పటికాన్ని ఉంచినట్లైతే, స్పటికం కూడా ఎర్రగా కనిపిస్తుంది. ఆ ఎరుపుకు స్పటికానికి ఏ సంబంధము లేదు. కాని చూసినవారు స్పటికం ఎర్రగా ఉన్నది అనే అంటారు. ఇలా అనటం కేవలము భ్రాంతి. అలాగే ఆత్మ విషయంలో కూడా జీవవ్యవహారము భ్రాంతి సిద్ధమైనది. అహంకారము ఆత్మకు దగ్గరగా ఉండటం చేత అహంకారము యొక్క స్వభావము, ఆత్మస్వభావము విడివిడిగా తెలుసుకోలేక అహంకారానికున్న కర్తృత్వాది ధర్మాలు ఆత్మకు ఆరోపిస్తున్నారు. ఈ రెండింటి ధర్మాలు విడిగా తెలుసుకోలేక, అవన్నీ ఒకదాని ధర్మాలుగానే భావిస్తున్నారు. ఇదంతా అజ్ఞానము వల్లనే జరుగుతున్నది.

**యదన్యథా భావ హేతు రతథా భూతవస్తునః ।**

**తదజ్ఞానం తమోరూపం సంసారాది మకారణమ్ ॥ 82**

ఉన్నది ఉన్నట్లుగా గాక వేరే విధంగా అనుకోవటమే అజ్ఞానము. ఈ అజ్ఞానమే కర్తృత్వ భోక్తృత్వాది సంసారానికి హేతువై ఉన్నది.

ఇలా చూసినట్లైతే జీవత్వం కాని, దానితో సంబంధించిన సంసారం గాని అన్నీ అజ్ఞానంతో కల్పించబడినవే. వాటిలో ఆవగింజంతైనా నిజం లేదు. అసలు అజ్ఞానము అంటే ఏమిటి ఒక వస్తువు యొక్క లక్షణాలు ఇంకొక దానిలో ఆరోపించటం. ఒక వస్తువును చూసి ఇంకొకటిగా భ్రమించటం. మసక చీకటిలో ఒక త్రాడు పడి ఉన్నది. దాన్ని చూసి అది పాము అనుకున్నాడు. భయపడ్డాడు. అరిచాడు. అది నిజంగా పాము కాదు. దీనికి కారణము అది నిజంగా పాము కాదు అని తెలియకపోవటమే. అదే అజ్ఞానము. ఈ అజ్ఞానంతోనే ఆత్మ అంటే నేను. అహంకారము అనుకుంటున్నాడు. సంసారానికి మూలకారణం అజ్ఞానమే.

**అజ్ఞానదోషేణ తు యత్ర యత్ర ప్రకల్పితం తత్తుమృషైవ దృష్టం ।**

**రజ్వాదికే వస్తుని సర్పతాది యథా తథైవాత్మని జీవితా మృషా ॥ 83**

అజ్ఞానంవల్ల త్రాడును చూసి పాము అనుకున్నట్లుగానే అహంకారోపాధిని తెలుసుకోలేక పోవటం చేత కల్పించబడిన జీవత్వము కూడా అసత్యమైనదే.

లోకంలో అజ్ఞానం చేత కల్పించబడిన ప్రతిదీ అసత్యమే. త్రాడును చూసి పాము అనుకున్నాడు. అంటే కేవలము అజ్ఞానంతో త్రాడులో పామును ఊహించుకున్నాడు. ఈ ఊహ నిజము అని ఎవరూ అనరు. దీన్ని బట్టి చూస్తే ప్రత్యగాత్మలో జీవత్వము కూడా కల్పించబడిందే. అహంకారోపాధిని విడదీయలేక పోవటం చేత అహంకారమే ఆత్మ అనుకుంటున్నాడు. ఈ ఆత్మే జీవుడు అనికూడా అనుకుంటున్నాడు. ఇదంతా అసత్యమే. అజ్ఞానంతో కల్పించబడినవి అన్నీ అసత్యాలే. అలాంటప్పుడు ఈ జీవత్వము మాత్రము ఎలా సత్యమవుతుంది? అవదు.

**నిరంజనే నిర్వికారే నిష్క్రియేఽసంగవస్తుని ।**

**సాక్షిణ్యారోపితం సర్వం స్వప్నవత్సర్వదా మృషా ॥ 84**

జగత్తులో దృశ్యమానమైనదంతా యధార్ధంగా కనిపిస్తున్నప్పటికీ అసత్యమే.

ఇక్కడ మనం గుర్తించాల్సింది ఏమంటే జీవత్వము ఒకటే కాదు. ఈ జగత్తు నంతటి నీ మనస్సు తనయందు వ్యాపించి ఉన్న పరబ్రహ్మలోనే ఆరోపిస్తోంది. స్వప్నావస్థలో మనస్సు తన వికారాలను తనయందున్న బ్రహ్మము నందు ఆరోపిస్తుంది. దీనివల్ల స్వప్నజగత్తు కనిపిస్తోంది. జాగ్రదావస్థలో ఈ మనస్సు ఇంద్రియాలతో కలిసి సర్వవ్యాపకుడయిన బ్రహ్మము నందు ఈ జగత్తునంతటినీ ఆరోపిస్తోంది. అదే సుషుప్తిలోకి వచ్చే సరికి మనస్సు, బుద్ధి కూడా లయమై పోతాయి. అందుకే బాహ్యాభ్యంతర పదార్ధాలు ఏవీ కనిపించవు. గతంలో ఒక విషయాన్ని చెప్పుకున్నాం. ఇప్పుడు మళ్ళీ చెబుతున్నాం. అదేమంటే మనసు గనక పని చేయకపోతే ఈ సంసారము, జగత్తు లేవు. పసిపిల్లవాడి విషయంలోను, పిచ్చివాడి విషయంలోను వారికి మనస్సు పని చెయ్యదు. అందుకే వారి దృష్టిలో ఈ సంసారం ఉండదు. ఈ జగత్తంతా అజ్ఞానంతో ప్రత్యగాత్మ యందు ఆరోపించబడుతోంది. అసలు రూపమే లేని ఆత్మకు అనేక రూపాలున్నట్లుగా భావించటం ఎంతటి అజ్ఞానమో చూడండి. స్వయంప్రకాశియైన ఆత్మను దృశ్యమానమైన వాడుగా, ఒక రూపం గలవాడుగా భావించటం కన్న అవివేకం ఇంకేమైనా ఉంటుందా? పరబ్రహ్మ సర్వసాక్షి. అటువంటి పరబ్రహ్మకు కర్తృత్వ భోక్తృత్వాలు అంటగట్టటము, అన్ని విషయాలతోను సంబంధం గల వాడుగా భావించటము ఎంత అవివేకమో చూడండి. కాబట్టి ఇక్కడ తెలుసుకోవలసినది ఏమంటే, జగత్తంతా ఆత్మయందే ఆరోపించబడింది. అందుచేత జగత్తులోని అన్ని ధర్మాలు, ఆచారాలు, వ్యవహారాలు, వర్ణాశ్రమాలు, అన్ని వ్యవస్థలు, యజమాని సేవకుడు అనే భావము, చుట్టాలు, పక్కాలు, స్నేహితులు, దేవతలు, ఉపాసన, ఇవన్నీ కూడా అసత్యమే. సృష్టిలేదు లయము కూడా లేదు. అంతా భ్రాంతే కాని యధార్ధము కాదు.

## పశుపక్ష్యాదులకు కూడా కలలు వస్తాయా?

కలలు అనేవి అన్ని జీవులకు సర్వసాధారణం. వీటికి పెద్ద చిన్న, మానవుడు, పశువు, పక్షి అనే భేదం లేదు. చిన్నపిల్లలు నిద్రపోతూ ఒక్కోసారి ఉలికిపడి లేస్తారు. విపరీతంగా ఏడుస్తారు. అంటే వారికి నిద్రలో ఏదో పీడకల వచ్చిందన్న మాట. 'ఏనుగు కనులు మూసుకుని నిద్ర పోదు. కనులు మూసుకుంటే సింహం దాని

కలలోకి వస్తుంది' అనే మాట మన పెద్దవాళ్ళు చెబుతుంటారు. పక్షులలో 'తీతువు' అనే పేరుగల పక్షి ఒకటుంది. అది రాత్రిపూట నిద్ర పోయేటప్పుడు కాళ్ళతో చిన్నమట్టి బెడ్డలు పట్టుకుని వెల్లికిలా పడుకుని కాళ్ళు చాపి మరీ నిద్ర పోతుంది. నిద్రలో దాని కాళ్ళతో పట్టుకున్న మట్టిబెడ్డ జారి దానిమీద పడుతుంది. దాంతో ఆకాశంవిరిగి మీదపడుతోంది అని భావించి తీ...తీ... అని అరుస్తూ చక్కెర్లు కొడుతుంది.

ఈ రకంగా కలలు అనేవి మనుషులకే కాదు పశుపక్ష్యాదులకు కూడా వస్తాయి.

**న హి స్వాప్నికసంసారః కర్తృభోక్తృత్వలక్షణః ।**

**సత్యః సమీక్ష్యతే తద్వ జ్జాగ్రత్కాలేఽపి సాక్షిణః ॥ 85**

సర్వసాక్షి అయిన ఆత్మ ఏ పని చెయ్యదు. దానికి కర్తృత్వ భోక్తృత్వాలు లేవు. స్వప్నంలో మాత్రమే ఇవి ఉన్నట్లుగా అనిపిస్తాయి. కాని అది నిజం కాదు. అలాగే జాగ్రదావస్థలో కూడా అని గుర్తించాలి.

జగత్తులో ప్రతి జీవి కలలు కంటుంది. కేవలము మానవులకే కలలు అనుకోవటం పొరపాటు. పశుపక్ష్యాదులకు కూడా స్వప్నావస్థ ఉన్నది. అవి కలలు కంటాయి. జాగ్రదావస్థలో అన్నింటికీ నేనే కర్తని, భోక్తని అని ఎలా అనుకుంటున్నాడో అలాగే స్వప్నావస్థలో కూడా భావిస్తున్నాడు. కలగనేంత వరకు అది సత్యము అనే భావనతోఉంటాడు. కాని నిద్ర లేచిన తరువాత కల కరిగిపోతుంది. ఇదంతా 'కల' అని భావిస్తాడు. అంటే ఇదంతా అసత్యము అని తెలుస్తుంది. స్వప్నము ఎప్పుడయితే అసత్యమైందో జాగ్రదావస్థలోని సంసారము కూడా అలాంటిదే కదా ! అసత్యమే అవుతుంది.

**తస్మాద విద్యాతత్కార్య సంబంధ రహితః సదా ।**

**శుద్ధ ఏవ భవత్యాత్మా నిష్కళో నిష్క్రియః స్వయమ్ ॥ 86**

ఇంత వరకు చెప్పుకున్న విషయాల వల్ల సంసారమనేది మిథ్య అనటం వల్ల ప్రత్యగాత్మకుఅజ్ఞానంతో గాని, సంసారంతో గాని, ఏ విధమైన సంబంధం లేదు. అతను ఏ పనులు చెయ్యడు. ఎప్పుడూ పరిశుద్ధుడే. ఆయనకు దేనితోను సంబంధము లేదు. ఆయన ఎప్పుడూ ముక్తుడే. ముక్తి అనేది ప్రత్యగాత్మకు స్వతఃసిద్ధము.

ప్రత్యగాత్మ జీవుడు కాదు. అసలు జీవత్వమే లేదు అని గతంలోనే చెప్పుకున్నాం కదా ! కాబట్టి ప్రత్యగాత్మకు అజ్ఞానంతో సంబంధం లేదు. అజ్ఞానంతో కల్పించబడిన ఈ సంసారంతో సంబంధం లేదు. అది ఇది, వీడు వాడు అనే విభాగాలు ఉండవు. అన్ని సమయాలలోను ప్రత్యగాత్మ నిర్మలుడే. ఎప్పుడు ఏ రకమైన కర్మ చేయడు. అతడికి ఏ రకమైన బంధాలు ఉండవు. ఒకసారి బంధాలు కల్పించుకోవటము, ఆ బంధాల నుంచి విముక్తి పొందటము అనేది ఉండదు. ప్రత్యగాత్మ నిత్యముక్తుడు. దీనికి వ్యతిరేకంగా ఉండేదంతా భ్రాంతి.

**అత ఏవ శ్రుతిర్వక్తి బ్రహ్మాభిన్నత్వమాత్మనః ।**

**సాక్షాత్తత్వ మసీత్యేవ భూయో భూయః పునః పునః ॥ 87**

ఈ కారణాలచేత ప్రత్యగాత్మ బ్రహ్మముకన్న వేరు కాదని, ప్రత్యగాత్మకు బ్రహ్మమునకు భేదము లేదని వేదం చెబుతోంది.

ఇప్పటి వరకు చెప్పిన విషయాలవల్ల ప్రత్యగాత్మకు సంసారంతో ఏ రకమైన సంబంధము లేదు. తత్ శబ్దముచే చెప్పబడే బ్రహ్మముకు ప్రత్యగాత్మకు భేదము లేదు. అని చెబుతోంది వేదము. **"తత్త్వమసి-ఆ బ్రహమే నీవై ఉన్నావు"** అని అనేకసార్లు చెప్పింది వేదం. 'తత్త్వమసి' అనే మాట వేదంలో ఎక్కడా చెప్పబడలేదు కదా? ఇది ఏ సూక్తంలోను లేదు కదా? అనే అనుమానం కొంతమందికి రావచ్చు. ఎందుకంటే వేదము అంటే సంహిత భాగము మాత్రమే అని కొందరి అభిప్రాయం. సంహిత, బ్రాహ్మణాలు మాత్రమే వేదము అని కొందరి వాదన. ఉపనిషత్తులు ఋషిప్రోక్తాలు కాబట్టి ఇవి వేదం కాదు. వేదాలు అపౌరుషేయాలు. ఉపనిషత్తులు ఋషిప్రోక్తాలు. అందుచేత ఉపనిషత్తులు వేదం కాదు. ఇది చాలా గట్టి వాదన.

వేదాలమీద పరిశోధన చేసిన అనేకమంది ఉపనిషత్తులు కూడా వేదంలో భాగమే అని నిర్ణయించారు. దీన్నే వేదాంతము అన్నారు. ఉపనిషత్తులు మొత్తం 1180. వాటిలో ముఖ్యమైనవి 108. వీటిలో ముఖ్యమైనవి 10. వీటినే దశోపనిషత్తులు అంటారు. ఈ పది ఉపనిషత్తులకు త్రిమతాచార్యులు ఎవరి వాదనకు అనుగుణంగా వారు భాష్యం వ్రాశారు. వీటిలో నుంచి నాలుగు వాక్యాలను ప్రత్యేకంగా ఏరి వాటిని మహావాక్యాలు అన్నారు అవి :

| | | |
|---|---|---|
| 1. ప్రజ్ఞానం బ్రహ్మ | ఐతరేయోపనిషత్తు | ఋగ్వేదము |
| 2. అయమాత్మాబ్రహ్మ | మాండూక్యోపనిషత్తు | అధర్వణవేదము |
| 3. తత్త్వమసి | ఛాందోగ్యోపనిషత్తు | సామవేదము |
| 4. అహంబ్రహ్మాస్మి | బృహదారణ్యకోపనిషత్తు | శుక్లయజుర్వేదము |

ఈ నాలుగు మహావాక్యాలు కూడా పరబ్రహ్మను గురించే చెబుతాయి. వీటిలో తత్త్వమసి అనే మహావాక్యానికి అర్థం తెలుసుకుంటే మిగిలిన వాటికి కూడా అర్థం తెలుస్తుంది. అందుకే 'మహావాక్యదర్పణం'లో తత్త్వమసి అనే మహావాక్యాన్ని వివరించారు.

ఛాందోగ్యోపనిషత్తులోఉద్దాలకఅరుణి బ్రహ్మజ్ఞాని. తన కుమారుడైన శ్వేతకేతువుకు బ్రహ్మవిద్యను బోధిస్తూ 'తత్త్వమసి' అనే మహావాక్యాన్ని చెప్పాడు. ఈ మహావాక్యంలో మూడు పదాలున్నాయి. 1.తత్ 2.త్వం 3.అసి.

1.తత్ అంటే – అది. పరబ్రహ్మ 2.త్వం అంటే – నీవు 3.అసి అంటే – అయి ఉన్నావు. ఓ శ్వేతకేతూ ! తత్త్వమసి. ఆ పరబ్రహ్మమే నీవై ఉన్నావు. ఉద్దాలకుడు శ్వేతకేతువుకు చెబుతున్నాడు. ఓ శ్వేతకేతూ ! ఆకాశంలో సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. ఆ సూర్యుడిలో ఏ తత్త్వమైతే ఉన్నదో, అదే నీలోనూ ఉన్నది. తత్త్వమసి. ఆకాశంలో చంద్రుడు చల్లదనాన్నిస్తున్నాడు. ఆ చంద్రునిలో ఏ తత్త్వమైతే ఉన్నదో అదే నీలోనూ ఉన్నది. తత్త్వమసి. అగ్ని అన్నింటినీ దహించి వేస్తాడు. అగ్నిలో ఏ దాహకశక్తి ఉన్నదో అదే నీలోనూ ఉన్నది. తత్త్వమసి. చరాచర జగత్తులో ఉన్న అన్ని తత్త్వాలు, అన్ని శక్తులు నీలోనే ఉన్నాయి. తత్త్వమసి. నీవే సాక్షాత్తు బ్రహ్మనివి. అంటాడు. ఈ మహా వాక్యానికి ఇంకో రకంగా అర్థం చెప్పటానికి లేదు.

**యత్కార్యం యస్తుతన్మాత్ర మేవ విద్ధి విలోకితం ।**
**మృద్ఘటాదౌ తతః సర్వం బ్రహ్మ మాత్ర మిదం జగత్ ॥ 88**

ఏ వస్తువు ఏ వస్తువు నుంచి పుట్టిందో అది దానికన్న భిన్నమైనది కాదనేది సిద్ధాంతం. మట్టినుండి తయారైన కుండ మట్టికన్న వేరైనది కాదు.

పులి కడుపున పులే పడుతుంది. పిల్లి కడుపున పిల్లి పడుతుందనేది లోకరీతి. సహజంగా వంశలక్షణాలు, జాతిలక్షణాలు పారంపర్యంగా వస్తాయి. ఒకవేళ అలా

జరగలేదు అంటే మనకు తెలియని విషయాలున్నాయన్న మాట. మట్టితో తయారయిన కుండలో మట్టిలక్షణాలే ఉంటాయి. అలాగే నూలుతో తయారైన వస్త్రానికి నూలులక్షణాలే ఉంటాయి. ఇక్కడ నామరూపాలు తప్ప మట్టికికుండకు, నూలుకు వస్త్రానికి తేడాలు ఏవీ ఉండవు. ఇది అందరికీ తెలిసిన విషయమే. ప్రతిచోట ఇలాగే ఉంటుంది. బంగారం నుంచి తయారైన ఆభరణాలు కూడా బంగారమే. రాగితో తయారైన చెంబు కూడా రాగే. చెక్కతో తయారైన విగ్రహము కూడా చెక్కే. ఈ రకంగానే ప్రతివస్తువు, ప్రతిజీవి కూడా ఉంటుంది. నామరూపాలే మారుతుంటాయి. అంతేకాని అసలు వస్తువుకు ఏ రకమైన భేదము ఉండదు. కాబట్టి బాగా ఆలోచిస్తే మట్టికన్న కుండ, లోహం కన్న పాత్ర వేరైనవి కావు. అదే విధంగా చరాచ జగత్తంతా బ్రహ్మముచేతనే బ్రహ్మముయందే సృష్టించబడింది. కాబట్టి **జగత్తు బ్రహ్మము కన్న వేరు కాదు.**

**జగతో బ్రహ్మమాత్రత్వే పరస్య బ్రహ్మణః సదా ।**
**అద్వయత్వం స్వతః సిద్ధం ద్వైత హేతోరసంభవాత్ ॥ 89**

జగత్తంతా బ్రహ్మమే. ఇందులో తేడా లేదు. కాబట్టి పరబ్రహ్మకు అన్ని కాలముల యందు ఒకే రూపముండటమనేది స్వాభావికము. ఇది ఏమీ క్రొత్తగా రాలేదు. వేదంలో చెప్పిందీ ఇదే. అనుభవ పూర్వకంగా తెలుసుకున్నది ఇదే. ఉపాదాన కారణమైన బ్రహ్మానికి, కార్యమైన జగత్తుకు తేడా లేదు. కాబట్టి జగత్తులో పరబ్రహ్మ కన్న వేరైన పదార్ధము ఏదీలేదు. అసలు అలా ఉండటానికి వీలు లేదు. జీవులచేతన ప్రపంచంగాని, పదార్ధముల చేతన ప్రపంచంగాని బ్రహ్మముకన్న వేరు కాదు. బ్రహ్మము ఎప్పుడూ అద్వితీయమే. రెండవది లేనిది. **"ఏకాకీ, భూమరూపా, నిర్ద్వైతా, ద్వైత వర్జితా" "ఒంటి వాడను చుట్ట మొకడు లేడు"** ఇలాంటి వాక్యాలన్నీ ప బ్రహ్మ అద్వితీయుడు అని సామాన్య ప్రజానీకానికి తెలియ జేయటానికే చెప్పబడినాయి. త్రికాలముల యందు, అన్ని ప్రదేశముల యందు బ్రహ్మము కన్న వేరైనది లేదు.

# 7. బ్రహ్మసత్యం - జగన్మిథ్య

చరాచర జగత్తులో నామరూపాత్మకమైనవన్నీ అశాశ్వతాతలే. అసలు జగత్తే లేదు. బ్రహ్మము ఒకటే సత్యము నిత్యము శాశ్వతమైనది. ఈ జగత్తంతా మిధ్య. భ్రాంతిచేత కల్పించబడింది. అజ్ఞానము చేత కల్పించబడింది.

జగత్తును సృష్టించటానికి ప్రత్యేకంగా బ్రహ్మదేవుడు లేడు. కలలను సృష్టించినట్లే ఈ జగత్తును మనస్సే సృష్టిస్తోంది. బ్రహ్మదేవుడు చేసేది సమిష్టి సృష్టి. జగత్తులోని జీవరాసి యొక్క సమ్మేళనమే బ్రహ్మదేవుడు. ఈ కారణం చేతనే బ్రహ్మ చేసే సృష్టి అందరికీ కనుపిస్తుంది. మనసులేని పసిపిల్లవాడికి, పిచ్చివాడికి ఈ జగత్తు గాని, సృష్టి గాని కనుపించవు. స్వప్నంలాగానే ఈ జగత్తు అంతా కల్పనామాత్రము. మానవుడికి జ్ఞానం కలిగినట్లైతే ఈ జగత్తు నశిస్తుంది. ఒకవేళ ఈ జగత్తు గనక సత్యమైనది అయితే జ్ఞానం కలిగినా అది నశించదు. భ్రాంతి సిద్ధమైన వస్తువులు జ్ఞానంతో నశించిపోతాయి. జ్ఞాన సముపార్జనతో నశించే వస్తువులు అసత్యమైనవి. దీనికంతటికీ కారణం మనస్సు. తన రచనాశక్తితో 84 లక్షల రకాలైన జీవరాసితో ఈ జగత్తును సృష్టించి బ్రహ్మవేత్తలను కూడా అందులో ముంచేస్తుంది. ఈ జగత్తంతా మనసువల్లనే కల్పించబడుతున్నది. యధార్ధంగాచూస్తే సంసారంలేదు. మనసు పనిచేయని సుషుప్తి, మూర్ఛ వంటి అవస్థలలో సంసారం కనుపించదు. మనసు ఉన్నచోటే లోకాలున్నాయి. మనసు లేకపోతే లోకాలు లేవు. సృష్టి లేదు అసలు జగత్తే లేదు.

బ్రహ్మానికి జగత్తుకు ఏ రకమైన తేడా లేదు. జగత్తంతా బ్రహ్మము యొక్క మార్పు, భ్రాంతితో కూడిన రూపాంతరము. జగత్తుకు ఉపాదాన నిమిత్త కారణాలు రెండూ బ్రహ్మమే. జగదుత్పత్తికి కారణాలు రెండు. 1.ఆరంభము 2.పరిణామము. ఆరంభంలో దారపు పోగులు కలిసి వస్త్రంగా ఏర్పడతాయి. ఇందులో ఆరంభంలో ఉన్న లక్షణాలు పోకుండానే ఇంకొక వస్తువు ఆవిర్భవిస్తోంది. నూలుపోగులు వస్త్రంగా ఏర్పడ్డప్పుడు నూలు పోగుల లక్షణాలు వస్త్రంలో ఉంటాయి. కాని నూలు వేరు వస్త్రం వేరు. రెండవది పరిణామము. ఇందులో ప్రారంభంలో ఉన్న లక్షణాలు పోయి క్రొత్త లక్షణాలు వస్తాయి. పాలను తోడు వేస్తే పెరుగవుతుంది. కాని పెరుగులో పాల లక్షణాలు, రూపము కూడా ఉండవు.

అయితే జగత్తు ఆరంభ పరిణామము వల్ల ఏర్పడలేదు. వివర్త పరిణామము వల్ల ఏర్పడింది. అంటే భ్రాంతివల్ల ఒక వస్తువు ఇంకొక రకంగా కనుపిస్తుంది. అదే రజ్జు సర్పభ్రాంతి. పరబ్రహ్మ ఈ జగత్తును సృష్టించలేదు. విత్తనం నుంచి చెట్టు వచ్చినట్లుగా, తండ్రి నుంచి తనయుడు పుట్టినట్లుగా, బ్రహ్మ నుంచి ఈ జగత్తు ఆవిర్భవించలేదు. వివర్తము అంటే కనుపించే రూపము. అవిద్య, అజ్ఞానం వల్ల కలిగిన అసత్యరూపము. అసలు ఇక్కడ జగత్తే లేదు. అంతా మాయ. అజ్ఞానంతో మనసు చేసిన కల్పనలవల్ల జగత్తు ఉన్నట్లుగా కనుపిస్తోంది. అంతేకాని అసలు జగత్తే లేదు. బ్రహ్మదేవుడు మనస్సంకల్పంతో ఈ సృష్టి చేశాడు. ఇది సమిష్టి సృష్టి. అందుకే అందరికీ ఒకే రకంగా కనుపిస్తోంది. మనసున్న వాడికే జగత్తు కనుపిస్తుంది. మనసు లేని వాడికి ఈ జగత్తు లేదు. అజ్ఞానం వల్ల ఆవరించబడిన మాయతో ఈ జగత్తు సత్యము అనుకుంటాము. అజ్ఞానం గనక తొలగిపోతే ఈ జగత్తు ఉండదు. మిగిలేది ఒక్కటే అదే బ్రహ్మము. అందుకే **బ్రహ్మసత్యం జగన్మిథ్య**. బ్రహ్మము జగత్తుల మధ్య తేడా లేదు. జగత్తు పరబ్రహ్మ యొక్క మార్పు. భ్రాంతి సిద్ధమైన రూపము. అంతే.

ఆరంభ పరిణామము వల్ల జనించినవి మాత్రం అధిష్ఠానానికి వికారము కలిగిస్తాయి. అసలు వస్తువు రూపాన్ని మారుస్తాయి. కాని వివర్త పరిణామంలో అధిష్ఠానానికి ఏ రకమైన మార్పు, వికారము కలగదు. అధిష్ఠానానికి ఏ రకమైన మార్పు లేకపోయినప్పటికీ అజ్ఞానం వల్ల మార్పులు ఉన్నట్లుగా అనిపిస్తుంది. ఈ కారణం చేతనే బ్రహ్మకు ఏ వికారాలు లేకపోయినా అనేక రూపాలు ఉన్నట్లుగా జగద్రూపంలో కనిపిస్తున్నాడు.

ఎడారిలో ప్రయాణం చేసేవారికి ఎండమావులు నీరులాగా కనిపిస్తాయి. అలాగే బ్రహ్మమును గురించి తెలియని అజ్ఞానులకు జగత్తు సత్యంగా కనుపిస్తుంది. అవి ఎండమావులు అనే జ్ఞానం కలిగినట్లైతే, ఎండమావులలో నీరు కనుపించదు. అలాగే జగత్తుకు అధిష్ఠానమైన బ్రహ్మము గురించి తెలియగానే జగత్తంతా పరబ్రహ్మగానే దర్శనమిస్తుంది. అంటే అప్పటిదాకా కనుపించిన జగత్తు ఏమవుతుంది? ఏమీ కాదు. ఇక్కడ నుంచి ఎక్కడికి పారిపోదు. పరబ్రహ్మలో లయమై పోదు. మరి ఏమవుతుంది? అంటే – బ్రహ్మరూపంలో నిలిచి ఉంటుంది. ఒక పదార్థంలో

అజ్ఞానంతో ఆరోపించబడిన వస్తువు, జ్ఞానభావన కలగగానే ఆధారమైన పదార్థము యొక్క స్వరూపముతో తప్ప ఇతరమైన దేనియందు లయమవటం గాని, ఎక్కడికైనా వెళ్ళిపోవటంగాని జరగదు. ఇదే రజ్జుసర్పభ్రాంతి. తాడును చూసి పాము అనుకుంటున్నాము. అది నిజంగా పాముకాదు. అజ్ఞానంతో దాన్ని పాము అనుకుంటున్నాము. ఇప్పుడు జ్ఞానం కలిగింది. అజ్ఞానం పోయింది. త్రాడులో ఉన్న పాము ఇప్పుడు లేదు. ఏమైంది? చచ్చిపోయిందా? పారిపోయిందా? నాశనమై పోయిందా? ఎక్కడైనా లయమై పోయిందా? అంటే ఏమీ కాలేదు. అది తన అధిష్ఠాన రూపంలో నిలిచిపోయింది. త్రాడు త్రాడుగానే మిగిలిపోయింది. విచిత్రం ఏమంటే త్రాడు ఎప్పుడూ త్రాడుగానే ఉంది. అజ్ఞానంతో నువ్వే దాన్ని పాము అనుకున్నావు. అజ్ఞానం పోగానే అది పాము అనే భావన పోయింది. త్రాడే మిగిలింది. నీ అజ్ఞానం పోకముందు అక్కడ ఉన్నది త్రాడే. అజ్ఞానం పోయిన తరువాత అక్కడ ఉన్నది త్రాడే. అందులో ఏ మార్పు లేదు. ఉన్నదంతా నీ భావనలోనే ఉంది. అలాగే నీ అజ్ఞానంతో ఈ జగత్తును భావన చేశావు. అజ్ఞానం పోయిన తరువాత జగత్తు లేదు. కేవలము బ్రహ్మము మాత్రమే మిగిలింది. అందుకే **బ్రహ్మసత్యము** జగన్మిధ్య. నీ అజ్ఞానం పోకముందు ఇక్కడ జగత్తు లేదు. పోయిన తరువాత జగత్తు లేదు. పరబ్రహ్మలో జగత్తును నువు అజ్ఞానంతో భావన చేశావు. అజ్ఞానం కాస్తా పటాపంచలైపోయింది. ఇప్పటిదాకా చిమ్మచీకట్లు క్రమ్ముకున్నాయి. ఆ చీకటిలో అనేక రకాలైన భూతాలు, పిశాచాలు, దెయ్యాలు కనుపించాయి. ఇప్పుడు జ్ఞానజ్యోతులు వెలిగాయి. ఆ దివ్యమైన ప్రకాశంతో చీకటి ఎగిరిపోయింది. ఇప్పుడు యధార్థం గోచరిస్తోంది. అక్కడ దెయ్యాలు, భూతాలు ఏవీలేవు. అదంతా నీ భ్రాంతి. ఆ భ్రాంతి తొలగిపోయింది. అలాగే ఇక్కడ కూడా అజ్ఞానమనే చీకట్లు తొలగిపోగానే అప్పటివరకు కనుపించిన జగత్తు కనుపించకుండా పోయింది. ఎక్కడికి పోయింది అంటే భ్రాంతి పోయింది అంతే. అసలు అక్కడ జగత్తే లేదు. అది ఎక్కడికీ పోలేదు. దేనిలోనూ లీనం కాలేదు. ఈ జగత్తంతా భ్రాంతి అనే మాటను నువ్వు తెలుసుకున్నావు. ఉన్నది ఒక్కటే. సత్యము, నిత్యము శాశ్వతము అయిన పరబ్రహ్మ. నామరూపాత్మకమైన జగత్తంతా భ్రాంతిచే కల్పించబడింది. అందుకే **బ్రహ్మసత్యం జగన్మిధ్య.**

అజ్ఞానం వల్ల ఆవిర్భవించిన జగత్తు జ్ఞానంవల్ల అదృశ్యమై పోతుంది. తన అధిష్ఠానంలో లీనమవుతోంది. కలలో జరిగిన విషయాలు మెలకువ రాగానే ఎలా కరిగిపోతాయో, అలాగే జ్ఞానం కలగగానే జాగ్రదావస్థలోని జగత్తు అదృశ్యమై పోతుంది. తన అధిష్ఠానంలో కలిసిపోతుంది. ఇక్కడ మనస్సు తన అజ్ఞానంతో జగత్తును ఊహించుకుంటోంది. ఇదంతా ఊహ, కల్పన, భ్రాంతి. అయితే ఇక్కడ చిన్న తేడా ఉంది. కలలోని వస్తువులు మెలకువ రాగానే కరిగిపోతాయి. కాని జాగ్రదావస్థలో అలా కాదు. వస్తువులు కంటికి కనుపిస్తాయి. వాటిని చేత్తో తాకుతాము. అనుభవిస్తాము. వివాహం చేసుకున్నాడు. భార్య ఇంటికి వచ్చింది. తనతోనే ఉంటుంది. ఇల్లు కట్టుకున్నాడు. గృహప్రవేశం చేశాడు. ఆ ఇంట్లోనే ఉంటున్నాడు. తన భార్య, పిల్లలు, ఇల్లు ఇవన్నీ కళ్ళ ఎదురుగా కనుపిస్తూనే ఉన్నాయి. వాటిని తాను అనుభవిస్తూనే ఉన్నాడు. అందుకే ఇవన్నీ సత్యము అనుకుంటున్నాడు. మంచి గురువును ఆశ్రయించి, ఆయనకు శుశ్రూష చేసి, జ్ఞానసముపార్జన చేసిన తరువాత, జాగ్రదావస్థలోని విషయాలు కూడా స్వప్నంలోని విషయాలలాగానే అసత్యము, ఇదంతా భ్రాంతి అనే విషయం తెలుస్తుంది. అప్పుడు దృశ్యమానమైన జగత్తు అదృశ్యమై పోతుంది. ఆ సమయంలో ఇంక మిగిలేది ఒక్కటే. అధిష్ఠానమైన బ్రహ్మము. అందుకే **బ్రహ్మసత్యంజగన్మిథ్య.**

సముద్రంలో ముత్యపుచిప్ప తేలియాడుతోంది. దాన్ని చూసి వెండిపాత్ర అనుకున్నాం. అది ముత్యపుచిప్ప అని తెలియగానే వెండిపాత్ర కనుపించదు. త్రాడును చూసి పాము అనుకున్నాం. అది త్రాడు అని తెలియగానే ఇంక పాము కనుపించదు. అలాగే జగత్తుకంతటికీ అధిష్ఠానమయిన పరబ్రహ్మ స్వరూపం గురించి తెలియనంత వరకు నామరూపాత్మకమైన జగత్తే కనుపిస్తుంది. జ్ఞానం కలిగిన తరువాత ఇది బ్రహ్మము అని తెలిస్తే దృశ్యమానమైన జగత్తు ఇంక ఉండదు. అన్నీ అంతర్ధానమై పోతాయి. ఇక్కడ అంతర్ధానము అంటే పూర్తిగా నశించిపోతాయని, నామరూపాలు ఏవీ ఉండవనీ కాదు. అజ్ఞానం వల్ల ఇంకో రకంగా ఆరోపించిన వస్తువులను జ్ఞానంతో యథార్థంగా తెలుసుకోవటం. అప్పుడు జగత్తు నశిస్తుంది. అంటే పూర్వస్థితికి వస్తుంది. తన రూపాన్ని తాను సంతరించుకుంటుంది. తనరూపము బ్రహ్మము. కాబట్టి జగత్తంతా బ్రహ్మముగానే కనుపిస్తుంది. బ్రహ్మకన్న వేరైన పదార్థం ఏదీ

ఉండదు. అందుకే **బ్రహ్మసత్యం జగన్మిధ్య**. జగత్తు ఎన్నటికీ నశించదు. ఒకసారి నశించినది మళ్ళీ పుడుతుంది. కాని అజ్ఞానము అలాకాదు. అజ్ఞానము ఒకసారి నశిస్తే మళ్ళీ పుట్టదు. నీటిమీద తేలియాడుతున్న ముత్యపుచిప్పను చూసి వెండిపాత్ర అనుకున్నాడు. ఇప్పుడు కాదని తెలిసింది. రెండవసారి ముత్యపుచిప్ప కనుపించినా అది వెండిపాత్ర అనుకోడు. భ్రాంతి గనక ఒకసారి నశిస్తే మళ్ళీ జనించదు. ఒకవేళ జనించినా అది భ్రాంతి అని వెంటనే తెలుస్తుంది. కాబట్టి **జగత్తు అనిత్యము అని తెలుసుకున్న వాడు మళ్ళీ జగత్తు సత్యము నిత్యము అని ఎప్పటికీ నమ్మడు.** ఈ విషయాన్నే ఇక్కడ వివరించటం జరుగుతోంది.

**నేదం చోద్యం మయా తత్వం కథ్యతే శృణు సాదరం ।**
**బీజాదంకురవత్తాత పుత్ర వద్బ్రహ్మణో జగత్ ॥** **90**

**నేదం జాతమితి బ్రూమో వయ మద్వైతవాదినః ।**
**కింతు బ్రూమో జగత్సర్వం వివర్తం బ్రహ్మణ స్త్వితి ॥** **91**

ఇంతవరకు చెప్పిన సిద్ధాంతము పూర్వపక్షము చేయదగినది కాదు. అంటే వ్యతిరేకించదగినది కాదు. ఇక్కడ విషయాన్ని "నేను చెబుతున్నాను నువ్వు విను" అనే రీతిలో చెప్పటం లేదు. విత్తనం నుంచి మొక్క వచ్చినట్లుగా, తండ్రి నుంచి తనయుడు ఆవిర్భవించినట్లుగా ఈ జగత్తంతా పరబ్రహ్మ నుంచే పుట్టింది. బ్రహ్మానికి జగత్తుకు ఏ రకమైన తేడా లేదు. ఈ జగత్తంతా పరబ్రహ్మము యొక్క మార్పు. భ్రాంతితో కూడిన రూపాంతరము.

బ్రహ్మానికి జగత్తుకు తేడా లేదని ఇంతవరకు చెప్పిన విషయంలో అనుమానం ఏదీలేదు. ఉత్పత్తికి కారణాలు రెండు 1.ఆరంభము 2.పరిణామము. దీన్ని శాస్త్రజ్ఞులు కూడా అంగీకరించారు. దారపు పోగులన్నీ కలిపి వస్త్రంగా ఏర్పడతాయి. అలాగే కారణ పదార్థాలు కార్యాన్ని ఏర్పరుస్తాయి. ఇది ఆరంభము. ఇందులో ప్రారంభంలో ఉన్న వస్తువు లక్షణాలను పోకుండానే ఇంకొక వస్తువు ఆవిర్భవిస్తోంది. నూలుపోగులు వస్త్రంగా ఏర్పడినప్పుడు నూలుపోగుల లక్షణాలు వస్త్రంలో ఉంటాయి. కాని నూలు వేరు వస్త్రం వేరు. రెండవది పరిణామము. ఇందులో ప్రారంభంలో ఉన్న వస్తువు తన లక్షణాలను కోల్పోయి కొత్త లక్షణాలను సంతరించుకుంటుంది. పాలను తోడు

వేస్తే పెరుగవుతుంది. పెరుగులో పాల లక్షణాలు, రూపము కూడా ఉండవు. ఈ రెండు కారణాలు తప్ప ఉత్పత్తికి మూడవ కారణము ఏదీలేదు. అయితే కారణానికి కార్యానికి కొంత తేడా ఉంటుంది. ఇందాక చెప్పినట్లుగా నూలుకు వస్త్రానికి తేడా ఉంది. పాలకి పెరుగుకు తేడా ఉంది. పాలు పెరుగుకాదు. పెరుగు పాలుకాదు. అలాగే వస్త్రం నూలుకాదు నూలు వస్త్రంకాదు. అందుచేత కారణ కార్యాలకు తేడా ఉంటుంది. ఈ జగత్తుకు ఉపాదాన, నిమిత్త కారణాలు రెండూ బ్రహ్మమే. అయితే జగత్తంతా 'ఆరంభ పరిణామ వాదము' వల్లనే ఏర్పడింది. అనవచ్చా? అంటే కాదు. ఇక్కడ 'వివర్త పరిణామము' అని ఇంకొక వాదన ఉన్నది. ఇందులో భ్రాంతి వల్ల ఒక వస్తువు ఇంకొక రకంగా కనిపిస్తుంది. ఇదే రజ్జు సర్పభ్రాంతి. పరబ్రహ్మ ఈ జగత్తును సృష్టించలేదు. విత్తనం నుంచి చెట్టు వచ్చినట్లుగా బ్రహ్మము నుంచి ఈ జగత్తు ఆవిర్భవించలేదు. తండ్రి నుంచి తనయుడు పుట్టినట్లుగానూ రాలేదు. వివర్తము అంటే కనిపించే రూపము అవిద్య వల్ల కలిగిన అసత్యరూపము. అసలు ఇక్కడ జగత్తే లేదు. అంతా మాయ. అజ్ఞానం వలన మనస్సు చేసిన కల్పనల వలన జగత్తు ఉన్నట్లుగా కనిపిస్తున్నది. అంతే నిజంగా అయితే అసలు జగత్తే లేదు. ఇదంతా గారడీ వాడి మాయ. బ్రహ్మదేవుడు ఈ జగత్తును సృష్టించాడు అంటారు. అంటే మనసుతో సంకల్పం చేశాడు. ఆ సంకల్పం వల్లనే ఈ జగత్తు ఏర్పడింది. ఇది సమిష్టి సృష్టి. అదే మనస్సు జీవులన్నింటికీ ఉన్నది కాబట్టి, అందరికీ ఈ జగత్తు కనిపిస్తోంది. మనసు లేని వారికి పసిపిల్లవాడికి, పిచ్చివాడికి ఈ జగత్తు లేదు. అజ్ఞానం వల్ల ఆవరించబడిన మాయలో ఉండి ఈ జగత్తంతా ఉన్నది సత్యము అనుకుంటున్నాము. అజ్ఞానం తొలగిపోతే ఈ జగత్తు ఉండదు. మిగిలేది ఒక్కటే. అదే బ్రహ్మము. 'బ్రహ్మ సత్యం జగన్మిథ్య'. మాయచేత బ్రహ్మయందే కల్పించబడిన జగత్తుకు, బ్రహ్మకు తేడా లేదు. జగత్తనేది పరబ్రహ్మ యొక్క మార్పు. భ్రాంతి సిద్ధమైన రూపాంతరము. అంతేకాని బ్రహ్మము జగత్తుల మధ్య తేడా లేదు.

**మరు దేవాంబు రూపేణ యథైవా భాత్య విక్రియః ।**
**రజ్జు రేవాహి రేపేణ యథా భాత్య వికారిణి**
**తథైవ జగదా కృత్యా బ్రహ్మైవా భాత్య విక్రియః ॥** **92**

ఏ విధంగాఅయితే మరు మరీచికలు కనిపిస్తాయో, ఏ విధంగా అయితే రజ్జువు సర్పంగా కనిపిస్తోందో, ఆ విధంగానే పరబ్రహ్మకు ఏ రూపం లేకపోయి నప్పటికీ అనేక రూపాలుగా కనిపిస్తున్నాడు.

ఇందాక జగత్తుకు వివర్తమే కారణము అని చెప్పుకున్నాం. వివర్తం వలన అజ్ఞానం వలన జన్మించిన వస్తువు, అసలు వస్తువుకు, అధిష్టానానికి ఏ రకమైన వికారము కలిగించదు. అదే మొదట్లో చెప్పిన ఆరంభ పరిణామముల వల్ల జనించినవి మాత్రం అధిష్టానానికి వికారము కలిగిస్తాయి. అసలు వస్తువు యొక్క రూపాన్ని మారుస్తాయి. కాని వివర్తంలో కారణానికి ఏ రకమైన వికారము, మార్పు కలగదు. అధిష్టానానికి ఏ రకమైన మార్పులు లేకపోయినప్పటికీ, కేవలము అజ్ఞానంతో మార్పు ఉన్నట్లుగా కనిపిస్తుంది. ఈ కారణం చేతనే పరబ్రహ్మ ఏ వికారాలు లేనివాడు అయినప్పటికీ అనేక రూపాలు కలిగినట్లుగా జగద్రూపంలో ప్రకాశిస్తున్నాడు.

**అపశ్యతామధిష్ఠానం విశ్వం భాతి యథార్థవత్ ।**
**అదృష్టమరు దేశానాం మరీచిసలిలం యథా ॥ 93**

ఎడారిలో తిరిగే వారికి ఎండమావులు ఎలా నీరులాగా జలాశయం లాగా కనిపిస్తాయో, అలాగే పరబ్రహ్మను గురించి తెలియని వారికి, అజ్ఞానులకు ఈ జగత్తంతా సత్యముగానే కనుపిస్తుంది.

వివర్తం వల్ల జన్మించి వస్తువు, అధిష్టానానికి ఏ రకమైన మార్పుకలిగించలేదు. వాస్తవంలో అధిష్టానికంటే వేరైన కార్యాన్ని చెయ్యలేదు. అందుచేత కార్యాపదార్థము లేనిదవుతుంది. ఎండమావులు అంటే ఏమిటో తెలియని వారికి అక్కడ నీరున్నట్లు కనిపిస్తుంది. అలాగే పరబ్రహ్మను గురించి తెలియని వారికి జగత్తే సత్యమనిపిస్తుంది. జగత్తు కన్న బ్రహ్మము వేరైనది అనిపిస్తుంది. ఇది కేవలము అజ్ఞానము వల్లనే జరుగుతుంది. జగత్తు సత్యముగాను బ్రహ్మము వేరుగాను తెలుస్తుంది.

**విజ్ఞాతే సత్యధిష్ఠానే పరే బ్రహ్మణి కేవలే ।**
**ప్రతీత మఖిలం విశ్వం బ్రహ్మమాత్రం భవేత్స్వయమ్ ॥ 94**

జగత్తుకు అధిష్టానమైన బ్రహ్మను గురించి తెలియగానే ఈ జగత్తంతా తనకు తానుగానే అంతా పరబ్రహ్మగానే అవుతుంది.

పరబ్రహ్మను గురించిన జ్ఞానం లేకనే నామరూపాలతో కూడిన జగత్తు కనిపిస్తోంది. బ్రహ్మజ్ఞానం కలగగానే ఈ జగత్తు అనేది ఉండదు. అంతా బ్రహ్మము గానే స్ఫురిస్తుంది. ఎడారిలో వెడుతున్న వాడికి ఎండమావులు కనిపిస్తాయి. అవి ఎండమావులు అని తెలియగానే అందులో నీరు ఎలా ఉండదో, అంతా ఎడారిగానే ఎలా కనిపిస్తుందో అలాగే బ్రహ్మజ్ఞానికి జగత్తంతా బ్రహ్మమయంగా ఉంటుంది.

**మరౌ దృష్టస్య తోయస్య మరుజ్ఞానే సముత్థితే ।**

**యథా స్యాన్మరు మాత్రత్వం తథైవ జగతో స్యచ ॥ 95**

ఇవి ఎండమావులు అనే జ్ఞానం గనక కలిగినట్లైతే, ఎండమావులలో ఉన్న నీరు కనుపించదు. అలాగే ఈ జగత్తులో కూడా జగత్తుకు బ్రహ్మరూపం ఏర్పడుతుంది.

జగత్తంతా భ్రాంతిచేత కల్పించబడినది కావటం చేత, భ్రాంతిచేత కల్పించబడిన జలమంతా ఎండమావులై పోతుంది. అంటే లేకుండా పోతుంది. ఇది బ్రహ్మము అని తెలుసుకోగానే అది బ్రహ్మమే అవుతుంది. బ్రహ్మము కన్న ఇతర పదార్థాలేవీ కనుపించవు. లోకంలో భ్రాంతిచేత కల్పించబడిన వస్తువులన్నీ భ్రాంతి తీరగానే కనుపించవు. జ్ఞానం కలగగానే అజ్ఞానం చేత ఆవిర్భవించిన వస్తువులన్నీ అదృశ్యమై పోతాయి.

**బ్రహ్మమాత్రత్వమేవ స్యాత్ జ్ఞాతే బ్రహ్మణి స్వాశ్రయే ।**

**ఆరోపితస్యాధిష్ఠానా కా రేణావస్థితిం వినా ॥ 96**

**విలయో నిర్గమో వాపి సతి బాధే న దృశ్యతే ।**

**అధిష్ఠా నాన్యథా భావ మాత్ర మేవ యతో జగత్ ।**

**తతో ధిష్ఠానమాత్రత్వం జగతో న విరుధ్యతి ॥ 97**

తనకు ఆధారమైన పరబ్రహ్మ స్వరూపం తెలియగానే ఈ జగత్తంతా బ్రహ్మము అయిపోతుంది. అంటే ఇక్కడ నుంచి పారిపోదు. ఎక్కడికీ వెళ్ళిపోదు. పరబ్రహ్మలో లయం కాదు. బ్రహ్మరూపంతో నిలచి ఉంటుంది. ఎక్కడా లయం కాదు. ఒక పదార్థంలో అజ్ఞానంతో ఆరోపించబడిన వస్తువుకు జ్ఞాన భావన కలగగానే ఆధారమైన పదార్థము యొక్క స్వరూపముతో తప్ప ఏ ఇతరములైన దేని యందు లయమవటం గాని, ఎక్కడికీ వెళ్ళిపోవటం గాని జరగదు.

దీనివల్ల మనకు తెలిసేదేమంటే జగత్తు ఎప్పటికీ బ్రహ్మరూపంతోనే ఉంటుంది. అధిష్ఠాన జ్ఞానము అంటే బ్రహ్మజ్ఞానము కలగగానే, అజ్ఞానంతో కల్పించబడిన పదార్థాలన్నీ అధిష్టాన స్వరూపం అంటే కల్పిత రూపాన్ని వదలి అసలైన బ్రహ్మరూపాన్ని పొందుతాయి. అంతేగాని అవి ఎక్కడికీ పోవు. ఎందులోను లయం కావు. అవన్నీ అజ్ఞానం వల్ల సృష్టించబడినవి. అజ్ఞానంతో కల్పించబడినవి. అందుచేత అవి ధ్వంసము చేయబడవు. జ్ఞానము చేతనే బాధించబడతాయి. ఇక్కడ విషయం ఏమంటే ధ్వంసం అయిన పదార్థాలు తమ కారణంలో లీనమవుతాయి. ఉదాహరణకు మట్టితో ఒక కుండను తయారుచేశాం. ఇప్పుడు ఈ కుండను పగలగొట్టి ధ్వంసం చేశాం. ఆ కుండ మళ్ళీ మట్టిలో కలిసిపోతుంది. ఇక్కడ కారణం మట్టి కార్యం కుండ. ధ్వంసమైన కార్యం కారణంలో కలిసిపోతుంది. వాస్తవంగా మట్టి కుండగామార్పు చెందింది. కాబట్టి ధ్వంసమైన కుండ మళ్ళీ మట్టిలో కలిసిపోతుంది. మరి వాస్తవంగా ఆ వస్తువు అక్కడ లేకపోతే ఏమవుతుంది? అంటే వివర్త పరిణామము. వివర్తము అంటే అజ్ఞానము. అజ్ఞానంతో లేనిదాన్ని ఉన్నట్లుగా ఊహిస్తున్నాము. ఇదే రజ్జు సర్పభ్రాంతి. త్రాడును చూసి పాము అనుకుంటున్నాము. అది నిజంగా పాము కాదు. అజ్ఞానంతో దాన్ని పాము అని భావిస్తున్నాము. ఇప్పుడు జ్ఞానం కలిగింది. అజ్ఞానం పోయింది. త్రాడులో ఉన్న పాము ఇప్పుడు లేదు. ఏమైంది? పారిపోయిందా? చచ్చిపోయిందా? నాశనం అయిపోయిందా? ఎక్కడైనా లయమై పోయిందా? అంటే ఏమీ కాలేదు. అది తన అధిష్టానం రూపంతో నిలిచిపోయింది. త్రాడు త్రాడుగానే ఉంది. విచిత్రం ఏమంటే త్రాడు ఎప్పుడూ త్రాడుగానే ఉంది. నువ్వే అజ్ఞానంతో దాన్ని పాము అనుకున్నావు. నీ అజ్ఞానం పోగానే అది పాము అనే భావన పోయింది. అక్కడ త్రాడే మిగిలింది.

ఎడారిలో ఎండమావులు కనుపిస్తున్నాయి. ఇది అజ్ఞానము. ఇక్కడ నీరుండదు. ఇది భ్రాంతి అనే విషయం తెలిస్తే, జ్ఞానం కలిగితే ఎడారిలో ఎండమావులు కనుపించవు. అంతా ఇసకనేల మాత్రమే ఉంటుంది. అలాగే చరాచర జగత్తంతా అజ్ఞానంతో బ్రహ్మము నందు కల్పించబడింది. అజ్ఞానం గనకపోయినట్లైతే జగత్తంతా బ్రహ్మస్వరూపంలోనే కనిపిస్తుంది. ఈ జగత్తు ఎప్పటికీ బ్రహ్మము కన్న వేరు కాదు. బ్రహ్మము ఎప్పటికీ అద్వితీయమే.

**నైతా వన్మాత్రతో బ్రహ్మ జడం భవితు మర్హతి ।**

**న దృశ్యం నాప్య నిత్యంచ న చ సావయవం తథా ॥ 98**

పరబ్రహ్మకు జగత్తుకు భేదం లేదు అని చెప్పినంత మాత్రం చేత అతడు జ్ఞానశూన్యుడు, అశాశ్వితుడు, విభాగములతో కూడిన వాడు అనటానికి వీలులేదు. ప్రపంచ ధర్మాలు ఏవీ ఆయనకు సంక్రమించవు. ఇక్కడ అనుమానం ఏమంటే బ్రహ్మానికి జగత్తుకి భేదము లేదు అన్నారు కదా ? మరి జగత్తు యొక్క ధర్మాలు బ్రహ్మానికి కూడా ఉంటాయా? జగత్తుకు ఉన్న అశాశ్వతత్త్వము, రూపము, విభాగాలు, అజ్ఞానము వంటివన్నీ బ్రహ్మానికి కూడా ఉంటాయా? బ్రహ్మమేమో శాశ్వతమైనది. నామరూపాలు లేనిది, నిరాకారము నిర్గుణమైనది; సర్వవ్యాపకమైనది. జగత్తు అశాశ్వతమైనది. నామరూపాలు గలది. ఇలాంటి జగత్తు, బ్రహ్మలకు ఐక్యము ఎలా కుదురుతుంది? ఒకవేళ కుదిరింది అనుకుందాం. అప్పుడు జగత్తు యొక్క లక్షణాలైన అజ్ఞానము, నామరూపాలు మొదలైనవి బ్రహ్మానికి కూడా రావాలి కదా? ఇది అనుమానం. ఈ అనుమానం అవసరం లేదు. విరుద్ధ ధర్మాలు గల వస్తువుకు అధిష్టానమైన మాత్రం చేత, ఆ వస్తువులు అధిష్టానము నందు ఆరోపించబడినంత మాత్రం చేత వాటి లక్షణాలు అధిష్టానానికి రావాలి అనే సిద్ధాంతం ఏదీ లేదు. అదీ గాకుండా ఇలా ఆరోపించబడిన వస్తువులన్నీ అజ్ఞానంతో కల్పించబడినవే. కాబట్టి జగత్తు లక్షణాలేవీ బ్రహ్మానికి ఉండాల్సిన పనిలేదు.

**స్వస్మిన్ కల్పిత తోయస్య స్వమాత్రత్వేతు కిం మరోః ।**

**శీతతా ద్రవతా వాపి జలధర్మో విలోక్యతే ॥ 99**

ఎండమావుల యందు కల్పించబడిన నీరు తానుగానే ఉన్నప్పటికీ ఆ నీటివల్ల ఎండమావులకు చల్లదనం రాదుకదా.

పైన చెప్పిన విషయాన్నే ఇంకా వివరిస్తున్నారు. ఎడారిలో ఎండ మండి పోతుంది. ఎండమావులు కనిపిస్తున్నాయి. వాటిలో నీరున్నది. అజ్ఞానంతోనే ఈ విషయాలను చూస్తున్నాము. జాగ్రత్తగా చూసినట్లైతే ఆరోపించబడిన వస్తువులు ఎప్పటికీ అధిష్టాన మాత్రములే. అంటే ఇక్కడ నీరు ఎండమావులకన్న భిన్నం కాదు. ఒకవేళ అవును అనుకుంటే నీటికి చల్లదనమనేది ఉండాలి. అది ఇక్కడ లేదు.

ద్రవ్యత్వము కూడా లేదు. అలాగే జడత్వ లక్షణాలు గల జగత్తు బ్రహ్మము నందు ఆరోపించబడుటచే, వాస్తవ స్థితిలో వేరు కాకపోయినప్పటికీ జగత్తుకున్న జడత్వము మొదలైన వాటితో బ్రహ్మానికి సంబంధం ఉండవలసిన అవసరం లేదు. ఉండదు కూడా. జగత్తు, బ్రహ్మము రెండూ ఒకటే. వేరు కాదు.

**జాత్యాది ధర్మకం విశ్వం స్వరూపేణా స్తి చేత్తదా ।**
**తద్వైశిష్ట్యే తు దోషాః స్యుః బ్రహ్మణో జడతాదయః ॥ 100**

విధమైన జాతులు, ధర్మాలు గల జగత్తు బ్రహ్మకన్న వేరైనట్లైతే అప్పుడు బ్రహ్మానికి దాని లక్షణాలు వస్తాయి.

జగత్తంతా అజ్ఞానంతోనే కల్పించబడింది. స్వాభావికంగా అసత్యమైనది. కాబట్టి జగత్తులో ఉన్న దోషాలు బ్రహ్మకు ఉండవు. ఒకవేళ జగత్తుకు ప్రత్యేకరూపం ఉండి, బ్రహ్మముతో గనక సంబంధం ఉంటే అప్పుడు జగత్తుకు ఉన్న లక్షణాలు బ్రహ్మానికి ఉండి తీరాలి. తనకన్న వేరైనది, సత్యమైనది, వ్యతిరేక లక్షణాలు గలది అయిన ఇంకొక దానితో కలిసినప్పుడు ఆ వస్తువు యొక్క ధర్మాలతో సంబంధం ఉండి తీరుతుంది. కాని ఇక్కడ పరిస్థితి అది కాదు. జగత్తుకు ప్రత్యేక రూపం లేదు. అజ్ఞానంతో కల్పించబడింది. కాబట్టి జగత్తుకు ఉండే జడత్వాది లక్షణాలు బ్రహ్మమునకు ఉండవు.

**ఆభాతస్య క్వ స్వరూపం ఘటతే మరుతోయవత్ ।**
**న హ్యత్ర వీక్ష్యతే లోకే స్వరూపం మరువారిణః ॥ 101**

ఎండమావులలో కనిపించే నీటికి ఎండమావుల కన్న వేరైన రూపము ఉండదు కదా?

జగత్తుకు ప్రత్యేకమైన అస్థిత్వము లేదు. అది బ్రహ్మముకన్న వేరైనది కాదు. అజ్ఞానంతో నిర్వికారుడైన బ్రహ్మము నందే ఈ జగత్తంతా ఆపాదించబడింది. కాబట్టి జగత్తుకు ప్రత్యేకంగా స్వరూపము ఉండటానికి వీలులేదు. ఇప్పుడు ఎండమావులని చూడండి. అజ్ఞానం వల్ల ఒక అధిష్టానము మీద ఊహించే లేదా కనుపించే రెండవ పదార్థానికి వేరే స్వరూపము ఉండదు. ఈ మాటను గతంలో మనం చెప్పుకున్నాం. అది అధిష్టాన మాత్రమే అయి ఉంటుంది. లోకంలో ఎంత వెదికి చూసినా

ఎండమావులలో నీరుండదు. అలా ఈ జగత్తుకు కూడా ప్రత్యేకమైన స్వరూపం లేదు. ఒకవేళ ఉంటే జగత్తు యొక్క ధర్మాలు బ్రహ్మకు కూడా కలుగుతాయి. కాని ఇక్కడ అలా లేదు. జగత్తుకు ప్రత్యేకమైన అస్తిత్వం లేదు. అది అజ్ఞానముచే కల్పించబడినది.

**గ్రహీతుర్గ్రహదోషేణ బ్రహ్మైవ జగదాత్మనా ।**

**ఆభాతం సర్పవద్రజ్జు ర్యథా తద్వద విక్రియమ్ ॥ 102**

ఏ రకమైన మార్పు లేని తాడు పాములాగా ఎలా కనిపిస్తోందో అలాగే నిర్వికారమైన బ్రహ్మమే చూసేవాడు, లేదా గ్రహించేవాడి శక్తిని బట్టి నామరూపాలతో జగత్తుగా కనిపిస్తోంది.

నిజంగా చెప్పాలంటే అజ్ఞానం వల్ల నిర్వికారమైన బ్రహ్మమే జగత్తుగా కనిపిస్తోంది. ఇందులో ఇంకో వస్తువు కాని, ఇంకొక పదార్థం కాని ఏదీ లేదు. అధిష్ఠానంలో ఏ రకమైన మార్పు లేదు. కేవలము అజ్ఞానము చేత, భ్రాంతి చేత మసక చీకటిలో త్రాడు పాముగా కనుపించినట్లుగా, నిర్వికారమైన బ్రహ్మము జగద్రూపుడుగా కనిపిస్తున్నాడు. ఇదంతా చూసేవాడి దోషమే తప్ప ఇంకేమీ కాదు. బ్రహ్మము కన్న వేరైన వస్తువేదీ లేదు.

**ఆభాతస్య త్వధిష్ఠానా దన్యత్వం నైవసిద్ధ్యతి ।**

**అధిష్ఠానాత్పృ కథకృత్తా రజ్జుసర్పేణ వీక్ష్యతే ॥ 103**

కల్పిత పదార్థాలకు ఆధార పదార్థముకన్న వేరుగా ఉండటం జరగదు. త్రాడు నందు అజ్ఞానముతో పామును ఊహించినప్పుడు ఆ పాములో దానికాధారమైన త్రాడు కన్న వేరుగా ఉనికి ఉండదు. బాగా ఆలోచించి చూస్తే ఆరోపిత పదార్థము ఎప్పుడూ అధిష్ఠానము కన్న వేరుగా ఉండదు. భ్రాంతి వల్ల త్రాడులో సర్పము కనుపించినంది. ఆ సర్పానికి అధిష్ఠానమైన త్రాడుకన్న వేరైన రూపము ఉండదు. ఈ కారణంచేత భ్రాంతితో కల్పించబడిన పదార్థములు అధిష్ఠానము కన్న వేరు కావు.

**పరస్మాద్బ్రహ్మణో విశ్వం కదా చిన్నైవ భిద్యతే ।**

**రజ్జుసర్పోయథా రజ్జోః స్వరూపేణ న భిద్యతే ॥ 104**

త్రాడునందు భ్రాంతితో తోచిన సర్పము ఏ రకంగా త్రాడు కన్న వేరు కాదో, అలాగే జగత్తు కూడా పరబ్రహ్మ కన్న వేరు కాదు.

అజ్ఞానముచే కల్పించబడిన వస్తువులు ఎప్పుడూ అధిష్టానము కన్న వేరు కావు. ఎందుకంటే అసలు అక్కడ వస్తువే లేదు. అజ్ఞానంతో కల్పించబడింది. అజ్ఞానం పోగానే వస్తువు స్వస్వరూపంలో ఉంటుంది. త్రాడులో ఆరోపించబడిన పాము త్రాడుకన్న వేరు కాదు. అలాగే బ్రహ్మము నందు ఆరోపించబడిన జగత్తు బ్రహ్మము కన్న వేరుకాదు.

**నభిద్యతే యథా దంతి స్వస్వరూపేణ దారుణః ।**

**స్వరూపేణ తథా విశ్వం బ్రహ్మణో నైన భిద్యతే ॥ 105**

కొయ్యతో చేసిన ఏనుగు కొయ్యకన్న వేరు కానట్లే ఈ జగత్తు పరబ్రహ్మ కన్న వేరు కాదు.

కొయ్యతో చేయబడిన ఏనుగు ఎప్పటికీ కొయ్య కన్న వేరు కాదు. అలాగే ఈ జగత్తుకు కూడా దానికి ఉపాదాన కారణమయిన పరబ్రహ్మ కన్న వేరు కాదు. ఇక్కడ చిన్న అనుమానం. ఏమంటే కొయ్యఏనుగు భ్రాంతి కల్పితము కాదు కదా? అలాంటప్పుడు ఈ ఉదాహరణ నిలవదు కదా? ఇది అనుమానం. ఇక్కడ చూడవలసినది ఏమిటి అంటే వివర్తము వల్ల కలిగేవన్నీ భ్రాంతితో కల్పించబడినదే కానవసరం లేదు. ఒక కొయ్య దుంగను చూసి మనిషి అనుకున్నారు. ఇక్కడ దుంగలో మనిషి ఆరోపించబడ్డాడు. అలాగే ఉలి బాడిస మొదలగు పనిముట్ల సాయంతో ఆ స్తంభంలో ఏర్పరచిన బొమ్మకు కూడా వివర్తమే కారణము.

**యత ఏవం తతో విశ్వం సర్వం బ్రహ్మైవ కేవలం ।**

**విచార్యమాణే సద్యుక్తి శ్రుతి స్మృత్యుపపత్తిభిః ॥ 106**

ఉత్తమమైన ప్రమాణాలు, వేదాలు స్మృతులు, యుక్తులు గతంలో మనకున్న అనుభవాలు వీటన్నింటితోను బాగా ఆలోచించినట్లైతే ఈ జగత్తంతా బ్రహ్మము కన్న వేరు కాదు. అందుచేత బ్రహ్మము అద్వితీయము.

జగత్తులో బ్రహ్మము కన్న వేరైనది ఏదీ లేదు. అన్నింటికీ కారణమైనది. సర్వవ్యాపి, సర్వానికి చేతనము ఇచ్చేది బ్రహ్మమే. కాబట్టి శ్రుతులు, స్మృతులు, వేదాలు, ప్రమాణాలు, వాదనలు, ప్రతివాదనలు, మనకున్న అనుభవాలు వీటన్నింటినీ దృష్టిలో పెట్టుకుని ఆలోచించినా జగత్తంతా బ్రహ్మమయం అని తెలుస్తోంది. **'అహంసర్వస్యప్రభవః'** సమస్త జగత్తుకు కారణభూతుడను నేనే. ఈ జగత్తంతా ఒక అంశతో ఆవరించి ఉన్నాను. అనే మాటలు బ్రహ్మని గురించి చెప్పటం జరిగింది. ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. బ్రహ్మానికి అంశలు ఉన్నాయా? బ్రహ్మానికి అంశలు లేవు. కాని విషయం బాగా అర్థం కావాలి అనే కోరికతో, **'జగత్తంతా బ్రహ్మమయము'** అనే మాటను విశదీకరించటం కోసం ఈ మాటలు చెప్పటం జరిగింది. అంతేకాని నిజంగా బ్రహ్మానికి అంశలు లేవు. బ్రహ్మము ప్రపంచాతీతుడు. కాబట్టి బ్రహ్మము కన్న వేరైన పదార్థము ఇంకొకటి లేదు. ఈ విషయం నిర్ధారించటానికే **'అనేక కోటిబ్రహ్మాండ జననీ'** కొన్ని కోట్ల బ్రహ్మాండాలను బ్రహ్మము సృష్టించింది అని కూడా చెప్పారు.

**విశ్వం బ్రహ్మాభిన్న మేవ స్వయం భవితు మర్హతి ।**
**అధిష్ఠానా నతిరిక్త స్వరూపత్వాద్గుణాహివత్ ॥** **107**

ఆశ్రయం కన్న వేరుగాని రూపం కలిగి ఉండటం చేత ఈ జగత్తంతా బ్రహ్మము కన్న వేరు కానిదే.

ఈ జగత్తు బ్రహ్మము కన్న వేరు కాదు. ఇది బ్రహ్మావివర్తము. అజ్ఞానంతో బ్రహ్మ నుంచి ఆవిర్భవించింది. అధిష్టానము కన్న వేరుగా ఇంకొక రూపాన్ని కలిగి ఉండటానికి వీలులేదు. త్రాడులో ఆరోపించబడిన ఊహించబడిన పాములాగా ఏ పదార్థము దేని నుండి ఆవిర్భవించిందో, దేనికన్న భిన్నమైన రూపము ఆకారము లేకుండా ఉంటుందో, అది దాని అధిష్టానము కన్న వేరుకాదు. ఇక్కడ త్రాడు వంకర టింకరగా ఉంది. మనం చూసినప్పుడు పాము మెలికలు తిరిగి పడుకుంది. చుట్ట చుట్టుకుని పడుకుంది అనుకుంటాం. ఎందుకంటే త్రాడు పాము రెండూ ఒకే ఆకారంలో ఉంటాయి. ఈ జగత్తు కూడా బ్రహ్మ వివర్తమే. బ్రహ్మ పరిణామమే. అందుచేత పాము త్రాడుకన్న ఏ రకంగా వేరు కాదో, అలాగే జగత్తు కూడా బ్రహ్మము కన్న వేరు కాదు. **విశ్వం బ్రహ్మాభిన్నం అధిష్టానా నతిరిక్త స్వరూపత్వాత్ రజ్జు సర్పవత్.**

**ఇదం బ్రహ్మవివర్తత్వాత్ బ్రహ్మాభిన్నం జగత్సదా ।**

**మృద్వివర్తః స్వయం కుంభో మృదభిన్నో యథా తథా ॥** **108**

మట్టితో తయారైన కుండ ఆ మట్టికన్న ఎలా వేరు కాదో అలాగే బ్రహ్మము నుంచి కల్పించబడిన జగత్తు బ్రహ్మము కన్న వేరు కాదు.

త్రికాలము లందు కూడా జగత్తు అంతా బ్రహ్మమే. ఏ కాలంలో అయినా, ఏ యుగంలో అయినా బ్రహ్మము కన్న వేరైనది ఏదీలేదు. కాని ఇదంతా బ్రహ్మమే అనే మాటను గుర్తించలేకపోతున్నారు అజ్ఞానులు. మట్టితో కుండను తయారుచేశాం. మట్టికీ కుండకీ ఎక్కడా పొంతన లేదు. అందుకే అజ్ఞానులు కుండను చూసి ఇదిమట్టి అని తెలుసుకోలేకపోతున్నారు. కుండ మట్టి కన్న వేరు కాదు. తనయుడు తండ్రికన్న వేరు కాదు. కారణము కన్న కార్యము వేరు కాదు. ఈ జగత్తు కూడా అలాంటిదే. అజ్ఞానంతో బ్రహ్మము నందు కల్పించబడింది. కాబట్టి జగత్తు బ్రహ్మముకన్న వేరుగా ఉండటానికి వీలులేదు.

**"ఇదం బ్రహ్మాభిన్నం బ్రహ్మవివర్త్యాత్ మృద్వివర్త ఘటవత్"**

మట్టితో తయారైన కుండ మట్టికన్న ఏ రకంగా వేరు కాదో, అలాగే జగత్తు బ్రహ్మము కన్న వేరు కాదు.

**బ్రహ్మాభిన్నం స్వతః సత్తా రహి తత్వాదిదం జగత్ ।**

**శుక్తిరూప్యవదిత్యాద్యా జయంతి బహుయుక్తయః ॥** **109**

జగత్తు స్వాభావికంగా ఉనికి లేనిది. ముత్యపుచిప్పలో అజ్ఞానంతో ఆరోపించబడిన వెండిలాగా అధిష్టానమైన బ్రహ్మము కన్న ఈ జగత్తు వేరుకాదు.

ఈ జగత్తు అనేది బ్రహ్మముకన్న వేరు కాదు. దీనికి కారణము జగత్తుకు ప్రత్యేకమైన ఉనికి లేకపోవటమే. జగత్తుకు స్వతంత్ర ప్రతిపత్తి లేదు. అది అజ్ఞానముతో బ్రహ్మము నందు కల్పించబడింది. ఇలా కల్పించబడిన వస్తువులకు అధిష్టానము కన్న వేరే ఏవీ ఉండవు. సముద్రంలో ముత్యపుచిప్ప తేలియాడుతున్నది. సూర్యకాంతి దానిమీద పడి మిలా మిలా మెరుస్తున్నది. చూసిన వారికి వెండి గిన్నెలాగా కనిపిస్తున్నది. ఈ జగత్తు కూడా అలాంటిదే. అందుకే జగత్తుకు బ్రహ్మానికీ భేదం లేదు.

**విశ్వస్య బ్రహ్మాభిన్నత్వే శ్రుతయో పిచ జాగ్రతి ।**
**ఐతీదాత్మ్యమిదం సర్వం స ఇదం సర్వ మిత్యుత ॥** 110

**విద్దీదం సర్వమిత్యేవ సర్వం ఖల్విద మిత్యసౌ ।**
**బ్రహ్మైవేదం విశ్వమిద మిత్యాద్యాస్తత్ప్రయోజనాః ॥** 111

ఈ జగత్తంతా బ్రహ్మముకన్న వేరు కాదు అని చెప్పటానికి శ్రుతి ప్రమాణం ఉంది. ఈ సమస్త పరబ్రహ్మమే. ఈ జగత్తంతా పరబ్రహ్మ అని తెలుసుకో.

ఇప్పటిదాకా చెప్పిన విషయాలను సిద్ధాంతీకరించటానికి అనేకమైన శ్రుతులు ఉన్నాయి. **ఐతదాత్మ్యమిదం సర్వంస ఇదం సర్వం** చరాచర జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే అంటున్నాయి శ్రుతులు.

**విద్దీదం సర్వం బ్రహ్మ**

**సర్వభిల్విదం బ్రహ్మ**

**బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్టం**

ఇవన్నీ శ్రుతివాక్యాలే. జగత్తుకు బ్రహ్మానికి భేదం లేదని చెబుతున్నాయి ఇవన్నీ.

**వాసుదేవ స్సర్వమిదం సర్వం విష్ణుమయం జగత్ ।**
**బ్రహ్మమాత్ర మిదం సర్వం బ్రహ్మైవసకలం జగత్ ॥** 112

**భూతాని విష్ణు రిత్యాద్యా శ్శతశో థసహస్రశః ।**
**విశ్వస్య బ్రహ్మ భిన్నత్వే జయంతి స్మృతయో పిచ ॥** 113

చరాచర జగత్తంతా విష్ణుమయమే. అంటున్నాయి స్మృతులు.

ఇప్పటిదాకా శ్రుతులను ఉదహరించి ఇప్పుడు స్మృతులు చెబుతున్నారు. శ్రుతి అంటే వేదము. స్మృతి అంటే ధర్మశాస్త్రము. అంటే ఇప్పటిదాకా వేదాలను చెప్పి ఇప్పుడు ధర్మశాస్త్రాలను చెబుతున్నారు.

**వాసుదేవ స్సర్వమిదం సర్వం విష్ణుమయం జగత్**

**బ్రహ్మం మాత్రమిదం సర్వం బ్రహ్మైవ సకలం జగత్**

**భూతానివిష్ణుః**

"చరాచర జగత్తంతా వాసుదేవుడు నిండి ఉన్నాడు. జగత్తంతా విష్ణుమయము' అంటున్నాయి ధర్మశాస్త్రాలు.

**బ్రహ్మాత్మనా జగద్భాతి శుద్ధబుద్ధేర్మహాత్మనః ।**
**బ్రహ్మైవ జగదాకృత్యా భాత్యశుద్ధధియో సతః ॥ 114**

జ్ఞానియైన వాడికి ఈ జగత్తు పరబ్రహ్మ లాగా కనిపిస్తుంది. అజ్ఞానికి పరబ్రహ్మమే జగత్తుగా కనిపిస్తుంది.

ఇక్కడ జగత్తు, బ్రహ్మ వేరు కాదు. జ్ఞానియైన వాడు, సర్వాన్ని విమర్శించి సూక్ష్మదృష్టితో చూడగలవాడికి ఈ జగత్తంతా బ్రహ్మముగానే కనిపిస్తుంది. విమర్శించి చూడలేని వాడికి సాక్షాత్తు పరబ్రహ్మ కూడా జగత్తు గానే కనుపిస్తుంది. ఏదైనా ఒక వస్తువు విషయం తెలిసిన వాడికి ఒక రకంగా, తెలియని వాడికి ఇంకో రకంగా కనుపిస్తుంది. అలాగే జ్ఞానికి జగత్తంతా బ్రహ్మముగా కనిపిస్తే అజ్ఞానికి బ్రహ్మము కూడా జగత్తు లాగానే కనిపిస్తుంది.

**అంతర్దృష్టేః స్వయం భాతి హేమాకృత్యైవ కుండలం ।**
**హేమైవకుండలాకృత్యా బహిర్దృష్టేః ప్రతీయతే ॥ 115**

తరచి చూస్తే కర్ణాభరణాలు బంగారమే. ఆ రకమైన ఆలోచన లేనివాడికి అని ప్రత్యేకమైన ఆభరణాలు.

బంగారంతో అనేక రకాలయిన ఆభరణాలు తయారుచేస్తారు. అప్పుడు చూసే వారికి అవి వివిధ రకాలుగా కనుపిస్తాయి. వస్తువు ఒకటే అయినా తలా ఒక రకంగాను కనుపిస్తుంది. దీనికి కారణం వారి ఆలోచనా విధానం. బంగారంతో ఎన్ని రకాల ఆభరణాలు తయారుచేసినా, వాటిలో ఉండేది బంగారమే. ఇవన్నీ బంగారమే అనే మాట కేవలము జ్ఞానం కలవాడికి మాత్రమే తెలుస్తుంది. అజ్ఞానికి ఆ విషయం తెఇయదు. అవన్నీ వివిధ రకాలు అనుకుంటాడు. కాబట్టి వస్తువు ఒకటే అయినా చూసేవాడిని బట్టి రకరకాలుగా కనుపిస్తుందనటంలో సందేహం ఏ మాత్రం లేదు.

**అప్యంధ దృష్టేః సర్వత్ర తమ ఏవ ప్రతీయతే ।**

**చక్షుష్మత స్తేజ ఏవ యథా తద్వదసన్మతే ॥ 116**

**బహిరంతశ్చ సర్వత్ర విశ్వమేవప్రతీయతే ।**

**శుద్ధాత్మనో బ్రహ్మవిదో బ్రహ్మైవ సమదర్శినః ॥ 117**

గ్రుడ్డివాడికి పగటికీ రాత్రికీ తేడా లేదు. అంతా అంధకారమే. కంటిచూపు గలవాడికి పగటి పూట వెలుగు, రాత్రి చీకటి. అదే జ్ఞానికి పగలు, రాత్రి అంతా దివ్యమైన కాంతియే. జ్ఞానికి శరీరంలోపలా, బయటా, సర్వత్రా బ్రహ్మమే కనుపిస్తుంది.

ఇప్పుడు ఇంకొక ఉదాహరణ చెబుతున్నారు. గ్రుడ్డివాడున్నాడు. వాడికి కళ్ళు కనిపించవు. అంతా అంధకారంగా ఉంటుంది. పగలు రాత్రి తేడా ఉండదు. ఎంత కాంతి ప్రసరిస్తున్నా వాడికి అంతా అంధకారమే. అదే జ్ఞానియైన వాడు చిమ్మచీకట్లో ఉన్నా అంతా దివ్యమైన వెలుగే. అలాగే అజ్ఞాని రక్తమాంసాలతో కూడిన ఈ దేహాన్ని చాలా అందంగా చూస్తాడు. శరీరంలోని ఒక్కొక్క భాగాన్ని ఒక్కొక్క రకంగా భావన చేస్తాడు. భావోద్వేగం పొందుతాడు. కాని జ్ఞాని మాత్రం శరీరాన్ని శవంలాగా చూస్తాడు. శరీరం లోపలా బయటా అంతటా అతడికి బ్రహ్మమే కనుపిస్తుంది.

**సదేవ విశ్వం విపరీతదృష్టేః**

**పరీతదృష్టేర్జగదేవ సత్స్యాత్ ।**

**అతద్జ్ఞదృష్ట్యా తు మణిశ్శిలా స్యాత్**

**తద్ జ్ఞస్య దృష్ట్యాతు శిలా మణిః స్యాత్ ॥ 118**

నాణ్యత, విలువ తెలియని అజ్ఞానికి ఎంత విలువైన రత్నమైనా రాయిలాగే కనిపిస్తుంది. నాణ్యత తెలిసిన వాడికి ఆ రాయే రత్నం అనిపిస్తుంది. అలాగే అజ్ఞానికి కనుపించే నామరూపాత్మకమైన జగత్తు జ్ఞానికి పరబ్రహ్మలాగా కనిపిస్తుంది.

ఆలోచించి, విచారించి, శోధించిన వాడికి తత్త్వం బోధ పడుతుంది. అప్పుడు ఈ జగత్తులో సత్యము నిత్యము శాశ్వతమైనది. బ్రహ్మము ఒక్కటే అనే విషయం తెలుస్తుంది. చరాచర జగత్తంతా పరబ్రహ్మ స్వరూపంగానే దర్శించగలుగుతాడు. ఒక మంచి నాణ్యత గల విలువైన రత్నం దొరికింది. ఉదాహరణకు కోహినూరు

వజ్రమే సామాన్యుడికి దొరికింది అనుకోండి. ఇతనికి ఆ రాయి విలువ తెలియదు. దాన్ని మామూలు రాయిగానే చూస్తాడు. అదే వజ్రాల విలువ తెలిసిన వాడైతే దాన్ని వజ్రంగా గుర్తిస్తాడు. అలాగే అజ్ఞాని జగత్తును నామరూపాత్మకమైనదిగా గుర్తిస్తే, జ్ఞాని అదే జగత్తుని పరబ్రహ్మ స్వరూపంగా గుర్తిస్తాడు.

**అదిష్టానే పరిజ్ఞాతే సచ్చిదానంద లక్షణే ।**

**బ్రహ్మైవ సకలం విశ్వం భోక్త భోగ్యాది లక్షణమ్ ॥ 119**

సచ్చిదానంద స్వరూపమయిన బ్రహ్మాన్ని గురించి తెలియగానే అజ్ఞానం పటాపంచలై సమస్తము బ్రహ్మముగానే తెలుస్తుంది.

పూర్తిగా విచారణ చేసి భ్రాంతికి ఆధారమైన సచ్చిదానంద రూపాన్ని తెలుసున్న వాడికి జగత్తంతా బ్రహ్మమయము అని తెలుస్తుంది. జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము వంటివి బ్రహ్మము కన్న వేరు కావు. వాస్తవ స్థితిలో అంతా మనోవికారమే.

**బ్రహ్మైవ పంచభూతాని బ్రహ్మైవ భువనత్రయం ।**

**బ్రహ్మైవాహం బ్రహ్మ చ త్వం బ్రహ్మణో న్యన్నకించన ॥ 120**

పంచభూతాలు, ముల్లోకాలు, గురువు, శిష్యుడు అంతా పరబ్రహ్మమే. జగత్తులో బ్రహ్మమును మించినది ఏదీలేదు.

జగత్తులో అన్నీ పరమేశ్వర స్వరూపమే. పంచభూతాలు, తన్మాత్రలు, ఊర్ధ్వలోకాలు, అథోలోకాలు, అహంకార మమకారాలు, మంత్రము, దేవత, గురువు, శిష్యుడు, నువ్వు, నేను అంతా పరబ్రహ్మ స్వరూపమే. అంతకు వేరైనది ఏదీ లేదు.

**చిద్వ్యోమ కేవలమనంతమనాదిమధ్యం**

**బ్రహ్మైవభాతి నిజచిత్తవశాత్స్వయంభూః ।**

**ఆకారవానివ పుమానివ వస్తుతస్తు**

**వంధ్యాతనూజ ఇవతస్యతు నాస్తిదేహః ॥ 121**

బ్రహ్మము ఆద్యంతములు లేనిది. అవధులు లేనిది. అద్వితీయమైనది, స్వయంభువు, జ్ఞానరూపమైనది. చూసేవాడి మనస్సు ననుసరించి రూపం గల దానిలాగా ప్రకాశిస్తుంది. గొడ్రాలి పుత్రుడులాగా బ్రహ్మానికి కూడా ఆకారం లేదు.

పరబ్రహ్మ స్వరూపానికి చావు పుట్టుకలు లేవు. అది ఇంతవరకే ఆవరించి ఉంటుంది అనటానికి ఒక పరిధి లేదు. దానితో సమానమైనది కాని, దానికన్న అధికమైనది గాని వేరొకటి లేదు. అది సర్వవ్యాపి. దానికి నామరూపాలు లేవు. ఇటువంటి పరబ్రహ్మ భ్రాంతివలన ఒకరూపాన్ని సంతరించుకుని స్త్రీగా, పురుషునిగా, పశువుగా, పక్షిగా, క్రిమికీటకాలుగా భిన్నమైన రూపాలుగా, అడవులు, కొండలు, బండలు, వృక్షాలు, చెట్లు, చేమలు, స్థావరజంగమాలుగా సాత్వీకుడుగా, దుర్మార్గుడుగా, రాక్షసుడుగా, దేవతగా, జీవుడుగా, ఈశ్వరుడుగా అనేక రూపాలు ధరిస్తాడు. నిజానికి అతడు నిర్వికారుడు, నిర్గుణుడు. నామరూపాలు లేనివాడు. గొడ్రాలి కొడుకు. అసలు రూపమే లేనివాడు.

**మయా తతమిదం సర్వం జగదవ్యక్త మూర్తినా ।**
**మత్థాని సర్వభూతాని న చాహం తేష్వవ స్థితః ॥** 122

**న చ మత్థాని భూతాని పశ్యమే యోగమైశ్వరం ।**
**ఇతి విశ్వవ్యాపకత్వా ధారత్వే చాత్మనో హరిః ॥** 123

**సూచయిత్వా పనుదతి భూతేషు స్వస్య సంస్థితం ।**
**భూతానామపి స్వస్థత్వం స్వస్యాద్వైతత్వ సిద్ధయే ॥** 124

ఎవరికీ తెఇయరాని నేను ఈ జగత్తంతా వ్యాపించి ఉన్నాను. జీవజాలమంతా నాలోనే ఉంది. కాని నేను వాటిలో లేను. జంతువులు పశువులు పక్షులు నాలో లేవు. అని గీతాచార్యుడైన శ్రీకృష్ణపరమాత్ముడు చెప్పాడు. నేను జగత్తంతా వ్యాపించి ఉన్నాను. జగత్తుకు ఆధారంగా ఉన్నాను. నేను ఒక్కడినే అంటున్నాడు.

శ్రీకృష్ణభగవానుడు గీతలో **మయాతతమిదం సర్వం** "ఈ జగత్తంతా నేనే వ్యాపించి ఉన్నాను. జగత్తులో నాకన్న వేరైనది ఏదీ లేదు. ఈ జగత్తుకు నేనే ఆధారమై ఉన్నాను. జగత్తంతా భ్రాంతిచేత నాలో కల్పించబడింది. ఈ జగత్తు భ్రాంతి వల్ల ఏర్పడింది కాబట్టి అధిష్టానము కన్న వేరు కాదు. అధిష్టానమయిన నేను ఎప్పటికీ అద్వితీయుడనే అన్నాడు. ఈ విషయాన్ని నిరూపించటం కోసం నేను భూతాలయందు లేను. భూతాలు నా యందు లేవు. అంటే భూతాలకు నాకు భేదం లేదు. నేను భూతాలయందు ఉన్నానని గాని, భూతాలు నా యందున్నాయని గాని చెప్పటానికి లేదు." అంటాడు. అంటే భూతాలు వేరు పరమాత్మ వేరు కాదు.

**అద్వయత్వమతః సిద్ధం ప్రమాణైరఖిలైరపి ।**

**నైవాత్ర సంశయః కార్యః బ్రాహ్మణైర్బ్రహ్మ వాదిభిః ॥ 125**

ఈ కారణాల చేత అన్ని ప్రమాణాలచేత కూడా జీవబ్రహ్మాభేదము స్వభావంగానే సిద్ధించింది. పరబ్రహ్మను వివరిస్తూ బ్రాహ్మణులు అనేక విషయాలు చెప్పారు. వాటిలో ఏ రకమైన సందేహము లేదు.

కాబట్టి శ్రుతులు, స్మృతులు, వేదాలు, శాస్త్రాలు అన్ని రకాల ప్రమాణాలు ఆధారంగా విచారించినప్పటికీ జీవుడికి, బ్రహ్మానికీ భేదం లేదని తెలుస్తున్నది. ఇక్కడ బ్రాహ్మణులు అంటే బ్రహ్మను తెలుసుకోవాలనే కోరిక ఉన్నవారు, నిరంతరము సత్యాన్వేషణ చేసేవారు అనేక విషయాలు చెప్పారు. వాటిమీద ఏ సందేహము లేదు. అవన్నీ నిజమే.

**విచార్యమాణే సద్బుద్ధ్యా శ్రుతి స్మృత్యు పపత్తిభిః ।**

**సదేవేదం జగత్సర్వం సద్వివర్తం యతః స్వయమ్ ॥ 126**

వేదాలు, ధర్మశాస్త్రాలు, అనుభవము వీటన్నింటితోను బాగా లోతుగా ఆలోచించగా చరాచర జగత్తు ఏ పరబ్రహ్మ యొక్క మార్పు వికారము అయి ఉన్నదో, అదే బ్రహ్మము.

లోకానుభవాన్ని గనక తీసుకున్నట్లైతే భేదము అనేది నిజం కాదు. నిర్మలమైన మనస్సుతోను, శ్రుతులు, స్మృతులు, యుక్తులు అన్నీ కలిపి బాగా ఆలోచిస్తే ఏ విషయము సర్వప్రమాణ సిద్ధమవుతు స్థిరమవుతున్నదో, ఆ విషయమే సర్వసిద్ధాంత సారము. దాన్ని గట్టి చేసే అనుభవమే యథార్థానుభవము. కాబట్టి కేవలము అనుభవాన్ని మాత్రమే ఆధారంగా చేసుకుని నిర్ణయించరాదు. బ్రహ్మ జగత్తు ఈ రెండింటి మధ్యన ఉన్న తేడా ఏమిటి అని విచారిస్తే, అంతా బ్రహ్మమే అవుతుంది. జగత్తంతా బ్రహ్మము యొక్క వికారమే. జగత్తే బ్రహ్మము బ్రహ్మమే జగత్తు.

**హేమ్నో వివర్తం కటకం హేమైవ భవతి స్వయం ।**

**శిలావివర్తః శ్రీవిష్ణుః శిలైవ భవతి స్వయమ్ ॥ 127**

**యథాతథైవ సకలం స్వరూపేణ స్వయం జగత్ ।**

**బ్రహ్మైవ తస్య నిత్యత్వా త్తదభావో నసిధ్యతి ॥ 128**

ఏ రకంగా అయితే బంగారంతో చేసి కంకణము బంగారమే అవుతున్నదో, రాతితో చెక్కిన శిల్పము రాయే అవుతున్నదో అలాగే చరాచర జగత్తంతా బ్రహ్మమే అవుతున్నది.

బాగా ఆలోచిస్తే బంగారంతో తయారుచేసిన ఏ ఆభరణమైనా బంగారమే అవుతుంది. రాతితో చెక్కిన ఏ శిల్పం అయినా అది విష్ణువు కాని, శివుడు కాని ఇంకేదయినా కాని అది రాయే అవుతుంది. అలాగే సమస్త జగత్తు బ్రహ్మము యొక్క వికారమే కాబట్టి జగత్తంతా బ్రహ్మమే అవుతుంది. ఒక విధముగా ఉన్న బ్రహ్మము వేరొక విధంగా భావించటం చేత కలిగినదే కాబట్టి భూత భవిష్యద్వర్తమాన కాలంలో ఎప్పుడూ అది బ్రహ్మము కన్న వేరు కాదు. ఇది సర్వప్రమాణమైన సిద్ధాంతము. బ్రహ్మము అవినాశి అందుచేత జగత్తు కూడా ఎప్పటికీ నాశనం కాదు. అజ్ఞానులకు ఎప్పుడూ బ్రహ్మము అనేక రకాలుగా కనుపిస్తుంది. జ్ఞానులకు మాత్రం జగద్బ్రహ్మలకు అభేదము కనుపిస్తుంది. ఏదైనా స్వతంత్ర ప్రతిపత్తి గలిగిన వస్తువుకునాశనము అనేది ఉంటుంది. కాని త్రికాలములందు అధిష్టానము కన్న వేరు కాని వస్తువుకు నాశనము ఎలా ఉంటుంది? ఉండదు.

**వాఙ్మాత్రలాభస్త్వత్పక్ష స్త్యజ్యతామతిదూరతః ।**
**లోకే వస్త్వస్వభావాఖ్య మితి యేతు వదంతి తే ॥ 129**

**న శ్రోత్రియా నశాస్త్రజ్ఞా నతత్వజ్ఞాన సాధవః ।**
**అభావో పి చ భావో పి సర్వం బ్రహ్మైవ తచ్ఛృణు ॥ 130**

**సచ్చ త్వచ్చేత్యుపక్రమ్య జగద్భాతిం స్వయం శ్రుతిః ।**
**సత్యం చానృతం సత్య మిత్యంతగ్రంథతః స్ఫుటమ్ ॥ 131**

**సద్బ్రహ్మైవాభవత్సర్వ మితి వక్తిస్వయం యతః ।**
**తతో భావాభావరూపం సకలం సత్యమేవ హి ।**
**బ్రహ్మైవ సత్యశబ్దార్థః సత్యం జ్ఞానమితి శ్రుతే ॥ 132**

జీవబ్రహ్మలకు భేదమున్నది అనే మాటను వదలి పెట్టండి. ఎవరైతే లోకంలో బ్రహ్మము కన్న వేరైన పదార్థమున్నదంటారో, వారు వేదవేత్తలు కారు. శాస్త్రపండితులు కారు. యధార్థ స్థితి తెలిసినవారు కాదు. సత్పురుషులు కారు. చిత్తశుద్ధి కలవారు

కాదు. కలిమి లేమి అంతా బ్రహ్మమే. రూపమున్నది, రూపం లేనిది అంతా బ్రహ్మమే అంటోంది వేదం. ఈ సమస్తము ఉనికియే స్వరూపముగా గలది బ్రహ్మమే. జగత్తులో ఉన్నది లేనిది అంతా బ్రహ్మమే. బ్రహ్మము సత్యరూపుడు, జ్ఞానరూపుడు. అన్నప్పుడు సత్యము అనే శబ్దానికి అర్థం బ్రహ్మమే.

లోకంలో ఉన్నది, లేనిది అని రెండు పదార్థాలున్నాయి. ఈ రెండూ ఒకదానికన్న ఒకటి వేరు కావు. శూన్యము, అశూన్యము కూడా బ్రహ్మమే. సత్యము నిత్యము శాశ్వతమైనది బ్రహ్మము. సత్యము అంటే బ్రహ్మమే. **సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ.** సచ్చిదానందము బ్రహ్మమే. జగత్తంతా బ్రహ్మమయం.

**గ్రహీతుర్గ్రహదోషేణ నానాత్వం న చ వస్తునః ।**

**తద్దృష్టం స్థాణురజ్జ్వాదౌ పండితైర్వస్తుదర్శిభిః ॥ 133**

ప్రత్యక్షముగా కనుపించే భేదము చూసే వారి దృష్టిని బట్టి ఉంటుంది. అంతేగాని బ్రహ్మ యొక్క దోషంతో మాత్రం కాదు.

బ్రహ్మము ఒకటిగానే ఉన్నది. కాని చూసేవారి దృష్టిని బట్టి అనేకంగా కనిపిస్తుంది. అది చూసే వారి దోషము తప్ప బ్రహ్మములో దోషము కాదు. బ్రహ్మపదార్థానికి భేదము ఎప్పుడూ లేదు. అజ్ఞానికి ఒక విధంగా ఉన్న వస్తువు ఇంకొక విధంగా కనుపిస్తుంది. అనుభవజ్ఞుడైన జ్ఞానికి ఈ విషయం బాగా తెలుస్తుంది. తాడు పాముగా కనుపించటం, ముత్యపు చిప్ప వెండిపాత్రలాగా కనుపించటం, ఎడారిలో ఎండమావులు ఇవన్నీ అందరికీ తెలిసినవే. అజ్ఞానికి యధార్థం కన్న వేరుగా కనుపిస్తాయి. జ్ఞానికి మాత్రం యధార్థ రూపం కనుపిస్తుంది. అందుచేతనే ఈ భేదము చూసేవారి దృష్టి ననుసరించి ఉంటుంది. అంతేకాని ఆ దోషము పరబ్రహ్మది కాదు.

**ఏక ఏవ స్వయం స్థాణు ర్నిజలక్షణలక్షితః ॥ 134**

**గ్రహీతు రేవధీదోషా త్ప్రత్యయస్తస్కరాత్మనః ।**

**ఉదేతి స్తంభరూపేణ స్థాణు స్తష్ఠతి నాన్యధా ॥ 135**

**తద్వదేవ గ్రాహకాణం ప్రత్యయో జగదాత్మకః ।**

**జాయతే బుద్ధి దోషేణ స్వయం బ్రహ్మత్వవిక్రియమ్ ॥ 136**

నిజలక్షణాలతో స్తంభము ఒకటే. కాని చూసేవాడి బుద్ధి లోపంవల్ల దొంగవాడుగా కనుపిస్తాడు. త్రికాలములందు ఆస్తంభము అలానే ఉంటుంది. అలాగే అజ్ఞానికి ఇది జగత్తు అనిపిస్తుంది. స్వాభావికంగా పరబ్రహ్మకైతే వికారం లేదు. లోకంలో సహజంగా జరుగుతుండే సంఘటనలు ఇవి. స్తంభాన్ని చూసి దొంగవాడు అనుకోవటం. మసకచీకటి, పెరడులో చెట్టు కొట్టి పడేసి ఉన్నది. యధాలాపంగా చూసిన వారికి ఎవరో కూర్చున్నట్లుగా అనిపిస్తుంది. ఇది అందరికీ తెలిసిందే. ఇక్కడ ఆలోచించాల్సిన విషయం ఏమంటే స్తంభంలో గాని, మానులో గాని మార్పు ఏమీ ఉండదు. గతంలోనూ అలాగే ఉంది. ఇప్పుడు అంటే దొంగవాడుగా భావించినప్పుడు అలాగే ఉంది. తరువాత అంటే అది దొంగవాడు కాదు చెట్టుమాను అని తెలిసిన తరువాత కూడ అది అలాగే ఉంది. అందులో ఏ మార్పు ఉండదు. చూసేవాడి అజ్ఞానం వల్ల బ్రహ్మమునందు జగత్తు భ్రాంతి కలుగుతుంది. బ్రహ్మానికి మాత్రం ఏ వికారాలు లేవు.

**అనాదికాలీననిరంతవాసనా**
**దోషేణ దుష్టా పురుషస్యబుద్ధిః ।**
**నానావిధం విశ్వమిహ ప్రసూతే**
**స్వప్నా దివద్బ్రహ్మణి కేవలే ద్వయా ॥** **137**

అనాదిగా అంతము లేకుండా వస్తోంది ఈ దోషము. అదే అజ్ఞానము. దీంతో మానవుడి బుద్ధి స్వప్నావస్థలో లాగా అనేక రకాలయిన ప్రపంచాన్ని పరబ్రహ్మము నందు సృష్టిస్తుంది.

అసలు యధార్థము ఏమంటే అజ్ఞానము అనేది ఇప్పుడు క్రొత్తగా వచ్చింది కాదు. అనాదిగా ఉన్నది. కొన్నికోట్ల జన్మల నుంచి ఈ అజ్ఞానము ఉన్నది. సామాన్యంగా స్వప్నావస్థలో అనేక విషయాలు కల్పించబడతాయి. సంతోషము, ఆనందము, దుఃఖము, భయము వంటి ఉగ్వేదాలు కలుగుతాయి. స్వప్నావస్థ కేవలము కల్పితము. కాని తెలియని విషయం ఏమంటే జాగ్రదావస్థ కూడా కల్పితమే. ఈ దశలో మనం చూసే కొండలు, బండలు, ఎడారులు, అడవులు, సముద్రాలు మొదలైనవి, వివిధ రకాల జీవరాసి, స్థావర జంగమాలు అన్నీ కల్పితాలే. అజ్ఞానముచే బ్రహ్మయందు కల్పించబడినవే. ఈ నామరూపాత్మకమైన జగత్తు అజ్ఞానికి మాత్రమే

పరిమితము. అందుకే ఈ జగత్తంతా భ్రాంతి వలన ఏర్పడినదే కాని అంతకన్న వేరు కాదు.

**న బ్రహ్మణా నాపి శివేన విష్ణునా స్వప్నప్రపంచో నకదాపి దృష్టః ।**
**స్వయం ధియాం కల్పిత ఏవ భాతి తథైవ జాగ్రత్యపి బుద్ధికల్పితః ॥138**

స్వప్నావస్థలో ఈ జగత్తు బ్రహ్మచేత గాని, విష్ణువు చేతగాని, శివునిచేత గాని సృష్టించబడలేదు. కేవలము బుద్ధిచేతనే సృష్టించబడింది. అలాగే జాగ్రదావస్థలో కూడా ఈ జగత్తంతా మనస్సు లేదా బుద్ధిచేతనే సృష్టించబడింది.

సామాన్యంగా అందరూ అనుకుంటారు బ్రహ్మయే ఈ లోకాలను సృష్టిచేశాడు అని. బ్రహ్మ - సృష్టికర్త. విష్ణువు - స్థితికారకుడు, రుద్రుడు-లయకారకుడు అని పురాణాలు కూడా చెబుతున్నాయి. వారికి తెలియని విషయం ఏమంటే సృష్టికారకుడు బ్రహ్మ కాదు. మనస్సు, మనస్సు వల్లనే చరాచర జగత్తు సృష్టించబడుతోంది. జాగ్రదావస్థలోని అనుభవాన్ని బట్టే స్వప్నాలు కలుగుతుంటాయి. స్వప్న ప్రపంచం అంతా జాగ్రత్సంసారముతో కూడిన బుద్ధి చేత కల్పించబడింది. ఒక్కొక్కసారి కలలో తను ఎప్పుడూ చూడని ప్రదేశాలు కనిపిస్తాయి. తనకు పరిచయం లేని వ్యక్తులు తారస పడతారు. ఇది ఎలా సాధ్యం? అంటే గతజన్మలోని విషయాలు,కథలు, పురాణాలలో చెప్పిన విషయాలు, మనసులో ఊహిస్తున్న విషయాలు కలలోకి వస్తాయి. ఒక్కొక్కసారి జరగబోయే సంఘటనలు కలలో కనిపిస్తాయి. శుభాశుభాలను సూచిస్తూ ఉపాస్య దేవతలు ఇలాంటి స్వప్నాలు కలిగిస్తారు. ఇక్కడ ఒక మాట గుర్తించాలి. ఏమంటే జగత్తులాగానే ఉపాస్య దేవతలు కూడా మనోకల్పితాలే. నేను వేరు, దేవత వేరు అనేది కూడా భ్రాంతే. కాబట్టి ఈ భ్రాంతి దేవతలు కలలు చూపించి మనకు శుభాన్ని సూచిస్తారు. ఈ రకంగా స్వప్న జగత్తంతా మనస్సు చేతనే సృష్టించబడుతోంది. అలాగే జాగ్రదావస్థలోని వాస్తవము అనుకుంటున్న జగత్తు కూడా నిజంగా వాస్తవం కాదు. అదికూడా మనోకల్పితమే.

**ధీకల్పితత్వేన హి జాగ్రదీక్షితం నస్వప్నకాలే జగదస్తి తద్వత్ ।**
**స్వప్నేక్షితం నాస్తి చ జాగ్రతీహ ద్వయోశ్చ సుప్తావతిశూన్యతా తతః ॥139**
**యత్ర చిత్తం తత్ర విశ్వం స్వయమేవ ప్రతీయతే ।**
**యత్రచిత్తం నాస్తి తత్ర నాస్తి కించిజ్జగత్కథా ? 140**

మనస్సుచేత కల్పించబడినందు వల్ల జాగ్రదావస్థలోని జగత్తు స్వప్నావస్థలో ఉండదు. అలాగే స్వప్నావస్థలోని జగత్తు జాగ్రదావస్థలో ఉండదు. సుషుప్తిలో అసలు ఏవీ ఉండవు. కాబట్టి ఎక్కడ ఏ అవస్థలో మనస్సు ఉంటుందో అక్కడే జగత్తు ఉంటుంది. ఏ అవస్థలో మనస్సు ఉండదో అక్కడ జగత్తు ఉండదు.

స్వప్న ప్రపంచంగాని, జాగ్రదావస్థలోని జగత్తు గాని రెండూ మనసు చేతనే కల్పించబడినవి. అందుకనే జాగ్రదావస్థలోనిజగత్తు స్వప్నావస్థలోగాని, స్వప్నావస్థలోని జగత్తు జాగ్రదావస్థలోగాని ఉండదు. బాహ్యేంద్రియాలతో గ్రహించగలిగినది కాబట్టి జాగ్రత్ప్రపంచాన్ని బాహ్యప్రపంచము అంటారు. ఇంద్రియాలకు అందని ప్రపంచాన్ని స్వప్నప్రపంచము అభ్యంతరప్రపంచము అంటారు. సుషుప్తిలో మనసు కూడా లయం అయిన తరువాత ఈ ప్రపంచము ఏమీ ఉండదు. కాబట్టి మనస్సు ఎక్కడ ఉంటుందో జగత్తు అక్కడ ఉంటుంది. మనస్సు లేనిచోట జగత్తు ఉండదు.

**స్వప్నే పిజాగ్రత్యపి చిత్తసత్వాత్ప్రతీయ తే విశ్వమశేష మేతత్ ।**
**చిత్తస్య నాశే సతి సుప్తికాలే నాస్త్యేవ విశ్వం సకల ప్రసిద్ధే ॥ 141**

స్వప్నావస్థలోను జాగ్రదావస్థలోను మనస్సు ఉండటం వల్ల పరిపూర్ణ జగత్తు ఉంటోంది. అదే సుషుప్తిలో మనసు ఉండదు కాబట్టి జగత్తు కూడా ఉండదు.

ఈ విషయం కూడా అందరికీ తెలిసిందే. ముందుగా జాగ్రదావస్థకి స్వప్నావస్థకి తేడా చూడండి. జాగ్రదావస్థలో జ్ఞానేంద్రియాలు కర్మేంద్రియాలు మనసుతో సహా పని చేస్తారు. మనస్సు తన భావాలను బట్టి అనేక రకాలైన నిర్మాణాలు పనులు చేపడుతుంది. జాగ్రదావస్థలో ప్రతి వస్తువును ఇంద్రియాలతో తాకుతాము. పట్టుకుంటాము. తింటాము, అనుభవిస్తాము. కాబట్టి జాగ్రదావస్థ అంతా వాస్తవంగానే కనుపిస్తుంది. స్వప్నావస్థలో కూడా విషయాలన్నింటినీ కల్పించుకుంటుంది మనస్సు. జాగ్రదావస్థలోకి మల్లే ఇక్కడ విషయాలను ఇంద్రియాలతో అనుభవించము. అనుభవించినట్లుగా భావిస్తాము. నిద్ర లేవగానే కల కరిగిపోతుంది. ఈ రెండు అవస్థలకు తేడా ఏమంటే జాగ్రదావస్థలో కొన్న వస్తువు, అనుభవించిన విషయము, అనుభవాల తాలుకు జ్ఞాపకాలు అన్నీ అలానే ఉంటాయి. జాగ్రదావస్థలో ఇల్లు కట్టుకున్నాం. ఆ యింటికి గృహప్రవేశం చేస్తాం. ఇంట్లోకి వెడతాం. క్రొత్త ఇంట్లో సుఖంగా ఉంటాం. ఆ యిల్లు నాశనమయ్యేదాకా

అలాగే ఉంటుంది. వివాహం చేసుకున్నాం. భార్య ఇంటికి వచ్చింది. జీవించి ఉన్నంత వరకు ఎన్ని సంవత్సరాలు గడిచినా ఆమె అలానే ఉంటుంది. కాని స్వప్నావస్థలో అలా కాదు. మెలకువ రాగానే కట్టుకున్న ఇల్లు, భార్య అన్నీ మాయమై పోతాయి. అయితే జాగ్రస్వప్నాలు రెండింటికీ మనస్సు కారణము. మనస్సు చేతనే ఈ వస్తూత్పత్తి జరుగుతోంది. కాని సుషుప్తిలో అలా కాదు. ఇక్కడ మనసు కూడా లీనమై పోతుంది. మనసు కూడా పని చేయని స్థితి. అందుచేతనే ఈ జగత్తు కనిపించదు. దీనివల్ల తేలేది ఏమంటే ఏ అవస్థలో నైనా మనస్సు ఉంటేనే జగత్తు ఉంటుంది. మనస్సు లేకపోతే జగత్తు ఉండదు.

**భ్రాంతిమాత్రమిదం విద్వన్ విశ్వం బ్రహ్మణి కల్పితం ।**

**విద్ధి యస్మాత్స్వయంవిశ్వం బ్రహ్మజ్ఞానేన బాధ్యతే ॥ 142**

ఏ కారణమున ఈ జగత్తు బ్రహ్మజ్ఞానంతో నశించిపోతుందో, ఆ కారణముచేతనే ఈ జగత్తంతా పరబ్రహ్మ చేత కల్పించబడినదిగా భావించాలి.

అజ్ఞానము వల్ల కలిగిన జగత్తు, జ్ఞానము వల్ల నశిస్తుంది. ఇక్కడ నాశనము అంటే బాధ అంతేకాని ధ్వంసము కాదు. రోకళ్ళు పలుగులు పట్టుకుని ఎవరూ ఈ జగత్తును ముక్కలు చేయరు. కలలోని విషయాలు మెలకువ రాగానే ఎలా కరిగిపోతాయో అలాగే జ్ఞానం కలగగానే జాగ్రదావస్థలోని జగత్తు అదృశ్యమై పోతుంది. తన అధిష్టానంలో కలిసిపోతుంది. స్వప్నంలో అజ్ఞానంతో మనోభావంతో కలగంటాడు. మెలకువ రాగానే అంటే జ్ఞానం రాగానే కల కరిగిపోతుంది. కలలోని విషయాలు చాలా గుర్తుండవు. జాగ్రదావస్థలో కూడా అంతే తరుగుతోంది. ఇక్కడ మనస్సు తన అజ్ఞానంతో ఈ జగత్తును ఊహించుకుంటోంది. అదంతా ఊహ కల్పన. ఇంద్రియాలతో వాటిని తాకుతోంది. వాటి స్పర్శ తగులుతోంది. కాబట్టి వాటి స్థితి సత్యము అనుకుంటోంది. మంచి గురువు దగ్గర శుశ్రూష చేసి జ్ఞానాన్ని సముపార్జించిన తరువాత జాగ్రదవస్థలోని విషయాలు అసత్యము ఇవన్నీ అజ్ఞానం వల్ల ఏర్పడినాయి అని తెలుసుకుంటాడు. జగత్తంతా అదృశ్యమైపోతుంది. అప్పుడు మిగిలేది ఒక్కటే 'అధిష్టానమైన పరబ్రహ్మ' కాబట్టి జాగ్రదావస్థ స్వప్నావస్థ రెండూ ఒకలాంటివే. వీటిలోని దృశ్యాలన్నీ కేవలము మనోకల్పితాలు.

**శుక్తిజ్ఞానాద్యథా రూప్యం రజ్జుజ్ఞానాద్య థోరగః ।**

**తథాధిష్ఠానతద్బ్రహ్మ జ్ఞానాద్విశ్వం న దృశ్యతే ॥** **143**

ఇది ముత్యపుచిప్ప అని తెలియగానే వెండి ఎలా కనపడదో, ఇది త్రాడు అని తెలియగానే పాము ఎలా కనపడదో అలాగే అలాగే ఇది బ్రహ్మము అని తెలియగానే ఈ జగత్తు కనుపించదు.

ఈ జగత్తంతా బ్రహ్మమునందు ఆరోపించబడినంది. కాబట్టి బ్రహ్మరూప జ్ఞానము కలిగినప్పుడు ఈ జగత్తు బ్రహ్మము కన్న భిన్నముగా కనుపించదు. సముద్రంలో తేలియాడుతున్న ముత్యపుచిప్పను చూసి వెండిపాత్ర అని భ్రాంతి చెందినవాడికి ఇది వెండిపాత్ర కాదు ముత్యపుచిప్ప అని తెలియగానే అక్కడ వెండిపాత్ర కనుపించదు. త్రాడును చూసి పాము అని భ్రాంతి చెందిన వాడికి అది త్రాడు అని తెలియనంత వరకు పామే కనుపిస్తుంది. అది త్రాడు అని తెలిసిన తరువాత అక్కడ పాము కనుపించదు. అలాగే జగత్తు కంతటికీ అధిష్టానము పరబ్రహ్మ. ఈ జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమని తెలియనంత వరకు నామరూపాత్మకమైన జగత్తే కనిపిస్తుంది. జ్ఞానసముపార్జన చేశాక ఇది బ్రహ్మము అని తెలిస్తే ఇక నామరూపాత్మకమైన జగత్తు ఉండదు. బ్రహ్మజ్ఞానం కలగగానే అన్నీ అంతర్ధానమవుతాయి. అంతర్ధానం కావటం అంటే – పూర్తిగా నశించి పోతాయి అని గాని, నామరూపాలు ఏవీ కనిపించవని అర్థం కాదు. ఈ నాశనము బాధ. అంటే అజ్ఞానముతో ఇంకో రకంగా భావించిన వస్తువులను జ్ఞానము వలన యధార్థముగా తెలుసుకోవటము. జగత్తు నశిస్తుంది. అంటే పూర్వస్థితికి వస్తుంది. అందులో బ్రహ్మకన్న వేరైన పదార్థం ఏదీలేదు అని అర్థం.

**అధిష్ఠానా దర్శనత ఏవ విశ్వభ్రమస్సతాం ।**

**తస్మిన్ దృష్టే జగద్భ్రాంతి ర్ధూరా దేవ పలాయతే ॥** **144**

సత్పురుషులకు కూడా సర్వాధారమైన బ్రహ్మము గురించి తెలియకపోవటం చేత ఇది జగత్తు అనే భ్రాంతి కలుగుతోంది. బ్రహ్మమును గురించి తెలియగానే ఈ భ్రాంతి వదలిపోతుంది. సర్వానికి అధిష్టానమైన బ్రహ్మను గురించి తెలియకపోవటం చేతనే జగత్తు కనిపిస్తున్నది. ఇది జగత్తు అనిపిస్తున్నది. ఒకవేళ బ్రహ్మమును గురించి

తెలిస్తే నామరూపాత్మకమైన జగత్తు కాస్తా అంతర్ధానమవుతుంది. జగత్తు నశించదు. ఒకసారి నశించినది మళ్ళీ ఇంకోసారి పుడుతుంది. కాని అజ్ఞానము అలాకాదు. ఒకసారి జ్ఞానము గనక కలిగితే అజ్ఞానము పూర్తిగా పటాపంచలై పోతుంది. మళ్ళీ అజ్ఞానం రాదు. అజ్ఞానానికి ఒకసారి నశిస్తే అది మళ్ళీ వచ్చే స్వభావం లేదు. అందువల్ల జగత్తు మిధ్య అని తెలుసుకున్న వాడు మళ్ళీ ఎట్టి పరిస్థితులలోను జగత్తు సత్యము అనడు. అజ్ఞానము, భ్రాంతి మళ్ళీ జనించవు. ఒకసారి ముత్యపు చిప్పను చూసి వెండి పాత్ర అనుకున్నాడు. తరువాత కాదని తెలిసింది. మళ్ళీ కొన్నాళ్ళకి ముత్యపుచిప్ప నీటి మీద తేలియాడుతూ కనుపించింది. ఈసారి దాన్ని చూసి వెండిపాత్ర అనుకోడు. ఒకవేళ పొరబడి అనుకున్నా కొద్దిసేపటికే త్రిప్పుకుని ఇది వెండిపాత్ర కాదు ముత్యపుచిప్పే అని నిర్ధారించుకుంటాడు. ఇక్కడ రెండు పదాలను చూడాలి.

1. మూలాజ్ఞానము – సర్వకారణమగు జ్ఞానము
2. తూలాజ్ఞానము – తాత్కాలికమైన జ్ఞానము

రెండవసారి కూడా ముత్యపుచిప్పను చూసి వెండిపాత్ర అని భ్రమించటం తాత్కాలిక జ్ఞానము. దాన్నే తూలాజ్ఞానము అంటారు. మూలాజ్ఞానము బలంగా ఉండే **సర్వంఖిల్విదం బ్రహ్మ** అనే విషయం గట్టిగా బోధపడితే తూలాజ్ఞానము ఎన్నిసార్లైనా పుడుతుంది. ఎన్నిసార్లైనా నశిస్తుంది. జగద్విషయానికొస్తే బ్రహ్మాజ్ఞానంతో మూలాజ్ఞానమే ధ్వంసమై పోతుంది. కాబట్టి జగద్భ్రాంతి రెండవసారి కలగదు.

**యదసత్యం బాధ్యతే త చ్ఛుక్తి కారజతం యథా ।**
**యత్సత్యం బాధ్యతే తన్నో శుక్తికాశకలం యథా ॥ 145**

స్వాభావికంగా లేనిది ముత్యపుచిప్పలోని వెండిలాగా బాధింపబడుతుంది. జ్ఞానముతో నశిస్తుంది. స్వాభావికంగా ఉండేది ముత్యపుచిప్పలాగా బాధ పొందుతుంది.

ఇక్కడ చాలా జాగ్రత్తగా చూడండి. స్వాబావికంగా లేనిది ముత్యపుచిప్పలోని వెండి. అది బాధింపబడుతుంది. ఏ విధంగా? జ్ఞానముచే ఇది వెండి కాదు అని తెలియబడుతుంది. నశింపబడుతుంది. అజ్ఞానంతో అక్కడ వెండి ఉన్నది

అనుకున్నాం. ఈ భ్రాంతి జ్ఞానంతో నశిస్తుంది. నశించటం అంటే మంటలో కాలి బూడిద కాదు. భ్రాంతి తొలగిపోతుంది. స్వాభావికంగా ఉండేది ముత్యపుచిప్ప. ఇది జ్ఞానంతో నశించదు. ఎందుకు అంటే అది అక్కడ స్థూలంగా ఉననది. అందుకే జ్ఞానంతో నశించదు. దాన్ని పగులకొట్టి ముక్కలు చెయ్యటం ద్వారా నాశనమవు తుంది. ఇదే విధంగా అసత్యమైన ఈ జగత్తు బ్రహ్మజ్ఞానముతో బాధ పొందుతుంది. జగత్తు స్వరూపం జ్ఞానంతో పటాపంచలవుతుంది. కాని బ్రహ్మనికి ఎప్పుడూ బాధలేదు. బ్రహ్మనికి అవయవాలు లేవు కాబట్టి దానికి ధ్వంసము కూడా కాదు.

**విశ్వస్య భ్రాంతికార్యత్వా దసత్యత్వంచ బాధనం ।**

**న్యాయయుక్తమతో విశ్వం బ్రహ్మజ్ఞానేన బాధ్యతే ॥ 146**

ఈ జగత్తు అజ్ఞానముచే కల్పించబడినది కాబట్టి అసత్యమైనది. యుక్తులచే విచారించవలసి ఉన్నది. ఈ కారణంచచేత జగత్తునకు అధిష్టానభూతుడైన బ్రహ్మమును తెలుసుకోవటం చేత బాధింపబడుతుంది.

చూసేవారికి వాస్తవిక దృష్టిలో నామరూపాత్మకమైన జగత్తంతా కంటికి కనుపిస్తూనే ఉన్నది. అయినప్పటికీ ఇది అసత్యమే. ఇందులో అనుమానం లేదు. ముత్యపుచిప్పలో కల్పించబడిన వెండిలాగా బ్రహ్మమునందు కల్పించబడిన జగత్తు కూడా అసత్యమే. అజ్ఞానంతో కల్పించబడినవి అన్నీ అసత్యములే అనటంలో సందేహం లేదు. అయితే ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. ముత్యపుచిప్ప, వెండి, ఇందులో వెండి అసత్యమే. మరి ముత్యపు చిప్ప కూడా అసత్యమే కదా? అప్పుడు బాధ అనేది ఆ రెండింటికీ వస్తుంది కదా? కాబట్టి ఈ జగత్తు విషయం నిరూపించటానికి ఈ ఉదాహరణ పనికి రాదు కదా? ఇక్కడ చాలా జాగ్రత్తగా చూడండి. వాస్తవిక స్థితిలో బ్రహ్మము కన్న ఇతరమైన పదార్ధము ఏదీలేదు. ఉదాహరణగా చెప్పాలి అంటే సమాన స్వభావం కల రెండు పదార్ధాలు ఉండి తీరాలి. ముత్యపుచిప్ప సత్యము. అందులో కల్పించబడిన వెండి అసత్యము. ఇక్కడ ముత్యపు చిప్ప సత్యము అంటే అది వ్యావహారిక సత్యము. అదే బ్రహ్మము పారమార్ధిక సత్యము. వ్యావహారిక సత్యము నందు కల్పించబడిన పదార్ధాలు వ్యావహారిక అసత్యాలై బాధింపబడతాయి. అలాగే పారమార్ధిక సత్యములందు కల్పించబడినవి పారమార్ధిక అసత్యాలై బాధించబడతాయి. ఈ రెండింటినీ ఉదాహరణలు గానే తీసుకోవాలి.

అంతేకాని ఇక్కడ బ్రహ్మము పారమార్థిక సత్యమైతే ముత్యపుచిప్ప వ్యావహారిక సత్యము. ఈ రెండూ ఒకటి కాదు. బ్రహ్మములో కల్పించబడిన భాగమే ముత్యపుచిప్ప. అప్పుడు అది కూడా అసత్యమే అనటంలో అనుమానం లేదు. అధిష్టాన రూపుడయిన బ్రహ్మను తెలుసుకున్న క్షణంలోనే ఈ జగత్తు ముత్యపుచిప్పలోని వెండిలాగా బాధ పొందుతుంది. అప్పుడు బ్రహ్మము కన్న వేరైనది ఏదీ ఉండదు.

**జాగ్రత్స్వప్న సుషుప్త్యాదౌ వ్యభిచారప్రదర్శనాత్ ।**
**స్వతఃసత్తాదిశూన్యత్వం చిత్త సంభావితత్వతః ॥ 147**

**విశ్వస్య భ్రాంతి కార్యత్వ మభ్యుపేతం మహర్షిభిః ।**
**నహ్యస్తి కించిత్సత్యత్వం భ్రాంత్యా కల్పితవస్తునః ॥ 148**

మూడు అవస్థల యందు మార్పు ఉండటం, జగత్తు మనోమయము అని నిర్ధారణ చేయబడటం వల్ల, అజ్ఞానముచే కల్పించబడినది అని మహర్షులు అంగీకరిస్తారు. భ్రాంతి లేదా అజ్ఞానము చేత కల్పించబడిన పదార్థాలు సత్యము కాదు.

లోకంలోని మునీశ్వరులంతా ఈ జగత్తు భ్రాంతితో కూడినది అని, అందుచేత ఇది అసత్యము అని సోదాహరణంగా వివరించారు. స్వాభావికంగా సత్యమైన పదార్థము ఒకప్పుడు ఒకవిధంగా మరొకప్పుడు మరియొక విధంగాను ఉండదు. కాని జగత్తు అలా కాదు జాగ్రదావస్థలో ఒకలా ఉంటుంది. స్వప్నావస్థలో ఇంకొకలా ఉంటుంది. సుషుప్తిలో అసలు ఉండదు. కాబట్టి ఈ జగత్తు స్వాభావిక సత్యం కాదు. ప్రత్యేకమైన ఉనికి లేదు కాబట్టి స్వయంగా ప్రకాశించే సామర్థ్యం కూడా లేదు. అసలు వస్తువే అసత్యమైనప్పుడు దానిలోని ధర్మము సత్యము అవదు కదా? ఎండమావులే తీసుకోండి. వాటిలో అసలు నీరే లేదు. అలాంటప్పుడు ఆ నీటికి చల్లదనం ఎలా ఉంటుంది? అసలు లేని వస్తువు ఎలా కనుపిస్తుంది. ఒకవేళ కనుపించింది అన్నా అది భ్రమ కాక నిజం ఎలా అవుతుంది? ఆకాశ హర్మ్యాలుండవు కదా? వాటిలో నివాసం ఎలా సంభవం? జగత్తుకు అవస్థాభేదమున్నది. ఒక అవస్థలో ఒకలాగా, ఇంకొక అవస్థలో ఇంకొక లాగా కనుపిస్తుంది. అందుకే జగత్తుకు సత్యత్వము, ప్రకాశత్వము లేవు. 'ఇదంతా జగత్తు. దీన్ని నేను చూస్తున్నాను.

ఆనందిస్తున్నాను' అనటం పూర్తిగా కల్పన. జగత్తు గాని దాని ఉనికి గాని మనస్సుచే కల్పించబడినవే. జగత్తును చూస్తున్నాను అన్నప్పుడు అక్కడన్న ఆకారాలు, వికారాలు, పదార్థాలు అవన్నీ అజ్ఞానంతో కల్పించబడ్డవే. ముత్యపుచిప్పలో వెండి కనిపిస్తుంది. అది నిజంగా వెండి కాదు. అది వెండి అనే సంకల్పం. అంతే. ఈ వెండి అజ్ఞానంతో కల్పించబడింది. అలాగే ఈ జగత్తు కూడా భ్రాంతి సిద్ధమే. ఏ రకంగా ఆలోచించినప్పటికీ జగత్తుకు మనస్సుకన్న భిన్నమైన రూపం లేదు. ఈ కారణాలన్నీ విచారించిన తరువాతనే జగత్తంతా భ్రాంతి సిద్ధము. భ్రాంతివల్ల ఏర్పడింది అని నిశ్చయం చేశారు. భ్రాంతిచే కల్పించబడినది ఏదీ సత్యం కాదు. కాబట్టి జగత్తు కూడా సత్యం కాదు.

**రజ్వా కల్పితసర్పస్య సత్యంత్వం కేన వీక్షితం ।**

**యత్ర యత్కల్పితంభ్రాంత్యా తత్తు తస్మాన్న భిద్యతే ॥ 149**

త్రాడులో కల్పించబడిన సర్పము యథార్థము కాదు. కల్పిత పదార్థాలేవీ యథార్థం కాదు. అవి అధిష్టానముకన్న వేరు కాదు.

భ్రాంతితో కల్పించబడిన పదార్థాలు అన్నీ కూడా అసత్యమే. ఇందులో అనుమానం లేదు. భ్రాంతి పోగానే ఆ పదార్థం కూడా ఉండదు. త్రాడును చూసి సర్పము అనుకున్నంత మాత్రం చేత అది నిజం కాదు. భ్రాంతి చెందినవాడు కూడా ఆ భ్రాంతి తీరిన తరువాత 'ఇంతవరకు నేను చూసినది, భావించినది అసత్యము' అనుకుంటాడు. కాబట్టి ఒక అధిష్టానములో భ్రాంతితో కల్పించినట్లైతే, ఆకల్పిత పదార్థము అధిష్టానము కన్న భిన్నం కాదు. అది సత్యము అంతకన్న కాదు. కల్పిత పదార్థానికి స్వతంత్ర ప్రతిపత్తి, సత్తా లేకపోవటమే దీనికి కారణము.

**శుక్తికల్పితరూప్యస్య శుక్త్యభిన్నత్వదర్శనాత్ ॥ 150**

ముత్యపుచిప్ప యందు కల్పించబడిన వెండి ఆ ముత్యపు చిప్ప కన్న వేరు కాదు. అలాగే ఏ పదార్థము నుండి ఏ పదార్థము కల్పించబడినా, అది అధిష్టానము కన్న వేరు కాదు.

'అధిష్టానము నందు ఆరోపించబడిన వస్తువు అధిష్టానము కన్న వేరు కాదు' అనేది సిద్ధాంతము. ముత్యపుచిప్పను చూసి వెండి అనుకున్నప్పుడు ఆ వెండి ముత్యపు

చిప్పకన్న వేరు కాదు. భ్రాంతితో ఒకవేళ అది వెండియే అనుకున్నప్పటికీ, భ్రాంతి తీరగానే వెండి ముత్యపుచిప్పలాగానే కనిపిస్తుంది. యథార్థంగా ముత్యపు చిప్ప కన్న వెండి వేరైతే, ఎప్పటికీ అలాగే ఉండిపోవాలి. అలా జరగదు. ఎందుకంటే ముత్యపుచిప్ప కన్న వెండి వేరు కాదు. అంటే ఆరోపిత వస్తువు అధిష్ఠానము కన్న వేరు కాదు.

**పాషాణే పరికల్పితైరవయవైః పాణ్యాదిభిర్భావితః ।**

**శ్రీవిష్ణుర్నిజరూపతో న హి శిలారూపా త్పృథగ్భిద్యతే ।**

**తద్వద్బ్రహ్మణి కల్పితస్య జగతో బ్రహ్మస్వరూపాత్పృథ**

**గ్భేదో నాస్తి యత స్తతస్త దఖిలం బ్రహ్మైవసద్వస్తుతః ॥ 151**

రాతిమీద చెక్కిన శిల్పం రాయికన్న భిన్నం కాదు.

ఇక్కడ కేవలము భ్రాంతి చేత మాత్రమే కాదు. ఒకరాతి మీద ఉలితో దేవతా విగ్రహం చెక్కారు. ఆ విగ్రహం రాయి కన్న భిన్నమైనది కాదు. ఒక చెక్కమీద విష్ణుమూర్తి బొమ్మ చెక్కారు. ఆ బొమ్మ చెక్క కన్న వేరు కాదు. ఇలా కల్పించబడినవి వాటి ఉపాదాన కారణము కన్న వేరు కాదు. రాతిమీద చెక్కి విగ్రహం రాయికన్న వేరు కాదు. విష్ణుమూర్తి విగ్రహం విష్ణువు, కన్న వేరు కాదు. వాస్తవంగా చూస్తే ఈ విష్ణుమూర్తి కూడా ఆ ప్రతిమలో భ్రాంతిచేత ఆరోపించబడినవాడే. ఈ రకంగానే పరబ్రహ్మ యందు కల్పించబడిన జగత్తుకు కూడా బ్రహ్మమునకు వ్యతిరేకమైన రూపము లేదు. అది బ్రహ్మముకన్న భిన్నము కాదు.

**యత్సర్వం కల్పితం బ్రహ్మ సర్వం హ్యేతదితి స్ఫుటం ।**

**బ్రహ్మైవేదం విశ్వమితి ప్రబ్రవీతి స్వయం శ్రుతిః ॥ 152**

**విశ్వస్య బ్రహ్మమాత్రత్వం తాత్పర్యేణ తతో జగత్ ।**

**సర్వం బ్రహ్మేవ నాస్త్యత్ర సంశయో బ్రహ్మ వాదినామ్ ॥ 153**

చేతనా చేతనమైన సమస్త జగత్తు పరబ్రహ్మమే. ఇతర పదార్థాలు కూడా పరబ్రహ్మమే. ఇందులో సందేహం లేదు.

భ్రాంతి రెండు రకాలుగా ఉంటుంది. 1.సంవాదిభ్రాంతి 2.విసంవాదిభ్రాంతి

1.సంవాదిభ్రాంతి : భ్రాంతి పొందే వాడికి ఫలితాన్నిచ్చేది. రాతిలో చెక్కిన బొమ్మ భ్రాంతి అయినప్పటికీ, మనఃశుద్ధిని కలిగించి, మోక్షం పొందటానికి కారణమవుతుంది.

2.విసంవాదిభ్రాంతి : భ్రాంతి పొందే వాడికి ఫలితము కలిగించనిది. ముత్యపుచిప్పలో వెండి భావన ఏ రకంగానూ లాభదాయకం కాదు. జగత్తులో ఈ రెండు రకాల భ్రాంతులు ఉన్నాయి. కొంతమంది సంవాది భ్రాంతి కార్యములయిన పదార్థాలు సత్యము అని, మిగిలినవి అసత్యమని భావిస్తున్నారు. శిలాప్రతిమకు శిలకన్న వేరే రూపం లేదు. ఆ రాతిలో కనుపించే విష్ణుమూర్తి బొమ్మ కూడా ప్రతిమకన్న భిన్నం కాదు. కాబట్టి చేతనాచేతనాత్మకమైన జగత్తులో జీవులు, జడపదార్థాలు అన్నీ భ్రాంతివల్ల కలిగినవే. ఇలా భ్రాంతి వల్ల కలిగిన వాటికి అధిష్టానము కన్న వేరే రూపంలేదు. కాబట్టి ఈ జగత్తుకు, దీనికి అధిష్టానమైన బ్రహ్మమునకు భేదము ఏ మాత్రము లేదు. వేదంలో కూడా **యత్సర్వం కల్పితం బ్రహ్మ, సర్వహ్యేతత్ బ్రహ్మ, బ్రహ్మై వేదం విశ్వం** మొదలైన వాక్యాలతో ఈ విషయాన్ని చెబుతోంది. కాబట్టి జగత్తుకు, బ్రహ్మకు ఏ రకమైన భేదం లేదనేది నిశ్చయము.

**రూపస్య శుక్తిమాత్రత్వం యథా స్యాజ్జగతస్తథా ।**
**సిద్ధేతు బ్రహ్మమాత్రత్వే పరస్య బ్రహ్మణస్సతః ॥** **154**
**సిద్ధమేవాద్వితీయత్వం ప్రమాణై రఖిలైరపి ।**
**యత ఏవమతో హీశే సర్వజ్ఞ త్వా దయో మృషా ॥** **155**

కల్పించబడిన వెండి అధిష్టానము కన్న ఎలా వేరుకాదో, జగత్తు పరబ్రహ్మ కన్న ఎలా వేరు కాదో, అలాగే పరబ్రహ్మ అన్నింటికన్నా అధికుడు, ఏకాకి. రెండవది లేనివాడు. అవుతున్నాడు. ఏ కారణము వల్ల బ్రహ్మకన్న వేరైనది ఏదీలేదో, ఆ కారణం చేత మాయాప్రతిబింబమని చెప్పబడే ఈశ్వరునియందు సర్వము తెలుసుకోవటము, సర్వానికి ప్రభువై ఉండటము, సర్వానికి అంతరాత్మయై ఉండటము అనే గుణాలు అసత్యమే కదా అని అనుమానం.

భ్రాంతివల్ల ముత్యపుచిప్పలో కల్పించబడిన వెండి అధిష్టానమైన ముత్యపు చిప్పయే అవుతుంది. అలాగే పరబ్రహ్మలో కల్పించబడిన జగత్తు పరబ్రహ్మమే

అవుతుంది. జగత్తు అంటే చేతనా చేతనముల సమూహము. ఇవేవీ బ్రహ్మకన్న వేరు కాదు. ఈ కారణం చేతనే 'బ్రహ్మము అద్వితీయము' అనబడుతోంది. జగత్తుకు బ్రహ్మకు భేదం లేదని అనేక ప్రమాణాలతో నిరూపించాం. వీటివల్ల బ్రహ్మము అద్వితీయము అని తెలుస్తోంది. ఇప్పుడు సర్వజ్ఞత్వము మొదలైన గుణాలు బ్రహ్మమునకు ఉన్నాయి అనేవన్నీ జగత్తులాగానే భ్రాంతి సిద్ధములే అనవచ్చు. బాగా ఆలోచించి చూస్తే బ్రహ్మము కన్న వేరైన పదార్థము ఏదీలేదు. ఈ బ్రహ్మమే మాయతో కలిసినప్పుడు ఈశ్వరుడు అవుతున్నాడు. సర్వజ్ఞత్వము మొదలైన గుణాలు అసత్యము కాబట్టి మాయోపాధి కూడా భ్రాంతి కల్పితమే. కాబట్టి ప్రతిబింబం కూడా శూన్యప్రాయమే కావటం చేత ఈశ్వరుడు కూడా బ్రహ్మము కన్న వేరు కాదు. బ్రహ్మము కన్న వేరు గా కనిపించేదంతా అసత్యమే అనేది వేదాభిప్రాయము.

**స్వాజ్ఞానకల్పితాః సర్వే స్వస్మిన్ కించిద్జ్ఞ తాదివిత్ ।**
**మాయా మాత్రమిదం ద్వైత మితి శ్రుతివచోబలాత్**
**ద్వైతస్య భ్రమకార్యత్వా త్తదంతఃపాతినోరపి ॥ 156**
**ద్వయోర్జీవేశ్వరోపాధ్యో స్త థైవోభయగామినాం ।**
**సర్వజ్ఞత్వాధిధర్మణాం మృషాత్వే కోఽత్రసంశయః ॥ 157**

సమస్తమైన గుణాలు అజ్ఞానము చేత స్వస్వరూపమునందు కల్పించబడినవే ఈ భేదమంతా మాయ. బ్రహ్మకన్న వేరుగా ఉండేది అంతా అజ్ఞానము భ్రాంతి. అవిద్య, మాయ. ఇవి కూడా అంతే.

వాస్తవంలో ప్రత్యగాత్మ అయిన జీవునకు ఏ గుణాలతోను సంబంధం లేకపోయిఆన **'జీవుడు కించిదజ్ఞుండు సుఖి దుఃఖి'** అని చెప్పబడుతోంది. సర్వసాక్షి అయిన ప్రత్యగాత్మకు కించిదజ్ఞత్వము ఎలా వస్తుంది? సుఖదుఃఖాలన్నింటికీ సాక్షి ఆయన. అలాంటివాడికి సుఖదుఃఖాలతో సంబంధం ఎలా కలుగుతంది. ఇదంతా అజ్ఞాన కల్పితమే. అసత్యమే. బ్రహ్మకు చెప్పబడుతున్న సర్వజ్ఞత్వము మొదలైన గుణాలు కూడా అజ్ఞానంచేత కల్పించబడినవే. వ్యష్టి ఉపాధిని ఆశ్రయించాడు కాబట్టి కొంత అజ్ఞాని అని, సమిష్టి ఉపాధిని ఆశ్రయించాడు కాబట్టి ఈశ్వరుడు సర్వజ్ఞుడు అని భ్రాంతివల్ల అంటున్నారు.

బ్రహ్మకన్న వేరుగా కనుపించేది అంతా అసత్యమే. మనం చెప్పుకునే భేదం అంతా అజ్ఞానంతో కల్పించబడిందే. జీవుడికి ఉపాధి అజ్ఞానము, ఈశ్వరుడికి ఉపాధి మాయ. ఇలా చెప్పటం కూడా భేదమే అవుతుంది. ఈ భేదము అసత్యము అన్నాం. అలా అయితే ఉపాధులు కూడా అసత్యమే కావాలి కదా? అవును. ఉపాధులు కూడా అసత్యమే. ఇలా గనక చూసినట్లైతే జీవుడు, ఈశ్వరుడు వారికి ఉన్న ఉపాధులు అవిద్య, మాయ వాటిని ఆశ్రయించి ఉన్న సర్వజ్ఞత్వము మొదలైన గుణాలు ఇవన్నీ మాయ తప్ప వేరు కాదు. అసలు మాయ అంటే ఏమిటి? **మాయా సామాయా ఏది** లేదో అది మాయ. ఇవన్నీ మూడుకాలములందు శూన్యములే.

**యత ఏవమతః శుద్ధ శ్చిన్మాత్రైక స్వరూపిణోః ।**

**యుక్తం బ్రహ్మాత్మనోరైక్యం శ్రుత్యుక్తం న విరుధ్యతే ॥ 158**

బ్రహ్మముకన్న వేరైన పదార్ధము ఏదీ సత్యం కాదు. నిర్వికారము పరిశుద్ధము అయిన జ్ఞానమే బ్రహ్మకు జీవునికి ఏకత్వం కలిగిస్తోంది.

కాబట్టి జీవేశ్వరులు, జీవబ్రహ్మలు ఒక్కటే. ఉపాధులు గాని వాటిని ఆశ్రయించిన సర్వజ్ఞత్వము మొదలైన లక్షణాలు గాని అన్నీ అసత్యమే. బాగా ఆలోచిస్తే వారిద్దరికీ ఉండేది శుద్ధ జ్ఞానమే. ఈ రకంగా వారికి ఉపాధి లేదు. నిర్వికార పరిశుద్ధ జ్ఞానము ఒకటే. మరి వారిద్దరి మధ్య భేదం ఎలా వస్తుంది? రాదు. ఇద్దరి మధ్య భేదం ఉండదు. 'తత్త్వమసి' అనే మహావాక్యానికి అర్ధమిదే.

**పాషాణప్లవనం చాపి సిద్ధ్యేత్కాలవిపర్యయే ।**

**న క్వచిచ్ఛ్రుతివాక్యానా మప్రామాణ్యం తు విద్యతే ॥ 159**

రాయి నీటిమీద తేలింది అని చెప్పవచ్చు. ఈ విషయం వేదంలో చెబితే అది నిజమే. వేదమే అన్నిటికీ ప్రమాణము. ఇక్కడ ఒక విచిత్రమైన విషయం చూడండి 'రాయి నీటిమీద తేలుతున్నది. రాయి నీటిలో ఈత కొడుతున్నది' అని వేదంలో చెబితే అది ప్రమాణమే. వేదం ఎప్పటికీ అప్రమాణం కాదు. ఇది ఎలా సాధ్యం? చిన్న ఉదాహరణ చూడండి. అధ్యాత్మ రామాయణంలో శ్రీరాముడు సముద్రంమీద వారధి కట్టే సమయంలో కొండరాళ్ళ మీద 'రామ' అని వ్రాయించి వాటిని నీటిలో వేయించాడని, దాంతో ఆ రాళ్ళు నీటిమీద తేలియాడాయని చెప్పబడింది. నిజంగా

జరిగిందేమంటే కొన్ని రకాల శిలలు నీటిమీద తేలతాయి. మునగవు. ఆ రాళ్ళనే వారధి నిర్మాణానికి వాడారు అని మనం గుర్తించాలి. నెట్‌లో చూసినట్లైతే ఆ రాళ్ళ వివరాలు తెలుస్తాయి. అలాగే రామేశ్వరంలో సీతామ్మవారు ఇసుకతో తయారుచేసిన శివలింగం. సైకత లింగం. సైకత శిలలు విడిగా దొరుకుతాయి. మొవ్వ వేణుగోపాలుని విగ్రహం కూడా సైకతశిలే అంటారు. సైకత శిలతో తయారుచేసిన శివలింగాలు, శ్రీచక్రాలు లేపాక్షి మొదలైన చోట్ల అమ్ముతున్నారు చూడండి. వాటిమీద సూర్యకాంతి పడితే అవి రత్నాల్లా మెరుస్తాయి. ఇదంతా విషయం తెలియటంకోసం మాత్రమే చెప్పాను. అంతేకాని ఎవరి మనోభావాలను దెబ్బ తియ్యటానికి కాదు.

**తావద్యుపాధిసంబంధో యావత్స్యాద్భేదదర్శనం ।**

**న భేదదర్శినో జంతో స్సంసారో న వివర్తతే ॥** 160

ఎంత కాలమువరకు నేను వేరు జగత్తు వేరు అనే భేదదృష్టి ఉంటుందో, అంతవరకు అజ్ఞాని విషయంలో సంసారము నాశనం కాదు. అనాదిగా వచ్చిన అజ్ఞానం వల్ల కలిగిన భేదదృష్టి ఎంత కాలము ఉంటుందో, అంత కాలము జీవుడికి, ఈశ్వరుడికి కూడా ఉపాధి సంబంధం ఉంటుంది. ఇక్కడ జీవుడే సాధకుడు. అతడు 'నేను మోక్షం పొందాలి' అనుకుంటాడు. ఉపాధి సంబంధం లేకపోతే మోక్షం కూడా సాధ్యంకాదు. ఇంకా చెప్పాలి అంటే జీవుడు సాధకుడు కాదు. భేదదృష్టి గనక నశిస్తే ఉపాధి కూడా నామమాత్రమే అవుతుంది. అప్పుడు జీవత్వాదులు ఏవీ ఉండవు. కాబట్టి ఇక్కడ తెలిసేది ఏమంటే భేదదృష్టి ఉన్నంత కాలము జీవుడే సంసారి, సాధకుడు కూడా. భేదదృష్టి ఉన్నంత వరకు సంసారము నశించదు.

**యదా హ్యేవైష ఏతస్మి న్నిత్యేవ వదతి శ్రుతిః ।**

**భేదదృష్టేస్తు సంసారం దురంతం భయలక్షణమ్ ॥** 161

ఎవరైతే పరబ్రహ్మలో భేదాన్ని చూస్తారో వారికి సంసారము అనే భయం కలుగుతుంది.

బ్రహ్మము వేరు, నేను వేరు అని భావన చేసే వాడికి భయం కలుగుతుంది. **ద్వితీయాద్వైభయం** రెండవది ఉంటేనే భయం. ఒక్కడే ఉంటే ఏమీ అనిపించదు. కాని రెండవవారు గనక ఉంటే అప్పుడు అనుమానము భయము వేస్తాయి. అయితే

భయాని కిరాణం ఏమిటి? అని తీవ్రంగా ఆలోచిస్తే 'భేదదృష్టి' అని తెలుస్తుంది. ఇంట్లో తాను భార్యమాత్రమే ఉన్నారు బయటకు వెళ్ళేటప్పుడు ఇల్లంతా ఆమెకు ఒప్పగించి వెడతాడు. తాను వేరు భార్యవేరు కాదు. ఇద్దరూ ఒకటే. అందుచేతనే భార్య రెండవ వ్యక్తి అయినా ఆమెను వేరుగా చూడడు. తన శరీరంలో సగభాగం,జీవిత భాగస్వామి ఆమె. వారిద్దరికీ భేదం లేదు. అందుచేత ఆమెని గురించి భయం లేదు. భేదము ఉన్నప్పుడే భయం ఉంటుంది. అడవిలో లేడి ఒక్కటే ఉంటే దానికి భయం లేదు. లేళ్ళ సమూహం ఎంత ఉన్నా ఒకటిగానే లెక్క. ఒక లేడివల్ల ఇంకొక లేడికి భయం ఉండదు. కాని ఒక సింహం కూడా ఉంటే అప్పుడు భయం ఉంటుంది. సింహానికి లేడికి భేదం ఉంది. లేడికి లేడికి భేదం లేదు. కాబట్టి భయానికి హేతువు ఏమిటంటే భేదదృష్టి, ఈ రకంగా భేదదృష్టి ఉన్నవాడికే సంసారమనేది ఉంటుంది. ఈ సంసారం ఎంత వరకు ఉంటుంది? అంటే అజ్ఞానము నశించేంతవరకు సంసారము అనేక రకాల భయాలకు మూలం. అనేక దుఃఖాలకు మూలం.

**జన్మదుఃఖం జరాదుఃఖం జాయా దుఃఖం పునః పునః**
**సంసార సాగరం దుఃఖం తస్మాత్ జాగ్రత జాగ్రత ॥**

అతిభయంకరమైన దుఃఖాలన్నీ సంసారంలోనే ఉన్నాయి. వివాహము చాలా గొప్పది అనుకుంటాము. కాని అది చాలా పెద్ద అవయోగము అంటారు పండితులు. ఎందుకంటే వివాహమైన క్షణం నుంచే సంసారం మొదలవుతుంది. అసలు ఈ లోకంలో జన్మించటమే అత్యంతమైన దుఃఖం. చిన్నతనంలో బాలారిష్టాలు, విద్యార్థి దశలో శిక్షణ, వివాహం, భార్య, సంతానం సంసారపోషణ. బాధ్యతలు, రోగాలు రొష్టులు, ముసలితనం ఇవన్నీ కష్టాలే. అందుకే సంసారము ఒక మహాసముద్రం లాంటిది. దుఃఖ భాజనమైనది. అన్ని భయాల్లోకి సంసారభయం చాలా పెద్దది. భేదదృష్టి గలవాడికే భయము కలుగుతుంది.

**తతో నిశ్శేషసంసారో చ్ఛిత్త్యై నిత్యసుఖాప్తయే ।**
**జ్ఞాతవ్యం విదుషాసమ్య గ్బ్రహ్మాభిన్నత్వ మాత్మనః ॥** **162**

భయరూపమైన సంసారము భేదదృష్టి వల్లనే కలుగుతున్నది. కాబట్టి ఈ భయం నుంచి బయట పడాలంటే జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే అనే దృష్టిని అలవరచుకోవాలి.

దుఃఖాలకు కారణం సంసారం అన్నాం. ఎందుకని? అంటే ఈ సంసారం అజ్ఞానం వల్ల కలిగింది. సంసారం నాశనం కాకుండా మోక్షం సిద్ధించదు. కాబట్టి ప్రతివారు సంసారాన్ని నాశనం చెయ్యటానికి ప్రయత్నించాలి. ఇక్కడ ఒక చిన్నమాట. సంసారాన్ని నాశనం చెయ్యాలంటే ప్రతివారు సంసారం వదలిపెట్టి అడవుల వెంబడి వెళ్ళాలా? సన్యాసం పుచ్చుకోవాలా? ఇలా అనేక ప్రశ్నలుదయిస్తాయి. సమాధానం ఏమంటే ఎవరూ సంసారం వదలి వెళ్ళాల్సిన పనిలేదు. సంసారంలో ఉంటూనే దానితో మమేకమవటం తగ్గించుకోవాలి. సంసారంలోని పనులన్నీ తన బాధ్యతలను తప్పకుండా నెరవేర్చాలి. బురదలో తిరిగే కుమ్మరి పురుగులాగే ఈ సంసారాన్ని నిర్వహించాలి. జనక మహారాజులాగా. జీవుడికీ బ్రహ్మానికి భేదం లేదు అని తెలుసుకోవాలి. అలా మనసా వాచా కర్మణా తెలుసుకున్నవాడే మహాజ్ఞాని.

**తతస్తయోర ఖండత్వ మేకత్వం ప్రతిపాద్యతే ।**

**తాత్పర్యేణ ముహుఃశ్రుత్యా తారణార్థం ముముక్షతామ్ ॥ 163**

మోక్షం పొందాలనుకునే వాడికి వేదములో చెప్పిన జీవబ్రహ్మాల ఏకత్వాన్ని తెలుసుకోవాలి.

మానవుడికి పురుషార్థము ఏది? అంటే మోక్షము. పురుషార్థాలు నాలుగు. వీటినే చతుర్విధ పురుషార్థాలు అంటారు. ఇవే ధర్మార్థ కామమోక్షాలు. ఇందులో నాల్గవదైన మోక్షమే అసలు పురుషార్థం. దీన్ని సాధించటానికే మిగిలిన మూడు ఉపయోగపడతాయి. జీవిత పరమావధి మోక్షసాధన. మోక్షేచ్ఛ గలవారు జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే అనే విషయం అనుభవ పూర్వకంగా తెలుసుకోవాలి.

**యద్యస్య కార్యం పరిదృశ్యతే త త్తన్మాత్ర మేవావధృతం ఘటాదౌ ।**

**సద్బ్రహ్మణః కార్యమిదం చ విశ్వం సదద్వయాత్సర్వమిదం సదేవ ॥164**

కుండ మొదలైన పదార్థాలలో కార్యానికి కారణము ఏదైతే ఉన్నదో, అలాగే జగత్తు అనే కార్యానికి కారణము బ్రహ్మమై ఉన్నది.

జగత్తులో ఏ పదార్థము దేని నుంచి ఆవిర్భవించిందో, అది ఆ పదార్థము కన్న వేరు కాదు అని సిద్ధాంతం. దీన్ని గతంలో మనం చెప్పుకున్నాం. మట్టితో కుండను తయారుచేశాం. అలా తయారైన కుండ మట్టికన్న వేరు కాదు. అలాగే జగత్తుకు కారణం బ్రహ్మకన్న వేరుగా ఏదీ లేదు. నూలు నుంచి తయారైన వస్త్రము

నూలు కన్న వేరు కాదు. అదే విధంగా పాలనుంచి తయారైన పెరుగు, రాతి నుంచి తయారైన శిల్పము మొదలైనవి కూడా. ఈ విషయాలన్నీ గతంలో మనం చెప్పుకున్నాం. కాబట్టి ఈ బ్రహ్మము నుంచి వివర్తముచే జనించిన జగత్తు బ్రహ్మముకన్న భిన్నం కాదు. చేతనాచేతనములు అన్నీ బ్రహ్మమే.

**నిర్దిశ్యమానోఽపి వికార ఏష భ్రాంతైరతద్బుద్ధిభిరాత్మదోషాత్ ।**

**సతః పృథగ్రూపయితుం న శక్యతే మృదః పృథక్త్వేన ఘటాద యో యథా**

**యతస్తతో విశ్వమిదం సమస్తం బ్రహ్మైవ మృత్స్నైవ యథాఘటస్తథా ॥165**

భ్రాంతి చెందిన వారికి అజ్ఞానమువల్ల కనిపించే జగస్స్వరూపమైన వికారము వాస్తవంగా ఉన్నట్లు కనిపించినప్పటికీ, మట్టి కుండ ఏ రకంగా వేరుకావో అలాగే జగస్స్వరూపం కూడా పరబ్రహ్మ కన్న వేరుకాదు.

లౌకికంలో చూసినట్లైతే జగత్తుకు బ్రహ్మకు తేడా కనుపిస్తుంది. జగత్తు నామరూపాత్మకమైంది. బ్రహ్మము నామరూపాలు లేనిది. ఈ రకంగా ఈ రెండింటి మధ్యా తేడా ఉన్నప్పటికీ అది అసత్యము. వ్యవహారానికి మాత్రమే పనికి వస్తుంది. అందుకే అది వ్యావహారిక సత్యం. చూసేవారు తమ అజ్ఞానంతో తత్త్వం తెలుసుకోలేక జగత్తు వేరు బ్రహ్మము వేరు అనుకుంటున్నారు. మట్టి నుంచి తయారైన కుండ మట్టి కన్న వేరు కాదు. కాని ఈ విషయం గ్రహించలేక మట్టి వేరు కుండ వేరు అనుకుంటున్నారు. అలాగే ఇక్కడ కూడా విషయం తెలుసుకోలేక ఇది జగత్తు, ఇది బ్రహ్మము అనుకుంటున్నారు. దీని కారణము చూసేవారి లోపమే. అంతేకాని నిజంగా తేడాలేదు. ఎంత ప్రయత్నించినప్పటికీ మట్టికి కుండకి, నూలుకు, వస్త్రానికి తేడా నిరూపించలేమో, అలాగే జగద్బ్రహ్మలకు తేడా చూపటం జరగని పని. జగత్తు బ్రహ్మలకు తేడా లేదు. జగత్తు అంటే చేతనాచేతన పదార్థాలు, స్థావర జంగమాలు. అందుచేత ప్రాణమున్నవి ప్రాణము లేనివి, చలనమున్నవి చలనములేనివి అన్నీ జగత్తులో భాగాలే, వీటన్నింటితో కలిసిన జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే.

**మూర్తామూర్తవికార జాతముదితం సత్యాదికం సర్వత**

**స్తచ్చేత్యాగమబోధితం బహువిధం యన్నామరూపాత్మకం।**

**తత్సర్వం స్వయమేకమేవ సదభూత్తస్మాత్పరం బ్రహ్మణః**

**కించిన్నాస్తి విచారితం సదఖిలం బ్రహ్మైవ సద్వస్తుతః ॥ 166**

నామరూపాలు స్వరూపంగా గలది. సత్యమైనది. అంతా పరబ్రహ్మమే అని వేదంచే చెప్పబడినది. భ్రాంతివల్ల ఆకారాలు గలది, లేనిదిగా అనిపిస్తున్నది ఆ సమస్త జగత్తు బ్రహ్మమే, జగత్తులో బ్రహ్మకన్న వేరైనది వేరేదీ లేదు.

వేదంలో 'సత్యము' మొదలైన శబ్దములచే చెప్పబడింది. జగత్తును గురించి చెబుతూ 'ఇదంతా బ్రహ్మమే'అన్నారు. మన అనుభవాన్ని బట్టి చూస్తే జగత్తు అంటే నామరూపాలతో కూడినది. ఏ వస్తువును చూసినా నామరూపాలు తప్ప ఇంకేమీ లేవు. అడవులు, కొండలు, ఎడారులు, నదులు, సముద్రాలు, పశువులు, పక్షులు, క్రిమికీటకాలు, మానవులు ఇవన్నీ నామరూపాత్మకాలే. వీటిలో మళ్ళీ అనేక తేడాలు. వీటన్నింటితో కూడినదే జగత్తు. అలాగే బంగారు ఆభరణాలు చూడండి. గుండ్రంగా ఉన్నవి. మెడలో వేసుకునేవి. చేతులకు వేసుకునేవి. శరీరంమీద అలంకరించుకునేవి. ఇలా రకరకాల ఆభరణాలు. అన్నీ బంగారంతో చేసినవే. అన్నీ బంగారుమయమే. ఇవేవీ బంగారం కన్న వేరుకాదు. బంగారం కూడా పంచభూతాలలో ఒకటైన భూమిలో దొరికిందే. కాబట్టి బంగారము పంచభూతాలకన్న వేరైనదికాదు. ఇలా ఆలోచించి చూస్తే సృష్టిలో నామరూపాలకన్న ఇతరమైనది ఏదీలేదు. 'చాలా వస్తువులన్నాయి' అంటే కార్యకారణాలకు నామరూపాలలో భేదముండటమే కారణము. యధార్థ స్థితిలో నామరూపాల వ్యవహార సాధనాలు అంతే. నామరూపాలను బట్టి వస్తువులకు వాస్తవంగా తేడా ఉన్నది అనుకోవటం భ్రాంతి. ఇలా చూసినట్లైతే రకరకాల రంగులు ఎరుపు, తెలుపు, పసుపు, నలుపు ఇవన్నీ భ్రాంతి రూపాలే. అనేకములు అని మనం అనుకునే పదార్థాలు అన్నీ భ్రాంతి వల్ల ఏర్పడినవే, ఈ జగత్తంతా భ్రాంతివల్ల ఏర్పడిందే. అందుకే ఈ జగత్తంతా వికారము మార్పు అంటున్నారు. మట్టినుంచి పుట్టిన కుండ మట్టికి వికారము. అలాగే బ్రహ్మము యొక్క మార్పు అయిన జగత్తు బ్రహ్మవికారము. అన్ని రకాలైన భ్రాంతులు అనగా వికారాలు అజ్ఞానం వల్ల ఏర్పడినవే. ఇవి ఏవీకూడా బ్రహ్మము కన్న వేరు కావు. జగత్తులో బ్రహ్మ కన్న భిన్నమైన పదార్థము ఏదీలేదు. ఒకవేళ ఉన్నట్లుగా అనిపించినా, జాగ్రత్తగా ఆలోచిస్తే బ్రహ్మకన్న వేరైనది జగత్తులో లేదని తెలుస్తుంది.

**ప్రత్యగేష పరం బ్రహ్మ బ్రహ్మైవ ప్రత్యగేషకః ।**

**నోభయోరంతరం కించి త్సహంతే శ్రుతయః క్వచిత్ ॥ 167**

లోకోత్తరుడైన పరబ్రహ్మ ఈ ప్రత్యగాత్మే. అలాగే ప్రత్యగాత్మ అంటే బ్రహ్మమే. వీరిద్దరికీ ఏ మాత్రము తేడా లేదు.

చేతనాచేత్మకమైన జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే. కాబట్టి ఆ బ్రహ్మమే జీవుడు. అతడే ప్రత్యగాత్మ. ఆ ప్రత్యగాత్మయే బ్రహ్మము. వీరి మధ్యన భేదం లేదని చెబుతోంది వేదం.

**శ్రుతేః స్మృతేశ్చాపి తత్త్వం పర్యాలోచ్య స్వయుక్తిభిః ।**

**బ్రహ్మాత్మనోర్నైవ భేద మీషత్పశ్యంతి సూరయః ॥ 168**

పండితులు వేదప్రమాణాన్ని, స్మృతి ప్రమాణము, తమ అనుభవములను ఆధారంగా చేసుకుని యధార్ధ స్వరూపాన్ని విమర్శించి పరబ్రహ్మకు ప్రత్యగాత్మకు తేడా లేదు అని నిర్ధారించారు.

ఈ కారణాలచేత శ్రుతులు, స్మృతులు, బాగా విమర్శించి, తను అనుభవాన్ని చేర్చి యుక్తులతో నిర్ణయించిన మహాత్ములు జీవబ్రహ్మభేదము భావింపరు. జీవుడు బ్రహ్మ ఒకటి కాదు వారిద్దరు వేరు వేరు. అని ఎప్పుడూ భావించరు.

**విభేదజనకాజ్ఞానే నాశమాత్యంతికం గతే ।**

**ఆత్మనో బ్రహ్మణోభేద మనంతం కః కరిష్యతి ॥ 169**

అజ్ఞానం పూర్తిగా నాశనమయిన తరువాత త్రికాలములందు కూడా పరబ్రహ్మకు ప్రత్యగాత్మకు భేదము ఉండదు.

కార్యకారణాలకు ఎక్కడాభేదం లేదు. వస్తువులకు నామరూపాల ఆధారంగా భేదం కల్పించటంకన్న అజ్ఞానం ఇంకొకటి లేదు. ఈ తేడాలన్నీ అజ్ఞానం వల్లనే కల్పించబడ్డాయి. అజ్ఞానంతో కల్పించబడినవన్నీ అసత్యము అనే మాట మనం గతంలో చెప్పుకున్నాం. కాబట్టి అజ్ఞానం గనక నశిస్తే జీవబ్రహ్మలకు తేడా ఉండదు. ఈ భేదము అజ్ఞానముతో వచ్చింది కాబట్టి త్రికాలముల యందు ఉండదు. అజ్ఞానము అంటే ఉన్నది లేనట్లు, లేనిది ఉన్నట్లు భావించటం. ఒకసారి గనక అజ్ఞానం నశించిపోతే మళ్ళీరాదు. మహా అయితే ఆ విషయం మరిచిపోవచ్చు. ఉదాహరణకు ఒక విషయాన్ని గురించి, వస్తువు గురించి వివరించాం. దాని సంబంధించిన జ్ఞానం కలిగింది. అజ్ఞానము నశించింది. కొంత కాలానికి మహాఅయితే ఈ విషయం

మరచిపోతాడు. అంతే. ఒకసారి వింటే మళ్ళీ ఆ జ్ఞానం కలుగుతుంది. కాబట్టి జీవబ్రహ్మల మధ్య భేదం లేదని ఇప్పుడు తెలిసినా, మళ్ళీ ఇంకోసారి కలుగుతుందనే భయం లేదు. జ్ఞానం కలగగానే అజ్ఞానము పూర్తిగా నశిస్తుంది. జీవబ్రహ్మలకు తేడా లేదని స్పష్టంగా గుర్తుంటుంది.

## 8. తత్త్వమసి

వేదాలు నాలుగు. ప్రతి వేదానికి కొన్ని ఉపనిషత్తులు ఉన్నాయి.

| | |
|---|---|
| ఋగ్వేదానికి | 21 |
| యజుర్వేదానికి | 109 |
| సామవేదానికి | 1000 |
| అథర్వణ వేదానికి | 50 |

వెరసి 1180 ఉపనిషత్తులు ఉన్నాయి. మంత్ర యంత్ర తంత్రాలు, సాధన, మోక్షము వీటిలో చెప్పబడ్డాయి. వీటిలో దశోపనిషత్తులు ముఖ్యమైనవి. త్రిమతాచార్యులు వీటికి తమ మతానికి అనుకూలంగా భాష్యం వ్రాశారు.

వీటిలో నాలుగు వేదాలకు సంబంధించిన ఒక్కొక్క ఉపనిషత్తు నుంచి ఒక్కొక్కటి చొప్పున, నాలుగు ఉపనిషత్తుల నుంచి నాలుగు వాక్యాలను తీసుకున్నారు. వీటినే మహావాక్యాలు అంటారు. అవి

| | | | |
|---|---|---|---|
| 1. | ప్రజ్ఞానం బ్రహ్మ | ఐతరేయోపనిషత్తు | ఋగ్వేదము |
| 2. | అహం బ్రహ్మాస్మి | బృహదారణ్యకోపనిషత్తు | శుక్ల యజుర్వేదము |
| 3. | తత్త్వమసి | ఛాందోగ్యోపనిషత్తు | సామవేదము |
| 4. | అయమాత్మాబ్రహ్మ | మాండూక్యోపనిషత్తు | అథర్వణ వేదం |

మహావాక్యాలన్నింటికీ అర్థం ఒకటే. జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే వీటి మధ్య భేదం లేదు. వీటిలో 'తత్త్వమసి' అనే మహావాక్యానికి అర్థం తెలుసుకుంటే, మిగిలిన మహావాక్యాలకు కూడా అర్థం తెలుస్తుంది.

**తత్త్వమసి** అనే మహావాక్యం ఛాందోగ్యోపనిషత్తులోది. ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు బ్రహ్మవిద్యను బోధిస్తూ ఈ వాక్యాన్ని చెబుతాడు. తత్త్వమసి

అనే మహావాక్యంలో మూడు పదాలున్నాయి. 1.తత్ 2.త్వం 3.అసి. తత్ అంటే – అది. త్వం అంటే – నీవు. అసి అంటే – అయి ఉన్నావు. అది అంటే పరమాత్మ నువ్వు అంటే – జీవాత్మ. ఓ శ్వేతకేతూ అదే నువ్వు అయి ఉన్నావు. జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే. శ్వేతకేతూ ! నువ్వే పరమాత్మ స్వరూపానివి.

శ్వేతకేతూ ! ఆకాశంలో సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. అతనిలో ఉన్న తేజస్సు ఏదయితే ఉన్నదో అదే నీలోనూ ఉన్నది. **తత్త్వమసి.** అదే నీవై ఉన్నావు.

ఆకాశంలో ఉన్న చంద్రుడు చల్లదనాన్నిస్తున్నాడు. అతనిలో ఉన్న చల్లదనం ఏదైతే ఉన్నదో అదే నీలోనూ ఉన్నది. **తత్త్వమసి.** అదే నీవై ఉన్నావు.

ఈ రకంగా జగత్తులో ఉన్న ప్రతిపదార్ధంలోను, వస్తువులోను, జీవిలోను ఉన్న ప్రకాశము, శక్తి అన్నీ నీలోనే ఉన్నాయి. **తత్త్వమసి.**

సూర్యకాంతిలో ప్రకాశించే రూపాన్ని కన్ను ఎలా చూడగలుగుతున్నదో, బ్రహ్మ పదార్ధముచే ప్రకాశించే జగత్తును మనస్సు ఎలా తెలుసుకుంటుందో, ఆ బ్రహ్మమే నీవు. **తత్త్వమసి.**

జగత్తులోని అన్ని పదార్ధాలకన్న అధికమైనది త్రికాలములందు ప్రకాశిస్తూ, జగత్తును ప్రకాశింపచేసేది బ్రహ్మము అదే నీవు. **తత్త్వమసి.**

దేనిని పొందిన తరువాత ఇంద్ర పొందవలసినది ఏదీ ఉండదో, ఏ సుఖాన్ని మించిన సుఖం ఇంకొకటి లేదో, ఏ జ్ఞానానికి మించిన జ్ఞానం ఇంకొకటి లేదో అదే బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

పరమాత్మ అంటే ఏదో ఒక రూపం కాదు. జ్ఞానరాసి. జ్ఞానరూపమే పరబ్రహ్మ. ఆ బ్రహ్మమే నీవు. **తత్త్వమసి.**

మూడు అవస్థల యందు జగత్తు దేనివల్ల ప్రకాశిస్తున్నదో అదే బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

స్వప్నంలో నేను అని భావించేది, జాగ్రదావస్థలో నేను, నాది అనిపించేది, నేను అంటే ఈ దేహము కాదు అని చెప్పేది, నిర్మలమైనది, నాశనము లేనిది బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

శరీరత్రయము, గుణత్రయము, అవస్థాత్రయము, ఇంద్రియాలు, అంతఃకరణ చతుష్టయము మొదలైన వాటితో ఉన్నప్పటికీ దేనితోను సంబంధం లేనిదే బ్రహ్మము. అదే నీవు **తత్త్వమసి.**

చరాచర జగత్తులో అన్నింటికి సాక్షియైనది బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

ఆద్యంతములు లేనిది, సర్వవ్యాపి, దేశకాల భేదములు లేనిది బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

జ్ఞానమే స్వరూపంగా గలది, అహంకారం లేనిదే బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

ఆదిమధ్యాంతములు లేనిది, శాశ్వతమైనది, అహంకారము లేనిది, నిశ్చలమైనది, నాశనము లేనిది బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

నువ్వు స్థూలశరీరానివి కాదు, సూక్ష్మశరీరానివి కాదు. కారణ శరీరానివి అంతకన్నా కాదు. నువ్వు సర్వాంతర్యామివి. పంచకోశాలలో ఉన్న జ్ఞానరూపానివి. నీవే పరబ్రహ్మవు. **తత్త్వమసి.**

జనన మరణాలు, కులగోత్రాలు, చతురాశ్రమాలు, చాతుర్వర్ణాలు, ఏవీ లేనిది, సర్వానికి సాక్షియైనది బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

అజ్ఞానము, జడత్వము, జాగు చెయ్యటము, మూర్ఛ, నిద్ర, భ్రాంతి మొదలైన శరీర ధర్మాలు ఏవీ లేనిదే బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

కర్తృత్వ భోక్తృత్వాలు. అహంకార మమకారాలు ఏవీ లేనిదే బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

ఏ మాత్రము అజ్ఞానము లేని జ్ఞానరాసియే బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

వికారశూన్యుడైన పరబ్రహ్మకు సంసార బంధాలు లేవు. వాటి నుంచి విముక్తి అంతకన్నా లేదు. ఆ బ్రహ్మమే నీవు. **తత్త్వమసి.**

జగత్తులో కనుపించే అన్ని పదార్థాలు, పంచప్రాణాలు, మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు, ముల్లోకాలు, గురువు, శిష్యుడు, నామరూపాలున్న ప్రతివస్తువు, ప్రతిప్రాణి, ప్రతిఅణువు పరబ్రహ్మమే. అదే నీవు. **తత్త్వమసి.**

వేదం కూడా దృశ్యమానమైనదంతా బ్రహ్మమే అని చెబుతోంది. ఆ బ్రహ్మమే నీవు. **తత్త్వమసి.**

ఈ రకంగా జగత్తులో ఉన్న ప్రతివస్తువులోను, ప్రతి ప్రాణిలోను ఉన్న శక్తి, ప్రకాశము అంతా నీలోనే ఉన్నది. అదే నీవై ఉన్నావు. చరాచర జగత్తంతా వ్యాపించిన పరబ్రహ్మమే నీవై ఉన్నావు. **తత్త్వమసి.**

ఈ విషయాలు తెలుసుకుని మనసుతో కల్పించబడిన భేదాన్ని నాశనం చేసి బ్రహ్మానందంతో స్వస్వరూపమునందే విహరించవలసింది. భేదాలన్నీ పోయి జగత్స్వరూపంతో ఆత్మయందు బ్రహ్మానందంతో ఉండవలసింది. అని చెప్పాడు ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు తత్త్వమసి అనే మహా వాక్యానికి అర్థం సద్గురువు ద్వారా చెప్పుకోవాలి. గురుగీతలోని ఈ శ్లోకాలు చూడండి.

**అఖండ మండలాకారం । వ్యాప్తం యేన చరాచరం ।**

**తత్పదం దర్శితం యేన । తస్మై శ్రీ గురవే నమః ॥**

సమస్త చరాచరములందు వ్యాపించి ఉన్న 'తత్' పదవాచ్యుడగు పరమాత్మను దర్శింపచేయు సద్గురువుకు నమస్కారము.

**స్థావరం జంగమం వ్యాప్తం । యత్కించత్సచరాచరం ।**

**త్వం పదం దర్శితం యేన । తస్మై శ్రీ గురవే నమః ॥**

స్థావర జంగమాత్మకమైన జీవోపాధుల యందు వ్యాపించి ఉన్న 'త్వం' పదమని చెప్పబడుచున్న జీవస్వరూపాన్ని దర్శింపచేసే సద్గురువుకు నమస్కారము.

**చిన్మయం వ్యాపితం సర్వం – త్రైలోక్యం సచరాచరం**

**అసిత్వం దర్శితం యేన । తస్మై శ్రీ గురవే నమః ॥**

త్రిలోకముల యందు చిద్రూపంగా వ్యాపించిఉన్న చైతన్యాన్ని 'అసి' పదం ద్వారా దర్శింపచేసే సద్గురువుకు నమస్కారము.

ఈ రకంగా ప్రత్యగాత్మకు బ్రహ్మమునకు భేదం లేదని సద్గురువు ద్వారా తెలుసుకోవాలి. ఈ విషయాన్ని ఇక్కడ వివరిస్తున్నారు.

**నామరూపాదయో యత్ర కల్పితా శ్చిత్తవిభ్రమాత్ ।**

**వ్యోమ్నీవ నగరం యత్త ద్భ్రహ్మ తత్త్వమసి ధ్రువమ్ ॥ 170**

ఏ పదార్థంలో మనస్సు యొక్క భ్రాంతిచేత నామరూపాత్మకాలన్నీ ఆకాశ హర్మ్యాలులాగా కల్పించబడ్డాయో, ఏది సర్వవ్యాపకమై ఉన్నదో అదే బ్రహ్మ. అదే నీవు అంటే ప్రత్యగాత్మవై ఉన్నావు. **తత్త్వమసి**

లోకంలో మొత్తం ఐదు పదార్థాలే అనుభవంలో ఉన్నాయి. అవి 1.కలిమి 2.ప్రకాశము 3.ఆనందము 4.రూపము 5.నామము. ఇందులో మొదటి మూడు పరబ్రహ్మ రూపాలు. చివరి రెండు జగద్రూపాలు. ఆకాశంలో కల్పించబడిన నగరంతో ఆకాశానికి ఏమీ సంబంధం ఉండదు. అలాగే తనలో కల్పించబడిన జగత్తుతో బ్రహ్మమునకు ఏ సంబంధము లేదు. పరబ్రహ్మ అన్నింటికీ అధిష్టానమైనవాడు. సర్వసాక్షి. సర్వవ్యాపకుడు. జగత్తంతా కల్పించబడినదే. కాబట్టి బ్రహ్మమునకు నీకు ఏ మాత్రం తేడా లేదు. నీవే బ్రహ్మవై ఉన్నావు. 'తత్త్వమసి'

**ద్రష్టృదర్శన దృశ్యానా మభావో యత్ర దృశ్యతే ।**

**యదేవకేవలం శుద్ధం బ్రహ్మ తత్త్వమసి ధ్రువమ్ ॥ 171**

ఎక్కడైతే జ్ఞాతజ్ఞానజ్ఞేయములు లేవో, అద్వితీయము పరిశుద్ధము అయినది ఏదో ఆ పరబ్రహ్మమే నీవు అయి ఉన్నావు.

ఇక్కడ తత్త్వమసి అనే మహావాక్యాన్ని వివరిస్తున్నారు. ఛాందోగ్యోపనిషత్తులో ఉద్దాలకు తన కుమారుడైన శ్వేతకేతువుకు బ్రహ్మవిద్యను బోధిస్తాడు. ఓ శ్వేతకేతూ జగత్తులోని ప్రతివస్తువులోను, ప్రతిజీవిలోను ఏ చైతన్యమైతే ఉన్నదో అదే చైతన్యము నీలోనూ ఉన్నది. అదే నీవై ఉన్నావు. **తత్త్వమసి.** ఆకాశంలో కాంతినిచ్చే సూర్యునిలో ఉన్న చైతన్యమే నీలోనూ ఉన్నది. చల్లదనాన్నిచ్చే చంద్రునిలో ఉన్న చైతన్యమే నీలోనూ ఉన్నది. ఈ రకంగా ప్రతివస్తువులోను, జీవిలోను ఉన్న చైతన్యము నీలోనే ఉన్నది. శ్వేతకేతూ **తత్త్వమసి** అదే నీవై ఉన్నావు. అంటాడు.

జ్ఞాత జ్ఞాన జ్ఞేయములు లేనటువంటిది, పరిశుద్ధమైనది. అద్వితీయమైనది. విపరీతమైన కాంతితో ప్రకాశించే బ్రహ్మమే నీవు.

**అంతఃపూర్ణం బహిఃపూర్ణం స్వయమద్వయమ క్రియం ।**

**యదనంతరం పరంజ్యోతి బ్రహ్మ తత్త్వమసి ధ్రువమ్ ॥ 172**

లోపలా బయటా నిండి ఉన్నది, స్వతంత్రమైనది, అద్వితీయమైనది, ఏ కర్మలు చేయనిది, నాశనము లేనిది, ప్రకాశమే రూపముగా గలది పరబ్రహ్మము. అదే నీవు ఉన్నావు. **"తత్త్వమసి"**

**'అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణస్థితః'** పరమేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు లోపలా బయటా అంతటా ఆవరించి ఉన్నాడు అంటోంది నారాయణోపనిషత్తు. ఇలా లోపలా బయటా కూడా ఆవరించి ఉండటము. పరబ్రహ్మ లక్షణం. బ్రహ్మము ఏకాకి. రెండవది లేనిది తనతో సమానమైన వారు కాని, తన కన్న అధికులు గాని లేనిది. అద్వితీయమైనది. ఏ విధమైన కర్మలు చేయదు కాబట్టి కర్మఫలము లేనిది, సర్వోత్తమమైన జ్ఞానమే రూపంగా గలది బ్రహ్మము. ఆ బ్రహ్మము నీవే. **'తత్త్వమసి'**

**యద్గ్రాహ్యగ్రాకాదీనాం భాసకం తద్విలక్షణం ।**

**భామాత్రం పరితః పూర్ణం బ్రహ్మ తత్త్వమసి ధ్రువమ్ ॥ 173**

ఏ పదార్థమైతే గ్రహించేవాడు, గ్రహింపదగినది మొదలగు పదార్థాలను ప్రకాశింప చేస్తుందో, అగ్రాహ్యగ్రాహకాదుల కన్న వేరైనదో, ప్రకాశమే స్వరూపముగా గలది అదే బ్రహ్మము. అదే నీవై ఉన్నావు. **'తత్త్వమసి'**

ఏ బ్రహ్మమయితే వీడు గ్రహించేవాడు, ఇది గ్రహింపబడేది మొదలయిన భేదములతో ఉన్న అన్ని పదార్థాలను ప్రకాశింపచేస్తూ ద్రష్ట అయిన వాటికన్న వేరై జ్ఞానరూపుడై ఉన్నాడో ఆ బ్రహ్మమే నీవు **'తత్త్వమసి'.**

**భానునా భాసితం రూపం యథా చక్షుస్తథా మనః ।**

**యేన భాతమిదం వేత్తి బ్రహ్మతత్త్వమసి ధ్రువమ్ ॥ 174**

సూర్యునిచే ప్రకాశింప చేయబడిన రూపాన్ని కన్ను ఎలా తెలుసుకుంటోందో, బ్రహ్మ పదార్థముచే ప్రకాశింప చేయబడిన జగత్తును మనస్సు తెలుసుకుంటుందో. అటువంటి బ్రహ్మమే నీవు. **'తత్త్వమసి'**

జగత్తులో సూర్యకాంతి వల్ల వస్తువులు ప్రకాశిస్తాయి. అలా ప్రకాశించే రూపాలను కన్ను గ్రహిస్తుంది. సూర్యకాంతి లేనప్పుడు ఆ వస్తువును తెలుసుకోలేక పోవటానికి కారణం ఇదే. అలాగే మనసు గ్రహించే పదార్థాలను కూడాఏదో ఒక శక్తి ప్రకాశింప చేస్తుంది. అదే పరబ్రహ్మ. ఆ పరబ్రహ్మమే నీవు. **'తత్త్వమసి'**

**సకృద్విభాతం పురత స్సర్వస్మాత్తు విభాతి యత్ ।**

**యద్భానమనుభాతీదం బ్రహ్మ త త్తత్వమసి ధ్రువమ్ ॥ 175**

ఏదైతే పరస్పరం వేరుగా ఉండే అన్ని పదార్థాల కన్న అధికమై ఉన్నదో, అన్ని కాలములందు ప్రకాశించే ఈ జగత్తు దేనివల్ల ప్రకాశిస్తున్నదో ఆ బ్రహ్మమే నీవు **'తత్త్వమసి'** ఏ పదార్థమైతే సర్వానికి సాక్షియై, అన్నింటికన్నా అధికమై, అన్ని అవస్థల యందు ఒకే రూపంతో ప్రకాశిస్తోందో అదే బ్రహ్మము. అదే నీవు.

**దర్శనం శ్రవణం జ్ఞానం యత్ర నాన్యస్య విద్యతే ।**

**సూక్ష్మమప్యవ దేశ్యంయ ద్బ్రమ్మ తత్త్వమసి ధ్రువమ్ ॥ 176**

ఎక్కడైతే ఇతర పదార్థముల చూపుగాని, వినికిడి గాని లేదో ఏ పదార్థము అతిసూక్ష్మమయి కూడా దృశ్యశ్రవణ జ్ఞానములచే నిర్ణయింపదగినదో అదే బ్రహ్మము. అదే నీవు **'తత్త్వమసి'.**

ఏ పదార్థాన్ని గురించి తెలుసుకుంటే మిగిలినవన్నీ తెలుస్తాయో, సూక్ష్మాతి సూక్ష్మమయినప్పటికీ దృశ్యశ్రవణాదులచే నిర్ణయించటానికి వీలైనది బ్రహ్మము.

బ్రహ్మపదార్థం దగ్గర ఇతరమైనవేవీ ప్రకాశించవు. **కేనోపనిషత్తు**లో చెప్పినట్లుగా

**న చక్షుర్గచ్ఛతి, నవాగ్గచ్ఛతి నో మనః**

ఆత్మ ఉన్న చోటికి ఇంద్రియాలు వెళ్ళలేవు. ఆత్మను కంటితో చూడటం గాని, ఆత్మను గురించి చెవులతో వినటం గాని, ఆత్మని మనస్సుతో ఊహించటం గాని, జరగదు. ఈ ఇంద్రియాలన్నీ ఆత్మచైతన్యం వల్లనే పని చేస్తున్నాయి. భగవత్పాదుల వారు **ఆత్మబోధ**లో చెప్పినట్లుగా

**యల్లాభాన్నాపరో లాభోయత్సుఖాన్నపరం సుఖం**

**యద్జ్ఞానాన్నాపరం జ్ఞానం తద్ బ్రహ్మేత్యవధారయేత్ ॥**

దేనిని పొందిన తరువాత ఇంక పొందవలసినది ఉండదో, ఏ సుఖాన్ని మించిన సుఖం మరొకటి లేదో, ఏ జ్ఞానాన్ని మించిన జ్ఞానము ఇంకొకటి లేదో అదే బ్రహ్మము అదిసూక్ష్మాతిసూక్ష్మమైనది అదే బ్రహ్మము. అదే నీవు.

**నిష్కళం నిష్క్రియం శాంతి నిరవద్యం నిరంజనం ।**

**శుద్ధం విజ్ఞానమానందం బ్రహ్మ తత్త్వమసి ధ్రువమ్ ॥ 177**

ప్రకాశమే ధర్మములుగా గలది, ఏ కార్యములు చేయనిది, సంసారము లేనిది, సర్వసాక్షి, ఏ వికారములు లేనిది, జ్ఞానరూపమయినదే బ్రహ్మము. అదే నువ్వు. **తత్త్వమసి**. ఆత్మ అంటే దివ్యమైన తేజస్సు. అత్యంత ప్రకాశమానమైనది.

**కోటిసూర్య ప్రతీకాశం, చంద్రకోటి సుశీతలం**

**విద్యుత్కోటి సమానాభమరుణం**

కొన్ని కోట్ల సూర్యుల కాంతులతో ప్రకాశిస్తున్నది. కొన్ని కోట్ల చంద్రుల చల్లదనముతో కూడినది. కొన్ని కోట్ల మెరుపులు ఒక్కసారిగా ప్రసరిస్తే వచ్చే కాంతి గలిగినది. ఆత్మ అంటే ఒక రూపం కాదు. దివ్యమైన కాంతి. అటువంటి కాంతియే ధర్మముగా గలది. ఆత్మ ఏ కర్మను చెయ్యదు. **ముండకోపనిషత్తు**లో చెప్పినట్లుగా

**ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే**

**తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్య నశ్నన్నన్యో అభిచాకశీతి ॥**

సంసారమనే వృక్షం మీద రెండు పక్షులు కూర్చుని ఉన్నాయి. ఆ రెండూ ఒకే రంగు, రూపము కలిగి ఉన్నాయి. అందులో ఒకటి దొరికిన ఆహారం తింటోంది. రెండవది ఏమీ తినకుండా దిక్కులు చూస్తోంది. వీటిలో ఆహారం తింటున్నది జీవాత్మ. దిక్కులు చూస్తున్నది పరమాత్మ. పరమాత్మ ఏ కర్మలు చెయ్యదు. దానివల్ల కర్మఫలం అంటే పాపపుణ్యాలు ఉండవు. కాబట్టి కర్మఫలం ఉండదు. అందుచేతనే పరమాత్మ ఏమీ తినకుండా అంటే కర్మఫలం అనుభవించకుండా దిక్కులు చూస్తోంది. కర్మఫలం ఉంటేనే సంసారం. లేకపోతే సంసారం లేదు. పరమాత్మకు కర్మా లేదు కర్మఫలం అంతకన్నాలేదు అందుకనే సంసారం లేదు.

పరమాత్మ ఏ పనీ చెయ్యకుండా కూచుని అన్నింటినీ అలా చూస్తూ ఉంటుంది. సర్వానికి సాక్షి. లోకంలో జరిగే వ్యవహారాలన్నీ ప్రత్యక్షంగా చూస్తుంటుంది. పంచభూతాలు, సూర్యుడు, చంద్రుడు వీరంతా పరమాత్మకు వేగులు. లోకంలో

ఎప్పుడు ఎక్కడ ఏం జరుగుతున్నదో పరమాత్మకు చెబుతుంటారు. ఆత్మ సర్వవ్యాపి కాబట్టి అన్నింటినీ ప్రత్యక్షంగా చూస్తుంటుంది. వికారము అంటే మార్పు. ఆత్మకు ఏ వికారాలు లేవు. అసలు ఆకారము అనేది ఉంటే వికారముంటుంది. ఆత్మకు ఆకారమే లేదు. కాబట్టి వికారము ఎలా ఉంటుంది? పరమాత్మ అంటే ఏదో ఒక రూపం కాదు. జ్ఞానరాసి. అందుకే జ్ఞానరూపమే పరబ్రహ్మ. ఆ బ్రహ్మమే నీవై ఉన్నావు. **తత్త్వమసి.**

**జాగ్రత్స్వప్నసుషుప్త్యాది ప్రపంచో యేన భాస్వతే ।**
**తదేవాహమితి జ్ఞాత్వా త్వన్యత్రాత్మమతిం త్యజ ॥ 178**

మూడు అవస్థలయందు ప్రపంచము దేనివల్ల భాసిస్తున్నదో అదే బ్రహ్మము. అదే నీవు **తత్త్వమసి**

జాగ్రస్వప్న సుషుప్తులనబడే మూడు అవస్థల యందు ప్రకాశింపచేసేది బ్రహ్మము. జాగ్రదావస్థలో నామరూపాత్మకమైన జగత్తు అంతా కంటికి కనుపిస్తుంది. ఏదైనా వస్తువు కనిపించాలంటే కాంతి దానిమీద పడి అది ప్రకాశించాలి. అప్పుడు ఆ వస్తువు కంటికి కనిపిస్తుంది. ఈ కాంతి ఎక్కడ నుంచి వస్తుంది అంటే సూర్యకిరణాల ద్వారా వస్తుంది. మరి సూర్యుడికి కాంతి ఎక్కడ నుంచి వస్తుంది? పరమేశ్వరస్వరూపం కాంతిమయం. కొన్ని కోట్ల కాంతి కిరణాలతో ప్రకాశిస్తున్నది. అందులోంచి

**అష్టోత్తరశతం వహ్నే। షోడశోత్త రశతం రవేః ।**
**షట్త్రింశ తదుత్తరశతం । చంద్రస్య కిరణాశ్శివేః ॥**

108 కిరణాలను అగ్నిదేవుడు, 116 కిరణాలను సూర్యుడు, 136 కిరణాలను చంద్రుడు తీసుకున్నారు. ఈ కిరణముల వల్లనే చంద్ర సూర్యాగ్నులు కాంతినిస్తున్నారు.

దీన్ని బట్టి చూస్తే సూర్యుడికి కూడా కాంతి ఆ పరబ్రహ్మ నుంచే వస్తున్నది. కాబట్టి జాగ్రదావస్థలో జగత్తంతా పరబ్రహ్మ వల్లనే ప్రకాశిస్తున్నది. స్వప్నావస్థ అనేది మనసుచే కల్పించబడినది. మనస్సు బ్రహ్మము యొక్క చైతన్యముతోనే ప్రకాశిస్తోంది. కాబట్టి స్వప్నావస్థలోని వస్తువులన్నీ బ్రహ్మచైతన్యముతోనే ప్రకాశిస్తాయి. సుషుప్తి. ఈ అవస్థలో మనస్సు కూడా లయమై పోతుంది. ఇప్పుడు మిగిలేది ఆత్మపదార్థం

ఒకటే. దానివల్లనే సుఖము అనే విషయం తెలుస్తుంది. ఈ రకంగా జాగ్రస్వప్న సుషుప్తులను ప్రకాశింపచేసేది బ్రహ్మము. అదే నువ్వు. **తత్త్వమసి.**

**యద్వత్స్వప్న శరీరకే హమితి ధీస్సంభావితా నిద్రయా**
**తద్వజ్జాగ్రతి మాయమాత్రవపుషి స్వాత్మత్వధీః కల్పితా**
**సత్యం నైతదసి త్వమాత్మని ధియా పశ్య స్వమేకాగ్రయా**
**నిత్యం శుద్ధమనంత మవ్యయసుఖం బ్రహ్మాసి సాక్షాత్పరమ్ ॥ 179**

స్వప్నంలో నేను అని భావించేది, జాగ్రదావస్థలో నేను, నాది అనిపించేది, స్థూలసూక్ష్మకారణ శరీరాలలో మాయతో ఇదే స్వస్వరూపము అనే బుద్ధిని కలిగించేది, నువ్వు ఈ దేహము కాదు అని చెప్పేది, నిర్మలమైనది, నాశనము లేనిదే బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

నిద్రలో కలగనేవాడు కలలోని శరీరం మీద ఆత్మబుద్ధి కలిగి ఉంటాడు. అంటే దేహమే ఆత్మ అని భావన చేస్తాడు. కలగాని కలలోని శరీరము, ఇతర సంఘటనలు అసత్యము అని తెలిసినా, నిద్రాదోషము వల్ల అతడికి భ్రాంతి కలుగుతోంది. జాగ్రదావస్థలో ఈ దేహము నిత్యం కాదు. దృశ్యమానమైన జగత్తు నిత్యం కాదు. అయినప్పటికీ దేహమే ఆత్మ అని భావిస్తాడు. వాస్తవంగా చూస్తే ఈ దేహము ఆత్మకాదు. ఏకాగ్రమైన చిత్తంతో గనక విచారిస్తే అప్పుడు నిర్వికారుడు, నాశనం లేనివాడు, ఆనందమయుడు పరబ్రహ్మ అని తెలుస్తుంది. ఆ బ్రహ్మమే నీవు. **తత్త్వమసి.**

**దేహేంద్రియప్రాణమనోహమాద్యైః సహస్థితః సన్నపి సంగహీనః ।**
**వ్యోమేవ మేఘైరమలస్వరూప స్త్వం ప్రత్యగాత్మాసి సదాశివోఽసి ॥180**

మేఘములతో కూడిన ఆకాశంలాగా, శరీరత్రయం, గుణత్రయం, అవస్థాత్రయం, ఇంద్రియాలు, అంతఃకరణ చతుష్టయము మొదలైన వాటితో ఉన్నప్పటికీ, దేనితోనూ సంబంధం లేనిది బ్రహ్మము. అదే నీవు **తత్త్వమసి.**

ఆకాశం మేఘావృతమై ఉంటుంది. కాని ఆకాశానికి మేఘాలకు ఏ రకమైన సంబంధం ఉండదు. అలాగే కూటస్థుడు ప్రాణాలు, ఇంద్రియాలు మొదలైన వాటితో కూడి ఉన్నప్పటికీ వాటితో అతనికి సంబంధం ఉండదు. కూటస్థుడు అంటే పిపీలికాది బ్రహ్మ పర్యంతము సకల ప్రాణుల యొక్క బుద్ధిగుహలో అధిష్ఠించి ఉన్నవాడు.

దేహాలు మూడు 1.స్థూలశరీరము – ఇది పంచీకృతము చేయబడిన పంచ మహాభూతాల వల్ల ఏర్పడినది. జీవి చేసిన కర్మఫలం అనుభవించేది ఈ స్థూలశరీరంతోనే.

2. సూక్ష్మశరీరము – జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధి, పంచభూతాలవల్ల ఏర్పడినది. సుఖదుఃఖాలు అనుభవించటానికి సాధనము.

3. కారణ శరీరము – వాక్కుచేత చెప్పటానికి వీలు కానిది, ఆది లేని అజ్ఞానమే కారణ శరీరము.

ఇంద్రియాలు రెండు రకాలు 1.జ్ఞానేంద్రియాలు 2.కర్మేంద్రియాలు

పంచప్రాణాలు : 1.ప్రాణ 2.అపాన 3.వ్యాన 4.ఉదాన 5.సమానములు

ఉపవాయువులు: నాగ, కూర్మ, క్రుకర, దేవదత్త, ధనుంజయములు.

అంతఃకరణ చతుష్టయము : 1.మనస్సు 2.బుద్ధి 3.చిత్తము 4.అహంకారము

వీటన్నింటితోనూ కూడిఉండి కూడా దేనితోను సంబంధం లేనిదే బ్రహ్మము. అదే నీవు. **'తత్త్వమసి'.**

**క్షరాక్షరాభ్యాం చ విలక్షణః సఽ క్షరాక్షరవ్యాపృతిహేతుభూతః ।**
**తయోశ్చ తత్తద్వికృతేషు సాక్షి త్వం ప్రత్యగాత్మాసి సదాశివోఽసి ॥181**

నాశనమయ్యే దేహాదుల కన్న, నాశనంలేని జీవునికన్న వేరుగా జీవుల యొక్క వ్యాప్తికి, కారణమైన వాడు క్షరాక్షరములకు సాక్షియైన వాడు ఆ కూటస్థుడే. అతడే బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి**

పాంచ భౌతికమైన దేహం నాశనమయ్యేది. **ఈశావాస్యోపనిషత్తు**లో చెబుతారు చూడండి.

**వాయురనిలమథేదం భస్మాంతం శరీరం**

మానవుడు మరణించిన తరువాత అతనిలో ఉన్న వాయువు వాయువులోను, అగ్ని అగ్నిలోను, జలం జలంలోను, ఆకాశం ఆకాశంలోను కలిసిపోగా మిగిలిన భాగము భస్మమై భూమిలో కలిసిపోతుంది. మానవుడి ఆయుర్దాయం పూర్వకాలంలో వంద సంవత్సరాలు. అయితే మంచినడవడితో మూడు వందల సంవత్సరాలు, ఇంద్రియనిగ్రహంతో మూడు వందల సంవత్సరాలు, ప్రాణాయామం

(యోగాభ్యాసం)తో మూడు వందల సంవత్సరాలు వెరసి మానవుడు వేయి సంవత్సరాల వరకు జీవించవచ్చు అంటున్నాయి శాస్త్రాలు. ఇప్పటికీ అప్పుడప్పుడు మనం టి.వి.లో చూస్తుంటాం. హిమాలయ ప్రాంతంలో ఒక బాబా ఉన్నాడని, ఆయన వయస్సు ఏడు వందల సంవత్సరాలనీ చెబుతారు. ఆ తరువాత ఏమవుతుంది? ఈ దేహపతనం కాక తప్పదు. కొంతమందికి హనుమంతుడు, మార్కండేయుడు వంటి వారు మరణించలేదు. వారు చిరంజీవులు కదా? అని అనుమానం. చిరంజీవి అంటే సూక్ష్మదేహంతో ఉన్నాడు అని. అంతేకాని ఇదే శరీరంతో అంటే పాంచభౌతికమైన శరీరంతో ఉన్నవారు ఎవరూ లేరు. అవతార పురుషులుగా చెప్పబడే రాముడు కృష్ణుడు కూడా నిర్యాణం పొందారు. ఈ లోకంలో పుట్టిన ప్రతివారు మరణించాల్సిందే. అది లోకధర్మము. కాబట్టి దేహం శాశ్వతం కాదు. నాశనమై పోతుంది. ఇక జీవుడు. ఇతడికి నాశనం లేదు. దేహపతనం జరిగిన తరువాత గొంగళీ పురుగు ఒక ఆకును పూర్తిగా తినేసి ఇంకొక ఆకు మీదకు వెళ్ళినట్లుగా, ఈ శరీరాన్ని వదలి ఇంకొక శరీరంలో ప్రవేశిస్తాడు. కాబట్టి జీవుడికి నాశనం లేదు. అతడు నాశరహితుడు. వీరిరువురి కన్న వేరైనది బ్రహ్మము. దేహముల వ్యాప్తికి అంటే జనన మరణాలకు కారణమైనది, మరణానంతరము జీవాత్మ ఒక దేహం వదలి ఇంకో దేహంలో ప్రవేవించటానికి సాయపడేది. జగత్తులో నాశనమున్నవి, నాశనము లేనివి అయిన అన్నింటికి సాక్షిగా ఉన్నది, సర్వసాక్షి అయినది ఆ కూటస్థుడే. అతడే బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

**అంతర్బహిశ్చైకరసో నిరంతో వ్యోమేవ పూర్ణం నిరూపాధి రేకః ।**
**నిరంతరానందఘనోఽద్వితీయ స్త్వం ప్రత్యగాత్మసి సదాశివోఽసి ॥182**

అంతటా వ్యాపించినవాడు, ఆద్యంతములు లేనివాడు, తనకన్న వేరుగా ఏదీ లేనివాడు, దేశ కాలభేదములు లేనివాడు కూటస్థుడు. అతడే పరబ్రహ్మ. అదే నీవు. **తత్త్వమసి.**

ఆకాశము అంతటా వ్యాపించి ఉంటుంది. ఖాళీ ప్రదేశము అంతా ఆకాశమే. ఆకాశము అంటేనే అవకాశాన్నిచ్చేది అని అర్థం. ఆకాశం అంటే ఎక్కడో పైన లేదు. మనపైన, మన క్రింద, మన చుట్టు ప్రక్కల ఉండే ఖాళీ ప్రదేశము అంతా ఆకాశమే. జగత్తంతా వ్యాపించింది మహదాకాశం. అక్కడ ఒక ఖాళీ కుండను

పెట్టాం. ఆ కుండలో కూడా ఆకాశం ఉంది. దాన్ని ఘటాకాశం అంటారు. ఈ రకంగా జగత్తులో లోపలా బయటా అంతటా వ్యాపించి ఉన్నది ఆకాశమే. ఆకాశము లాగా సర్వవ్యాపి అయిన పరమేశ్వరుడికి జనన మరణాలు లేవు. ఆది అనాది అయినవాడు. ఆయనకు అనేక రూపాలు లేవు. అసలు రూపమే లేనివాడు. ఉపాధి వల్ల పరబ్రహ్మకు ఏ వికారము (మార్పు) ఉండదు. జగత్తులో అతని కన్న ఇతరమైనది ఏదీలేదు. అంటే బ్రహ్మకన్న భేదమైన వస్తువు ఏదీ లేదు. ఈ భేదము మూడు రకాలుగా ఉంటుంది.

**1.స్వగత భేదము :** ఒకే దానిలో ఉండే తేడాలు. ఒక చెట్టుకు కాయలు, పూలు, ఆకులు, కొమ్మలు, రెమ్మలు ఉంటాయి. అవన్నీ ఒకే రకంగా ఉండవు. దీన్ని స్వగత భేదము అంటారు.

**2. సజాతీయ భేదము :** ఒకే జాతికి చెందిన రెండు వస్తువుల మధ్యన ఉండే తేడా. మర్రిచెట్టు. రావిచెట్టు. ఈ రెండూ చెట్లే. కాని వీటి మధ్యన తేడా ఉంది. అదే సజాతీయ భేదము.

**3. విజాతీయ భేదము :** రెండు భిన్న జాతుల మధ్యన ఉన్న భేదము. ఒక చెట్టు ఒక రాయి. ఈ రెండూ విజాతీయాలు ఒకే జాతికి సంబంధించినవి కావు. వీటి మధ్యన ఉన్న భేదమే విజాతీయ భేదము. ఈ రకమైన భేదాలు ఏవీ బ్రహ్మమునందు ఉండవు. దేశకాలమానములచే భేదము లేనివాడు. ఏ దేశంలోనైనా, ఏ కాలంలోనైనా ఎప్పుడైనా, ఎక్కడైనా ఒకే రకంగా ఉండేవాడు. ఆనంద స్వరూపుడు. ఎప్పుడూ ఆనంద డోలికలలో తేలియాడే వాడు. ఈ ఆనందము ఎలా ఉంటుంది? అనే విషయం తైత్తిరీయోపనిషత్తు లోని ఆనందవల్లిలో చెప్పబడింది.

లోకంలోని సంపద అంతా యువకుడు సదాచార సంపన్నుడు, వేదవిదుడు, బలమైన వాడు, ఆరోగ్యవంతుడు, అనుభవించటానికే ఉన్నది. ఈ ఆనందాన్నే మానుషానందము అంటారు.

మానుషానందానికి నూరు రెట్లు – మానవ గంధర్వానందం
మానవ గంధర్వానందానికి నూరు రెట్లు – నిజగంధర్వానందం
నిజగంధర్వానందానికి నూరు రెట్లు – చిరలోక పితరానందం

| | | |
|---|---|---|
| చిరలోక పితరానందానికి నూరు రెట్లు | – | అజానజదేవానందం |
| అజానజదేవానందానికి నూరు రెట్లు | – | కర్మదేవానందం |
| కర్మదేవానందానికి నూరు రెట్లు | – | నిజదేవానందం |
| నిజదేవానందానికి నూరు రెట్లు | – | ఇంద్రానందం |
| ఇంద్రానందానికి నూరు రెట్లు | – | బృహస్పతి ఆనందం |
| బృహస్పతి ఆనందానికి నూరు రెట్లు | – | ప్రజాపతి ఆనందం |
| ప్రజాపతి ఆనందానికి నూరు రెట్లు | – | బ్రహ్మానందం |

ఈ రకమైన ఆనందంలో తేలియాడేవాడు కూటస్థుడు. అతడే పరబ్రహ్మ. అదే నీవు. **'తత్త్వమసి'**

**త్వం దృశ్యభిన్నోఽపి దృశిస్వరూప శ్శశ్వత్ర్పతీతోఽప్యవబోధమాత్రః ।**

**సదేకరూపోఽప్యహమాదిముక్త స్త్వం ప్రత్యగాత్మాసి సదాశివోఽసి ॥ 183**

కనుపించే పదార్థాలకన్న వేరైనప్పటికీ సాక్షిత్వమే స్వరూపముగా గలవాడు. జ్ఞానమే స్వరూపంగా గలవాడు. ఉనికియే స్వరూపంగా గలవాడు, అహంకారము లేనివాడు కూటస్థుడు. అతడే పరబ్రహ్మ. అదే నీవు **'తత్త్వమసి'.**

ప్రత్యగాత్మ సర్వసాక్షి జగత్తులో అన్ని పదార్థములకన్న వేరైనవాడు. అన్నింటిని, చూస్తుంటాడు. అన్ని వ్యవహారాలు గమనిస్తూ ఉంటాడు. అందుకే సర్వసాక్షి. సాక్షిత్వమే స్వరూపముగా గలవాడు. అందుకే సర్వసాక్షి. సాక్షిత్వమే స్వరూపముగా గలవాడు. పరబ్రహ్మకు రూపం లేదు. గతంలో చెప్పుకున్నట్లుగా జ్ఞానమే అతని స్వరూపం. జ్ఞానరాసి కాబట్టి జ్ఞానమే స్వరూపంగా గలవాడు. నేను, నాది అనే అహంకార మమకారాలు లేనివాడు, తనకన్న ఇతర పదార్థము ఏదీ లేనివాడు కూటస్థుడు. అతడే పరబ్రహ్మ. అదే నీవు. **'తత్త్వమసి'**

**అ శబ్ద మస్పర్శ మరూప మవ్యయం**
**తథారసం నిత్యమగంథవచ్ఛ యత్ ।**
**అనాద్యనంతం మహతః పరం ధ్రువం**
**యదక్షరం తత్త్వమసి ధ్రువం మునే ॥ 184**

శబ్ద స్పర్శ రూప రస గంధాదులు లేనిది, ఆది మధ్యాంతములు లేనిది, శాశ్వతమైనది, అహంకారము లేనిది, నిశ్చలమైనది నాశనము లేనిది బ్రహ్మము. అదే నీవై ఉన్నావు. **'తత్త్వమసి'**

జ్ఞానేంద్రియాల లక్షణాలు శబ్ద స్పర్శ రూప రస గంధాలు, ఇవన్నీ మాయాకల్పితాలే. బ్రహ్మమునకు ఇవేవీ ఉండవు. కన్నుకు చూసే శక్తినిచ్చేది ఆత్మ. చెవికి వినికిడి శక్తినిచ్చేది ఆత్మ. అలాగే ముక్కుకు వాసన చూసే శక్తిని, నాలుకకు రుచి చూసే శక్తిని, చర్మానికి స్పర్శ శక్తిని ఇచ్చేది ఆత్మ. కాని ఆత్మకు ఈ లక్షణాలేవీ ఉండవు. ఆత్మకు చావు పుట్టుకలు లేవు. శాశ్వతమైనది. అహంకారము లేనిది. ఏ మాత్రము చలనము లేనిది, నిశ్చలమైనది ఆత్మ. అదే బ్రహ్మము. అదే నీవు. **'తత్త్వమసి'**

**నస్థూలోఽసినసూక్ష్మోఽసి నాపి కారణవిగ్రహః ।**
**బ్రహ్మైవాసి న సందేహః ప్రత్యగ్భోధైకలక్షణః ॥** **185**

నువ్వు స్థూలశరీరం కావు సూక్ష్మశరీరం కావు. కారణ శరీరం అంతకన్నా కావు. సర్వాంతర్యామివి. పంచకోశాలలో ఉన్న జ్ఞానస్వరూపానివి. నీవే పరబ్రహ్మవు. **'తత్త్వమసి'.**

బాగా ఆలోచించి చూస్తే పరబ్రహ్మ స్థూలశరీరం కాదు. సూక్ష్మశరీరం కాదు. కారణశరీరం కాదు. వీటికన్న వేరైనది. పంచకోశాల యందు ఉన్నవాడు. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములనే పంచకోశాలు ఒక దానిలో ఒకటి ఉంటాయి. ఆఖరుగా ఉండేది ఆనందమయ కోశం. ఆ ఆనందమయ కోశంలో జ్ఞానరూపంలో ఉండేవాడు పరమేశ్వరుడు. అతడే పరబ్రహ్మ. అదే నీవు. **తత్త్వమసి.**

**జన్మమృత్యుజరారోగాః కులగోత్రాశ్రమాదయః ।**
**సూక్ష్మస్యైవ తవైతేషాం సాక్షిణో నైవకశ్చన ॥** **186**

జన్మమృత్యుజరారోగాలు, కులగోత్రాలు, ఆశ్రమాలు మొదలైనవన్నీ సూక్ష్మశరీరానికి సంబంధించినవి. ఆ సూక్ష్మశరీరానికి సాక్షివైన నీకు వీటిలో ఒకటి కూడా లేదు.

జన్మమృత్యుజరాదులు ఇవన్నీ మనం చేసిన కర్మ ఫలితంగా వచ్చేవే. మానవుడు చేసిన కర్మ ఫలితంగానే మరుజన్మ అనేది ఉంటుంది. అతడు ధరించే దేహము

కేవలము కర్మఫలం అంతే. పుణ్యకర్మలు చేసినవారు ఉత్తమయోనులందు జన్మిస్తారు. పాపకర్మ చేసినవారు పశువులు, పక్షులు, మృగాలుగా జన్మిస్తారు. దుర్మార్గపు పనులు చేసిన వారు క్రిమికీటకాలుగా జన్మించి, పుడుతూ చస్తూ ఉంటారు. అంతకన్నా నీచమైన కర్మలు చేసిన వారు ఇంకా నీచమైన జన్మ లెత్తుతారు. ఇక్కడ చూడండి పుణ్యకర్మలు చేసినవారు ఉత్తమ జన్మలు ఎత్తుతారు. మానవులంతా ఇతర జీవులకన్న పుణ్యకర్మలు చేసినవారే. మానవులలో ఎన్ని తేడాలున్నాయో చూడండి. వీరిలో మళ్ళీ సంస్కారవంతుల ఇంట్లో జన్మించటం విశేషం. స్ఫురద్రూపి కావటం, మాట నేర్పరి కావటం. శరీరంలోని అవయవాలన్నీ సక్రమంగా ఉండటం, వేదవేదాంగాలు చదవటం. సంఘంలో గౌరవ ప్రదమైన జీవనం సాగించటం, భోగభాగ్యాలు కలగటం, తనతోబాటుగా తన వారందరూ సుఖంగా ఉండటం, రోగాలు రొష్టులు లేకపోవటం, ఈతిబాధలు లేకపోవటం, తనకు లాగానే తన పిల్లలు కూడా సమర్ధవంతులు కావటం. వృద్ధాప్యంలో కష్టాలు లేకుండటము, అనాయాస మరణము ఇవన్నీ గతజన్మ కర్మఫలాలే. మనం అనుకుంటాం. "అక్రమమో, సక్రమమో, కొన్ని తరాల వరకు కూర్చుని తిన్నా తరగని ఆస్తి సంపాదించాను." అని. మనం సంపాదించిన ఆస్తే కాదు. అప్పులు, బాధలు, మనం చేసిన పాపాలు ఇవికూడా మన పిల్లలకు వారసత్వంగా వస్తాయనేది మరచిపోకూడదు. ఎదుటివారిని మోసం చేసి పోగేసిన సొమ్ము నిలవదు. అది నీ పిల్లలకు సుఖానినవ్వదు. వారిని సోమరిపోతులుగా, పనికిరాని వారుగా మారుస్తుంది. రోగాలు వస్తాయి. శత్రువులు ఎదురౌతారు. కొంతమంది రోగాలతో పీడించబడి చస్తారు. కొంతమందికి అనాయాస మరణం. కాబట్టి జన్మమృత్యుజరాదులన్నీ మన కర్మ ఫలంగా వచ్చేవే. అవన్నీ ఈ దేహానికే గాని ఆత్మకు కాదు. ఆత్మ నిష్కళంకమైనది. స్థూలశరీరంతో చేసిన కర్మఫలాలను సూక్ష్మశరీరం మరుజన్మకు తీసుకుపోతుంది. స్థూలశరీరంనాశనమవుతుంది సూక్ష్మశరీరానికి నాశనం లేదు. బాల్య కౌమార, యవ్వనాది దశలు స్థూలశరీరానివే. కులగోత్రాలు ఇవి కేవలము మానవ కల్పితాలు. అయితే కొన్నివేల సంవత్సరాలుగా మనలో జీర్ణించుకుపోయి మా కులం, గోత్రం అనుకుంటున్నాం. వేదంలో కులమతాలు లేవు. అందరిదీ ఒకటే కులం. చతురాశ్రమాలు. బ్రహ్మచర్యము, గృహస్థాశ్రమము, వానప్రస్థము, సన్యాసము ఈ ఆశ్రమాలు ఏవీ ఆత్మకు కాదు కేవలం దేహానికే. ప్రతివారూ ఈ ఆశ్రమాలు తప్పక ఆచరించాలి అని ఏమీ నియమం

లేదు. ఈ రకంగా జన్మమృత్యుజరాదులు, కులగోత్రాలు, ఆశ్రమాలు అన్నీ శరీరానికే అన్నింటికీ సాక్షివైన నీకు వీటితో ఏ రకమైన సంబంధము లేదు. నీవే బ్రహ్మానివి. **'తత్త్వమసి'**

> **అజ్ఞానజడతాలస్య మోహనిద్రాభ్రమాదయః ।**
> **కారణస్త్యైవ తేఽ మిషాం సాక్షిణో నైవ కశ్చన ॥ 187**

అజ్ఞానము, జడత్వము, జాగు చెయ్యటం, మూర్ఛ, నిద్ర భ్రాంతి, మొదలైనవి కారణ శరీర ధర్మాలు. అన్నింటికీ సాక్షివైన నీకు వీటిలో ఏ ఒక్కటీ లేదు.

అజ్ఞానము. ఒక వస్తువు గురించిన విజ్ఞానము లేకపోవటం. జడత్వము అంటే ఏమీ తోచని స్థితి. ఆలస్యము అంటే జాగు చెయ్యటం, మోహము – విపరీతమైన కోరిక, మూర్ఛ, నిద్ర, భ్రమ అనగా భ్రాంతి. ఇవన్నీ కారణ శరీర ధర్మాలు. త్రిగుణాత్మకమైన మాయ లేదా అవిద్య కారణ శరీరము అనబడుతుంది. వాక్కు చేత చెప్పనలవి కానిది, ఆది లేనిది అయిన అజ్ఞానమే కారణశరీరము. గుణత్రయమే ఆత్మయొక్క కారణ శరీరము. నిద్ర భ్రాంతి అన్నీ కారణ శరీర ధర్మాలు. ఇక్కడ గుర్తించాల్సిన విషయం ఏమంటే త్రిగుణాత్మకమైన మాయే కారణ శరీరము జ్ఞానాజ్ఞాన ధర్మాలన్నీ గుణత్రయానికి సంబంధించినవే. కాబట్టి ఆ ధర్మాలన్నీ కారణ శరీరానికి సంబంధించినవి. సుషుప్తిలో నువ్వు ఆ కారణ శరీరానికి కూడా సాక్షివై ఉంటావు. ఆ ధర్మాలలో ఒకటి కూడా నీకు లేదు. నీవు పరబ్రహ్మావు. నీకు వీటితో ఏ సంబంధము లేదు.

> **కర్తృతా భోక్తృతాహంతా మమతాదికలక్షణః ।**
> **బుద్ధిరేవైష సంసారో న తే సంసృతిసాక్షిణః ॥ 188**

కర్తృత్వ భోక్తృత్వాలు, అహంకార మమకారాలు అన్నీ బుద్ధికి మనస్సుకు సంబంధించినవి. ఈ సంసారానికి సాక్షివైన నీకు ఇవి ఏవీ లేవు.

నేను ఈ పని చేశాను. కర్మఫలాన్ని అనుభవిస్తున్నాను. ఇవన్నీ కర్తృత్వ భోక్తృత్వాలు. నేను నాది అనేవి అహంకార మమకారాలు. ఈ ధర్మాలన్నీ బుద్ధికి సంబంధించినవి. మనసుకు సంబంధించినవి. నేను కర్తను, భోక్తను అని ఆత్మప్రకాశంతో బుద్ధి భావన చేస్తోంది. ఈ బుద్ధే ఇంద్రియాల ద్వారా కర్మలను

చేస్తోంది. వాటి ఫలితం అనుభవిస్తోంది. వీటితో నీకెలాటి సంబంధము లేదు. ఇప్పుడు కర్తృత్వాభిమానం కలిగింది. సుఖము, దుఃఖము అనుభవం కలుగుతోంది. అంటే చేసిన దానికి ఫలితం అనుభవిస్తున్నాను. అనే అన్ని విషయాలు నీకు తెలుసు. అన్నింటికీ నీవు సాక్షివి. ఈ సంసారానికే నీవు సాక్షివి.

**స్థూలాది దేహసంబంధో జన్మమృత్యుశ్చ సంసృతిః ।**

**స్వాజ్ఞానేన త్వయా స్వస్మిన్ సర్వమేతత్ప్రకల్పితమ్ ॥** 189

స్థూలదేహంతో సంబంధము, జనన మరణాలు, కర్తృత్వాది లక్షణాలన్నీ అజ్ఞానంతో స్వస్వరూపంలో కల్పించబడ్డాయి.

స్థూలదేహంతో సంబంధం గాని, జనన మరణాలు గాని, ఈ సంసారం గాని అన్నీ అజ్ఞానంతో స్వస్వరూపంలో కల్పించబడినవే. అంతేగాని యధార్థం మాత్రం కాదు. నేను సన్నగా ఉంటాను. లావుగా ఉంటాను. ఎర్రగా ఉంచాను. ఇవన్నీ స్థూలశరీరానికి సంబంధించినవి. నేను కుంటివాడిని, గ్రుడ్డివాడిని, అవిటి వాడిని అనే సూక్ష్మశరీరానివి. నేను నిద్రపోతున్నాను. అనేది కారణ శరీరానికి సంబంధించినది. ఈ రకంగా ఆత్మకు మూడు శరీరాలతో సంబంధము మున్నది. నేను జన్మించాను. నేను మరణించాను. నేను కర్తను. నేను భోక్తను అనే వ్యవహారాలు జన్మమృత్యుజరాదులకు సంబంధించినవి ఈ రకంగా సంసార బంధం కూడా ఆత్మకు ఉన్నట్లుగా అనిపిస్తోంది. ఇదంతా అజ్ఞానంతో కల్పించబడిందే. అజ్ఞానం కూడా ఆత్మకు సంబంధించినదే. ఆత్మను ఆశ్రయించినదే.

**రాహుణా గ్రహణం మోక్షో నైవ భానోర్యథా తథా ।**

**సంసారబంధో మోక్షశ్చ నైవతే నిర్వికారణః ॥** 190

సూర్యుడికి రాహువు చేత పట్టువిడుపు ఎలా లేవో, అలాగే వికార శూన్యుడవైన నీకు సంసార బంధాలుగాని, వాటి నుంచి విముక్తి గాని లేవు.

మామూలుగా మనం సూర్యగ్రహణం చంద్రగ్రహణం అని చెబుతాము. క్షీరసాగర మథనం జరిగినప్పుడు వచ్చిన అమృతాన్ని శ్రీమహావిష్ణువు మోహినీ రూపంలో దేవతలకు పంచాడు. ఆ సమయంలో సింహికయొక్క కుమారుడు రాహువు దేవతల పంక్తిలో కూర్చుని అమృతపానం చేశాడు. సూర్యచంద్రులు ఈ విషయం శ్రీమహావిష్ణువుకు చెప్పగా, ఆయన తన చక్రాయుధంతో రాహువు తల నరికేశాడు.

కాని అప్పటికే రాహువు అమృతపానం చేశాడు కాబట్టి మరణించలేదు. సూర్యచంద్రులు తన గురించి విష్ణువుకు చెప్పారనే కోపంతో వారిని మ్రింగుతున్నాడు అనేది కథ. ఇది కల్పితము నిజం కాదు. నిజంగా రాహువే శత్రుత్వంతో సూర్యచంద్రులకు హాని చెయ్యాలనుకుంటే చేతికి చిక్కినప్పుడు వారిని ఎందుకు వదులుతాడు? పరిభ్రమణంలో సూర్యుడు తన దగ్గరకు వచ్చినప్పుడు రాహువు మేఘంలాగా సూర్యుడికి కొంతవరకు అడ్డు వస్తాడు. మళ్ళీ అవతలకు వెళ్ళిపోతాడు. సైన్సు ప్రకారం అయితే సూర్యుడికి భూమి అడ్డుగా వస్తుంది. ఈ విషయం తెలుసుకోలేక 'రాహువు సూర్యుణ్ణి మ్రింగేశాడు' అనుకుంటారు. ఇది పూర్తిగా అజ్ఞానము. అలాగే వికారాలు లేని నీకు బంధాలు, ఆ బంధాల నుండి విడుదల ఉండదు. అసలు బంధాలే లేవు. అలాంటప్పుడు లేని బంధాల నుండి విడుదల ఎలా ఉంటుంది? అంతా అజ్ఞానముతో కల్పించబడినదే.

**స్వయం తత్త్వ మవిజ్ఞాయ సర్వం త్వయి వికల్పితం ।**
**నిర్వికారే నిరాకారే వ్యోమనిశ్యామతాదివత్ ॥ 191**

స్వయంగా యథార్థ స్వరూపం తెలుసుకోలేక వికారాలు లేని నీ యందు, అసలు ఆకారమే లేని ఆకాశము నందులాగా నామరూపాలతో కూడిన సమస్తము కల్పించబడినాయి. చూసేవారు యథార్థమైన స్వరూపాన్ని తెలుసుకోలేక స్వయముగా వికారములు లేని నీ యందు అన్నింటినీ కల్పిస్తున్నారు. దీనివల్ల జీవుడు సంసారి అవుతున్నాడు. సుఖదుఃఖాలను అనుభవిస్తున్నాడు. ఏ రంగు లేని ఆకాశానికి నలుపు, తెలుపు రంగులు ఆపాదించినట్లుగా నీ యందు సంసారాన్ని ఆపాదిస్తున్నారు. ఇదంతా కూడా భ్రాంతి అజ్ఞానము.

**ఆరోపితః సత్యదేవ భాతి**
**భ్రాంతస్య యద్యప్యసదేవ తత్తు ।**
**కుంభాకృతిః కుంభమతిశ్చ జాయతే**
**కుంభాత్మనా పశ్యతి యస్తు మృత్స్నామ్ ॥ 192**

భ్రాంతి చెందిన వాడికి కల్పించబడిన లేదా ఆరోపించబడిన పదార్థము నిజంగా ఉన్నట్లే అనిపిస్తుంది. కుండ యొక్క ఆకారము చూసే వాడికి మట్టికన్న వేరుగా ఇది కుండ. ఇది సత్యము అనిపిస్తుంది.

అసలు భ్రాంతి అంటే అదే. లేనిది ఉన్నట్లుగా చూపి అదే నిజము అని నమ్మిస్తుంది. భ్రాంతి చెందిన వాడికి కల్పించబడిన వస్తువు సత్యముగానే కనిపిస్తుంది. అలా కాకపోతే కల్పిత వస్తువును గురించి ఆలోచించడు. ముత్యపు చిప్పను చూసి ఇది వెండి అనుకుంటున్నాడు. దాన్ని పట్టి తెచ్చుకోవటానికి పోతున్నాడు. ఎండమావులలో నీరు త్రాగుదామని ఎడారిలో పరుగులు పెడుతున్నాడు. అధిష్ఠానమును తెలుసుకోలేనప్పుడు ఆరోపిత వస్తువు భిన్నంగానే కనిపిస్తుంది. కుండ మట్టితో తయారుచేసినది అనే విషయం తెలియనప్పుడు మట్టికన్న కుండ వేరుగా కనుపిస్తుంది.

**చక్షుష్మతో బుద్ధిమతో వివేకినః**
**ప్రామాణిక స్యాత్ర యథార్థదర్శినః ।**
**అంతర్బహిః సర్వత ఏవ కుంభో**
**మృదేవ కశ్చిన్నతతః పరో౾ర్థః ॥ 193**

కళ్లు ఉన్న జ్ఞానికి, మంచి బుద్ధితో వివిధ ప్రమాణాలద్వారా ఆలోచింపగలిగిన వాడికి కుండ లోపల, బయట అంతా మట్టే కనుపిస్తుంది.

కళ్ళుండి పరిపూర్ణమైన జ్ఞానం కలవాడికి, ఏ విషయాన్నైనా ప్రత్యక్షాది ప్రమాణాలతో ఆలోచించే వాడికి, తర్కించి చూసేవాడికి, పరబ్రహ్మతత్త్వం తెలిసిన వాడికి ఎప్పుడూ కల్పిత పదార్థము విడిగా ప్రత్యేకంగా కనపడదు. కుండమట్టితో తయారైంది. కాబట్టి కుండకు అధిష్ఠానము మట్టి. ఈ కారణం చేత కుండను పరిశీలించినట్లైతే కుండ బయట లోపల కూడా మట్టే కనుపిస్తుంది కాని ఇతరమైన పదార్థమేదీ లేదు.

**విజ్ఞాతే సత్యధిష్ఠానే కల్పితం నైన దృశ్యతే ।**
**రూప్యం కిం దృశ్యతే శుక్త్యౌ నీలపృష్ఠాది దర్శనే ॥ 194**

నల్లగా ఉన్న ముత్యపు చిప్ప పై భాగము కనుపించగానే వెండి కనపడదు. అందులోని ఆధారభూతమయిన పదార్థాన్ని తెలుసుకోగానే అధిష్ఠానము నందు కల్పించబడిన పదార్థము అసలు కనపడదు.

అధిష్ఠాన పదార్థం తెలిస్తే ఆరోపిత పదార్థం ఇంక కనపడదు. ముత్యపుచిప్ప పై భాగము నల్లగా ఉంటుంది. లోపలి భాగము తెల్లగా వెండిలా ఉంటుంది.

లోపలి భాగాన్ని చూసి ఇది వెండి అనుకుంటారు. కాని పై భాగాన్ని చూస్తే ఇది వెండి కాదు అని స్పష్టంగా తెలుస్తుంది. అలాగే పరబ్రహ్మ తత్త్వము తెలియగానే అందులో కల్పించబడిన జగత్తు అసత్యము అని తెలుస్తుంది.

**రజతం రజతత్వంచ చాకచక్యం చపాండిమా ।**

**సకలం శుక్తిరేవాసీ చ్ఛుక్తితత్వసనాధారణాత్ ॥ 195**

ముత్యపుచిప్ప యధార్థ స్వరూపం తెలిస్తే దానిలో ఉన్న వెండి, ధగధగ మెరుపు, తెల్లదనం, అన్నీ ముత్యపుచిప్పయే అని తెలుస్తుంది.

భాగా ఆలోచించి, విమర్శ చేసి ఇది ముత్యపుచిప్ప అని తెలుసుకోగలిగితే అంతవరకు అందులో ఆరోపించబడిన పదార్థము (వెండి) అంతా అధిష్ఠాన మాత్రమే అవుతుంది. అయితే ముందు ఇది వెండి అని ఎందుకు అనుకున్నాడు? తరువాత వెండి కాదు అని ఎందుకు అనుకుంటునానడు? గతంలో కనిపించిన వెండి ఇప్పుడు ఏమయింది? ఎక్కడికైనా వెళ్ళిపోయిందా? దేనిలో నయినా కలిసిపోయిందా? అలా ఏమీ జరగలేదు. అసలు అక్కడ వెండి లేదు. ఉన్నట్లుగా అనిపించింది. అది వెండి కాదు ముత్యపుచిప్ప అని తెలియగానే భ్రాంతి తొలగిపోయింది. ఆ వెండి ఇప్పుడు ముత్యపుచిప్ప యందే అభిన్నముగా ఉన్నది. భ్రాంతి వలన కనిపించిన వెండి, దాని తళతళ, తెలుపు రంగు ఏవీ ముత్యపు చిప్ప కన్న వేరు కావు.

**తథైవ బ్రహ్మణి జ్ఞాతే స్వాత్మనా కేవలాత్మని ।**

**బ్రహ్మైవ సకలం విశ్వం స్థూలసూక్ష్మాది సంజ్ఞితమ్ ॥ 196**

జగత్తునకు అధిష్ఠానమైన ప్రత్యగాత్మ రూపుడయిన పరబ్రహ్మను తెలుసుకున్నట్లైతే నామరూపాత్మకమైన జగత్తు అంతా పరబ్రహ్మమే అని తెలుస్తుంది.

ప్రత్యగాత్మ రూపంలో ఉన్న పరబ్రహ్మను తెలుసుకున్నట్లైతే భ్రాంతి వల్ల కనుపించిన నామరూపాలు గల స్థూల సూక్ష్మ రూపమయిన జగత్తంతా బ్రహ్మమే అని తెలుస్తుంది. అధిష్ఠానమయిన బ్రహ్మము కన్న వేరుగా ఏదీ ఉండదు. వాస్తవ స్థితిలో బ్రహ్మముకన్న వేరైన ద్రష్ట ఎవరూ లేరు. కాబట్టి ఈ జగత్తును కల్పించినా, అధిష్ఠానము కన్న వేరుగా చూసినా బ్రహ్మమే ఈ పనులు చేస్తున్నది. అజ్ఞానం కూడా బ్రహ్మమును ఆశ్రయించియే ఉన్నది. జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే అని

చెబుతున్నాము కదా? అలాంటప్పుడు అజ్ఞానము మాత్రము పరబ్రహ్మ స్వరూపము కాకుండా ఏమవుతుంది? జగత్తులాగానే ఈ అజ్ఞానం కూడా త్రికాలము లందు అసత్యమే అవుతుంది. బ్రహ్మమునకు ఏ వికారాలు లేవు. భేదదృష్టి ఉన్నప్పుడు వ్యవహారాలన్నీ ఉంటాయి. అసలువిషయం తెలిసిన తరువాత ఏదీ ఉండదు. ఉండేది బ్రహ్మము ఒక్కటే.

**చిదేవ దేహోఽప్యసవశ్చిదేవ మనశ్చిదేవాపి చ ధీశ్చిదేవ ।**

**చిదేవ కర్తా చ చిదేవ భోక్తా చిదేవభోగ్యం చ చిదేవ సర్వమ్ ॥ 197**

**చిదేవ పంచ భూతాని చిదేవ భువనత్రయం**

**చిదేవాహం చిదేవ త్వం సర్వమేతచ్చిదేవహి ॥ 198**

ఈ స్థూలదేహము పరబ్రహ్మము నందు బుద్ధిచే ఆరోపించబడినది అవటంచేత, నిశ్చయంగా జ్ఞానరూపమయిన పరబ్రహ్మమే అవుతున్నది. పంచప్రాణాలు, మనస్సు, బుద్ధి, చేసేవాడు. అనుభవించేవాడు, అన్ని పదార్థాలు, పంచభూతాలు, ముల్లోకాలు, గురువు, శిష్యుడు, జగత్తులో వేరువేరుగా కనుపించే ప్రతిదీ జ్ఞానరూపుడు, అద్వితీయుడు అయిన పరబ్రహ్మమే.

ఈ స్థూలదేహము పరబ్రహ్మము నందు బుద్ధిచేత ఆరోపించబడుచున్నది. కాబట్టి జ్ఞానరూపమయిన పరబ్రహ్మయే అవుతున్నది. అంతేకాదు పంచప్రాణాలు మననం చేసే మనస్సు, కర్మలను చేసేది, నిశ్చయించేది అయిన బుద్ధి ఇవన్నీ కూడా బ్రహ్మమునందు ఆరోపించబడినవే. కాబట్టి పరబ్రహ్మమే అవుతున్నాయి. చేసేవాడు, చేయించేవాడు, అనుభవించేవాడు, అనుభవించే పదార్థము, ఇతర పదార్థాలు, బుద్ధిచేత పరబ్రహ్మము నందు కల్పించబడ్డాయి కాబట్టి అవికూడా జ్ఞానరూపమయిన పరబ్రహ్మమే. పంచభూతాలు, మూడు లోకాలు, ఉపదేశించేవాడు, ఉపదేశం పొందేవాడు, గురువు, శిష్యుడు, రకరకాలుగా కనుపించే జగత్తు అన్నీ జ్ఞానరూపుడు, అద్వితీయుడు అయిన పరబ్రహ్మమే. భేదము అనేది కేవలము అజ్ఞానముచేత కల్పించబడినది.

**సదేవేదం సర్వంత్వితి వదతిసాక్షాచ్ఛ్రుతిరపి**

**ధ్రువం సర్వం విశ్వం భవతి చ చిదేవానుభవతః ।**

చితో భిన్నంకించిన్న హి కలయితుం క్వాపి విదుషాం
సతాందృష్టే రస్తిద్వయ విరహితే బ్రహ్మణి పరే ॥ 199

మృదాది దృష్టాంతబలేన యుక్త్యా
శ్రుత్యానుభూత్యా సదిదం విదిత్వా ।
నిర్మూల్య భేదం స్వమనః ప్రసూతం
స్వస్మిన్ రమస్వాత్మసుఖేన నిత్యమ్ ॥ 200

వేదంలో కూడా దృశ్యమానమైనదంతా బ్రహ్మమే అని చెప్పబడింది. వేదప్రమాణాన్ని బట్టి విమర్శ చేసి యధార్ధమైన తత్త్వము తెలుసుకున్న వాడికి సత్యముగ కనుపిస్తున్న జగత్తంతా పరబ్రహ్మమే అవుతున్నది. బ్రహ్మవేత్తల దృష్టిలో బ్రహ్మము కన్న వేరైన పదార్ధము ఏదీ లేదు. మట్టి మొదలైన ఉదాహరణల చేత, యుక్తులచేత, వేదవాక్యముల చేత, అనుభవముతోను ఈ జగత్తును బ్రహ్మరూపమైన దానినిగా తెలుసుకుని, మనసుతో కల్పించబడిన భేదాన్ని ధ్వంసం చేసి ఎల్లప్పుడూ బ్రహ్మానందంతో స్వస్వరూపము నందే విహరించవలసినది.

పరమ ప్రమాణమైన వేదం కూడా జగత్తుకు బ్రహ్మకు భేదం లేదనే చెబుతోంది. మహాత్ములు, మహర్షులు అలాగే భావిస్తున్నారు. బ్రహ్మజ్ఞానుల దృష్టిలో జగత్తులో బ్రహ్మము కన్న వేరైన పదార్ధము ఏదీలేదు. అజ్ఞానులకు ప్రపంచము ఎంత వేరుగా కనుపించినా అది యధార్ధము కాదు. ప్రమాణము కాదు. శ్రుతులు జగద్బ్రహ్మలకు భేదం లేదని చెబుతున్నాయి. అందుచేత చేతనాచేతనాత్మకమగు జగత్తంతా బ్రహ్మమే.

కాబట్టి మట్టి, కుండ మొదలైన ప్రత్యక్ష ఉదాహరణలచేత, అనుభవంచేత, ఈ జగత్తంతా బ్రహ్మమే అని నిశ్చయించుకోవాలి. అజ్ఞానం వల్ల కలిగే భేదాన్ని నాశనం చెయ్యాలి. ఈ తేడాలన్నీ మనసుతో కల్పించబడినవే కాని యధార్ధము కాదు. ఈ రకంగా స్వస్వరూప జ్ఞానం కలిగి, అన్ని కాలములందు బ్రహ్మానందాన్ని అనుభవిస్తూ ఆత్మయందే విహరింపవలసింది. అదే జీవన్ముక్త స్థితి.

# 9. బ్రహ్మానందము

చరాచర జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే. ఆకాశానికి కారణం పరబ్రహ్మ. సృష్టికి ముందు ఈ జగత్తంతా శూన్యంగా ఉండేది. ఆ శూన్యాన్ని పరబ్రహ్మ ఆవరించి ఉన్నాడు. అతడే నామరూపాత్మకమైన జగత్తును సృష్టించాడు. ఆ పరబ్రహ్మ ఆనందకారకుడు అతన్ని సాక్షాత్కరింప చేసుకున్నవాడు ఆనందం పొందుతాడు. దహరాకాశంలో ఆ పురుషుడు లేకపోతే ఊపిరి పీల్చటం కూడా జరగదు. ఆ పరమేశ్వరుడు హృత్పద్మంలోనే ఉన్నాడు. సాధకుడు తానే పరబ్రహ్మ స్వరూపాన్ని అని తెలుసుకుంటే భయాలుండవు. బ్రహ్మానికి తనకు భేదం కనిపిస్తేనే భయముంటుంది. తాను వేరు బ్రహ్మమువేరు కాదు. ఇద్దరూ ఒకటే అని భావన చేస్తేనే ముక్తి లభిస్తుంది. పరబ్రహ్మను గురించి భయంతోనే గాలి సవ్యంగా వీస్తోంది. సూర్యోదయ సూర్యాస్తమానాలు సక్రమంగా జరుగుతున్నాయి. దేవతలు తమ విధులు సక్రమంగా నిర్వర్తిస్తున్నారు. ఈ రకంగా అందరి భయానికి ఆకరణమైన బ్రహ్మమే ఆనందము. ఇది శాశ్వతమైన ఆనందము. విషయవాంఛల వల్ల కలిగేది లౌకికానందం. ఇది అనుభవించగానే తగ్గిపోతుంది. విషయవాంఛలు తగ్గిన కొద్దీ ఆనందము పెరుగుతుంది. ఆ ఆనందమే పెరిగి పెరిగి పరిపూర్ణానందంగా మారుతుండి. అదే అద్వైతానందం. ఈ ఆనందం శ్రోత్రియుడు, (వైదిక కర్మలు చేసేవాడు) సదాచార సంపన్నుడు, నిష్కాముడు అయిన బ్రహ్మవేత్త అనుభవించడానికే ఉన్నది. బ్రహ్మవేత్త మాత్రమే ఈ ఆనందం పొందగలుగుతున్నాడు.

ఈ లోకంలోని సంపద అంతా యువకుడు, సదాచార సంపన్నుడు, వేదవిదుడు, బలమైనవాడు అనుభవించటానికే ఉన్నది. దీన్ని అనుభవించటంవల్ల కలిగే ఆనందాన్ని మానుషానందము అంటారు.

మానుసానందానికి నూరు రెట్లు – మానవ గంధర్వానందం

మానవ గంధర్వానందానికి నూరు రెట్లు – నిజగంధర్వానందం

నిజగంధర్వానందానికి నూరు రెట్లు – చిరలోకపితరానందం

చిరలోక పితరానందానికి నూరు రెట్లు – అజానజదేవానందం

అజానజ దేవానందానికి నూరు రెట్లు – కర్మ దేవానందం

కర్మ దేవానందానికి నూరు రెట్లు - దేవానందం

దేవానందానికి నూరు రెట్లు - ఇంద్రానందం

ఇంద్రానందానికి నూరు రెట్లు - బృహస్పతి ఆనందం

బృహస్పతి ఆనందానికి నూరు రెట్లు - ప్రజాపతి (విరాట్పురుషుడు) పొందే ఆనందం.

ప్రజాపతి ఆనందానికి నూరు రెట్లు - బ్రహ్మానందం.

ఇతడు అన్ని ప్రాణులయందు ఉంటాడు. మానవులందరిలోను ఉన్నాడు.

ఈ రకంగా పరబ్రహ్మను గురించి తెలుసుకున్న వారికి ఏ రకమైన ద్వంద్వాలు అంటవు. అతన్ని ఏవీ బాధించవు. అతనికి అజ్ఞానము, భేదబుద్ధి ఉండవు. బ్రహ్మజ్ఞాని పాపపుణ్యాలకు అతీతుడుగా ఉంటాడు. ఆనందస్వరూపుడైన పరమేశ్వరుణ్ణి మనం వాక్కుతో గాని కంటితో గాని అవయవాలతో గాని దేనితోను తెలుసుకోలేము. ఇంద్రియాలకు అతీతమైన బ్రహ్మను బ్రహ్మజ్ఞానం ద్వారానే తెలుసుకోవాలి. ఈ రకంగా పరబ్రహ్మ పొందే ఆనందము అంటే మానవుడు పొందే ఆనందానికి కొన్ని కోట్ల రెట్లు ఉంటుంది. దాన్నే బ్రహ్మానందము అంటారు. ఆ బ్రహ్మ ఈ రకమైన ఆనంద డోలికలలో ఓలలాడుతుంటాడు. అటువంటి పరబ్రహ్మను చేరటమే ముక్తి, సాయుజ్యము, పరమపదము అంటారు. ఆనంం ఐదు రకాలుగా ఉంటుంది. అవి 1. జ్ఞానానందం 2. విషయానందం 3. ఆత్మానందం 4. అద్వైతానందం 5. యోగానందం ఈ ఆనందాలను పొందితేనే బ్రహ్మానందం సాధ్యమవుతుంది.

**"ఆనందోబ్రహ్మేతి వ్యజానాత్, ఆనందాద్ధ్యేన ఖల్విమాని భూతాని జాయన్తే ఆనందేన జాతాని జీవంతి"** అంటోంది తైత్తిరీయోపనిషత్తు. ఆనందమే బ్రహ్మ. ఆనందంలో నుంచే అన్నీ పుడుతునానయి. ఆనందంలోనే జీవిస్తున్నాయి. మళ్ళీ ఆనందంలోనే లయమవుతున్నాయి. అందుచేత ఆనందము. బ్రహ్మానందంలో లీనమవటమే సుఖానికి పరమావధి. బ్రహ్మానందం అనేది బ్రహ్మజ్ఞానం వల్లనే వస్తుంది. బ్రహ్మజ్ఞానే బ్రహ్మానందాన్ని పొందగలుగుతాడు. బ్రహ్మజ్ఞానం వల్ల రెండు పనులు జరుగుతాయి. 1. ఇష్టప్రాప్తి 2. అనర్థ నివారణ. **తైత్తిరీయోపనిషత్తు. ఛాందోగ్యోపనిషత్తు**లలో చెప్పినట్లుగా బ్రహ్మమును తెలుసుకున్నవాడు పరమమైన బ్రహ్మను పొందుతాడు. ఛాందోగ్యోపనిషత్తులో సనత్కుమారుడు నారదుడికి

చెబుతాడు. "ఓ నారదా! ఆత్మజ్ఞానియైన వాడు అజ్ఞాన మూలకమైన సంసారాన్ని, సంసార సాగరమనే దుఃఖాన్ని దాటి తరిస్తాడు." బ్రహ్మము ఆనంద స్వరూపం గలది. ఆనంద స్వరూపమైన బ్రహ్మను పొంది 'అహం బ్రహ్మాస్మి' నేనే పరబ్రహ్మను అనే జ్ఞానంతో సాధకుడు తాను బ్రహ్మమే అవుతాడు. బ్రహ్మైక్యతను తెలుసుకుంటేనే తప్ప ఆనంద స్వరూపుడవటం జరగదు. ముముక్షువైన వాడు అదృశ్యము, వకారము, అనిర్వచనీయము, నిరాధారము అయిన బ్రహ్మయందు అభయ స్థితి పొందినప్పుడు అభయ పదవి అంటే మోక్షం పొందుతాడు. పరమాత్మ విషయంలో భేదభావము ఏ మాత్రం ఉన్నా అతడు భయం నుంచి విముక్తుడు కాడు. అహంకారం ఉన్న ప్రతివాడికీ భయముంటుంది. కాబట్టి అహంకారం నుంచి విముక్తుడైన వాడే భయం నుంచి విముక్తుడవుతాడు. భయం ఎప్పుడూ ద్వైతంలోనే ఉంటుంది. నేను గాక ఇంకెవరో ఉన్నారు అన్నప్పుడు భయం కలుగుతుంది. అద్వైతంలో భయముండదు. ఉన్నది నేను ఒక్కడినే. రెండో వారెవరూ లేరు అన్నప్పుడు ఇంక భయమనేది ఉండదు. అటువంటి స్థితిలో సాధకుడు మోక్షరూపమైన అద్వితీయ బ్రహ్మను పొందుతాడు. **'బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి'** బ్రహ్మను గురించి తెలుసుకున్నవాడు సాక్షాత్తు తానే బ్రహ్మ అవుతాడు. వాయువు, సూర్యుడు, అగ్ని, ఇంద్రుడు యముడు, వీరు గతజన్మలో ఇష్టాపూర్తి (కోరికలు తీరాలని చేసే కర్మ) కర్మలు చేశారు కాబట్టే పరమాత్మ యందు భేదభావాన్ని పాటించి, ఈ జన్మలో ఈ రూపాలు పొందారు. కఠోపనిషత్తులో సాక్షాత్తు యముడే నచికేతుడితో "నచికేతా! చైనము అనే కర్మ చేసినందువల్ల శాశ్వత స్వర్గలోక ప్రాప్తి కలుగుతుంది. అంతేకాని మోక్షం రాదు. ఈ విషయం తెలిసి కూడా నేను ఆ కర్మను చేశాను. ఫలితంగా యమలోకాధిపతి నైనాను" అని చెబుతాడు. ఈ రకంగా బ్రహ్మజ్ఞానం కలిగినందువల్ల ఇష్టప్రాప్తి జరుగుతుంది. ఇక **అనర్థనివృత్తి** ఎలా జరుగుతుందంటే – బ్రహ్మతత్త్వాన్ని తెలుసుకున్న జ్ఞాని దేనికీ భయపడడు. కర్మ చెయ్యటం వల్ల వచ్చే ఫలితం జ్ఞాని, అజ్ఞాని ఇద్దరూ అనుభవించాల్సిందే. కాని బ్రహ్మజ్ఞాని తాను చేసిన పాపాలను అనుభవించటానికి భయపడడు. నేను పుణ్యం ఎందుకు చెయ్యలేదు? పాపం ఎందుకు చేశాను. అని దుఃఖించడు. పుణ్యపాపాలు తత్త్వవేత్తను ఏ మాత్రము బాధించవు. విద్వాంసుడు పుణ్యకర్మలు, పాపకర్మలు అన్నీ వదిలి, నిరంతరము ఆత్మచింతన చేస్తుంటాడు. పుణ్యపాప కర్మలన్నీ తన స్వరూపంగానే భావిస్తాడు. ఆ పరమాత్మ

అందరి యందు సర్వత్రా వ్యాపించి ఉన్నాడు అని భావించి, అతన్నే ధ్యానిస్తాడు. కాబట్టి అతని దృష్టిలో పుణ్యపాపాలు రెండు మిధ్యే. సమస్తమూ ఆత్మ స్వరూపమే. అందుకే అతడికి పుణ్యపాపాలు అంటవు. బ్రహ్మజ్ఞానికి ప్రారబ్ధము తప్ప, సంచితము, ఆగామి కర్మలుండవు. జ్ఞానంవల్ల సంచిత కర్మ పూర్తిగా దగ్ధమై పోతుంది. ఈ జన్మలో కర్మ చెయ్యడు అంటే ఆగామికర్మ ఉండదు. దేహం ఉన్నంతవరకు ప్రారబ్ధము మాత్రం అనుభవించాలి.

ప్రారబ్ధము మూడు రకాలుగా ఉంటుంది. 1.ఇచ్ఛ 2.అనిచ్ఛ 3.పరేచ్ఛ.

**1.ఇచ్ఛా ప్రారబ్ధం :** తన కోరిక ననుసరించి భోగాలు కలిగించే ప్రారబ్ధం. తినకూడని పదార్థాలు తినేవాడు, చోరుడు, రాజస్త్రీల యందు ఆసక్తి గలవాడు, తనకు కష్టం అని తెలిసి కూడా రోగము వస్తుందని, శిక్ష పడుతుందని, మరణం సంభవిస్తుందని తెలిసి, ప్రారబ్ధ కర్మకు వశుడై, అనర్థాలు కలిగించే వాటి యందు కోరిక గలిగి ఉండటము. తినకూడని పదార్థాలు తినటం, చేయకూడని పనులు చెయ్యటం. ఇదే ప్రారబ్ధం అంటే. ప్రాణులు తమ స్వభావానికి లోనై కర్మలు చేస్తుంటాయి. జ్ఞాని కూడా అంతే. "ప్రవృత్తిని గాని, నివృత్తిని గాని ఆపాలని ప్రయత్నించినా ఆగదు." అని భగవానుడు గీతలో చెప్పాడు. తప్పకుండా సంభవించాల్సిన దుఃఖాన్ని తప్పించటం ఎవరివల్లా కాదు. దీనికి శ్రీరామచంద్రుడు, ధర్మరాజులే మంచి ఉదాహరణ. ప్రారబ్ధానికి ప్రతీకారం చేయలేకపోయినంత మాత్రం చేత ఈశ్వరుడి యొక్క ఈశ్వరత్వానికి ఏ రకంగాను లోటు రాదు. శనైశ్వరుడికి భయపడి చెట్టుతొర్రలో దాక్కున్నా ఆయన ఈశ్వరుడే.

**2.అనిచ్ఛా ప్రారబ్ధం :** భగవద్గీతలో మూడవ అధ్యాయంలోని 36వ శ్లోకంలో అర్జునుడు భగవానుణ్ణి అడుగుతాడు. 'పరంధామా ! పురుషుడు బలవంతం చేయబడిన వానిలాగా, తాను కోరకుండానే, దేనివల్ల ప్రేరేపితుడై పాపాలు చేస్తాడు?" దానికి భగవానుడు "అర్జునా! ప్రారబ్ధకర్మవశాన రజోగుణం వల్ల పుట్టిన కామమే పురుషుని పాపాచరణలో ప్రవృత్తునిగా చేస్తుంది. ఆ కామమే క్రోధంగా మారినప్పుడు విషయాల యందు అతని ప్రవృత్తి ఇంకా పెరుగుతుంది. అది మహాశనము. అంటేకామానికి శబ్దాది విషయాలే భోజనం. అది గొప్ప పాపాలకు కారణమైనది. అటువంటి కామమే నీ శత్రువు. ఈ విధంగా ప్రవృత్తికి మూలకారణం లేదు. అది

అనిచ్ఛా ప్రారబ్ధం అంటే ప్రారబ్ధవశాన రజోగుణం, దాని నుంచి కామం, క్రోధం పుడతాయి. వాటి కారణంగా పురుషుడు పాపాలు చేస్తాడు. అర్జునా ! నువ్వు స్వయంగా చేసుకున్న ప్రారబ్ధం చేత బంధించబడినప్పుడు, ఒక పని చెయ్యకూడదు అనుకున్నా, అవివేకానికి లోనై, ఆ పని తప్పకుండా చేస్తావు. అనిచ్ఛాప్రారబ్ధం నీతో ఆ పని చేయిస్తుంది.

**3.పరేచ్ఛా ప్రారబ్ధం :** ఇతరులను సంతోషపెట్టాలనే కోరికతో సుఖంగాని, దుఃఖం గాని అనుభవిస్తాము. అదే పరేచ్ఛా ప్రారబ్ధము. ఏం చేసినా ప్రారబ్ధం నశించదు. ఆ ప్రారబ్ధంలో ఉండే ఇచ్ఛను పుట్టించే శక్తిని నివారించలేము. అయితే చేసిన పుణ్యంవల్ల సుఖము, పాపంవల్ల దుఃఖము అనే చిత్తవికారాలు పామరుడికి కలుగుతాయి. కాని తత్త్వవేత్తకు అవి ఉండవు. అంటే తత్త్వవేత్త కూడా ప్రారబ్ధకర్మని అనుభవిస్తాడు. కాని వాటి మీద అతడికి ధ్యాస ఉండదు. తత్త్వవేత్త కూడా ఈ ప్రారబ్ధం అనుభవిస్తాడు. ఆ ప్రారబ్ధం అతనికి దగ్ధ బీజమవుతుంది. అంటే అనుభవిస్తాడే గాని, తిరిగి దానివల్ల అతడు ఏ కర్మా చెయ్యడు. మాడిపోయిన బీజం మొలకెత్తదు. ఇక్కడ ఒక చిన్న విషయం గుర్తించాలి. జ్ఞాని విషయంలో జ్ఞానం కలగగానే సంచిత కర్మతో బాటు ప్రారబ్ధం కూడా దగ్ధమై పోతుంది అనుకుంటారు కాని ప్రారబ్ధం విషయంలో అలా జరగదు. ప్రారబ్ధ కర్మానుసారమే ఈ దేహం వచ్చింది. జ్ఞానం కలిగిన వెంటనే జ్ఞాని ఈ దేహాన్ని వదలటం లేదు. ఆయుష్యు ఉన్నంతవరకు జీవించి ఉంటాడు. అంటే ప్రారబ్ధ కర్మానుసారం వచ్చిన దేహంతోనే ఉన్నాడు కదా? మరి ప్రారబ్ధం ఎక్కడ నశించింది? అందుకే జ్ఞాని కూడా ఇతరుల లాగానే ప్రారబ్ధాన్ని అనుభవించి తీరాలి. ఇందులో అనుమానం లేదు. కాని ఆ అనుభవం జ్ఞానిని బాధించదు. దీనికి కారణం జ్ఞాని సుఖదుఃఖాలకు అతీతుడు. ప్రారబ్ధమనేది పార్థివదేహానికే గాని పారమార్థిక దేహానికి ఉండదు.

ఛాందోగ్యోపనిషత్తులో నారదుడు సనత్కుమారుడి దగ్గరు వెళ్ళి శోకనివృత్తికి మార్గం చెప్పమని అడుగుతాడు. అసలు నారదుడికి శోకం ఎందుకు వచ్చింది? నారుడు వేదవేదాంగాలు, శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలు అన్నీ చదివాడు. సంగీతం, సాహిత్యం అన్నీ తెలుసుకున్నాడు. కాని ఆత్మని గురించిన జ్ఞానం మాత్రం లేదు. అందుకే దుఃఖం వచ్చింది. వేదాలు, శాస్త్రాలు అభ్యసించటానికి ముందు త్రివిధ తాపాలతో సతమతమైనాడు. వేదాలు చదివినా, వాటిని మరచిపోయాడు.

తనకన్న విద్వాంసుల దగ్గరకు వెడితే తనను అవమానిస్తారని భయం అందుకే తనకన్న తక్కువ వాళ్ళ దగ్గరకి వెళ్ళి దర్పం ప్రదర్శించేవాడు. అందుకే నారదుడు మనశ్శాంతి లేకుండా క్రుంగిపోయాడు. సనత్కుమారుడి దగ్గరకు వెళ్ళి "ఓ విద్వాంసుడా! నేను దుఃఖంలో ఉన్నాను. నన్ను శోకం నుంచి దరిచేర్చవలసింది" అని ప్రార్థించాడు. అప్పుడు సనత్కుమారుడు "సుఖస్వరూపమైన భూమమే శోకనివృత్తికి ఉపాయము. కాబట్టి ఆ భూమమే తెలుసుకోదగినది" అని చెప్పాడు. భూమము అంటే బ్రహ్మము అని అర్థం.

సుఖము అనేది రెండు రకాలుగా ఉంటుంది. 1.క్షణికము 2.శాశ్వతము. క్షణికమైన సుఖము అనుభవించేంత వరకే ఉంటుంది. ఆ తరువాత అది అనేక అనర్థాలకు, దుఃఖాలకు దారి తీస్తుంది. అందుకే "లౌకిక సుఖాలన్నీ దుఃఖ హేతువులు" త్రిపురా రహస్యంలో హేమలేఖ తన భర్త అయిన హేమచూడుడికి సుఖ స్వరూపాన్ని వివరిస్తూ, "రాజా! స్త్రీ సుఖం చాలా గొప్పది అనుకుంటారు. ఒకవేళ అదే నిజమైతే, సంభోగానంతరము ఆడపశువు వళ్ళునొప్పులతో ఎందుకు బాధ పడుతుంది? కాబట్టి అది నిజమైన సుఖం కాదు. ఈ సుఖాలన్నీ దుఃఖ హేతువులు" అని వివరిస్తుంది. కాబట్టి లౌకిక సుఖాలన్నీ క్షణికమైనవి. అశాశ్వతమైనవి. దుఃఖహేతువులు, అందుచేత మానవుడు శాశ్వతమైన సుఖం కోసం ప్రయత్నించాలి. అదే బ్రహ్మానందం. ఆనందం మూడు విధాలుగా ఉంటుంది. 1.బ్రహ్మానందం 2.విద్యానందం 3.విషయానందం. మిగిలిన రెండింటికీ బ్రహ్మానందమే మూలము. బ్రహ్మానందము అనేది పరిపూర్ణమైన ఆనందం. అంతకు మించినది ఇంకొకటి లేదు. అందుకే పరిపూర్ణమైన బ్రహ్మానందాన్ని పొందాలంటే సాధకుడికి జ్ఞానము, వైరాగ్యము, యోగము, ఆత్మస్వరూపము, అద్వైత సిద్ధాంతము అన్నీ సిద్ధించి ఉండాలి. ఇవన్నీ ఒనకూడితేనే బ్రహ్మానంద ప్రాప్తి కలుగుతుంది. ఇలా బ్రహ్మానంద ప్రాప్తి కలగటాన్నే పరమపదము, సాయుజ్యము, మోక్షము అంటారు. అదే ముక్తి. ముక్తపురుషుడికి సంచితకర్మ ఉండదు కాబట్టి పునర్జన్మ ఉండదు. అటువంటి బ్రహ్మానందాన్ని అనుభవించవలసింది అని సాధకుడికి బోధ చేస్తున్నారు.

**నిరస్తభేదే నిఖిలాత్మ నాస్థితే నిరాస్పదే బ్రహ్మణి నిత్య సిద్ధే ।**
**నిరంతరానంద ఘనే నిరీహే స్వస్మిన్ రమస్వాత్మ సుఖేన నిత్యమ్ ॥201**

భేదాలన్నీ పోయి జగత్స్వరూపంతో అద్వితీయుడై పరబ్రహ్మమైన ఆత్మయందు బ్రహ్మానందంతో ఉండవలసింది.

అద్వితీయుడు. రెండవ వారు లేనివాడు అయిన ఆత్మపురుషుడు ఏకాకి. తనతో సమానమైన వారు గాని, తనకన్న ఎక్కువ వారుగాని లేనివాడు, ఏ రకమైన భేదములు లేనివాడు. జగత్తులో ఉన్నది బ్రహ్మము ఒక్కటే. రెండవది, అతనికన్న భిన్నమైనది ఏదీలేదు. పరబ్రహ్మ ఏ కర్మ చేయడు కాని అన్ని కర్మలకు అతడే సాక్షి. అన్నింటిని చూస్తూ ఉంటాడు. స్వయంప్రకాశకుడు. ఆయనను ప్రకాశింపచేసే శక్తి ఏదీలేదు. అన్నింటినీ ఆయనే ప్రకాశింపచేస్తాడు. ఆనందమే స్వరూపంగా గలవాడు. పంచకోశాలలోను ఆనందమయ కోశమందుండి ఎల్లప్పుడు ఆనంద డోలికల యందు తేలియాడుతుంటాడు. ఏ రకమైన కర్మ చేయడు. కర్మఫలం ఉండదు. ఇతడు పరబ్రహ్మ. ఆ బ్రహ్మమే నీవు. కాబట్టి నువ్వు నీ స్వరూపమునందే బ్రహ్మానందం అనుభవిస్తూ విహరించు.

**అవిద్యమా నార్థ విశేష కల్పనా విచక్షణం సంసృతి కారణం మనః ।**

**నిగృహ్యా సర్వైః కరణైః సహాత్మని స్వస్మిన్ రమ స్వాత్మ సుఖేన నిత్యమ్ ॥ 202**

విషయ భేదములను సంపూర్ణంగా నాశనం చేసి, మనస్సు, ఇంద్రియాలను నిగ్రహించి స్వస్వరూపమైన ఆత్మయందు విహరించుము.

మననం చేసేది మనస్సు. ఎప్పుడూ ఏదో ఒకటి ఆలోచిస్తూనే ఉంటుంది. ఊహిస్తుంటుంది. లేని వస్తువులను ఉన్నట్లుగా ఊహిస్తుంది. **మనయేన మనుష్యాణాం కారణం బంధమోక్షయోః** బంధ మోక్షాలకు కారణం మనస్సే, భార్య, భర్త, పిల్లలు, సంసారము, తల్లి, తండ్రి. ఇలా అనేక బంధాలు కల్పించుకుని, వాటిలోంచి బయటకు రాలేక శతమతమవుతుంటుంది. అజ్ఞానంతో అనేక విషయాలు, బంధాలు కల్పిస్తుంది. ఇంద్రియాలు మనస్సుకు అనుగుణంగా ప్రవర్తిస్తాయి. మనస్సు కల్పించే బంధాలను బలోపేతం చేస్తాయి. ఈ బంధాలను పూర్తిగా నాశనం చేసి, మనస్సును నిగ్రహించాలి. సంసారానికి కారణం మనస్సు. సంసారంలోంచి బయట పడాలంటే మనసును నిగ్రహించాలి. అలామనసును నిగ్రహించి, ఇక్కడ నిగ్రహించటము కేవలము ఒక్క మనస్సునే కాదు. ఇంద్రియాలను కూడా. జగత్తులో ఏ దృశ్యాన్ని చూడకూడదు అని నిర్ణయించుకుని కళ్ళు మూసుకుంటాం. కాని కళ్ళముందు అనేక విషయాలు,

రూపాలు గిరాగిరా తిరుగుతుంటాయి. ఈ స్థితి రాకుండా ఉండాలంటే మనస్సు, ఇంద్రియాలు రెండింటినీ నిగ్రహించాలి. అలా మనస్సును ఇంద్రియాలను, నిగ్రహించి, భేదాలు నాశనం చేసి స్వస్వరూపమయిన ఆత్మయందే ఉండి బ్రహ్మానందాన్ని అనుభవించవలసింది.

**అపార సంసార నిదాన వాసనా గ్రంధిక్షయం సాధు విధాయం యుక్త్యా।**

**అఖండ బోధైకరసే సదాత్మని స్వస్మిన్ రమ స్వాత్మసుఖేన నిత్యమ్ ॥203**

అంతం లేని సంసారానికి మూలకారణమైన అజ్ఞానాన్ని వేదాంత వాక్యాలతో నాశనం చేసి స్వస్వరూపమునందే ఉండి బ్రహ్మానందాన్ని అనుభవించు.

సంసారానికి కారణం అజ్ఞానము. ఇది క్రొత్తగా వచ్చింది కాదు. సృష్టి ప్రారంభం నుంచి ఉన్నది. పరబ్రహ్మ మానవుణ్ణి సృష్టించిన తరువాత బ్రహ్మ రంధ్రం గుండా మానవ దేహంలో ప్రవేశించి, ఈ దేహము, ఇంద్రియాలతో లౌకిక సుఖాలు అనుభవిస్తూ అజ్ఞానంవల్ల నేనే దేహము అని భావించి ఈ శరీరంలో బందీ అయిపోయాడు. కాబట్టి అజ్ఞానము అనేది ఇప్పటిది కాదు. అజ్ఞానము అంటే మాయ. ఉన్నది లేనట్లుగా లేనిది ఉన్నట్లుగా అనిపిస్తుంది. ఈ మాయ పరమేశ్వరుణ్ణి ఆవరించి ఉంటుంది. ఇదే అవ్యక్తము. కాబట్టి అజ్ఞానాన్ని లేదా మాయని వదుల్చుకోవటం అంత తేలిక కాదు. మోక్షం పొందాలంటే ముందుగా ఈ మాయను జయించాలి. అజ్ఞానాన్ని నాశనం చెయ్యాలి. కాబట్టి ముందు అజ్ఞానాన్ని నాశనం చేసి, ప్రమాణాలు, వేదాంతము, అనుభవాలతో బాగా తర్కించి జగత్తులో ఉన్నది బ్రహ్మమొక్కటే. ఇందులో ఏ రకమైన తేడాలు లేవు. నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని నాకన్న ఇతరమైనది లేదు అని నిశ్చయించుకుని స్వస్వరూపంలో బ్రహ్మానందంతో విహరించుము.

**పశ్చాత్పురస్తాదపి చోపరిష్టా**
**ద్ధిశస్సమంతా ద్విదిశోఽప్యధస్తాత్ ।**
**పూర్ణం సదాత్మాన మవేక్షమాణః**
**స్వస్మిన్ రమస్వాత్మ సుఖేన నిత్యామ్ ॥ 204**

వెనక ముందు దశదిశల యందు ఆ పరమాత్మనే దర్శిస్తూ స్వస్వరూపంలో బ్రహ్మానందంతో ఉండవలసింది.

బ్రహ్మము జగత్తంతా వ్యాపించింది. ఛాందోగ్యోపనిషత్తులో సత్యకామ జాబాలికి ఒక ఆబోతు బ్రహ్మతత్త్వాన్ని వివరిస్తుంది. "ఓ సత్యకామా! జగత్తులో తూర్పు పడమర ఉత్తరం దక్షిణం నాలుగుదిక్కులూ పరబ్రహ్మ స్వరూపమే" కేవలం నాలుగు దిక్కులు అనే కాదు దశదిశలు పరబ్రహ్మ స్వరూపమే. ఈ విషయాన్ని తెలుసుకుని స్వస్వరూపుడవై బ్రహ్మానందం అనుభవించు.

**స్వానందపీయూషనిధౌ నిమగ్నో నిగృహ్య బాహ్యాంతరధీ ప్రచారం ।**

**తదేక తాపన్నమనా నిరీహః స్వస్మిన్ రమస్వాత్మ సుఖేన నిత్యమ్ ॥205**

బుద్ధిని జయించి, అదుపులో ఉంచి అరిషడ్వర్గాలను జయించి బ్రహ్మతో ఏకత్వము పొంది స్వస్వరూపంలో ఉండి బ్రహ్మానందము పొందుము.

మనస్సు లేదా బుద్ధి. మననం చేసేది మనస్సు, నిశ్చయించేది బుద్ధి. ఇవి అంతఃకరణ చతుష్టయంలోని భాగాలు. కాని ఈ రెండింటినీ ఇక్కడ ఒకటిగానే చెబుతున్నారు. ఈ మనస్సు అన్నిచోట్లా ఉంటుంది. అన్ని విషయాల మీదకీ పోతుంది. ఇంద్రియాలమీద లోపలా బయటా కూడా ప్రసరిస్తుంది. కళ్ళు మూసుకున్నంత మాత్రం చేత బాహ్యప్రపంచం నీకు కనిపించదు. కాని మనోనిర్మితమైన ప్రపంచం అంతా సినిమారీలులాగా నీ కళ్ళముందు తిరుగుతుంది. అనేకమైన ఆలోచనలు, దృశ్యాలు, భావాలు నీ కళ్ళముందు కనిపిస్తాయి. కాబట్టి మనసును ముందు కట్టడి చెయ్యాలి. అదుపులో పెట్టాలి. అప్పుడు కామక్రోధాలనే అరిషడ్వార్గాలు, అహంకార మమకారాలను జయించి, సంకల్పాలన్నీ పూర్తిగా వదలి, ఆత్మజ్ఞాన సముపార్జన చేసి, జ్ఞానసాగరంలో పూర్తిగా మునిగి స్వస్వరూపంతో బ్రహ్మానందాన్ని అనుభవించవలసింది.

**కో నామ విద్వానపహాయ నిత్యం బ్రహ్మన్ స్వతః ప్రాప్తమఖండసౌఖ్యం ।**

**కథం రమేతా సతి తుచ్ఛకల్పే మృషాత్మకే వైషయికే సుఖేఽత్ర ॥206**

జ్ఞానియైనవాడు శాశ్వతమైన మోక్షాన్ని వదలి సంసార బంధాలలో చిక్కుకోవాలి అనుకోడు.

గురువుగారి దగ్గర ఉపదేశం పొందాడు. వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలు, వేదాంత గ్రంథాలు అన్నీ చదివాడు గురువు చెప్పిన విషయం విన్నాడు.

సహాధ్యాయులతో చర్చించాడు. తన అనుభవాన్ని జోడించాడు. జగత్తులో బ్రహ్మము తప్ప ఏదీలేదు. అదే నిత్యము, సత్యము, శాశ్వతము. అంతకు మించినది ఏదీలేదు అని తెలుసుకున్నాడు బ్రహ్మానందము అంటే ఏమిటో తెలిసింది. మోక్షస్వరూపాన్ని తెలుసుకున్నాడు. **బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి** బ్రహ్మము గురించి తెలుసుకున్న వాడు కూడా బ్రహ్మమే. అనే విషయం అర్థమయింది. నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని అని తెలుసుకున్నాడు పరబ్రహ్మ అయినాడు. అంటే అతని జీవాత్మ పరమాత్మ ఒకటే అయినాయి. ఇదే సాయుజ్యము, మోక్షము. ఈ రకంగా మోక్షస్వరూపాన్ని తెలుసుకున్నవాడు మోక్షసుఖాన్ని వదలి శబ్దాది విషయకమైన నామరూపాత్మకము అసత్యము అయిన సంసారాన్ని ఎందుకు కోరుకుంటాడు?

సారము లేనిది సంసారము. ఇందులో కేవలము కష్టాలే ఉండవు. అలాగని కేవలము సుఖాలే ఉండవు. సుఖదుఃఖాల మేళవింపే సంసారము. జీవుడు తాను చేసిన కర్మఫలితాన్ని సుఖదుఃఖాల రూపంతో అనుభవిస్తాడు. సర్వసంఘ పరిత్యాగి, మోక్షగామి అయిన మహాజ్ఞాని మోక్షసుఖమే కోరుకుంటాడు గాని సంసారాన్ని కోరడు.

**త్యక్త్వాత్మానం సదానందం విషయాన్ యస్తు సేవతే ।**
**పిపాసార్థం సుధాం త్యక్త్వా గరళం పాతుమిచ్ఛతి ॥ 207**

సద్రూపమైన స్వస్వరూపాన్ని వదలి లౌకిక సుఖాలకు ఆరాటపడేవాడు అమృతాన్ని వదలి విషాన్ని త్రాగుతున్నాడు. తానే పరబ్రహ్మ. ఈ విషయం అర్థమయింది. ఈ విషయాన్ని వదలి శబ్దాది విషయాలంటే ఆరాటపడేవాడు, శబ్దాది విషయల పట్ల మక్కువ చూపేవాడు దాహం వేసినప్పుడు దొరికిన అమృతాన్ని వదలి విషం త్రాగటానికి ఇష్టపడుతున్నాడు.

**యస్త్వాత్మ సుఖముత్సృజ్య సుఖం బాహ్యమపేక్షతే ।**
**కరస్థం పాయసం త్యక్త్వా స మూఢో లేఢి కూర్పరమ్ ॥ 208**

స్వరూపానందాన్ని వదలి బాహ్యవిషయాల యందు ఆసక్తుడైన వాడు, అరచేతిలోని క్షీరాన్నాన్ని వదలి, చేతిని నాకుతున్నాడు.

తనకు లభించిన పరమానందాన్ని వదలి అసత్యమైన బాహ్యవిషయము లందు ఆసక్తి చూపేవాడు. తన అరచేతిలోని క్షీరాన్నాన్ని వదలి, అందులోని రసము క్రిందికి జారిందేమో అని చేతిని నాకుతున్నాడు. ఉత్తర గీతలో కూడా భగవానుడు అర్జునుడికి ఇదే మాట చెబుతాడు.

**బహిర్ర్భామ్యతియః కశ్చిత్త్వక్తా దేహస్థ మీశ్వరమ్ ।**

**స్వగృహే పాయసం త్వక్త్వా, భిక్షామటతి దుర్మతిః ॥**

ఓ అర్జునా తన దేహంలోనే ఉన్న పరబ్రహ్మని తెలుసుకోలేక ఇతర విషయాల యందు ఆసక్తి కలవాడు తన ఇంట్లో చేసిన క్షీరాన్నము వదలి 'భిక్షాన్నము' కోసం ఇతరుల ఇళ్ళకు వెడుతున్నాడు.

**యద్యానందం స్వమాత్మానం త్యక్త్యేచ్ఛే త్వరతస్సుఖం ।**

**స్వానందానుభవా భావ స్తైనై వాస్యానుమీయతే ॥ 209**

బ్రహ్మమును వదలి ఇతర ఆనందాలను కోరేవాడు ఆత్మానందము అనుభవం లేకపోవటం చేతనే విషయ సుఖాలను కోరుతున్నాడు.

స్వస్వరూపము అంటే బ్రహ్మమే. ఆ బ్రహ్మము ఆనందరూపము. దాన్ని తెలుసుకోలేక విషయ సుఖాలు కోరేవాడికి బ్రహ్మానందానుభవము లేదు. ఎందుకంటే శాశ్వతమైన సుఖాన్ని వదలి క్షణికమైన ఆనందం కోసం ప్రాకులాడుతున్నాడు.

**భోగ్యదృష్టి సదాయస్య నతస్యబ్రహ్మదర్శనం ।**

**యస్యాస్తి సర్వదా ధ్వాంతం నతస్యార్క విలోకనమ్ ॥ 210**

బ్రహ్మము కన్న ఇతర విషయాల యందు ఆసక్తి ఉన్న వాడికి బ్రహ్మజ్ఞాన ముండదు. ఎప్పుడూ చీకట్లో ఉండే వారికి సూర్యకాంతి తెలియదు.

గ్రుడ్డివాడికి లోకమంతా గ్రుడ్డిది గానే కనిపిస్తుంది. అంటే లోకంలోని ఏ వస్తువు, ఏ ప్రాణి, అతడికి కనిపించవు. ఎప్పుడూ చీకటి గదిలో కూర్చునే వాడికి వెలుతురు తెలియదు. అలాగే అజ్ఞానికి, సర్వవ్యాపకుడు, సర్వమయుడు అయిన బ్రహ్మము కనిపించదు బ్రహ్మము గురించి తెలియదు.

**అద్వితీయం పరంబ్రహ్మ సర్వతః పశ్యతః సతః ।**

**ప్రపంచదర్శనం కష్టం కుతో భోగ్యాభిమర్శనమ్ ॥ 211**

ఏకాకి అయిన పరమేశ్వరుణ్ణి చూసిన సత్పురుషుడికి జగత్తంతా పరబ్రహ్మగానే కనిపిస్తుంది.

పైన చెప్పినట్లు కాకుండా సర్వవ్యాపకుడయిన పరబ్రహ్మను విచారించి శోధించిన వాడికి అసలు జగత్తనేదే కనుపించదు. జగత్తులో ఉన్న ప్రతివస్తువు ప్రతిప్రాణి పరబ్రహ్మమే. ఛాందోగ్యోపనిషత్తులో చెప్పినట్లుగా తూర్పు పడమర ఉత్తరం దక్షిణం పరబ్రహ్మ స్వరూపం. నదీనదాలు, అడవులు, కొండలు, ఎడారులు, లోయలు అంతా పరబ్రహ్మ స్వరూపం. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు పరబ్రహ్మ స్వరూపం. ప్రాణంబ్రహ్మ, దృష్టిబ్రహ్మ, శ్రోత్రంబ్రహ్మ. జగత్తులో ఇంక పరబ్రహ్మ కానిది ఏమున్నది? 84 లక్షల జీవరాసి పరబ్రహ్మ స్వరూపమే. ఈ రకంగా చూస్తే జగత్తులో ప్రాణమున్నవి ప్రాణంలేనివి, చలనమున్నవి చలనంలేనివి అంతా పరబ్రహ్మ స్వరూపమే. అందుకే సత్పురుషుడికి, జ్ఞానియైనవాడికి జగత్తంతా పరబ్రహ్మగానే దర్శనమిస్తుంది. నామరూపాత్మకమైన జగత్తు ఏ మాత్రము స్ఫురణకు రాదు. అద్వితీయుడైన బ్రహ్మమునకు భిన్నమైనది ఇంకేదీ ఉండదు.

**బ్రహ్మవిద్బ్రహ్మ భూతస్సన్ బ్రహ్మమేవ రమత్యలం ।**
**ఇష్టానిష్టార్థయోః క్వాపి న హృష్యతి న శోచతి ॥** **212**

బ్రహ్మజ్ఞానం పొందినవాడు తానే బ్రహ్మమై బ్రహ్మమునందు క్రీడిస్తాడు. అతడు కోరినది లభించినా, లభించక పోయినా సంతోషము, దుఃఖము ఉండవు.

చరాచర జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే. జగత్తులో బ్రహ్మము తప్ప వేరేదీ లేదు అని తెలుసుకోవటమే బ్రహ్మజ్ఞానము. **బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి.** బ్రహ్మజ్ఞాని కూడా బ్రహ్మమే అవుతాడు. అతడు నిరంతరము బ్రహ్మానందంలో మునిగి తేలుతూ బ్రహ్మము నందే క్రీడిస్తాడు. అతడికి ఏ కోరికలు ఉండవు. దేనిమీదా మక్కువ ఉండదు. అందుకే కోరినవి నెరవేరినా నెరవేరక పోయినా సంతోషము, దుఃఖము అనేవి ఉండవు. వీరు తనవారని వీరు పరులని తేడాఉండదు.

**అఖండం సచ్చిదానందం బ్రహ్మైవాస్మి న చేతరత్ ।**
**ఇత్యాత్మనానుభవతో బ్రహ్మనిష్ఠస్య యోగినః**
**యతేర్నిష్పద్యతే నిత్యం నిర్వాణ సుఖ ముత్తమమ్ ॥** **213**

నేను సత్యజ్ఞానానంద రూపమైన బ్రహ్మమును అయి ఉన్నాను. అంతకన్న వేరైనది కాను. అని తన్మయుడైన మోక్షేచ్ఛ గలవాడికి మోక్షరూపానందము శాశ్వతముగా దొరకును.

ఏ పురుషుడైతే మనోనిగ్రహం కలిగి ఏ రకమైన భేదములు లేక సత్యజ్ఞానానంద రూపుడై, సర్వము వ్యాపించిఉన్న పరబ్రహ్మమునునేనే అని భావించి స్వస్వరూపానందము పొందుతాడో అతడికి మోక్షము శాశ్వతంగా లభిస్తుంది. పునరావృత్తి ఉండదు.

**త్యక్త్వా బాహ్యమిదం మనోనిలయనం తుచ్ఛం మృషేతి స్వయం**
**బుద్ధ్వా నిశ్చలయా గురూక్తిపరయా విజ్ఞాయతత్త్వం మునే ।**
**బ్రహ్మణ్యస్తభితే చిదాత్మని సదానందేఽద్వయే నిర్గుణే**
**లీనస్యాస్తగతేః సుఖేన వసతస్తూష్ణీం కిమిన్యై ర్భ్రమైః ॥ 214**

మనస్సు చేత కల్పించబడిన బాహ్యప్రపంచము నీచాతి నీచమైనది. లేనిది ఉన్నట్లుగా కనిపిస్తుంది. సద్గురువు దగ్గర ఉపదేశం పొంది స్థిరమైన బుద్ధితో తనకు తానే యధార్ధ స్వరూపము తెలుసుకొని, జ్ఞానమే స్వరూపము రాగలవాడు, తనకన్న వేరైనది లేనివాడు, గుణాలు లేనివాడు, అయిన పరబ్రహ్మ నందు లీనమైన వాడికి భ్రాంతి సిద్ధమైన ఇతర పదార్ధాలతో పనిలేదు.

## 10. జీవన్ముక్తుడు

మనం జీవన్ముక్తి, విదేహముక్తి అని రెండు పదాలు వాడతాం. వాటిని గురించి **'మహోపనిషత్తు'**లో వివరించబడింది.

జీవించిఉండగానే ముక్తిపొందటం జీవన్ముక్తి. అటువంటివాడు ఆయుష్షు ఉన్నంతవరకు జీవించి ఆతరువాత ఈదేహాన్ని విడిచి పరబ్రహ్మలో ఐక్యము పొందుతాడు. ఈరకంగా దేహాన్నివిడిచి పరమాత్మలోలీనంకావటాన్నే విదేహముక్తి అంటారు.

ఆత్మఅనేది అణువుకన్నచిన్నది, ఆకాశంకన్నపెద్దది. ఈ చిద్వస్తువునందు అనంతకోటి బ్రహ్మాండ రేణువులు ఉత్పత్తి స్థితిలయము పొందుతుంటాయి. బయటకు శూన్యంగా కనిపిస్తుంది కాబట్టి పరబ్రహ్మఆకాశము అని చెప్పబడుతున్నది.

చిత్స్వరూపముగా ఉన్నది కాబట్టి బ్రహ్మము ఆకాశముకన్న విలక్షణమైనది. అయితే బ్రహ్మము ఆకాశంకాదు. ఆకాశములేనిది. అదియే సత్తు చిత్తు. ఆత్మవస్తువు స్వయంప్రకాశ స్వరూపము. విజ్ఞాన ఘనమైన శిలాసదృశమైనది. ఆకాశంలాగా స్వస్వరూపంలో తదధిష్ఠానముగా అనుభూతమైఉన్నది. చిత్రవిచిత్రముగా ఉన్న ఈజగత్తుయొక్క వికాసాన్ని భేదిస్తున్నది. ఈవిశ్వము తత్పద లక్షణముగా ఉన్న పరమాత్మయొక్క ప్రకాశమాత్రము. అందువల్ల ఈవిశ్వము ఆత్మకన్న ప్రత్యేకమగు సత్తుగలది. ఈజగత్తు యొక్క భేదభావముకూడా ఆత్మయందే ప్రకాశిస్తుంది. ఈ భేదమంతా ఆత్మమయమైనది. అధిష్ఠానరూపంలో ఈఆత్మ అన్నింటితోనూ సంబంధం కలిగి ఉన్నది. జాతి గుణ క్రియాదులు ఆత్మకులేవు. ఆత్మ త్రికాలభాధ్యమై సత్యమై ఉన్నది. అదే విజ్ఞానానందస్వరూపమగు పరబ్రహ్మ. త్యాగమూర్తులకు అది పరమగతి. సర్వసంకల్పాలను వదలివేసి శుద్ధమనస్సుతో ఆఆత్మను గ్రహించాలి. జాగ్రదావస్థలో ఉన్నప్పుడు ఎవరికి దృశ్యజ్ఞానము నశిస్తుందో, అతనియొక్క స్థితినే 'జ్ఞానము' అంటారు. వృత్తిజ్ఞానము లేకపోవుటయే జ్ఞానము. ఈ విషయాలను తెలుసుకున్నవాడు జీవన్ముక్తుడు. దృశ్యములేదు అనేఆత్మజ్ఞానంతో, మనసులోఉన్న దృశ్యభావాలను తుడిచివేసినట్లైతే తక్షణమే మహోన్నతమైన నిర్వాణసుఖము ఉత్పన్నమవుతుంది. వాసనలను అంటే రాగద్వేషాలను సంపూర్ణంగా త్యజించటమే మోక్షము. ఎవరైతే పరిశుద్ధవాసనలతో నిండిఉన్నారో, వారుతిరిగి జనన మరణాలు పొందరు. వాళ్ళు యదార్థాన్ని తెలుసుకోగలుగుతారు. వారే జీవన్ముక్తులు. దృఢమైన విషయ చింతనయే బంధము. వాసనాక్షయమే మోక్షము. దేహ, లోక, శాస్త్రవాసనలే సర్వవాసనలు.

తపస్సు మొదలైన సాధనలు చేయకుండానే సహజముగా ఎవరికి భోగాలు ఇష్టం ఉండవో, వారు జీవన్ముక్తులు. కాలానుగుణంగా సుఖదుఃఖాలు అనుభవిస్తున్నప్పటికీ, సంతోషము, విషాదము పొందనివాడు జీవన్ముక్తుడు. హర్షము (సంతోషము) అమర్షము (ఓర్వలేనితనము), భయము, క్రోధము, కామము, కార్పణ్యము వంటివి లేనివాడు జీవన్ముక్తుడు. అహంకారాన్నివదిలి, దృశ్యమునుకూడా త్యాగంచేసినవాడు జీవన్ముక్తుడు. అంతర్ముఖుడై ఇష్టాయిష్టములు లేకుండా ఉండేవాడు, సుషుప్తావస్తలో ఉన్నవాడులాగా సంచరించేవాడు. జీవన్ముక్తుడు. ఎప్పుడూ ఆత్మానందంపొందేవాడు, మనసును పవిత్రంగా ఉంచుకునేవాడు, జీవన్ముక్తుడు. ఏ కోరికలు లేకుండా ఉండేవాడు జీవన్ముక్తుడు.

ఆకాశంలాగా ఎవరిహృదయము దృశ్యవిషయముల యందు సంగమము కాకుండా ఉంటుందో, ఎవరిబుద్ధి జడముకాదో, ఎవడు చైతన్యవంతుడో వాడు జీవన్ముక్తుడు. రాగద్వేషాలను, సుఖదుఃఖాలను, లక్ష్యం చెయ్యకుండా, కోరికలు లేకుండా, నిష్కామ్యభావనతో సత్కర్మలు చేసేవాడు జీవన్ముక్తుడు. మౌనమే దీక్షగా గలవాడు, అహంభావం లేనివాడు, సంకల్పాలు, ఉద్వేగాలు లేకుండా కర్తవ్య కర్మలు చేసేవాడు జీవన్ముక్తుడు. సర్వత్ర విగతస్నేహితుడై సాక్షీభావముతో ఉండేవాడు, ఇచ్ఛారహితుడై సత్కర్మలు చేసేవాడు జీవన్ముక్తుడు. మనసునందు ధర్మాధర్మాలను, సమస్తసంకల్పాలను, ఇష్టాఇష్టాలను అన్నింటినీ వదలివేసినవాడు జీవన్ముక్తుడు. కంటికి కనిపిస్తున్న ఈదృశ్యప్రపంచాన్ని సమ్యక్‌దృష్టితో పరిత్యజించినవాడు జీవన్ముక్తుడు. కారము, పులుపు, ఉప్పు, చేదు, రుచి, అరుచి వీటన్నింటినీ సమభావంతో భుజించేవాడు జీవన్ముక్తుడు. వార్ధక్యము, మరణము, ఆపద, రాజ్యము, దరిద్రము వీటన్నింటినీ సమభావంతో అనుభవించేవాడు జీవన్ముక్తుడు.

ధర్మాధర్మాలు, సుఖదుఃఖాలు, జరామరణాలు, సంపూర్ణంగా, బుద్ధిపూర్వకంగా త్యాగంచేసినవాడు జీవన్ముక్తుడు. ఉద్వేగము, ఆనందము లేకుండా స్వచ్ఛమైన సమత్వబుద్ధిగలిగి, పొంగిపోవటము, క్రుంగిపోవటము, లేకుండాఉన్నవాడు జీవన్ముక్తుడు. సర్వేచ్ఛలను, సంశయాలను, ప్రయత్నాలను, నిశ్చయాలను జ్ఞానబుద్ధితో పరిత్యజించినవాడు జీవన్ముక్తుడు. సృష్టిస్థితిలయాలయందు ఉదయాస్తమయాదు లందు, భావాభావములందు, సమభావంతోఉండేవాడు జీవన్ముక్తుడు. కొంచెము కూడా ద్వేషించకుండా, కాంక్షించకుండా, రాగద్వేషాలులేనివాడు, ప్రారబ్ధకర్మలు అనుభవించనివాడు జీవన్ముక్తుడు. సంసారసంకులములో శాంతుడైఉండేవాడు, కళాయుక్తుడైకూడా నిష్కళుడై ఉండేవాడు, మనసుఉండికూడా అమనస్కుడైఉండేవాడు జీవన్ముక్తుడు. సమస్తసంపదలయందు, సమస్తవ్యవహారములయందు ఉండికూడా వాటి స్పృహలేనివాడు జీవన్ముక్తుడు.

జీవన్ముక్తుడు తనశరీరం పడిపోయినసమయంలో, శ్వాస ఆగిపోయిన వెంటనే జీవన్ముక్తపదవిని దాటి విదేహముక్తపదవిని చేరతాడు. విదేహముక్తుడికి జనన మరణాలుండవు. అతడు నిర్వికారుడు, సత్తుకాడు అసత్తుకాడు. దూరముకాడు, దగ్గరాకాడు. అహముకాదు, తదితరము కాదు.

జీవన్ముక్తుని పరిస్థితి ఎలాఉంటుందంటే, అత్యంతనిశ్చలము, మహాగంభీరము. అది ప్రకాశముకాదు, చీకటికాదు. మహావ్యాపకమై సర్వత్ర నిండిఉంటుంది. అనాఖ్యముగా, అనభివ్యక్తముగా, అతీతముగా ఉంటుంది. అది శూన్యము కాదు. సాకారము కాదు. దృశ్యము కాదు, దర్శనము కాదు. భూతపదార్థ సముదాయము కాదు. కేవలసత్తా మాత్రము. అనంతరూపంలో కలిసిఉంటుంది. ఇదమిద్ధమని చెప్పటానికి వీలుండదు. పరిపూర్ణముకన్న అధికపరిపూర్ణముగా ఉంటుంది. సత్తు కాదు అసత్తుకాదు సదసత్తు కాదు. భావనకాదు భావముకాదు. కేవల చిత్ పదార్థము. మహాచైతన్యము. అనంతమై, అజరమై, శివమై, ఆదిమధ్యాంతరహితమై, నిరామయమై ఉన్నది. అది అనాదిగా ఉన్న సత్యపదార్థము. ద్రష్ట, దర్శనము, దృశ్యము అనే త్రిపుటి మధ్యభాగంలో కేవల దర్శనము ఏదైతేఉన్నదో అది. దీనికన్న గొప్పది ఉత్తమమైనది ఏదీలేదు. జీవన్ముక్తి పొందినవాడు పరమార్థస్థితి పొందుతాడు.

## పరమార్థ స్థితి :

ఆత్మజ్ఞానం పొందిన వారికి జగత్తంతాఒకటిలాగానే కనిపిస్తుంది. జగత్తులో ఉన్నది పరబ్రహ్మఒక్కటే. అదే తను. మిగిలినవి ఏవీలేవు. అనిభావిస్తాడు. చరాచరజగత్తులో తనుతప్ప ఇంకేదీలేదు అని నిశ్చయించుకుంటాడు. **అష్టావక్ర గీత**లోని ఆఖరుఅధ్యాయంలో జనకమహారాజు పరమార్థస్థితిని చెబుతున్నాడు.

**క్వ భూతాని క్వదేహో వా క్వేంద్రియాణి క్వ వామనః ।**
**క్వ శూన్యం క్వచనైరాశ్యం మత్స్వరూపే నిరంజనే ॥**

స్వభావతః నేను నిరంజనుడను. అటువంటి నాలో పంచభూతాలెక్కడ? వాటితో తయారైన శరీరమెక్కడ? ఇంద్రియాలెక్కడ? మనస్సెక్కడ? శూన్యమెక్కడ? నిరాశ ఎక్కడ?

**క్వ శాస్త్రం క్వాత్మవిజ్ఞానం క్వవానిర్విషయం మనః ।**
**క్వ తృప్తిః క్వవితృష్ణత్వం గతద్వంద్వస్య మే సదా ॥**

అన్ని ద్వంద్వాలకు అతీతంగాఉన్న నాలో శాస్త్రాలెక్కడ? ఆత్మజ్ఞాన మెక్కడ? తృప్తి అంటే ఏమిటి? విషయరాహిత్యంఏది? కోరికలేకపోవటం అంటేఏమిటి?

**క్వ విద్యా క్వచవా అవిద్యా క్వాహం క్వేదం మమక్వవా ।**

**క్వ బంధః క్వ చ వామోక్షః స్వస్వరూపస్య క్వ రూపితా ॥**

జ్ఞానమెక్కడ ? అజ్ఞానమెక్కడ? నేనుఎక్కడ? ఏదినాది? బంధంఏది? మోక్షంఏది? అనంతమైన నా స్వరూపానికి రూపమేది?

**క్వ ప్రారబ్ధాని కర్మాణి జీవన్ముక్తి రపిక్వవా ।**

**క్వ తద్విదేహ కైవల్యం నిర్విశేషస్య సర్వదా ॥**

ఎప్పుడూ ఏకంగాఉండే నాలో ప్రారబ్ధంఏమిటి? జీవన్ముక్తిఏమిటి? విదేహ ముక్తిఏమిటి?

**క్వకర్తాక్వచవా భోక్తా నిష్క్రియం స్ఫురణం క్వవా ।**

**క్వా పరోక్ష ఫలం వాక్వ నిస్స్వభావస్య మే సదా ॥**

కర్త ఎవరు? భోక్తఎవరు? ఆలోచనలురావటమేమిటి? వాటిని నిరోధించట మేమిటి? పరోక్షజ్ఞానమేమిటి? అపరోక్షజ్ఞానమేమిటి? నిత్యము స్వభావ రహితంగా నేనుమాత్రమే ఉన్నాను.

**క్వ లోకః క్వ ముముక్షుర్వాక్వ యోగీజ్ఞానవాన్క్వవా ।**

**క్వ బద్ధః క్వచవా ముక్తః స్వస్వరూపేఽహమద్వయే ॥**

ఆత్మరూపమైన నాలో ప్రపంచంఎక్కడుంది? ధ్యానంచేసేదిఎవరు? ముక్తిని కోరేదిఎవరు? బద్ధుడెవరు. ముక్తుడెవరు?

**క్వ సృష్టిః క్వచ సంహారః క్వసాధ్యం క్వచసాధనం ।**

**క్వ సాధకః క సిద్ధిర్వా స్వస్వరూపేఽహమద్వయే ।**

అద్వయము, ఆత్మరూపము అయిన నాలో సృష్టిఎక్కడ? సంహారమెక్కడ? సాధనఏది? సాధకుడుఎవరు? సాధించాల్సిందిఏది? సిద్దించాల్సిందిఏది?

ఈరకంగా చరాచర జగత్తులో ఉన్నది ఆత్మఒక్కటే. అది తప్ప ఇంకేమీ లేదు. అదేనేను అని భావిస్తాడు ముక్తపురుషుడు.

**మాండూక్యోపనిషత్తు** కారికలతో గౌడపాదులవారు చెప్పినట్లుగా

**నవిరోధో నచోత్పత్తిః న బద్ధో నచ సాధకః ।**

**న ముముక్షుః న వైముక్త ఇత్యేషా పరమార్థతా ॥**

ఉత్పత్తిలేదు, లయములేదు. సాధకులులేరు. ఎవరూబద్ధులు కాదు, ముక్తులు కాదు. ముముక్షువులు లేనేలేరు. పారమార్థికంలో ఇవేవీ లేనేలేవు. ఇదే పరమసత్యం.

**ముండకోపనిషత్తు**లో చెప్పినట్లుగా

**సమోహవైతత్ పరమం బ్రహ్మవేద బ్రహ్మైవభవతి**

పరబ్రహ్మ స్వరూపాన్ని తెలుసుకున్నవాడు పరబ్రహ్మమే అవుతాడు.

**బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి**

**ఆస్మాచ్ఛరీ రాదహమాదికాన్మని స్సమ్యక్సముక్తో యది బోధదృష్ట్యా**

**జ్యోతిః పరం తత్వము పేత్య తేన స్వే నాత్మనా తిష్ఠతి యః స ముక్తః॥215**

వేదప్రమాణం, ఇతర ప్రమాణాల ద్వారా బాగా తర్కించి చూసినవాడు, అహంకార మమకారాలు గల శరీరము నుండి విడివడిన వాడు, బ్రహ్మమే తానైన వాడు. అతడే **'జీవన్ముక్తుడు'.**

ఈ శ్లోకం నుండి 219వ శ్లోకం వరకు జీవన్ముక్తుణ్ణి వివరిస్తున్నారు. జ్ఞానదృష్టితో అహంకార మమకారాలను పూర్తిగా వదలి అరిషడ్వర్గాలు, అహంకార మమకారాలు కలిగిన పాంచభౌతికమైన దేహాన్ని కూడా వదలి అంటే దేహాభిమానం లేకుండా, సర్వోత్కృష్టమైన పరమాత్మ స్వరూపాన్ని పొంది, స్వస్వరూపంతో అంటే తానే పరబ్రహ్మయైన పురుషుడే **జీవన్ముక్తుడు.**

**ప్రత్యగ్దృశా స్వాత్మతయైవ నిత్యం పశ్యన్నపావృత్త బహిఃప్రవృత్తిః ।**

**నిరంతరానంద రసాభిపూర్ణయా వృత్త్యా సదా తిష్టతి యః సముక్తః ॥216**

ఏ మహాత్ముడు ప్రత్యగాత్మ స్వరూపాన్ని బాగా తెలుసుకుని పరబ్రహ్మకు ప్రత్యగాత్మకు భేదం లేదని తెలుసుకుని, నేనే పరబ్రహ్మను అని ఎరిగి, బాహ్య వ్యాపారాలు వదలి బ్రహ్మానందంలో సదా మునిగి తేలతాడో **'జీవన్ముక్తుడు'.**

ముందుగా ప్రత్యగాత్మకు పరబ్రహ్మకు భేదంలేదు అని తెలుసుకుని, నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని అని మనసా వాచా కర్మణాభావన చేసేవాడికి బాహ్య

వ్యాపారాలన్నీ వాటంతట అవే అణిగిపోతాయి. బాహ్య వ్యాపారం ఎప్పుడైతే లేదో అప్పుడు దానికి సంబంధించిన విషయాలు ఉండవు కదా? అటువంటి మహానుభావుడు బ్రహ్మానందంలో మునిగి తేలుతుంటాడు. అతడే **జీవన్ముక్తుడు.**

**ఉన్మత్తవద్బాలవదప్యయత్నా న్నిర్వర్త్య దేహస్థితిమాత్మ నిష్ఠః ।**

**సదేహ గాహానుగ తా త్మవృత్తి రేకాత్మనా తిష్ఠతి యః స ముక్తః ॥217**

స్వయంగా దేనికోసం ప్రాకులాడకుండా, ఎవరైనా పెడితే తిని శరీరాన్ని నిలబెట్టుకుంటూ, మనస్సుతో ఏ మాత్రము సంబంధం లేకుండా ఒకే రూపముతో ప్రకాశించేవాడే **జీవన్ముక్తుడు.**

మోక్షగాములైన వారు అవధూతలు అనబడతారు. అవధూతల గురించి అవధూతోపనిషత్తులో చెప్పబడింది.

**అవధూత :**

ఏ రకమైన నియమాలు లేనివాడు. ఏ విధమైన ఆభిజాత్యము లేకుండా, అన్ని వర్ణములవారి దగ్గరా అజగర వృత్తితో (కొండచిలువ నోటికి దగ్గరకు వచ్చిన ఆహారాన్ని తిన్నట్లుగా) ఆహారం తీసుకుంటాడు. ఎల్లవేళల యందు స్వరూపానందాన్ని అనుభవిస్తూ ఉంటాడు. చెట్లు, చేమలు, పర్వతాలతో కూడిన ఈ జగత్తును నేను కాను. నేను పరమేశ్వర స్వరూపాన్ని అంతేకాని అల్పకాలంలో నాశనమయ్యే శరీరాన్ని కూడా నేను కాను. ఈ శరీరము జడమైనది. అచేతనమైనది. అందుకే నేను శరీరాన్ని కాను. శూన్యమైన ఆకారము కలది, శూన్యమైన ఆకాశము నుండి పుట్టినది అయిన అచేతనమైన శబ్దాన్ని కాను. క్షణభంగురమైన చర్మముచేత గ్రహించబడేది అయిన స్పర్శ నేను కాను. క్షణంలో నశించిపోయే దృశ్య దర్శనములందు లీనమయ్యేది, క్షీణించునది, చూసేవాడికి మాత్రమే కనిపించేది అయిన రూపాన్ని నేను కాను. చంచలమైన జిహ్వాచే గ్రహించబడేది, మధురమైనది అయిన రసము (రుచి)ని నేను కాను. నాశనమయ్యేది, ముక్కుతో మాత్రమే గ్రహింపబడేది అయిన గంధము నేనుకాను. పంచేంద్రియాల భ్రమలేనివాడను, అన్ని కలలను వదలివేసినవాడను, శాంతుడను అయినశుద్ధచేతనుడనే నేను. బాహ్యాంతరముల యందు వ్యాపించిన వాడను. నిష్కళంకుడను. నిరంజనుడను. 'ఏకమైన ఆత్మను నేను' అని భావన చేస్తుంటాడు.

ఇలాంటి అవధూతలు ప్రస్తుత కాలంలో ఎక్కడైనా ఉన్నారా? ఈ అనుమానం చాలామందికి వస్తుంది. నెల్లూరు దగ్గర వెంకాస్వామి. ఉయ్యూరు దగ్గర పిచ్చెమ్మ. కృష్ణాజిల్లా బందరులో దొంతులమ్మ. ముమ్మిడివరం బాలయోగి ఇలాంటివారు అనేకమంది. నా చిన్నప్పుడు చెప్పేవారు. బందరులో దొంతులమ్మ అని ఒకావిడ ఉండేదట. ఒంటిమీద బట్టలు లేకుండానే తిరుగుతుండేదట. తిండికూడా తినేది కాదట. తనలో తనే మాట్లాడుకుంటూ ఉండేదట. అందరూ ఆమెను పిచ్చిది అనుకునే వారట. రోడ్డుమీద పోతూ, ప్రక్కనే పండ్లు అమ్మే బండిలోంచి ఒక పండు తీసుకోవటానికి ప్రయత్నిస్తే వాళ్ళు కొట్టేవారట. ఆవిడ నవ్వుతూ వెళ్ళిపోయేది. ఒకరోజు దుకాణదారుడు ఏమరుపాటుగా ఉన్నప్పుడు బండిమీద నుంచి ఒకపండు తీసుకుపోయింది. ఆ రోజున అతడికి రోజూకన్న రెట్టింపు లాభం వచ్చిందట. దాంతో మరునాటి నుంచి పండ్లు అమ్ముకునే వారు దుకాణాలు తెరిచి ఆవిడ వస్తుంటే రమ్మని పిలిచేవారట. తమబండిలోంచి పండ్లు తీసుకోమని అడిగేవారట. కాని ఆవిడ మాత్రం ఏమీ పట్టించుకోకుండా అలా వెళ్ళిపోయేది. ఏ బండిలోంది పండు తీసుకుందో ఆ దుకాణదారుడికి రెట్టింపు లాభం వచ్చేది. దాంతో ఆవిడ దేవత అయిపోయింది. ఊరిచివర ఒకచెట్టు క్రింద పడుకునేది.అక్కడే ఆవిడకు నివాసం ఏర్పాటు చేశారు. ఆవిడమాత్రం పిచ్చిదానిలా అలాగే తిరుగుతుండేది. మరణానంతరం ఆవిడకు అక్కడే సమాధి, గుడి కూడా కట్టించారు.

ఇంచుమించుగా ప్రతిఅవధూతా ఇలాగే ఉంటాడు. చూసేవారంతా వీరిని పిచ్చివాళ్ళనుకుంటారు. ఒక అవధూతను ఇంకొక అవధూత మాత్రమే గుర్తించగలడు.

ఇవాల్టిరోజున గుంటూరు జిల్లా ఉండవల్లి దగ్గర 'కృష్ణాయపాలెం' అనే గ్రామంలో పోలయస్వామి అని ఒక అవధూత ఉన్నాడు. పదిసంవత్సరాల క్రితం నేను ఆయన్ని చూశాను. మళ్ళీ ఇవాళ్ళ అంటే 26-10-2014న చూశాను. పూర్తిగా దిగంబరుడు. ఉన్మత్తుడుగా ఉంటాడు. దేహాభిమానం ఉండదు. తిండికూడా సరిగా తినడు. ఇలాంటివాళ్ళు ఇంకా ఎంతోమంది ఉన్నారు.

మొదటగా కుటీచకుడై, కుటీచకుడు బహూదకుడై, హంసయై, పరమహంసయై, స్వరూపానుసంధానముచేత సర్వజగత్తునూ తెలుసుకుని, దండకమండలాలు, కటిసూత్రము, ఆచ్ఛాదనము, విద్యుక్త క్రియలు (చేయవలసిన పనులు) అన్నీ నీటిలో

వదిలి, అంతకుముందు ధరించిన రంగులేని నారచీరెలు, కృష్ణాజినము కూడా వదలివేసి, దిగంబరుడై, నిత్యక్రియలను అమంత్రకంగా చేస్తూ ఉంటాడు. అభ్యంగన స్నానం చెయ్యడు. పుండ్రధారణ చెయ్యడు. లౌకిక, వైదిక కర్మలు ఇతడికి ఉండవు. సర్వత్ర పాపపుణ్యాలు, జ్ఞానాజ్ఞానములను వదలివేస్తాడు. శీతోష్ణాలు, సుఖదుఃఖాలు, మానావమానాలను జయించినవాడు. వాసనాత్రయ పూర్వకమైన నింద, అనింద, గర్వము, మత్సరము, దంభము, దర్పము, ఇచ్ఛ, ద్వేషము, కామము, క్రోధము, లోభము, మోహము, హర్షము, అసూయ, ఆత్మసంరక్షణ అన్నింటినీ వదలివేసినవాడు. తన శరీరాన్ని శవంలాగా చూస్తూ, అప్రయత్నమంగా ఏ రకమైన నియమాలు లేకుండా, ఆవులాగా దొరికింది తిని, ప్రాణాలు నిలుపుకుంటాడు. లభించిన దానితో తృప్తి చెందుతాడు. ఆశ అనేది లేనివాడు. సర్వశాస్త్ర పాండిత్యము కలిగి ఉండి కూడా దాన్ని భస్మం చేస్తాడు. అంటే శాస్త్ర విషయాలు తెలిసికూడా, వాటిని తలచడు. తన ఉనికిని దాచేస్తాడు. తానెవరో చెప్పడు. పెద్ద చిన్న అనే మాటలాడడు. నాకన్న వేరెవరూ లేరని భావిస్తాడు. దుఃఖముతో బాధపడడు. సుఖముతో మోదము పొందడు. రాగమునందు కోరిక ఉండదు. శుభాశుభములయందు ఆసక్తి ఉండదు. ఇంద్రియాలను జయించినవాడు. వర్ణాశ్రమ ధర్మాలను వదిలి, పగలు, రాత్రి కూడా జాగరూకుడై, సంచారం చేస్తూ, కేవలము దేహము మాత్రమే మిగిలినవాడై, పిచ్చివాడిలాగా, దెయ్యం పట్టిన వాడిలాగా ఒంటరిగా తిరుగుతుంటాడు. ఎవరితోనూ మాట్లాడడు. ఎప్పుడూ స్వరూపాన్నే ధ్యానం చేస్తుంటాడు. ఇతన్ని అవధూత అంటారు. ఇతడికి జీవితంలో కర్మలు అన్నీ క్షయం అయిపోయి ఉంటాయి. ఇతడు విదేహముక్తి కోసం ఎదురుచూస్తున్నవాడు. **జీవన్ముక్తుడు.**

**సాక్షిణ్యశేషం ప్రవిలాప్య దృశ్యం తమద్వయే బ్రహ్మణి నిష్ప్రపంచే ।**

**తతః స్వయం వ్యోమవదేవ పూర్ణా త్మనాత్మనాతిష్ఠతి యః స ముక్తః ॥218**

ఎవరైతే సర్వసాక్షి అయిన ప్రత్యగాత్మలో దృశ్యపదార్థమంతా లీనం చేసి, బ్రహ్మకన్న వేరైనది ఏదీ లేదని తెలుసుకుని, ప్రత్యగాత్మ పరబ్రహ్మ ఒకటే అని నిశ్చయించి స్వస్వరూపముతో ఉంటాడో అతడు **జీవన్ముక్తుడు.**

దృశ్యపదార్థమంతా నశించేదే. అశాశ్వతమైనది. అందుచేత దాన్ని ప్రత్యగాత్మలో లీనం చేసి, ప్రత్యగాత్మ పరమాత్మ కన్న వేరు కాదని తెలిసి, ప్రత్యగాత్మను పరమాత్మలో

లీనం చేసి, తాను ప్రత్యగాత్మ కాబట్టి నేనే పరబ్రహ్మను 'అహం బ్రహ్మాస్మి' అని దృఢమైన నిశ్చయంతో ఉండేవాడు, ఏ వికారాలతో సంబంధం లేకుండా సుఖదుఃఖాలను వదలి 'నేను సర్వపరిపూర్ణుణ్ణి. నాకన్న వేరైనది లేదు' అని భావన చేసేవాడు **'జీవన్ముక్తుడు.'**

**సర్వేషుభూతేష్వవలోక్య చ స్వం సర్వాణి భూతాన్యపి చాత్మని స్వే ।**

**స్వమేవ సర్వంసమవేక్ష్య పశ్చాత్ స్సర్వాత్మానా తిష్ఠతి య స్స ముక్తః ॥ 219**

సమస్తమైన జంతువు లందు ఆత్మస్వరూపాన్ని, స్వస్వరూపమైన ప్రత్యగాత్మలో సమస్త జంతువులను చూసి, తనకన్న వేరుగా కనుపించే ప్రపంచం అంతా ఆత్మమాత్రము గానే తెలిసికొని, సర్వమయమగు రూపంతో ఉండే పురుషుడు **జీవన్ముక్తుడు.**

మొదటగా ప్రతిమానవుడు భ్రాంతిలోనే ఉంటాడు. క్రమక్రమంగా ఒక్కొక్క మెట్టు ఎక్కి పరమపదాన్ని చేరతాడు. ఇందులో అన్ని భూతములు తనకన్న వేరుగా ఉన్నప్పటికీ వివేకంతో అవన్నీ ఆత్మరూపమే అని భావించటం మొదటి మెట్టు. ఆత్మయందే అన్నిభూతాలు ఉన్నాయి అని, అన్ని భూతాలకు ఆత్మే ఆధారము అని భావించటం రెండవ మెట్టు. ఈ రెండుమెట్లు దాటి సర్వము ఆత్మమయము. ఆత్మకన్న వేరైనది ఏదీ లేదు అని భావించటం చివరిమెట్టు. ఇలా భావించిన వాడే **జీవన్ముక్తుడు.**

**ఆశా యస్య విలోకితేఽపి విషయే నోదేతివాప్యాగ్రహో**
**బ్రహ్మణ్యేవ తదాత్మనా స్థితతయా నాహమ్మతిర్వర్ష్మణి ।**
**నేదం కార్యమకార్యమిత్యపి కథా బాహ్యార్థసంభావనా**
**జీవన్నేవ సముక్తఇత్యభి దధేప్రాచీన వాచామయీ ॥ 220**

ఎవరికైతే ఒక వస్తువును చూసినప్పుడు రాగద్వేషాలు ఉండవో, దేహంమీద ఆత్మాభిమానం ఉండదో, ఇది చెయ్యాలి ఇది కూడదు అనిపించదో, శబ్దాది విషయాల మీద ఆసక్తి ఉండదో అటువంటి వాడు జీవించి ఉండగానే ముక్తుడు **'జీవన్ముక్తుడు'** అని వేదం చెబుతోంది.

ఏ మహనీయుడికి ఇష్టాఇష్టములుండవో, రాగద్వేషాలుండవో, దేహమే ఆత్మ అనే భావన ఉండదో, ఇది చేయరానిపని ఇది చేయవలసినపని అనిపించదో,

బాహ్య విషయములందు ఆలోచన లేదో, అతడు జీవన్ముక్తుడు. ఈ విషయాన్ని వేదమే నొక్కి వక్కాణిస్తోంది. వేదవ్యాసుడు కూడా ఇదే విషయాన్ని చెబుతున్నాడు. వ్యాసుడు అనేది ఒక పేరు కాదు. అది ఒక పీఠం. ప్రతి మహాయుగంలోని ద్వాపర యుగంలో వేదవిభజన చెయ్యటానికి ఒక మహనీయుడు బ్రహ్మమానసపుత్రుడుగా జన్మిస్తాడు. మొదటి మహాయుగంలో అపాంతరతముడు. వేదవిభజన చేశాడు. ఇప్పుడు 28వ మహాయుగం జరుగుతోంది. **ఈ మహాయుగంలో వేదవిభజన చేసినవాడు 'సత్యవతీ నందనుడు'. కృష్ణద్వైపాయనుడు. ఈ రకంగా వేదవిభజన చేసిన వాడే వేదవ్యాసుడు.** పై లక్షణాలున్నవాడే **జీవన్ముక్తుడని** చెబుతోంది వేదం.

**త్వం నిర్వికల్పేన సమాధినా స్వం సర్వాత్మకం వీక్ష్య వివేకదృష్ట్యా**

**స్వాత్మన్య శేషం ప్రవిలాప్య దృశ్యం పూర్ణాత్మనా తిష్ఠ సుఖం విముక్తః ॥ 221**

సంకల్ప వికల్పాలు లేని బ్రహ్మసాక్షాత్కారనిష్ఠతో సర్వమయుడైన ఆత్మను జ్ఞానదృష్టితో దృశ్యముల నుండి విడదీసి, నామరూపాత్మకమైన ప్రపంచాన్ని స్వస్వరూపంలో లయం చేసి, సర్వవ్యాపకమైన ముక్తిని పొంది బ్రహ్మానందముతో ఉంటాడు. ఈ శ్లోకంలో ముక్తిని వివరిస్తున్నారు.

## 11. ముక్తి

ఇక్కడ ఒక్క క్షణం ఆగి ముక్తి అంటే ఏమిటో చూద్దాం. ముక్తి అంటే 'విముక్తి' ఐహిక బంధాల నుంచి విముక్తి. ఇలా ముక్తి పొందిన పురుషుడు పరమాత్మలో ఐక్యం కాడు. సూక్ష్మరూపంతో కార్యబ్రహ్మను చేరి అక్కడ ఆయన అనుభవించే సుఖాలు అన్నీ అనుభవిస్తూ ఉంటాడు. వైకుంఠంలో లక్ష్మీదేవి, గరుడుడు, నారదుడు, ఆదిశేషుడు నిత్యముక్తులు. వారు అలాగే ఉంటారు. ముక్తి పొందినవారు అంగుష్ఠ మాత్రదేహులై కార్యబ్రహ్మను సేవిస్తుంటారు. ఈ విషయం **కౌషీతకీ బ్రాహ్మణంలో** చెప్పబడింది. ఈ ముక్త పురుషునితో కార్యబ్రహ్మ నేను అనుభవించే సుఖాల మీరు కూడా అనుభవిస్తూ ఇక్కడే ఉండండి అంటాడు. వారు పరమాత్మ చెప్పినట్లుగా అక్కడే ఉంటూ బ్రహ్మానందాన్ని అనుభవిస్తారు. కార్యబ్రహ్మ అనుభవించే సుఖము ఆనందము ఏదైతే ఉన్నదో అదే బ్రహ్మానందం. **ఈ ఆనందాన్ని సాకారోపాసన చేసినవారు మాత్రమే పొందుతారు. నిరాకారోపాసన చేసిన వారి జీవాత్మ పరమాత్మలో**

**లీనమయిపోతుంది. వారు బ్రహ్మానందాన్ని విడిగా పొందే అవకాశం ఉండదు.** కాని విరాగియైన వాడు జీవించి ఉండగానే బ్రహ్మానందం పొందే అవకాశమున్నది.

**విషయాణాం స్మృతిశ్చాశా పక్షౌ ద్వౌ చిత్తపక్షిణః ।**
**తాభ్యాముడ్డీయతే చిత్తం తదుచ్ఛేదేన శ్యామ్యతి**
**"మా మయం హంతి విషయో బంధకత్వ స్వభావతః ॥ 222**

విషయ వాంఛలు నన్ను బాధిస్తున్నాయి. ఇవి నన్ను వదలవు. ఇవే నాకు సుఖాన్నిస్తాయి. అనే సంకల్పము, వాటియందు అత్యాశ ఈ రెండు మనస్సు అనే పక్షికి రెండు రెక్కలు. ఆ రెక్కలతో మనస్సు ఇష్టం వచ్చినట్లు ఎగురుతూ ఉంటుంది. ఆ రెక్కలు గనక విరగ్గొడితే, ఎగరటంమాని శాంతంగా ఉంటుంది.

**మనయేన మనుష్యాణాం కారణం బంధమోక్షయోః** బంధ మోక్షాలకి కారణం మనస్సు. ఈ మనస్సే సంసారానికి మూలకారణం. మమ అంటే బంధం. నమమ అంటే మోక్షం. ఇలా అనుకోవలసింది మనసుతోనే. మనస్సు కోతిలాంటిది. ఉన్నచోట ఉండదు. ఏ విషయంమీదనయినా ఏకాగ్రత కావాలి అన్నప్పుడు, కళ్ళు మూసుకున్నప్పుడు రకరకాల ఆలోచనలు, భావాలు, దృశ్యాలు కనిపిస్తాయి. మనస్సు వీటన్నింటి మీదికీ పోతుంది. శబ్దాది విషయాలు అంటే విషయవాంఛలు. ఎలాంటి వాడినైనా బంధిస్తాయి. ఈ బంధాలవల్ల బాధ కలుగుతున్నా వాటిని వదిలించుకోవాలి అనిపించదు. అవి నన్ను వదలవు. అని నిర్ణయించుకుని విషయాలనే ధ్యానిస్తుండాడు. మనస్సు రెక్కల సాయంతో వివిధ ప్రదేశాలకు మహావేగం గా పరుగులు పెడుతుంది. వాయువేగం కన్న ఎక్కువ మనోవేగం. విషయ వాంఛలు నాకు సుఖాన్నిస్తాయనే భావన మనస్సు యొక్క కుడిరెక్క. వాటియందలి అత్యాశ ఎడమరెక్క, ఈ రెక్కల సాయంతోనే మనస్సు ఎగురుతుంటుంది. ఆ రెక్కలను గనక విరగ్గొడితే మనస్సు ఎగరటం మానేస్తుంది. అలా ఎగరలేని మనస్సు శాంతంగా ఉంటుంది.

## 12. కర్మలు చేస్తే మోక్షం రాదు

ఈ విషయం చూసేటప్పుడు ముందుగా అసలు కర్మ అంటే ఏమిటో చూద్దాం. కర్మ అంటే పని. ఇది మంచి కర్మ అంటే సత్కర్మ కావచ్చు, దుష్కర్మ కావచ్చు. ఏదైనా ఒక కర్మ చేసినప్పుడు దాని ఫలితం మనం తప్పకుండా అనుభవించాలి. కర్మ చేసిన వెంటనే దాని ఫలితము సూక్ష్మరూపంలో నీ హృదయంలోకి చేరి,

అవసరమైనప్పుడు, కర్మ ఫలితం అనుభవంలోకి వస్తుంది. కొంతమంది చెబుతుంటారు. 'త్రుటిలో ప్రమాదం తప్పిపోయింది' అని. అది కేవలము నీ అదృష్టము. అదే గతజన్మలలో నువు చేసిన కర్మఫలం. కొన్నిసార్లు ఈ కర్మ ఫలితం మనమే కాకుండా మన వారసులు, కుటుంబ సభ్యులు కూడా అనుభవించాల్సి వస్తుంది. ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. కర్మ చేసింది మనం కదా? దాని ఫలితాన్ని పిల్లలు ఎందుకు అనుభవించాలి? అని. కష్టపడి నానాగడ్డి తిని ధనం సంపాదించేది, ఆస్థులు కూడబెట్టేది నువ్వే. వాటిని అనుభవించేది నీ పిల్లలే కదా? అలాగే మనం చేసిన మంచి చెడు కర్మల ఫలితాలు మనతోపాటు ఒక్కోసారి కుటుంబ సభ్యులు కూడా అనుభవించాల్సి వస్తుంది.

ఇక కర్మలు చేస్తే మోక్షం రాదా? అనేది ప్రశ్న. కర్మలు అంటే తీర్థాలలో స్నానం చెయ్యటం, క్షేత్రదర్శనం, జపతపాలు, పూజలు, అర్చనలు, వ్రతాలు, హోమాలు యజ్ఞయాగాది క్రతువులు, దానధర్మాలు, ప్రజోపయోగకరమైన పనులు సత్రాలు కట్టించటం, దారి ప్రక్కన విడిది ఏర్పాటు చెయ్యటం, విద్యాలయాలు కట్టించటం మొదలైనవి. ఈ పనులు చేస్తే మోక్షం రాదు. పుణ్యం వస్తుంది. తద్వారా స్వర్గం వస్తుంది.

| | | |
|---|---|---|
| తీర్థాలలో స్నానం చేస్తే | – | శరీర శుద్ధి కలుగుతుంది. |
| క్షేత్రాలు దర్శిస్తే | – | ఆత్మ నిర్మలమవుతుంది |
| జపతపాలు, పూజలు, అర్చనలు | – | దేవతానుగ్రహం కలుగుతుంది |
| వ్రతాలు, హోమాలు చేస్తే | – | దేవతానుగ్రహం కలుగుతుంది. |
| యాగాలు చేస్తే | – | దానికి నిర్దేశించిన ఫలితం వస్తుంది. ఉదా : పుత్రకామేష్టి చేస్తే సంతానం కలుగుతుంది. |
| యజ్ఞాలు చేస్తే | – | బ్రహ్మాలోకప్రాప్తి. ఇక్కడ బ్రహ్మా అంటే చతుర్ముఖబ్రహ్మా. సృష్టికర్త. సత్యలోకప్రాప్తి |
| దానధర్మాలు చేస్తే | – | దానం చేసిన వస్తువు కొన్ని వందల రెట్లై మళ్ళీ నిన్నుచేరుతుంది. |

సత్రాలు కట్టించటం వంటి మంచి పనులు చేస్తే – నిన్ను గురించి లోకంలో చెప్పుకున్నంత వరకు నువ్వు స్వర్గంలో ఉంటావు. దీనికి భారతంతో ఇంద్రద్యుమ్న మహారాజు కథ మంచి ఉదాహరణ.

ఇలా ఏ రకమైన కర్మ చేసినా దానికి తగిన ఫలితం వస్తుంది. ఇప్పుడు చెప్పిన కర్మలకు ఎక్కడా ఫలము మోక్షము అని చెప్పలేదు. కర్మలు చెయ్యటంవల్ల స్వర్గం వస్తుంది. మరుజన్మలో ఉత్తమజన్మ కలుగుతుంది. సద్బ్రాహ్మణుడుగా, జన్మించి వేదవేదాంగాలు నేర్చి చాలా గొప్ప పండితుడయ్యే అవకాశం ఉంది. దేశాన్ని పాలించే రాజవుతాడు. మంచి లక్షణాలున్నవాడుగా జన్మిస్తాడు. అంతేకాని **కర్మలు చేస్తే మోక్షం రాదు.**

ఏదైనా ఒక దాన్ని పొందాలంటే దానికి తగిన అర్హత సాధించాలి. కలెక్టరు కావాలంటే ఐ.ఎ.ఎస్. ప్యాసవ్వాలి. ఐ.ఎ.ఎస్.లో ఉత్తీర్ణుడైతే అతడు కలెక్టరు కాకుండా ఎవరూ ఆపలేరు. ఉత్తీర్ణుడు కాకపోతే అతణ్ణి కలెక్టరు చెయ్యటం ఎవరివల్లా కాదు. అలాగే మోక్షం పొందాలంటే వాసనాక్షయం కావాలి. జీవాత్మ పరమాత్మల మధ్య తేడా లేదని తెలుసుకోవాలి. అటువంటి వాడు తప్పనిసరిగా మోక్షం పొందుతాడు. కర్మలు చేస్తే స్వర్గం వస్తుంది. ఉత్తమజన్మ వస్తుంది. అంతేకాని మోక్షం మాత్రం రాదు. ఈ విషయాన్నే ఇక్కడ వివరిస్తున్నారు.

**నస్నాన మంత్రార్చనకీర్తనాది వా నతీర్థసేవాది చ కర్మ భిక్షోః ।**

**యుక్తం యతోఽనాత్మమతిప్రవర్ధకం హ్యనాత్మ శాస్త్రైరితమ ప్యశేషమ్॥223**

భేదదృష్టి గలవారికి ప్రపంచంలో జరిగే కర్మకాండల యందు చెప్పిన అన్ని విషయాలు చెప్పటంవల్ల జగ్తులో అన్ని విషయాలు, పదార్థాలు ఆత్మకన్న వేరైనవి అనే భేదభావం ఎక్కువ అవుతుంది. మోక్షగామికి స్నానము, మంత్రము, తపము, అర్చన, యజ్ఞయాగాలు మొదలైన కర్మలు పనికిరావు. అలా అని తీర్థయాత్రలు, క్షేత్రదర్శనము వంటివి అవసరం లేదు.

బ్రహ్మము వేరు, జగత్తు వేరు అని భావన చేసేవారికి కర్మకాండల విషయము, దాని అర్థము వినరంగా చెబితే ఆ బేధభావము పెరుగుతుందే కాని తగ్గదు.

మోక్షగామికి స్నానము, పూజలు, జపతపాలు, అర్చనలు అవసరం లేదు. అంతేకాదు తీర్థస్నానము, క్షేత్రదర్శనము కూడా అవసరం లేదు. వీటివల్ల పుణ్యపాపాలు, స్వర్గనరకాలు వస్తాయి. అంతేగాని మోక్షం మాత్రం రాదు.

**నకర్మ మోక్షం ప్రతి కారణం త్వితి స్వయం వినిశ్చిత్య విముక్తి మిచ్ఛతాం।**

**నకర్మణా న ప్రజయేతి సాక్షా త్కర్మాఖిలం సాధు నిషేధతి శ్రుతిః ॥224**

వేదంలో కర్మలు చెయ్యటం వల్ల మోక్షం వస్తుంది. అని చెప్పలేదు. కర్మలవల్ల ముక్తి రాదు. సంతానము వల్ల ముక్తి రాదు అని చెప్పి వేదం కర్మను నిషేధించింది.

**నకర్మణాన ప్రజయాధనేన త్యాగేనైకే అమృతత్త్వ మానశుః** కర్మవల్ల గాని, సంతానం వల్లగాని, ధనం వల్లగాని మోక్షం కలగదు. కర్మవల్ల కర్మ పెరుగుతుంది. కర్మ చెయ్యటం వల్ల ఫలితం వస్తుంది. ఆ ఫలితం వల్ల ఇంకా అనేక కర్మలు చేస్తాడు. పుణ్యపాపాలు పెరుగుతాయి. దీనివల్ల జన్మలు అధికమవుతాయి. కర్మలు చెయ్యటం వల్ల ముక్తిరాదు. సంతానం వల్ల ముక్తి రాదు. వేదం చదవటం వల్ల కూడా ముక్తిరాదు. మానవ జీవితానికి చరమాంకం ముక్తి. ఈ విషయం వివరించి వేదం కర్మలు చేస్తే ఫలితముండదు అంటూ కర్మను నిషేధిస్తోంది.

**సన్న్యస్య శ్రవణం కుర్యాది త్యాదుస్మృతిరప్యలం ।**

**విధత్తే శ్రవణం భిక్షో ర్మోక్ష మాత్రైక కాంక్షిణః ॥ 225**

సన్యాసం తీసుకుని సర్వసంఘ పరిత్యాగియై వేదాంత వాక్యాలు వినాలి దీనిమీద సరియైన పట్టురాని వారు మళ్ళీ వేదాంత వాక్యాలు వినాలి.

కర్మలన్నీ వదలేసిన తరువాత వేదాంత వాక్యాలు వినాలి. అవి విన్న తరువాత సాధకుడికి ఆత్మజ్ఞానం అలవడాలి. ఒకవేళ ఏదైనా కారణాల వల్ల జ్ఞానం కలగకపోతే వేదాంత వాక్యాలను మళ్ళీ శ్రవణం చెయ్యాలి. జ్ఞానం కలిగేదాకా ఈ పనిచేస్తూనే ఉండాలి.

**అయమేవ యతేర్ధర్మః కర్తవ్యో మోక్ష కాంక్షిణః ।**

**నైవ స్నానం నాపి జపో నపూజాపి నకీర్తనమ్ ॥ 226**

మోక్షాన్ని కోరేవారు అందుకు కావలసిన సాధన సంపత్తిని సమకూర్చుకోవాలి. అతడు సన్యసించాలి. అంతే కాని అవబృథస్నానము, మంత్రానుష్ఠానము, దేవతార్చన, నామసంకీర్తన చేయవలసిన పనిలేదు.

మోక్షగామి చేయవలసిన విధులు చెబుతున్నారు. మోక్షం కావాలి అనుకున్నంత మాత్రంచేత మోక్షం రాదు. మోక్షం పొందటానికి కావలసిన సాధన సంపత్తిని చేకూర్చుకోవాలి. యజ్ఞయాగాది కర్మలు చేస్తే మోక్షం రాదు. యాగాంతంలో చేసేది అవబృథస్నానం. యజ్ఞయాగాది కర్మలు చేస్తే వాటికి చెప్పబడిన ఫలితం వస్తుంది.

| | | |
|---|---|---|
| అశ్వమేధ యాగం | – | రాజ్యవిస్తరణ, ప్రజాశ్రేయస్సు |
| రాజసూయం | – | చక్రవర్తిత్వం, ప్రజాశ్రేయస్సు |
| పుత్రకామేష్టి | – | సంతానప్రాప్తి |
| అగ్నిచయనం | – | శాశ్వత స్వర్గలోకప్రాప్తి. |

ఇలా ఒక్కొక్క యాగానికి ఒక్కొక్క ఫలితం వస్తుంది. అంతేగాని మోక్షం రాదు. వేదాధ్యయనం చేస్తే మోక్షం రాదు. సత్యలోక ప్రాప్తి జరుగుతుంది.

| | | |
|---|---|---|
| మంత్రజపం వల్ల | – | దేవతానుగ్రహం కలుగుతుంది. |
| దేవతార్చన వల్ల | – | దేవతానుగ్రహం కలుగుతుంది |
| నామసంకీర్తన వల్ల | – | మనసుకు ఏకాగ్రత, ప్రశాంతత, దేవతానుగ్రహము కలుగుతాయి. |

వీటివల్ల పుణ్యలోకాలు ప్రాప్తిస్తాయి. అంతే మోక్షం మాత్రం రాదు. మోక్షం కావాలంటే దానికి అవసరమైనవి చెయ్యాలి. మోక్షగామి సన్యసించాలి అంటున్నారు. సన్యాసమనేదివేదంలో చెప్పబడలేదు అంటాడు జైమిని మహర్షి. అంధ అంధక న్యాయం లాగా సన్యాసం చెప్పబడింది అన్నాడు. ఒక గ్రుడ్డివాడి చేయి పట్టుకుని ఇంకొక గ్రుడ్డివాడు నడిచినట్లుగా, ఎవరో చెప్పారు కాబట్టి ఇతడు చెబుతున్నాడు. ఇతడు చెప్పాడు కాబట్టి ఇంకొకరు చెబుతున్నారు అంటే వేదంలో మాత్రం సన్యాసం చెప్పబడలేదు అన్నాడు జైమిని. 'సన్యాసం వేదంలో చెప్పబడక పోయినా ఆచరించ తగినదే' అన్నాడు వ్యాసభగవానుడు.

సన్యాసము అంటే కాషాయాంబరాలు ధరించటం కాదు. లౌకిక జీవనానికి స్వస్తి పలకాలి. కొండలు కోనలలో నివసిస్తూ నిరంతరము సత్యాన్వేషణలో కాలం గడపాలి. మోక్షం కావాలంటే ఈ పని చెయ్యాలి.

**యథా తండుల సంపర్కా న్నారికేళం వినస్యతి ।**
**యథైవోదక సంపర్కా త్సమూలం మధు నశ్యతి ॥ 227**

**తథా శ్రవణజో బోధః కర్మయోగాద్వినశ్యతి ।**
**తతో ముముక్షోస్తుయతే ర్నకార్యం కర్మ కించన ॥ 228**

బియ్యంతో సంబంధం గలిగిన కొబ్బరికాయ, నీటితో కలిసిన తేనె నాశనమైనట్లుగా, వేదాంత వాక్యాలు వినటం వల్ల పుట్టిన అభేదజ్ఞానము, కర్మ చేయటం వల్ల నశిస్తుంది. కాబట్టి మోక్షగామి కర్మలు చేయరాదు.

ఇక్కడ చాలా ముఖ్యమైన విషయం చెబుతున్నారు. కొబ్బరిచెట్టుకు బియ్యపు కుడితి అంటే బియ్యం కడిగిన నీరు పోస్తే ఆ చెట్టు చచ్చిపోతుంది. బియ్యండబ్బాలో పెట్టిన కొబ్బరికాయ కుళ్ళిపోతుంది. ఈ రకంగా బియ్యంతో సంబంధం గల కొబ్బరి నాశనమవుతుంది. తేనెలో నీరు కలిస్తే తేనె యొక్క రుచి, నాణ్యత, నశిస్తాయి. వేదాంత వాక్యాలు వినటం వల్ల జీవాత్మ పరమాత్మలకు తేడా లేదు రెండూ ఒకటే అనే విషయం తెలుస్తుంది. కర్మలు చేసినట్లైతే కర్మ ఫలితం వస్తుంది. అంటే జీవాత్మ వేరు పరమాత్మ వేరు. కర్మ చేసేది మనం. కర్మ ఫలితాన్నిచ్చేది పరమేశ్వరుడు. అనే అజ్ఞానం వస్తుంది. దీంతో వేదాంత వాక్యాలు వినటంవల్ల వచ్చిన జ్ఞానం నశిస్తుంది. కాబట్టి **మోక్షగామియైనవాడు కర్మలు చెయ్యరాదు.**

## 13. వేదాంత వాక్యాలు, గురూపదేశం

మోక్షం కావాలనుకునేవాడు దానికి కావలసిన సాధన విపరీతంగా చెయ్యాలి. ముందుగా అజ్ఞానం నశించాలి. ఇది అంత తేలిక అయిన విషయం కాదు. ఎందుకంటే – ఇది అనాదిగా ఉన్నది. మానవుడిని సృష్టించిన తరువాత ఈ దేహంలో నేను లేకపోతే ఎలా? అనుకుని బ్రహ్మరంధ్రం ద్వారా పరమేశ్వరుడు మానవ దేహంలో ప్రవేశించి, ఇంద్రియాలతో అన్ని సుఖాలు అనుభవిస్తూ, వచ్చిన దారి కూడా

మరిచిపోయి, దేహమే నేను అని భావన చేసి పంజరంలో బంధించబడిన పక్షిలాగా బయటకు పోయే మార్గం తెలియక దేహంలోనే ఉండిపోయాడు. కాబట్టి ఈ అజ్ఞానము క్రొత్తగా వచ్చింది కాదు. అసలు సృష్టి ఆరంభంలోనే ఈ అజ్ఞానము మాయరూపంలో పరమేశ్వరుణ్ణి ఆవరించి ఉన్నది. అందుచేత **అజ్ఞానం కూడా పరమేశ్వర స్వరూపమే.** ఈ అజ్ఞానం నశించాలి అంటే శాస్త్రాలు చదవాలి. వేదాంత గ్రంథాలు చదవాలి. ఆధ్యాత్మిక విషయాల మీద పట్టు సాధించాలి. తరువాత ఒక సద్గురువును చూసి, అతని దగ్గర శిష్యరికం చెయ్యాలి. బ్రహ్మజ్ఞాని అయిన గురువు దొరకటం చాలా కష్టం. అతని ఉపదేశాలు వినాలి. విన్న వాటిని మననం చెయ్యాలి. సహాధ్యాయులతో చర్చలు చెయ్యాలి. విషయాన్ని నిర్ణయించాలి. జీవాత్మ పరమాత్మ ఒకటే అని తెలుసుకోవాలి. వేదాంత వాక్యాలు చదివినా, గురూపదేశం విన్నా అజ్ఞానం వదలకపోతే, జీవాత్మ పరమాత్మ ఒకటే అని తెలియకపోతే మళ్ళీ చదవాలి. మళ్ళీ వినాలి. ఇలా ఎంత కాలం చెయ్యాలి? అని అనుమానం వస్తుంది. ఒక తెల్లటి వస్త్రం మీద మట్టిమరక పడింది. దాన్ని శుభ్రం చెయ్యాలి. అంటే సబ్బు పెట్టి ఉతకాలి. ఒకసారి ఉతికాం. ఇంకా మట్టి ఉంది. మళ్ళీ ఉతుకు. ఇంకా మట్టి ఉంది. మళ్ళీ ఉతుకు. ఎంత కాలం ఉతకాలి? ఎన్నిసార్లు ఉతకాలి అంటే మరకపోయేదాకా ఎన్నిసార్లైనా ఉతకాలి. అలాగే వేదాంత వాక్యాలు ఎన్నిసార్లు చదవాలి? అంటే మనసుకు పూర్తిగా పట్టేదాకా చదవాలి. గురూపదేశం ఎన్నిసార్లు వినాలి అంటే ఏ మాత్రము అనుమానం లేకుండా జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే అని ఖచ్చితంగా తెలిసేదాకా, అజ్ఞానం అంతరించేదాకా ఈ పని చెయ్యాల్సిందే.

సామాన్యంగా ప్రతివారు మోక్షం పొందాలి. ఇదే చివరి జన్మ కావాలి అనుకుంటారు. అలా అనుకున్నంత మాత్రాన సరిపోదు. దానికి తగిన సాధన కూడా చెయ్యాలి. కలెక్టరు కావాలంటే ఐఎయస్‌లో ఉత్తీర్ణుడు కావాలి. ఐఎయస్‌లో ఉత్తీర్ణుడైతే కలెక్టరు కాకుండా నిన్నెవరూ ఆపలేరు. ఒకవేళ ఐఎయస్‌లో ఉత్తీర్ణుడు కాకపోతే సాక్షాత్తు దేశాధ్యక్షుడు కూడా నిన్ను కలెక్టరు చెయ్యలేడు. ఈ విషయం గతంలో చెప్పుకున్నాం. అలాగే మోక్షం పొందటానికి సరైన అర్హత సాధించాలి. దానికి సద్గురువు అవసరం చాలా ఉంది. ఇప్పుడు ఈ చిన్న కథ చూడండి. కథ మీకందిరికీ తెలిసిందే.

# 14. అనగా అనగా ఒక రాజు కథ

అనగా అనగా ఒకరాజు. ఆ రాజుకు ఏడుగురు కొడుకులు. ఏడుగురు కొడుకులు వేటకు వెళ్ళి ఏడు చేపలు తెచ్చారు. వాటిని ఎండబెట్టారు. అందులో ఒక చేప ఎండలేదు.

చేపా చేపా! ఎందుకు ఎండ లేదు? అంటే గడ్డిమోపు అడ్డం వచ్చింది అంది. గడ్డిమోపా,

గడ్డిమోపా ఎందుకు అడ్డం వచ్చావు? అంటే ఆవు మెయ్యలేదు అంది.

ఆవూ, ఆవూ, ఎందుకు మెయ్యలేదు? – గొల్లవాడు మేపలేదు.

గొల్లవాడా, గొల్లవాడా, ఎందుకు మేపలేదు? అమ్మ అన్నం పెట్టలేదు.

అమ్మా, అమ్మా ఎందుకు అన్నం పెట్టలేదు? – పిల్లవాడు ఏడ్చాడు.

పిల్లవాడా, పిల్లవాడా, ఎందుకు ఏడ్చావు? చీమ కట్టింది,

చీమా చీమా, ఎందుకు కుట్టావు? – నా బంగారు కన్నంలో వ్రేలు పెడితే కుట్టనా? అంది. చిన్నప్పుడు నాయనమ్మ, తాతయ్య పిల్లల్ని వళ్ళో కూర్చోబెట్టుకుని తప్పనిసరిగా ఈ కథ చెప్పేవాళ్ళు. ఇది నిరర్థకమైన కథ అని అనుకుంటారు. దీని అర్థం చాలామందికి తెలియదు. మనకు తెలియనంత మాత్రాన అది ఉపయోగం లేనిది కాదు. ఇప్పుడు ఈ కథకి అర్థం చూద్దాం.

అనగా అనగా ఒక రాజు : సామాన్య మానవుడు.

ఏడుగురు కొడుకులు : సప్తధాతువులు 1.శుక్లము 2.శోణితము 3.మాసంము 4.ఎముకలు 5.చర్మము 6.చీము 7.మెదడు

వేటకు వెళ్ళటం : జీవనం సాగించటం జీవనమనే వేట.

ఏడు చేపలు : సప్తవ్యసనాలు 1.కామము 2.వేట 3.జూదము4. మద్యపానము 5.వాక్పారుష్యము 6.దండపారుష్యము 7.దుబారా ఖర్చు

ఎండ బెట్టటానికి వీలైనది కాబట్టి దీన్ని చేప అన్నారు. ఎండ బెట్టటము అంటే నాశనం చెయ్యటం. మానవుడు మంచి సాధనతో ఈ సప్త వ్యసనాలను నాశనం చెయ్యవచ్చు.

ఒక చేప ఎండలేదు : ఆరు వ్యసనాలు నాశనమయినాయి. కాని ఒకటి మాత్రం నాశనం కాలేదు. అదే కామము. కామము అంటే కోరిక. కోరికలు అపరిమితమైనవి. ఒకదాని తరువాత ఇంకొకటి వస్తుంది. అవే బంధాలు. బంధాలు తెగిపోతే మోక్షమే. మోక్షం పొందాలి అనుకోవటం కూడా ఒక కోరికే. కోరికలను జయించటం చాలా కష్టం. ఇక్కడ కామము అనే ఒక చేప ఎండలేదు.

చేపా ! చేపా ! ఎందుకు ఎండలేదు? గడ్డిమోపు అడ్డం వచ్చింది. గడ్డి అంటే అజ్ఞానం. అందులోనూ మోపు. అపారమైనది. ఎంతలాగినా గడ్డి పరకలు వస్తూనే ఉంటాయి. అలాగే అజ్ఞానం తరగదు. ఎన్ని ఉపన్యాసాలు విన్నా, ఎంత చదివినా ఇంకా ఇంకా అజ్ఞానం పీడిస్తూనే ఉంటుంది. గొప్పగా జ్ఞానసముపార్జన చేసినా అహంకారం వస్తుంది. ఇది కూడా అజ్ఞానమే.

గడ్డి ఎందుకు అడ్డం వచ్చింది ? ఆవు మెయ్యలేదు. ఆవు జ్ఞానానికి ప్రతీక. జ్ఞానం కలిగిన మరుక్షణంలో అజ్ఞానం తొలగిపోతుంది. దీపం వెలిగించగానే చీకటి పోతుంది.

ఆవు ఎందుకు మెయ్యలేదు? గొల్లవాడు మేపలేదు. గొల్లవాడు సద్గురువు. సద్గురువుతో జ్ఞానబోధ జరగలేదు. కాబట్టి అజ్ఞానం పోలేదు. **'కృష్ణం వందే జగద్గురుం'** జగద్గురువు కృష్ణుడు. అతడు గొల్లవాడు.

గొల్లవాడు ఎందుకు మేపలేదు? అమ్మ అన్నం పెట్టలేదు. అమ్మ పెట్టిన అన్నం తిని, మూట కట్టుకుని తీసుకువెళ్ళి గోవులను కాయటం జరగుతుంది. అన్నం పెట్టటము అంటే అనుజ్ఞ ఇవ్వటం. అమ్మ అంటే జగన్మాత. అమ్మ అన్నం పెట్టలేదు అంటే – జగన్మాత అనుజ్ఞ ఇవ్వలేదు. ఎందుకని? ఇంకా జ్ఞానం పొందే సమయం రాలేదు. బుద్ధి పరిపక్వం కాలేదు.

అమ్మ ఎందుకు అన్నం పెట్టలేదు? పిల్లవాడు ఏడ్చాడు. సాధకుడు ఇంకా సంసార లంపటంలోనే ఉన్నాడు. అతడికి బంధాలు తెగలేదు.

పిల్లవాడు ఎందుకు ఏడ్చాడు? చీమ కుట్టింది. భవబంధాలు, ఈతిబాధలు, సంసార బాధ్యతలు.

చీమ ఎందుకు కుట్టింది? దాని బంగారుకన్నంలో వ్రేలు పెట్టాడు. చీమలు మట్టి పుట్టలో ఉంటాయి. కాని ఇది బంగారు కన్నం. సంసారం మీద ఉన్న

అపరిమితమైన ఆసక్తి. ఆకాంక్ష. అదే బంగారు కన్నం. అందులో వ్రేలు పెట్టాడు. సంసార సాగరంలో చిక్కుకున్నాడు. అందుకే చీమ కుట్టింది. చీమ కుట్టటం అంటే ఈతిబాధలు పొందటం. **సంసార సాగరంలో చిక్కిన వాడికి ఈ బాధలు తప్పవు.**

సంసారాన్ని వదిలితేనే ఈ బంధాలు పోతాయి. అరిషడ్వర్గాలను జయిస్తాడు. ఇది జరగాలంటే సద్గురువు కావాలి. అతని ఉపదేశం, బోధనలు కావాలి. వేదాంత వాక్యాలు సద్గురువు ఉపదేశంతోనే సంసార బంధనాల నుంచి బయట పడగలరు. అయితే ఈ బోధనలు, ఉపదేశాలు ఎన్నిసార్లు వినాలి? వేదాంత వాక్యాలు ఎన్నిసార్లు చదవాలి? అంటే **జ్ఞానం వచ్చేదాకా వేదాంత వాక్యాలు చదవాలి. గురువు ఉపదేశాలు వినాలి.** ఈ విషయాన్ని ఇక్కడ వివరిస్తున్నారు.

'బ్రహ్మసత్యం జగన్మిథ్య' 'తత్త్వమసి' ఇలాంటి విషయాలు ఎన్ని విన్నా సాధకుడికి "తానే పరబ్రహ్మ స్వరూపము. జగత్తులో తాను తప్ప వేరే పదార్థం ఏదీలేదు" అనే తత్త్వం పట్టుపడకపోతే ఏం చెయ్యాలి? ఇది చిన్న అనుమానం. ఇక్కడ ఒక విషయం చూడండి.

మనం మార్కెట్‌లో ఒక మామిడిపండును కొన్నాం. తెచ్చుకుని తిన్నాం. చాలా రుచిగా, తియ్యగా ఉంది. ఇక్కడ ఒక్క క్షణం ఆగి ఆలోచించండి. ఈ మామిడిపండు కొన్ని రోజులమందు పచ్చిగా ఉన్న కాయ. ఇంకొన్ని రోజులమందు మామిడి పిందె. ఇంకొన్ని రోజుల క్రితం మామిడిపూవు. ఇంకొన్ని రోజుల క్రితం మొగ్గ. కొన్ని రోజుల క్రితం ఉన్న మొగ్గే క్రమేణా పెరిగి ఇవాల్టి రోజున పండు అయింది. పిందెగా ఉన్నప్పుడు వగరుగా ఉంటుంది. కాయ అయిన తరువాత పుల్లగా ఉంటుంది. అదే పండిన తరువాత తియ్యగా, తినటానికి రుచిగా తయారైంది. కొన్ని రోజుల క్రితం వగరుగా ఉన్న పిందె ఇప్పుడు రుచికరమైన పండుగా తయారైంది. అంటే సాధన గనక చేసినట్లైతే క్రమేణా మార్పు వచ్చి సాధకుడు సిద్ధుడవుతాడు. ముక్తుడవుతాడు. ఒకవేళ అతనికి తత్త్వం బోధ పడలేదు అంటే అతని సాధన సరిపోలేదు. అన్నం సరిగా ఉడకలేదు అంటే, క్రింద మంట సరిగా లేదు అని అర్థం చేసుకోవాలి. అయితే ఇప్పుడేం చెయ్యాలి అనేది మళ్ళీ ప్రశ్న. ఇప్పుడు మళ్ళీ గురువు దగ్గర శుశ్రూష చెయ్యాలి. శాస్త్రాలు చదవాలి. ఇలా ఎంతవరకు చెయ్యాలి? పరిపక్వం చెందేదాకా. మామిడికాయని తెచ్చి గడ్డిలో చుట్టిపెట్టాం. అలా ఎంత

కాలం ఉంచాలి అంటే, అది పండేదాకా. అలాగే మనసు పరిపక్వత చెందేదాకా, తత్త్వం బోధపడే దాకా శాస్త్రాధ్యయనం, గురుశుశ్రూష చెయ్యవలసిందే.

**సర్వకర్మాణి సన్యస్యే త్యేవం వక్తి స్వయం శ్రుతిః ।**
**శ్రవణాదేః ఫలం ప్రాహు ర్బ్రహ్మాత్మైకత్వబోధనమ్ ॥ 229**

అన్ని రకాల కర్మలను వదలి పరబ్రహ్మకు ప్రత్యగాత్మకు తేడాలేదు అని తెలుసుకోవటమే వేదాంత వాక్యాల శ్రవణం వల్ల వచ్చే ఫలితము.

వేదాంత వాక్యాలు వినాలి అంటున్నాం. ఎందుకు వినాలి? వింటే దాని ఫలము ఏమిటి అనే విషయం ఈ శ్లోకంలో వివరిస్తున్నారు. శ్రవణము మొదలగు వాటివల్ల అంటే

1. శ్రవణము 2. మననము 3.నిధిధ్యాసనము

1. శ్రవణము – వేదాంత వాక్యాలను వినటం
2. మననము – విన్నవాటిని సహాధ్యాయులతో చర్చించి, అనుభవంతో విచారించి నిశ్చయించటము.
3. నిధి ధ్యాసనము – అలా నిశ్చయించిన విషయాన్ని జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే అనే విషయాన్ని రెండవ ఆలోచన లేకుండా సమాధిలో కూర్చుని ధ్యానం చెయ్యటం. ఇది వేదాంత వాక్యాలు వినటం వల్ల వచ్చే ఫలం.

**తదభావే యతేరస్య నిష్ఫలం శుకజల్పవత్ ।**
**దశధా శతధా వాపి శ్రుత్వా మత్వాపి వాయతే ।**
**సంసారధ్వంసకం జ్ఞానం సంపాద్యమతియత్నతః ॥ 230**

జీవాత్మ పరమాత్మ రెండూ ఒక్కటే అనే విషయం తెలియకుండా, మోక్షం పొందాలనుకునేవాడు చేసే శ్రవణాదులన్నీ చిలుక పలుకులులాంటివి. కాబట్టి వందసార్లు వెయ్యిసార్లు జీవాత్మ పరమాత్మలకు భేదం లేదనే విషయం నిశ్చయంగా తెలిసేదాకా వేదాంత వాక్యాలు వింటూనే ఉండాలి.

మోక్షగామి చెయ్యవలసిన ముఖ్యమైన పని గురించి చెబుతున్నారు. వేదాంత వాక్యాలు వినటం ద్వారా జీవాత్మ పరమాత్మ రెండూ ఒక్కటే అనే మాటను నిశ్చయంగా తెలుసుకోవాలి. ఇందులో ఏ మాత్రం అనుమానం ఉండరాదు. ఒకవేళ ఈ విషయం మీద నమ్మకం కుదరకపోతే మళ్ళీ, మళ్ళీ, మళ్ళీ జీవాత్మ పరమాత్మ ఒకటే అనే నమ్మకం కుదిరేదాకా వందసార్లు గాని వెయ్యిసార్లు గాని వేదాంత వాక్యాలు వింటూనే ఉండాలి. అంతకుమించి ఇంకొక మార్గం లేదు.

**తత ఆలస్యముత్సృజ్య శతధాపి సహస్రధా**

**కర్తవ్యం శ్రవణం భిక్షో ర్నికటే బ్రహ్మవిద్గురోః ॥ 231**

ఈ కారణంచేత బ్రహ్మవేత్త అయిన గురువు దగ్గర కూర్చుని ఎన్నిసార్లైనా సరే శ్రవణం చెయ్యాలి.

మోక్షాపేక్ష గల సన్యాసి వేదాంత వాక్యాలు గురువు చెప్పగా వినాలి. వాటిని మననం చెయ్యాలి. సహాధ్యాయులతో కలిసి విచారించాలి.

**శ్రుత్వా తత్త్వ మసీత్యేవం బోధ్యమానోఽప్యనే కథా ।**

**న విజానాత్యయం తత్త్వ మీశానుగ్రహవర్జితః ॥ 232**

ఒకవేళ సాధకుడు శుద్ధ అజ్ఞాని అయితే గురువు చెప్పిన జీవబ్రహ్మైక్యం అతని తలకు ఎక్కదు.

గురువు దగ్గర కూర్చున్నాడు. మిగిలిన వారితో పాటుగా ఇతడికి కూడా గురువుగారు బ్రహ్మవిద్యను బోధించాడు. అది అతనికి అర్థం కావాలని లేదు. విషయం తెలియాలని అంతకన్నా లేదు. ఇక్కడ ఒక చిన్న ఉదాహరణ.

ఒకసారి ఇంద్రుడు దధ్యమహర్షి ఆశ్రమానికి వచ్చాడు. వచ్చినవాడు ఇంద్రుడు దేవరాజు. ముల్లోకాలకు అధిపతి. దధ్యమహర్షి ఎదురు వెళ్ళి స్వాగత సత్కారాలందించాడు. కుశల ప్రశ్నలు అయిన తరువాత ఇంద్రుడు 'మహర్షీ! మీరు నాకు ఒక చిన్నపని చెయ్యాలి. అందుకే వచ్చాను' అన్నాడు. అడుగుతున్న వాడు ఇంద్రుడు. దేవరాజు. దాంతో మహర్షి ఏం కావాలో చెప్పు దేవేంద్రా. తప్పకుండా చేస్తాను.' అన్నాడు. ఇప్పుడు ఇంద్రుడు 'మహర్షీ ! నువ్వు మళ్ళీ కాదనకూడదు. అలా మాటిస్తేనే నేను అడుగుతాను' అన్నాడు. సరే అన్నాడు మహర్షి. ఇప్పుడు

మెల్లిగా చెప్పాడు ఇంద్రుడు. 'మహర్షీ ! నాకు బ్రహ్మవిద్య కావాలి.' ఆ మాట వినంగానే అవాక్కైపోయాడు మహర్షి. ఆలోచించటం మొదలుపెట్టాడు. ఇంద్రుడు నిరంతరము అప్సరాంగనలతో విహరిస్తుంటాడు. లౌకిక విషయాల యందు ఆసక్తి ఉన్నవాడు. బ్రహ్మవిద్య అనేది లౌకిక విషయాల యందు విరక్తి చెందిన వారికి చెప్పేది. ఇంద్రుడికి చెప్పటం ఎలా సాధ్యం? ఏం చెయ్యాలి. ఆలోచిస్తున్నాడు ఋషి. ఇప్పుడు ఇంద్రుడే అంటున్నాడు. 'ఏం మహర్షీ! మాట తప్పనన్నావు. నాకు బ్రహ్మవిద్యను చెబుతానన్నావు. చెబుతావా? చెప్పవా? 'స్వరం కొంచెం గట్టిగానే ఉంది. అధికార దర్పం కనిపిస్తోంది. ఇంద్రుడికి బ్రహ్మవిద్యను చెబితే అపాత్రదానం. చెప్పకపోతే అసత్యదోషం. ఏం చెయ్యలేడు. 'సరే రేపు ఉదయం మిగిలిన శిష్యులతో పాటురా!' అన్నాడు మహర్షి.

మరునాడు ఒక కౌపీనం ధరించి, చేతిలో దర్భలు పట్టుకుని వచ్చాడు ఇంద్రుడు చెప్పటం మొదలుపెట్టాడు. దధ్యుడు. 'చరాచర జగత్తంతా అశాశ్వతం. ఈ లోకాలు, భోగాలు, సుఖాలు, రాజ్యాలు, రాజులు, అధికారం, ఐశ్వర్యం అంతా అశాశ్వతం' అన్నాడు. వెంటనే లేచాడు ఇంద్రుడు. 'ఓ మహర్షీ ! నన్ను చూసి నువ్వు హేళన చేస్తున్నావు. ఏది అశాశ్వతం. నా రాజ్యమా? నా అధికారమా? అప్సరాంగనలా? ఇలాంటి అబద్ధాలు మళ్ళీ చెప్పావంటే వజ్రాయుధంతో నీతల తెగనరుకుతాను' అంటూ అక్కడ నుంచి వెళ్ళిపోయాడు.

ఇక్కడ ఇంద్రుడు బ్రహ్మవిద్యకు అధికారి కాదు. కాబట్టి ఇసుమంతైనా అతడి తలకెక్కలేదు. బ్రహ్మవిద్య.

## 15. యధార్థాన్ని నమ్మరు

అర్హత లేనివారికి ఎంత చెప్పినా తత్త్వం పట్టుబడదు. ఈశ్వరానుగ్రహము లేకపోతే, గతజన్మలలో చేసిన సుకృతము లేకపోతే ఎంతటివాడికైనా, ఎన్నిసార్లు విన్నా తత్త్వం తలకెక్కదు. సాధకుడు తానే పరబ్రహ్మాని అని నమ్మడు.

వేదాంత వాక్యాలు ఎన్నిసార్లు విన్నా తత్త్వం తలకెక్కదు. కంటికి కనుపించని విషయాలు అనేకం నమ్ముతాడు. కాని **'తానే పరబ్రహ్మ'** అనే మాట మాత్రం నమ్మడు. ఇదే అజ్ఞానము. మా జ్ఞాతి ఎవరో మరణించాడు. నాకు సూతకము వచ్చింది. పదిరోజుల మైల. ఈ విషయం చాలా ఖచ్చితంగా చెబుతాడు. సూతకము అనే

దాన్ని తాను చూసినట్లుగా చెబుతాడు. కాని తానే పరబ్రహ్మ అని మాత్రం నమ్మడు. రెండూ కంటికి కనుపించనివే. ఒక దాన్ని నమ్ముతాడు. ఒకదాన్ని నమ్మడు. ఒక రాయిని తెచ్చి ఇది లింగము. అంటే నమ్ముతాడు. ప్రతిరోజు అభిషేకాలు పూజలు చేస్తాడు. కాని నీవే పరబ్రహ్మవు అని ఎన్ని ప్రమాణాలు చూసినా నమ్మడు. లోకంలో అజ్ఞానులు చెప్పే మాటలు బాగా నచ్చుతాయి. కాని జ్ఞానులు చెప్పే మాట మాత్రం నమ్మడు. నీవే బ్రహ్మము అంటే ఒప్పుకోడు. మానవుడికి అజ్ఞానం జీర్ణించుకుపోయింది. లోకంలో దేన్నయినా నమ్ముతాడు కాని నీవే పరబ్రహ్మవు అంటే మాత్రం నమ్మడు.

లోకంలో సామాన్యులు, అజ్ఞానులు చెప్పే మాటలు తేలికగా నమ్ముతారు. అవి తలకెక్కుతాయి. వాటిమీద అత్యంతమైన నమ్మకం కుదురుతుంది. భగవంతుణ్ణి పూజిస్తే కోరికలు తీరతాయి. ఈ వ్రతం చేస్తే ఈ ఫలితం వస్తుంది. జపం చేస్తే దేవత పలుకుతుంది. హోమం చేస్తే ఫలితం త్వరగా వస్తుంది. ఇవి చాలా త్వరగా తలకెక్కుతాయి. ఈ వ్రతం చేస్తే సంతానం కలుగుతుంది అంటే, రెండవ ఆలోచన లేకుండా ఆ వ్రతం చేస్తాడు. ఈ హోమం చేస్తే నీకు బాగుంటుంది. ఈ దానం చేస్తే నీకు బాగుంటుంది అని మిడిమిడి జ్ఞానులు చెప్పినవన్నీ నమ్ముతారు. అలాగే చేస్తారు. కాని పండితులు, తత్త్వజ్ఞానులు అనేక సంవత్సరాలపాటు శ్రమించి, తపస్సు చేసి, శోధించి చెప్పిన మాటమాత్రం నమ్మరు. నీవే పరబ్రహ్మవు. అనే మాట మాత్రం నమ్మరు. వేదం ఎంత మొత్తుకున్నా వినిపించుకోరు. ఎన్ని ప్రమాణాలు చూపినా నమ్మరు. చరాచర జగత్తంతా అశాశ్వతము అని తెలిసినా నమ్మరు. యధార్థాన్ని నమ్మటానికి ఇష్టపడరు. ఈ విషయాన్నే ఇక్కడ వివరిస్తున్నారు.

**సూతకాది నిరాకారం సాకారమివ పశ్యతి ।**
**స్వస్మిన్ దృఢప్రత్యయేవ సూతక్యహమితి స్ఫుటమ్ ॥ 233**
**న తథా బోధితశ్శు త్యా ముహుస్త్వమసీత్యలం ।**
**విద్వానపి విజానాతి స్వతత్వం మహదద్భుతమ్ ॥ 234**

నాకు సూతకము వచ్చింది అని కనుపించని సూతకాన్ని నమ్ముతున్న సాధకుడు గురువు ఎంతగా బోధించినా నీవే పరబ్రహ్మవు అనే విషయాన్ని నమ్మలేదు.

మనకు సంబంధించిన వారు మరణిస్తే మనకు సూతకము మైల అంటారు. వారు జ్ఞాతులు అయితే ఈ సూతకము పదిరోజులు ఉంటుంది. ఇక్కడ విచిత్రం ఏమంటే సూతకమనేది ఒక ఆకారం కలిగి ఉండదు. దానికి రూపం లేదు. అయినప్పటికి సూతకము వచ్చింది అని కంటితో చూసినట్లు చెబుతున్నాడు. నమ్ముతున్నాడు. ఆశ్చర్యకరమైన విషయం ఏమంటే 'నీవే పరబ్రహ్మని' తత్త్వమసి అనే మాటను మాత్రం నమ్మలేకపోతున్నాడు. రెండుచోట్లా ఏమీ కనుపించదు. అయినప్పటికీ ఒకదాన్నే నమ్ముతున్నాడు. రెండవదాన్ని నమ్మడు. సూతకాన్నైతే నమ్ముతాడు కాని పరబ్రహ్మని మాత్రం నమ్మడు. తానే పరబ్రహ్మ అని ఒప్పుకోడు.

**సందర్శ్యార్ధ శిలాం శిలామయగృహే సాక్షాదయం శ్రీహరి**
**ర్భక్తేభ్యో వివిధాన్ ప్రయచ్ఛతి వరాన్ సంసేవ్యమానస్త్వితి**
**ఉక్తాం దేవలకస్య వాచమధికం విశ్వస్య సంసేవతే**
**త్యర్థం తత్వమసీతి వేదగదితం నో విశ్వసిత్యల్పధీః ॥ 235**

ఒకరాయిని తెచ్చి ఇది శివలింగము. దీన్ని పూజించు. అని చెబితే ప్రతిరోజు క్రమం తప్పకుండా అభిషేకం చేస్తాడు అలంకారం చేసి నివేదనలిస్తాడు. మరి 'తత్త్వమసి' అనే మహావాక్యాన్ని ప్రమాణపూర్వకంగా వివరించినా నమ్మడు.

కొండను పగులకొట్టి ఆ రాతి ముక్కలతో గుడికట్టి అందులో ఒక రాతిముక్కను 'శివలింగము' అని పెడితే అంతా నమ్ముతారు. దాన్ని పూజిస్తారు. దానిమీద విపరీతమై గౌరవం నమ్మకం ఏర్పడుతుంది. అదే వ్యక్తి సద్గురువు అనేక రకాలుగా బ్రహ్మను వివరించినా 'తత్త్వమసి' నీవే పరబ్రహ్మవు అనే మాట మాత్రం నమ్మడు. ఎంత అజ్ఞానమో చూడండి. ఒకటి రాయిముక్క. రెండవది పరబ్రహ్మ. ఇందులో రాతిముక్కని దేవుడు అని నమ్ముతాడు. కాని తానే పరబ్రహ్మ అని మాత్రం నమ్మడు.

**లౌకికే వచనే శ్రద్ధా శాస్త్రీయే చ యథా తథా ।**
**వాక్యే తత్వమసీత్యేవ వదన్త్యానశ్రుతేర్నృణామ్ ॥ 236**

మానవులకు అనాత్మ వాక్యాలయందు కలిగే శ్రద్ధ వేదవాక్యములందు కలగదు.

లోకంలో సామాన్యులు చెప్పే మాటలు, అజ్ఞానులు చెప్పే మాటలు బాగా నచ్చుతాయి. వాటిమీద నమ్మకం కుదురుతుంది. భగవంతుణ్ణి ప్రార్థిస్తే కోరికలు

తీరతాయి. జపం చేస్తే దేవత పలుకుతుంది. హోమం చేస్తే సత్వరసిద్ధి కలుగుతుంది. ఇలాంటి విషయాలు అప్రమాణమైనవి, అజ్ఞానానికి సంబంధించినవి చాలా బాగా తలకెక్కుతాయి. తత్వమసి నీవే పరబ్రహ్మవి. అని వేదం ఎంత మొత్తుకున్నా వినిపించుకోరు. ఎన్ని ప్రమాణాలు చూపినా నమ్మరు. ఈ జగత్తంతా అశాశ్వతము అని తెలిసినా, కళ్ళతో చూస్తున్నా నమ్మరు.

**నానాయోనిసహస్ర సంభవకరం నానావిధార్తి ప్రదం**
**కర్మాపాస్య హృది స్థితం సదనిశం చిత్తే ప్రసీదత్స్వయమ్ ।**
**రుధ్వానాత్మరతిం తదాత్మ కమతిం సంవర్ధ యేచ్ఛృణ్వతో**
**మన్వానస్య చ భానుభాజలదృఢే ద్వంద్వే వివేకా ద్ధృతమ్ ॥ 237**

ఎండమావులలో నీరున్నట్లు కనుపిస్తుంది. కాని నిజంగా లేదు. అలాగే జగత్తుకు కూడా వాస్తవరూపము ఏదీలేదు. జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే అనే విషయం వేదాంత వాక్యాలు విని మననం చేసిన వారికి తెలుస్తుంది. నామరూపాత్మకమైన జగత్తు అంతా భ్రాంతి అని, బ్రహ్మమే సత్యము నిత్యము శాశ్వతము అనే భావాన్ని వృద్ధి చేస్తుంది.

ఈ జగత్తంతా భ్రాంతివల్ల ఏర్పడినదే. భ్రాంతి ఉన్నంతవరకే అది ఉంటుంది. భ్రాంతి తీరగానే అదీ ఉండదు. జాగ్రదావస్థలో జగత్తు కళ్ళకు కనుపిస్తుంది. ఇంద్రియాలతో దాన్ని చూడవచ్చు. కాబట్టి అదంతా వాస్తవము అనిపిస్తుంది. ఒక కుక్కపిల్లను తెచ్చి పెంచుతున్నాం. అది మన చుట్టూ తిరుగుతుంది. అరుస్తుంది. తోకాడిస్తుంది. మారాం చేస్తుంది. మనవళ్ళో వచ్చి కూర్చుంటుంది. ఇదంతా ఇంద్రియాలతో మన అనుభవంలోకి వస్తోంది. అందుచేత జగత్తు వాస్తవం కాదు. అసత్యము అని భావించలేడు. విచిత్రమేమంటే అసత్యము అని చెబుతున్న జగత్తు కంటికి కనిపిస్తోంది. సత్యము అంటున్న బ్రహ్మము కంటికి కనుపించదు. కేవలం వేదాంత వాక్యాలను సమన్వయం చేసి ఈ విషయం నమ్మాలి. అలా నమ్మని వారికి అజ్ఞానపరమైన చిత్తవృత్తిని నిరోధించి బ్రహ్మాకారమైన చిత్తవృత్తిని పెంపొందింప చేస్తుంది.

**యో మోహయతి భూతాని స్నేహపాశానుబంధనైః ।**
**సర్గస్య రక్షణార్థాయ తస్మైమోహాత్మనే నమః ॥ 238**

మాయాకల్పితమైన జగత్తును కొంత కాలం రక్షించటానికి ప్రీతి అనే త్రాళ్ళతో జీవులను బంధించిన పరమేశ్వరునకు నమస్కారము.

జగత్తంతా మాయా కల్పితము. ఈ విషయం అనేకసార్లు చెప్పుకున్నాం. ఈ జగత్తులో జీవులకు బంధాలు ఏర్పడుతున్నాయి. ప్రారబ్ధకర్మ మూడు రకాలు

1. ఇచ్ఛా ప్రారబ్ధము – ఇష్టపూర్వకంగా, ఆనందంగా అనుభవించటము. భార్య పిల్లలు, మనవల పట్ల అభిమానము, ప్రేమ. ఇది చాలా ఆనందంగా అనుభవిస్తాడు మానవుడు.
2. అనిచ్ఛా ప్రారబ్ధము – ఇష్టం లేకుండానే అనుభవిస్తాడు. బలవంతంగా అనుభవించే కర్మ.
3. పరేచ్ఛాప్రారబ్ధము – ఇతరుల ఆనందం కోసం చేసే కర్మ. భార్య, పిల్లలు, ఇతరుల ఆనందం కోసం కొన్ని పనులు చేస్తాం.

వీటిలో ఇచ్ఛాప్రారబ్ధము చాలా ముఖ్యమైనది. మనవారి మీద, మన వస్తువుల మీద, మన దేహం మీద మనకుండే ప్రేమ. దీనివల్లనే ఈ జగత్తు నడుస్తోంది. ధృతరాష్ట్రుడు తన కుమారుడైన దుర్యోధనుని పట్ల అమితమైన ప్రేమవల్లనే అనేక ఘాతుకాలు సహించి చివరకు కురుక్షేత్ర యుద్ధానికి కూడా కారకుడైనాడు.

ఈ రకంగా మాయమయమైన జగత్తును కొంత కాలం రక్షించటం కోసం జీవులన్నింటినీ మోహింప చేస్తున్న అజ్ఞానరూపుడైన పరమేశ్వరునకు నమస్కారము.

**దృశ్య ప్రత్యయసంతత్యా బ్రహ్మతత్త్వం తిరోహితమ్ ।**

**తస్యా నిరానే బ్రహ్మైవ కేవలం పరిదృశ్యతే ॥ 239**

పరబ్రహ్మ యొక్క యధార్ధ స్వరూపము భ్రాంతిచే కల్పించబడిన దృశ్యమానమైన జగత్తుచే మరుగుపరచబడింది. ఆ భ్రాంతి తొలగినట్లైతే అద్వితీయమైన పరబ్రహ్మ కనుపిస్తుంది.

పరబ్రహ్మ యొక్క యధార్ధ స్వరూపము నిరాకారము నిర్గుణము. జగత్తులో ఉన్నది బ్రహ్మము ఒక్కటే. ఆయనకన్న వేరైనది ఏదీలేదు. కాని భ్రాంతివల్ల బ్రహ్మముకన్న భిన్నంగా దృశ్యమానమైన జగత్తు కల్పించబడింది. ఈ జగత్తులో అడవులు, కొండలు, ఎడారులు, నదులు, సముద్రాలు, పర్వతాలు 84 లక్షల జీవరాసి.

అందులో కూడా పశువులు, పక్షులు, క్రిమికీటకాలు, జంతువులు, మనుష్యులు. ఇలా అనేక రకాల జీవులు. వీటి సమూహాముతో పరబ్రహ్మ మరుగున పడిపోతోంది. భ్రాంతిచే కల్పించబడిన జగత్తే కనుపిస్తోంది. అంతేకాని పరబ్రహ్మము కనుపించటం లేదు. ఇప్పుడు చరాచర జగత్తంతా పరమేశ్వరమయము. జగత్తులో పరబ్రహ్మము తప్ప ఇంకేదీ లేదు. ఇదంతా భ్రాంతి అనే విషయాన్ని నిశ్చయించుకుని ఈ జగత్తే బ్రహ్మ అని తెలుసుకోగానే అప్పటివరకు కనుపించిన జగత్తు అదృశ్యమైపోయి అద్వితీయమైన పరబ్రహ్మమే కనుపిస్తుంది. **ఇదే సర్వవేదాంత సంగ్రహము.**

# 16. ఆత్మసాక్షాత్కారము

ఆత్మ సాక్షాత్కారము అంటే ఏమిటి ? అది ఎలా సిద్ధిస్తుంది ? ఈ విషయాలు **మహోపనిషత్తు**లో చెప్పబడ్డాయి.

సాధకుడు తనను తాను తెలుసుకోవటాన్నే స్వరూపజ్ఞానము అంటారు. సాధకుడు జగత్తంతా నాలోనే ఉన్నది. నేనే సాక్షాత్తూ పరబ్రహ్మను. సృష్టి స్థితి లయాలకు కారకుడను నేనే. ఈ జగత్తులో నేనుతప్ప వేరేఏదీలేదు. ఉన్నది ఒక్కటే అదేపరబ్రహ్మ. నేనే ఆపరబ్రహ్మ స్వరూపాన్ని జగత్తు అంతా నానుండే సృష్టించబడుతోంది. తిరిగి నాలోనే లయమవుతున్నది. నేనే పరమేశ్వరుడను అనే విషయాన్ని తెలుసుకోవటమే ఆత్మసాక్షాత్కారము అంటారు. ఈ విషయాన్ని అనుభవం ద్వారా తెలుసుకోవాలి.

ఆత్మసాక్షాత్కారము కావాలంటే మనోమాలిన్యము తొలగిపోవాలి. భ్రమలు నశించి పోవాలి. మోక్షద్వారానికి 1. శమము 2. విచారణ 3. సంతుష్టి 4. సజ్జన సాంగత్యము అనబడే నలుగురు ద్వారపాలకులు. వీరిలో ఏ ఒక్కరిని గట్టిగా పట్టుకున్నా సరే, మిగిలిన ముగ్గురూ వశమవుతారు. అందుకని వీరిలో ఏ ఒక్కరినైనా సర్వప్రయత్నాలచేత, సమస్తాన్ని త్యజించి అయినా సరే గట్టిగా ఆశ్రయించాలి. శాస్త్రాభ్యాసము, సజ్జన సంపర్కము, అనే తపస్సుచేత, దమముచేత ముందుగా సంసారబంధ విముక్తి కోసం ప్రజ్ఞను గట్టిగా అభివృద్ధి చెయ్యాలి. అభ్యాసమువల్ల శాస్త్రవాక్యము, స్వానుభవము, సద్గురువాక్యము అనే మూడూ సమన్వయముతో ఎవరి ఆత్మలో నిరంతరమూ దర్శనమిస్తాయో అతనికి పరమాత్మ దర్శనమిస్తాడు.

ప్రతిక్షణము సంకల్పము, ఆశ, విషయములు అనే ఈ మూడింటినీ పరిత్యజిస్తూ ఉన్నట్లైతే పరమపావనమైన అమనస్కస్థితి సాధించినవాడవుతాడు. మనస్సు అకర్తగా ఉండే తూష్ణీంస్థితియే సమాధి.

అదే కేవల భావస్థితి. అది శుభప్రదమైన ఉత్తమనిర్వాణము. మనస్సుతో సంకల్పాలను పరిత్యజించి, మూగవాడిలాగా, అంధుడిలాగా, జడునిలాగా సంచరించాలి. ఈ సర్వమూ ప్రశాంతము, అజము, ఏకము, ఆది మధ్యాంత రహితము. ప్రకాశస్వరూపము, దృశ్యభావములేని అనుభవరూపము. సమస్తము ఓంకారరూపము అని చెప్పటంకూడా భ్రాంతియే. ఈ సకల దృశ్య ప్రపంచమంతా చిద్వస్తువే. ఇక్కడ చైతన్యముతప్ప ఇంకొకటిలేదు అనే భావన చెయ్యాలి.

ఈ రకంగా సర్వదా జాగరూకతతో, నిండు మనసుతో, ఆత్మ అద్వితీయము అని తెలుసుకుని, జగత్కార్యాన్ని ఆరాధిస్తూ, తరంగాలు లేని సముద్రంలాగా నిశ్చలుడై ఉండాలి. వాసనలన్నింటికీ తృణానికి అగ్నివంటిదైన ఆత్మతత్త్వబోధయే సమాధి. అంతేకాని సమాధి అంటే తూష్ణీంస్థితి (మౌనస్థితి) కాదు. జాతిరత్నము ఇచ్ఛా శూన్యమైనప్పటికీ దానినుంచి కాంతులు వెదజల్లునట్లుగా, పరబ్రహ్మ తత్త్వము సత్తా మాత్రమైనప్పటికీ, బ్రహ్మభావముగా ఈ జగత్తు సర్వము ప్రకటితమవుతున్నది. ఆత్మయందు కర్తృత్వమున్నది. అయితే ఇచ్ఛ లేకుండా ఉంది కాబట్టి అకర్త, సన్నిధాన మాత్రమున కర్త కూడా అయి ఉన్నది. ఈ రకంగా పరస్పర విరోధంగల కర్తృత్వ రూపంలో ఉన్న ఈ చమత్కారము ఏ పరబ్రహ్మములో ఉన్నదో తెలుసుకుని, ఆ బ్రహ్మమునే ఆశ్రయించి, ఆ బ్రహ్మలోకంలోనే స్థిరంగా ఉండాలి. 'నేను నిత్యము అకర్తనై ఉన్నాను' అనే భావంతో ఒప్పునది, పరమామృతము అనబడేది, అయిన సమత్వమే జ్ఞానికి శేషించి మిగిలేది. సత్తా మాత్రస్థితిలో ఉన్నవారే మహాగుణవంతులు. వారి స్థితి శాశ్వతమైనది. మహోన్నతమైనది. అటువంటివాడు ఆకాశంలో పూర్ణచంద్రునిలాగా ప్రసన్నవదనముతో ఉంటాడు. అతడే శాంతి, సుఖము, సమభావము సిద్ధించిన మహాత్ముడు. వారు రాత్రిపూట పద్మంలాగా ఆపదలందు కృశించిపోరు. శిష్టాచారులు పోయే మార్గంలో సత్ప్రవర్తనతో సంతోషంగా ఉంటారు. అటువంటివారి దేహములు మైత్రి మొదలైన సద్గుణాలతో శోభిల్లుతుంటాయి. వారు సమత్వభావం గలవారై, సర్వదా సాధువృత్తి గలవారై, సమరసులై మార్పు లేకుండా ఉంటారు. నిర్మలాత్ములైన మహాత్ములు సముద్రంలాగా మర్యాదను అతిక్రమించకుండా

ఉంటారు. సూర్యునిలాగా నియమాలను విడిచిపెట్టకుండా ఉంటారు. నేను ఎవరిని? ఈ సంసార మాలిన్యము ఏ రకంగా వ్యాపించి ఉన్నది ? అని ప్రాజ్ఞుడు, సాధువు అయినమహాత్మునిసన్నిధిలో చక్కగా విచారణ చెయ్యాలి. నిషిద్ధకర్మలు చేయరాదు. ఆచార్యులతో కలిసి నివసించరాదు సర్వసంహార సంహర్త అయిన మృత్యువును హేళన చేయరాదు. ఈ దేహము ఎముకలు, మాంసము, రక్తము మొదలైన అశోభన పదార్థాల సమూహమే అనిగ్రహించి, దేహంమీద మమకారాన్ని విడిచిపెట్టి, సకల జీవులను ముత్యాల హారములోనిదారములాగా చిన్మాత్ర పరమాత్మగా దర్శించాలి.

ఇది కావాలి అనుకోవటం, ఇది వద్దు అని ద్వేషించటం ఇదే మనసుయొక్క స్వరూపము. ఆత్మ అటువంటి మనసుకన్న వేరుగా ఉన్నది. సద్గురువులు, శాస్త్రాలు చూపిన మార్గాన్ని అనుసరిస్తూ, స్వానుభవంలో "నేను చిద్ఘనుడైన బ్రహ్మనే అయి ఉన్నాను" అని తెలుసుకుని, శోకము లేనివాడు అశోకుడు కావాలి. జీవన్ముక్తుని దుఃఖాతీత శక్తి అద్భుతమైనది. పదునైన కత్తితో నరుకుతున్నప్పటికీ కలువపూలు పైన  చల్లిన రీతిగా భావిస్తాడు. అగ్నితో కాల్చేటప్పుడు మంచు బిందువులు మీద చల్లుతున్నట్లుగా భావిస్తాడు. నిప్పులలో త్రిప్పుతున్నప్పుడు మంచి గంధపు చల్లదనాన్ని అనుభవిస్తాడు. బాణవర్షము కురిపించినప్పుడు ఎండలో నిర్మించిన జలయంత్రం నీళ్ళు జల్లుతున్నది అనుకుంటాడు. శిరచ్ఛేదన చేసినప్పుడు సుఖముగా నిద్రిస్తాడు. వాగ్బంధనము చేస్తే మౌనముద్రగా భావిస్తాడు. శ్రోత్రాన్ని బంధిస్తే నిశ్శబ్దస్థితి అనుభవిస్తాడు. అటువంటి మహోన్నతమైనస్థితి ఉపేక్షతో ప్రాప్తించదు. దృఢవైరాగ్య సాధనతో అట్టి స్థితి సిద్ధిస్తుంది. గురువాక్యంచేత, వచ్చిన స్వానుభవముతో, పరిశుద్ధ బుద్ధితో నిరంతరము అభ్యాసం చెయ్యటంచేత ఆత్మను చక్కగా దర్శించవచ్చు. ఆత్మసాక్షాత్కారం  పొందవచ్చు.

దిగ్భ్రమ పూర్తిగా పోయినప్పటికీ, గతంలో లాగానే దిక్కులయొక్క జ్ఞానము ఉంటుంది. అలాగే బ్రహ్మజ్ఞానంవల్ల ఈ జగత్తులేదు అని తెలిసినా కూడా, జగత్తు కనిపిస్తూనే ఉంటుంది. అలా కనిపించినప్పటికీ జగత్తులేదనే భావించాలి. ఆత్మసాక్షాత్కారానికి సిరిసంపదలు సాయంచెయ్యలేవు. స్నేహితులు, బంధువులు, శరీరకష్టము, తీర్థాలుసేవించటము, సాయపడవు. కేవలము పరమాత్మలో తన్మయత్వం పొందే మనసుకలవాడే ఆత్మసాక్షాత్కారం పొందగలడు. దుఃఖాలు, తృష్ణ, భరించలేని చింతలు, అన్నీ మహాత్ములకు సూర్యకిరణములవల్ల అంధకారం

నశించినట్లుగా నశిస్తాయి. క్రూరజంతువులు, సౌమ్యజంతువులు అన్నీ శమముగల మహాత్ముని కన్నతల్లిని చేరునట్లుగా, విశ్వాసముతో సమీపిస్తాయి. మానవుడు శమమువల్ల పరమసుఖము అనుభవిస్తాడు. అటువంటి పరమసుఖము అమృతపానం వల్ల కూడా సిద్ధించదు. లక్ష్మీదేవి అనుగ్రహంతో లభించదు. శుభాశుభాలను విని, అనుభవించి, దర్శించి, తెలుసుకొని, సంతోషము, దుఃఖము పొందనివాడు శాంతస్వరూపుడు.

ఎవరి మనసైతే మరణకాలమందు, ఉత్సవసమయమందు, యుద్ధమందు కూడా వ్యాకులత చెందకుండా స్వచ్ఛంగా ఉంటుందో, అటువంటివాడు శాంతుడు. తపస్సంపన్నులయందు, బుద్ధిశాలులయందు, యజ్ఞములు చేసిన వారియందు, చక్రవర్తులయందు, బలవంతులయందు, సద్గుణ సంపన్నులయందు, శమము (అంతరింద్రియ నిగ్రహము) కలిగి ఉండేవాడే ప్రశస్తిని పొందుతాడు. సంతోషామృత పానంతో ఎవరు శాంతచిత్తులవుతారో, అట్టివారే పరమపదమును పొందుతారు. ప్రాప్తించని వాటికోసందుఃఖించనివాడు, ప్రాప్తించినవాటితో తృప్తి చెందేవాడు, భేదభావాలు లేనివాడు, సంతుష్టుడు. అంతఃపురంలో నివసించే సాధ్వి ఏ రకంగా లభించినవాటితో తృప్తిచెంది ఆనందంగా ఉంటుందో, అలాగే ప్రాప్తమైనవాటితో సంతృప్తి చెందేవాడు జీవన్ముక్తునిస్థితి పొందుతాడు. అదే స్వస్వరూపానందము.

ప్రాజ్ఞుడు శాస్త్రాలను, దేశకాలమానాలను అనుసరించి, ఏది సుఖమో, అది ఎలా దొరుకుతుందో, విచారిస్తుంటాడు. ఈ రకంగా ఆత్మలో విశ్రాంతి దొరికేదాకా మోక్షపదానికి దారి వెతుకుతూ ఉండాలి. సంసారార్ణవమునుండి బయటపడి, తురీయస్థితిలో విశ్రాంతి పొందేవాడు గృహస్తుగాని, సన్యాసిగాని, జీవించి ఉన్నా, మరణించినా అతడు కృతకృత్యుడు. అటువంటి జీవన్ముక్తుడు కర్మలు చేసినందువల్ల ప్రయోజనంలేదు. చెయ్యకపోతే అపకారంలేదు. మందరపర్వత రహితుడు, క్షోభిరహితుడు అయిన క్షీరసాగరంలాగా ఆత్మస్థితుడు ఆనందంగానే ఉంటాడు. దృశ్యపదార్థాలన్నీ పరమాత్మగానే దర్శించే జ్ఞానము కలిగినప్పుడు, దేశకాలవస్తు పరిచ్ఛేద, శూన్యము, శుద్ధ చిద్రూపము అయిన స్వస్వరూపము ప్రకాశిస్తుంది. అదే ఆత్మసాక్షాత్కారము. ఈ రకంగా నువ్వు భావించిన రూపంలో ఆత్మ ప్రత్యక్షమవుతుంది. స్తావరజంగమాత్మకమైన సమస్త దృశ్య ప్రపంచము, గాఢనిద్రలో స్వప్నంలాగా,

ప్రళయకాలంలో నశించిపోతుంది. ఆత్మ, ఋతము, సత్యము, పరబ్రహ్మము అనే పదాలు పరబ్రహ్మకు వ్యవహారసంజ్ఞలు.

కంకణము అంటే బంగారమే కాని ఇంకొకటి కాదు.కడియము అన్నా బంగారమే. అలాగే ఈ జగత్తు అంటే పరమాత్మయే అవుతుంది. జగత్తే బ్రహ్మ, బ్రహ్మయే జగత్తు. ఆ చిత్ బ్రహ్మనుండే ఈ జగత్తుగా కనిపించే ఇంద్రజాలము విస్తారముగా ఉన్నది. దృశ్యముయొక్క స్థితే ద్రష్ట అయిన ఆత్మకు బంధము. ద్రష్ట (చూసేవాడు) దృశ్యపదార్థములవలన బద్ధుడవుతున్నాడు. దృశ్యముయొక్క అభావముతో జీవన్ముక్తుడవుతున్నాడు. నేను, నీవు అనే బాధలతో ఉన్నదే జగత్తు. మనస్సు వల్లనే జగత్తు అనే ఇంద్రజాలము విస్తరించి ఉన్నది. ఈ మనస్సు అనే కల్పితభావము ఎంతకాలం ఉంటుందో, అంతకాలం మోక్షంరాదు. స్వయంభువయిన పరమేశ్వరుడే ఈ జగత్తును సృష్టించాడు. అతనియొక్క మానసిక సృష్టియే ఈ జగత్తు. అందుచేతనే నామరూపాలుగల దృశ్యమాన జగత్తంతా మనస్సే అయి ఉన్నది. మనస్సులేనప్పుడు ఈ జగత్తులేదు. మనస్సు అనేది హృదయంయొక్క లోపలగాని, బయటగాని, ఇంకోచోటగాని లేదు. దానికి సత్యమైన ఉనికిలేదు. విషయ సంకల్పమే మనస్సు. సంకల్పమే మనస్సుయొక్క రూపము. ఎక్కడ మనస్సుంటుందో అక్కడ సంకల్పముంటుంది. సంకల్పము, మనసూ రెండూ వేరుకాదు. సంకల్పాలన్నీ నశించినప్పుడు పరమాత్మస్వరూపమే మిగులుతుంది.

నేను, నువ్వు, జగత్తు మొదలైన దృశ్యభ్రమ శమింపగా, దృశ్యమంతా అసత్తు కాగా, మిగిలిన స్థితే కైవల్యము. అదే ఆత్మస్థితి. మహాప్రళయం సమయంలో సకల దృశ్యజగత్తు సత్తాశూన్యమై పోతుంది. అప్పుడు సృష్టికి పూర్వములో ఉన్న శాంతి రూపమైన అద్వితీయ పరమాత్మే మిగులుతుంది. ఈ సృష్టికి పూర్వము ఏదిఉన్నదోఅదే ప్రళయము. అటువంటి ఆత్మభానుడు ఎప్పుడూ అస్తమించడు. సర్వదా తేజోవంతుడై ఉంటాడు. ఆ పరమాత్మ అజుడు (జన్మలేనివాడు) దేవుడు, సమస్త దోషరహితుడు. అతడే సర్వకర్త. సర్వస్వరూపుడు. ఎక్కడినుండి వాక్కులు వెనక్కి తిరిగి వస్తుంటాయో, దేనిని ముక్తపురుషులు తెలుసుకుంటున్నారో, దాన్నే ఆత్మ అంటారు. ఆకాశములు మూడున్నాయి. 1. చిత్తాకాశము 2. చిదాకాశము 3. దహరాకాశము. వీటిలో చిదాకాశము అత్యంత సూక్ష్మమైనది. మనసు ఒకచోటినుండి ఇంకొక చోటికి

పోయేటప్పుడు, ఆ మధ్య సమయంలో రెప్పపాటు కాలంలో అనుభవమయ్యే ఆనందమే చిదాకాశము. రెండు దృశ్యముల మధ్యనున్న ఉనికియే చిదాకాశము.

సర్వసంకల్పాలు త్రోసిపుచ్చినస్థితిలో స్థిరముగా ఉన్నప్పుడు సర్వాత్మక శాంతపదము పొందగలడు. ఔదార్యము, సౌందర్యము, వైరాగ్యములతో కూడిన పరమపద ఆనందస్థితియే సమాధి. దృశ్యము లేనే లేదు అనే భావనతో రాగద్వేషాలు నశిస్తాయి. ఆ సమయంలో మహత్తరమైన స్వరూపానందం కలుగుతుంది. అటువంటి స్థితియే సమాధి. దృశ్యము లేదనే భావనే నిజమైన జ్ఞానము. అదే కేవలభావము. చిదాత్మక విజ్ఞేయము. అదే కైవల్యస్థితి. అంతకన్న మిగిలినదంతా మిథ్య, మదించిన ఏనుగు ఆవగింజలో బంధింపబడినది. చిన్నదైన చెట్టు తొర్రలో ఒక దోమ సింహాల గుంపుతో యుద్ధం చేసింది. తామరపూసలో మేరుపర్వతము పెట్టబడినది. ఆ తామరపూసను తుమ్మెద మ్రింగివేసింది. ఇవన్నీ అసంభవాలు. భ్రమతో కూడిన వాక్యాలు. ఈజగత్తుకూడా అలాంటిదే. ఈ జగత్తుకు అస్థిత్వము లేదు. రాగద్వేషాలతో దూషితమైన చిత్తమే సంసారము. ఆ చిత్తము ఎప్పుడు రాగద్వేష రహితం అవుతుందో, అప్పుడు సంసారం నివృత్తి జరిగి మోక్షం సిద్ధిస్తుంది.

మనసుతో భావింపబడినవాడై జీవుడు దేహవాసన కలిగి ఉంటాడు. దేహవాసన పోయిన తరువాత, అతడు దేహధర్మాలకు అంటుకోడు. మనస్సుకు గొప్పశక్తి ఉన్నది. అది ఒకకల్పము కాలాన్ని ఒకక్షణంగా చేస్తుంది. అలాగే ఒక్కక్షణకాలాన్ని కల్పంగా చేస్తుంది. ఈ సంసారమంతా మనోవిలాసం మాత్రమే. దుష్ప్రవర్తన విడిచి పెట్టనివాడు, అశాంతుడు, కేవలము ప్రజ్ఞాబలంతో ఆత్మసాక్షాత్కారము పొందలేడు. ద్వంద్వరహితమై, నిర్గుణమై, సత్యమై, చిద్ఘనమైనట్టి బ్రహ్మానందాన్ని తన ఆత్మరూపంగా తెలుసుకున్నవాడు ఎన్నటికీ భయపడడు. ఉత్తమోత్తమమైనది, మహత్తరమైనది, తేజోమయమైనది, కళ్యాణకారకమైనది, శాశ్వతమైనది, సర్వజ్ఞము, పురాణము, సనాతనము, సకల దేవతలచేత ఆరాధింపబడునది అయిన సర్వేశ్వర రూపాన్ని గురించి తెలుసుకున్నవాడు దేనికీ భయపడడు. అతడికి భయంలేదు.

'మమ', 'నమమ', ఈ రెండు పదాలే బంధమోక్షాలకు హేతువులు. మమ అనుకొన్న జీవుడు బద్ధుడవుతాడు. నమమ అనుకున్నవాడు ముక్తుడవుతాడు. చేతనాచేతనాత్మకమగు ఈ జగత్తు జీవేశ్వరాది రూపంలో ప్రకాశిస్తున్నది. ఈ సృష్టి

అంతా పరమేశ్వర సంకల్పమైనది. జాగ్రదవస్థ నుండి మోక్షము వచ్చేదాకా, సంసారము జీవకల్పితమై ఉన్నది. నాచికేతాగ్ని మొదలు యోగమువరకు ఉన్న మతాలన్నీ ఈశ్వరుని విషయంలో భ్రాంతిని ఆశ్రయించి ఉన్నాయి. పొరపాటు పడుతున్నాయి. చార్వాకుల నుండి, సాంఖ్యులదాకా జీవభ్రాంతిని ఆశ్రయించి ఉన్నాయి. అందువల్ల ముముక్షువులు జీవేశ్వర సిద్ధాంతంలో బుద్ధిని ప్రవేశింపనీయరాదు. నిశ్చలబుద్ధితో బ్రహ్మతత్త్వ విచారణ చెయ్యాలి. అన్వయ వ్యతిరేక సిద్ధాంతాలద్వారా ఈతడు సాక్షాత్తు జ్ఞాని. అతడే శివుడు. అతడే హరి, అతడే బ్రహ్మ. సద్గురువు యొక్క కరుణ లేకపోతే విషయత్యాగం చాలాకష్టం. తత్త్వదర్శనము దుర్లభము. సహజావస్థ మరీ దుర్లభము.

ఈశ్వరుడే ఈ జగత్తును సృష్టించాడు అనే జ్ఞానంగలవాడు, సర్వకర్మలను త్యాగం చేసినవాడు, అయిన యోగికి ఆత్మస్థితి సహజంగానే కలుగుతుంది. మానవుడు ఈ జగత్తులో భేదభావం గనక దర్శించినట్లైతే, అతడికి భయం కలుగుతుంది. సచ్చిదానందమనే జ్ఞాననేత్రము సర్వవ్యాపకమైనది. ప్రకాశించే సూర్యుణ్ణి గ్రుడ్డివాడు చూడలేడు. అలాగే అజ్ఞాని సచ్చిదానందాన్ని దర్శించలేడు. ప్రజ్ఞానమే బ్రహ్మ. ఆ బ్రహ్మము సత్యజ్ఞానాది లక్షణాలు గలది. అటువంటి బ్రహ్మను గూర్చిన జ్ఞానంవల్లనే మానవుడు అమృతుడవుతున్నాడు. పరాపర రూపమైన పరబ్రహ్మసాక్షాత్కారమైన తరువాత, మానవుని యొక్క హృదయగ్రంథులు విడిపోతాయి. సర్వసంశయాలు నశించిపోతాయి. అన్ని కర్మలు క్షీణిస్తాయి. కాబట్టి అనాత్మ అనే సంకల్పాన్ని పరిత్యజించాలి. జగత్తు విషయంలో నిర్వికారుడై ఉండాలి. అంతర్ముఖుడై కేవలము సంవిన్మాత్రపరుడై (అన్నీ తెలిసినవాడవై) ఉండాలి. భ్రమవల్ల ఎడారులలో నీటిగుంటలు కనిపిస్తాయి. కాని అవి మృగతృష్ణలు. అలాగే జాగ్రస్వప్నసుషుప్తులకు సంబంధించిన జగత్తంతా ఆత్మస్వరూపం దక్క వేరుకాదు.

లక్ష్యా లక్ష్యబుద్ధులను త్యజించి కేవలము ఆత్మమాత్రుడుగా ఎవడు ఉంటాడో, అతడు సాక్షాత్తూ ఈశ్వరుడే అయి ఉన్నాడు. అతడే ఉత్తముడైన బ్రహ్మజ్ఞాని. సర్వానికీ అధిష్ఠానము పరబ్రహ్మయే. ఉపమానము లేనిది, అవాఙ్మానస గోచరము, నిత్యము, సర్వగతము, సూక్ష్మాతిసూక్ష్మము, అవ్యయము అయిఉన్నది. ఈజగత్తు సర్వశక్తి మయుడగు పరమేశ్వరుని విలాసముగా ఉన్నది. సంశయము, అసంశయాలతో,

ఈ సంసారము శాంతి పొందుతున్నది. మనోవ్యాధికి చికిత్స కోసం ఒక్కటే ఉపాయం ఉన్నది. ఏ వస్తువుమీద ప్రీతిఎక్కువ ఉంటుందో, దాన్ని త్యజిస్తూ వెళ్ళాలి. అప్పుడే మోక్షం సిద్ధిస్తుంది. స్వాధీనములో ఉన్నది. ఏకాంతహితమైనది, అయిన ఇష్టమైన వస్తువును పరిత్యజించటానికి ఇష్టపడనివాడు కీటకంతో సమానము.

అసంకల్పము అనే శస్త్రంతో ఈ చిత్తాన్ని ఛేదించాలి. అప్పుడే స్వరూపము, సర్వగతము, శాంతము, అయిన పరబ్రహ్మ ప్రాప్తిస్తుంది. లోకవిషయభావనను పూర్తిగా విడిచి పెట్టెయ్యాలి. పరబ్రహ్మను గురించే ఆలోచించాలి. మనోనిగ్రహము కలిగి ఉండాలి. శాంతమనస్కుడై ఉండాలి. మనస్సు మ్రింగివేయబడిన స్థితి అదే అమనస్క స్థితి. అదే బ్రహ్మపదము. పరమమయిన పురుషయత్నాన్ని ఆశ్రయించి, చిత్తాన్ని అచిత్తముగా చేసి, హృదయాకాశంలో ఆత్మను ధ్యానించాలి. జ్ఞానము అనే చక్రాయుధంతో మనస్సును సంకోచం లేకుండా ఛేదించాలి. అప్పుడు కోరికల రూపంలో ఉన్న శత్రువులు నిన్ను బంధించలేరు. నేను నాది అనే సంకల్పమే మనస్సు. అటువంటి సంకల్పాలు లేకుండా చేసి, నిస్సంకల్పము అనే కొడవలితో మనస్సును ఛేదించాలి. శరత్కాలంలో ఆకాశంలో పట్టిన మేఘాలు, వేగంగా వీచిన గాలులవల్ల చిన్నాభిన్నమై పోయినట్లుగా, చక్కని ఆత్మవిచారంతో మనస్సు అమనస్సు కావాలి. అదే మనస్సు అంతర్ధానమైన స్థితి. అమనస్కము.

ప్రళయకాల పవనాలు వీచినప్పటికీ, సముద్రాలన్నీ ఏకమైనప్పటికీ, ద్వాదశాదిత్యులు ఒక్కసారే ప్రకాశించినప్పటికీ, మనోనాశనమైన వారికి ఏ విధమైన చింత ఉండదు. మోక్షసామ్రాజ్యము సంకల్ప రాహిత్యం చేతనే సిద్ధిస్తుంది. మనసు ఎప్పుడూ చలనం లేకుండా ఉండదు. అగ్నికి ఉష్ణము ధర్మములాగానే మనసుకు చంచలత్త్వము ధర్మము. చిత్తాన్ని ఆధారంగా చేసుకుని ఉన్నది, చంచలముగా ఉన్నది, అయిన స్పందనశక్తియే మనోసంబంధమైన చిత్తశక్తి. ఈ జగదాడంబరము అంతా మనసుకు సంబంధించినదే. చలనరహితమైన మనస్సు అమృతమయము. అది తపస్సు, దాన్నే మోక్షము అంటారు. మనస్సుయొక్క చంచలత్వమే వాసనారూప మయిన అవిద్య. దీన్నివిచారణద్వారా నశించిపచెయ్యాలి.

పురుష ప్రయత్నాన్ని ఆశ్రయించి, శుద్ధచిత్తముతో మలినచిత్తాన్ని జయించాలి. మనసును నిగ్రహించాలంటే దానికి మనస్సే సమర్ధవంతమైనది. రాజును

జయించటానికి రాజేసమర్థుడు. ఇంకొకడు సమర్థుడు కాదు. సంసారమనే సాగరంలో చిక్కి, ఆశ అనే గ్రహంతో పట్టుకోబడిన వాడికి అతనియొక్క శుద్ధ మనస్సే నావగా ఉన్నది. వివేకమైన మనస్సుతో బంధరూపంలో ఉన్న పాశాన్ని ఖండించి, సంసార సాగరం నుంచి నిన్ను నువ్వే రక్షించుకోవాలి. సాధకుడు తనను తానే ఉద్ధరించుకోవాలి. ఇతరులెవరూ కాపాడలేరు. తనలోపల జనించిన ఇష్టాన్ని ప్రాజ్ఞుడు నశింపచేసుకోవాలి. దానితో అవిద్య నశిస్తుంది. భోగవాసనను విడిచి, భేదవాసనను త్యజించి, భావాభావములను పరిత్యజించి, నిర్వికల్పుడైనవాడు సుఖిస్తాడు. అనుభవానికివచ్చే వేటికీ నీలోపల అవకాశ మియ్యవద్దు. ఇదే మనోనాశనము. అవిద్యానాశనము.

**దృశ్యములందు విశ్వాసము ప్రీతి విడిచిపెట్టి ఉండటమే మోక్షము. దృశ్యములందు విశ్వాసముప్రీతి కలిగి ఉండటమే దుఃఖము.** అవిద్య అనేది లేనేలేదు. అయినప్పటికీ అష్టప్రజ్ఞలయందు అవిద్య కనిపిస్తోంది. నామమాత్రంగా ఉన్న ఈ అవిద్య సమ్యక్‌ప్రజ్ఞగలవారియందు అసలుండదు. సమ్యక్‌ప్రజ్ఞ సిద్ధించేదాకా ఈ అవిద్య అమాయకుడైన జీవిని తనవెంట తీసుకుపోయి దుఃఖాలనే ముళ్ళపొదలలో పడవేస్తుంది. సమ్యక్‌ప్రజ్ఞ గలవారిని ఈ అవిద్య ఏమీ చెయ్యలేదు. మోహకారకమైన కోరికలున్నంతవరకూ, ఈ అవిద్య వెంటాడుతూనే ఉంటుంది. పరతత్త్వాన్ని అవలోకించిన వెంటనే ఈ అవిద్య నాశనమవుతుంది. సర్వగతమైన జ్ఞానాన్ని దర్శించినట్లైతే అవిద్య తనకు తానే నశించిపోతుంది. అవిద్య నశిస్తే ఆత్మసాక్షాత్కారము జరుగుతుంది. ఆ స్థితి రావాలంటే సంకల్పాలు పూర్తిగా నశించాలి.

చిత్తాకాశములో వాసనారూపంలో ఉన్న రాత్రి నశించిన తరువాత, చిదాదిత్య ప్రకాశమువల్ల చంద్రకళ (జీవభావము) వెలవెలపోతున్నది. విషయములు అనే దృశ్యసంబంధాలు లేనట్టిది, సామాన్యరూపంలో సర్వవ్యాపకము, అనిర్వచనీయము అయిన చైతన్యమే ఆత్మ. అదే పరమేశ్వరుడు. ఈ సమస్తము నిత్యమై, సత్యమై, అక్షయమైన బ్రహ్మమే అయి ఉన్నది. మనస్సు అనే పేరుగల కల్పన ఇంకొకటి ఏదీలేదు. ఈ జగత్తులో ఏదీ జన్మించటంలేదు. మరణించటంలేదు. అందువల్ల షడ్భావవికారాలు కనిపిస్తున్న వీటన్నింటికీ అస్థిత్వము కొంచెముకూడా లేదు. ఏకముగా ఉన్నది, తేజోరూపము, స్వరూపము, సర్వసామ్రాజ్యము, అవ్యయము,

చైతన్యానుపాతరహితము, చిన్మాత్రము అయిన బ్రహ్మమే ఇక్కడ ఉన్నది. అటువంటి నిత్యమైన వ్యాపకముగాఉన్న, శుద్ధమైన, చిన్మాత్రముగాఉన్న, నిరుపద్రవమైన శాంతశమ పూర్ణ నిర్వికారమైన చిదాత్మయందు మనసు విహరిస్తుంది. మనసు తన స్వభావానికి అనుగుణ్యమైన దానిని కల్పించుకుని, అన్ని దిక్కులకు పరుగుపెడుతుంది. ఎప్పుడూ మననము చేస్తుంది కాబట్టే దీన్ని మనస్సు అంటారు. ఈ మనస్సు సంకల్పము చేతనే సిద్ధిస్తుంది.

'నేను బ్రహ్మముకాదు' అనే ఆలోచనతో మనసు బంధింపబడుతున్నది. సర్వమూ బ్రహ్మమయమే అనే దృఢసంకల్పంతో మనస్సు విముక్తమవుతుంది. నేను కృశించినవాడను. దుఃఖించినవాడను. కోరికలతో బంధింపబడినవాడను, కాలు చేతులు గలవాడను అనే భావంతో వ్యవహరిస్తూ జీవుడు బద్ధుడవుతున్నాడు. నేను దుఃఖినికాదు. నాకు దేహములేదు. బంధములేదు. అనే భావాలతో జీవి విముక్తుడవుతున్నాడు. నేను మాంసమును కాను. ఎముకలు కాను. దేహముకన్న వేరైనవాడను, నేను పరతత్త్వమును అని అంతరంగంలో నిశ్చయించుకున్నవాడు అవిద్యారహితుడై ఆత్మసాక్షాత్కారము పొందుతాడు. అనాత్మయందు ఆత్మభావన చెయ్యటంచేత అవిద్య కల్పించబడింది. పురుషప్రయత్నం తీవ్రం చేసి, భోగేచ్ఛను దూరంగా వదలి, నిర్వికల్పుడై, సుఖవంతుడు కావాలి. ఈ రకంగా అమనస్కుడైన జ్ఞానికే ఆత్మసాక్షాత్కారం కలుగుతుంది.

శాశ్వతమైన ఆత్మకి అశాశ్వతమైన శరీరము ఆవాసమవుతున్నది.

ఇప్పుడు చిన్న అనుమానం వస్తుంది. "నాశనమయ్యే శరీరంలో నాశనం కాని ఆత్మ ఎలా ఉంటుంది?" దీనికి సమాధానం చూడండి.

పాలు అందరూ ఉపయోగించేవే. కాని నిల్వ ఉండవు. ఒకరోజు కూడా పూర్తిగా ఉండవు. విరిగిపోతాయి. అదే పాలలో తోడు వేస్తే పెరుగవుతుంది. ఈ పెరుగు ఇంకొక రోజు వరకు నిల్వ ఉంటుంది. తరువాత రోజుకు పాడవుతుంది. పెరుగును చిలికితే వెన్న వస్తుంది. ఈ వెన్న ఇంకొక రోజు వరకు నిల్వ ఉంటుంది. తరువాత అదికూడా పాడవుతుంది. ఆ వెన్నను కరిగిస్తే 'నెయ్యి' అవుతుంది. ఈ నెయ్యి పాడు కాదు. జాగ్రత్తగా పరిశీలిస్తే ఒకరోజులో పాడయ్యే పాలలో ఎన్నటికీ పాడు కాని నెయ్యి దాగి ఉన్నది. అలాగే అశాశ్వతమైన ఈ శరీరంలో శాశ్వతమైన ఆత్మ దాగి ఉన్నది. ఇప్పుడు

| | | |
|---|---|---|
| మానవ శరీరమే | – | పాలు |
| కీర్తన | – | పెరుగు |
| సేవ | – | వెన్న |
| సాధన | – | నెయ్యి |

మానవ శరీరాన్ని కఠోరమైన నియమ నిష్ఠలతో లొంగదీసి మనసును అదుపులో ఉంచి సాధన చేస్తే ఆత్మసాక్షాత్కారమవుతుంది.

**అవిద్యయా కల్పితనామరూప వ్యపోహ ఏవ ప్రయతేత విద్వాన్**

**న బ్రహ్మబోధే తదపోహమాత్రా ద్బ్రహ్మైవభాతి స్వయమేవ సాక్షాత్ ॥240**

జ్ఞానియైనవాడు భ్రాంతిచేత కల్పించబడిన జగత్తు వినాశనం కోసం ప్రయత్నించాలి. అంతేకాని బ్రహ్మమును తెలుసుకోవటానికి ప్రయత్నించనక్కరలేదు. ఈ జగత్తు నాశనమైతే ఆ బ్రహ్మము ఏ ప్రయత్నం లేకుండానే ప్రకాశిస్తుంది.

మోక్షం పొందాలి అనుకునే జ్ఞాని నామరూపాత్మకమైన దృశ్యమానమైన జగత్తును నాశనం చెయ్యటానికి ప్రయత్నం చెయ్యాలి. అంతేకాని పరబ్రహ్మ కోసం ఎక్కడా వెతకవలసిన పనిలేదు. ఈ జగత్తు యొక్క భ్రాంతి తొలగిపోయినట్లైతే అప్పుడు ఏ ప్రయత్నము లేకుండానే బ్రహ్మము ప్రకాశిస్తుంది. కాబట్టి బ్రహ్మ సాక్షాత్కారానికి ఏ ప్రయత్నము అవసరం లేదు.

**శైవాలమాత్రాపనయే పిపాసోః కార్యః ప్రయత్నో నతు తోయసిద్ధౌ ।**

**తస్మిన్నపేతే స్వయమేవ తోయం శుద్ధం ప్రసన్నం విషయత్వమేతి ॥241**

దాహం వేసిన వాడికి నీటిపైన ఉన్న నాచును తొలగిస్తే చాలు మంచినీరు అందుతుంది. అంతేకాని నీటిని ఉత్పత్తి చేయవలసిన అవసరం లేదు.

ఇందాక చెప్పిన దానికి ఉదాహరణ ఇస్తున్నారు. ఒక బాటసారి నడిచి వెడుతున్నాడు. ఎండ మండిపోతుంది. గొంతు ఎండిపోతోంది. ఎక్కడైనా కాసిని నీరు దొరికితే బాగుండు అనుకుంటున్నాడు నడుస్తున్నాడు. ఇంతలో దారి ప్రక్కనే ఒక చెరువు కనుపించింది. దానినిండా నీరున్నది కాని నాచు ఆ నీటిని కమ్మేసి ఉంది. అతడు ఆ చెరువులోకి దిగి నీటిపై ఉన్న నాచు, గుర్రపుడెక్క ఆకు ఇత్యాదులు తొలగించాడు. అంతే నిర్మలమైన నీరు కనుపించింది. దాహం తీర్చుకున్నాడు.

చూడండి దాహం తీరాలి. నీరు కావాలి అంటే నీటిమీద ఉన్న నాచును తొలగిస్తే సరిపోయింది. అంతేగాని నీటిని క్రొత్తగా ఉత్పత్తి చేయనవసరంలేదు. అలాగే పరబ్రహ్మ సాక్షాత్కారం కావాలంటే బ్రహ్మము కోసం వెతకనవసరం లేదు. అజ్ఞానంతో కల్పించబడిన దృశ్యాన్ని నాశనం చేస్తే చాలు. **ఆత్మసాక్షాత్కారమవుతుంది.**

**ఘటస్త దం త స్సలిలం తదగ్రే స్థితం శరావం చ తదంతరంబు ।**

**ఉష్ణత్వమగ్నేర్వ్యహతి ప్రసాదాత్ తథాహమాదిశ్చ సతః ప్రసాదాత్ ॥242**

నీటితో నింపిన కుండ, దానిపైన ముంత అందులో నీరు ఉన్నాయి. కుండ క్రింద వేడిచేస్తే ఆ వేడివల్ల కుండలోని నీరు ముంతలోని నీరుకూడా వేడెక్కుతుంది. అలాగే అహంకార మమకారాలన్నీ సత్యజ్ఞానానంద స్వరూపుడయిన బ్రహ్మముయొక్క అనుగ్రహం వల్ల ఆయన ధర్మాలను పొందుతున్నాయి.

పరబ్రహ్మ యొక్క అనుగ్రహం వల్ల ఆయన ధర్మాలను అహంకార మమకారాదులు పొందుతున్నాయి. అనటానికి చిన్న ఉదాహరణ చూపుతున్నారు. ఒక కుండను తెచ్చి నీటితో నింపాం. ఆ కుండ మీద ఒక ముంత పెట్టి అందులో నీరు పోశాం. ఇప్పుడు ఆ కుండను పొయ్యిమీద పెట్టి క్రింద వేడి చేశాం. ఈ వేడివల్ల కుండలోని నీరే గాక ముంతలోని నీరు కూడా వేడెక్కింది. అలాగే పరమేశ్వరుడి అనుగ్రహం వల్ల ఆయన ధర్మాలయిన సత్యజ్ఞానానందాలు అహంకార మమకారాలను కూడా చేరుతున్నాయి. సత్యజ్ఞాన ఆనందాలు కలవిగా తోచుచున్నాయి.

**దేహేంద్రియప్రాణ మనోధ్యహంకృతేః**

**బ్రహ్మప్రసాదాత్ఖలు చేతన్వతమ్ ।**

**సత్తాభిదానం చ న తు క్వచిత్స్వయం**

**జడాత్మకా భాంత్యహమాదయోఽమీ ॥ 243**

దేహేంద్రియాలు బుద్ధి, అహంకారాలకు జ్ఞానరూపము ఆ పరబ్రహ్మ అనుగ్రహం వలన కలుగుతోంది. అంతేకాని స్వతహాగా అవి జడములే.

ఇక్కడ ఇంకొక విషయం చూడండి. స్థూలదేహం, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము ఇవన్నీ జడపదార్థాలే.

అయితే వీటికి చేతనత్వము సత్యజ్ఞానానంద స్వరూపుడైన పరబ్రహ్మ అనుగ్రహం వల్ల కలుగుతోంది. ఉపనిషద్వాక్యాలను చూడండి. **కేనోపనిషత్తు**లో చెబుతున్నారు.

**యద్వాచానభ్యుదితం యేన నాగభ్యుద్యతే**

**తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥**

ఏ ఆత్మ వాగింద్రియముచేత గ్రహించబడదో, దేని శక్తిచేత వాగింద్రియం పని చేస్తోందో అదే ఆత్మ. అంటే కంటికి చూసే శక్తిని చైతన్యాన్నిచ్చేది ఆత్మ. చెవికి వినికిడి శక్తినిచ్చేది ఆత్మ. నోటికి మాటాడే శక్తినిచ్చేది ఆత్మ. ముక్కుకు వాసన చూసే శక్తినిచ్చేది ఆత్మ. మనసుకు ఆలోచించే శక్తిని, బుద్ధికి నిశ్చయించే శక్తిని ఇచ్చేది ఆత్మ. స్వతహాగా ఇవన్నీ జడాలే. కాని వీటికి చైతన్యము ఆత్మవల్లనే వస్తుంది.

**నిత్యంసదానంద రసానుభూతి**

**మభిన్న వృత్త్యాత్మని కుర్వతాం సతామ్ ।**

**ఇంద్రస్య లోకేన కిమబ్దయోనేః**

**కిం వా వహరేః కిం ను శివస్య సాక్షాత్ ॥ 244**

తానే పరబ్రహ్మ అని తెలుసుకుని నిరంతరము బ్రహ్మానందం పొందేవారికి బ్రహ్మలోకము, వైకుంఠము, కైలాసములతో పనిలేదు.

జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే. అంతకు తప్ప ఇంకేదీలేదు. నేను కూడా పరబ్రహ్మ స్వరూపాన్నే అని భావన చేసిన మహానుభావుడు నిరంతరము బ్రహ్మానందంలో మునిగి తేలుతుంటాడు. వేదపండితులు, యజ్ఞకర్మలు చేసినవారు బ్రహ్మలోకం చేరతారు. వైష్ణయాఆగాలు చేసేవారు, విష్ణుభక్తులు వైకుంఠం చేరతారు. రుద్రయాగాలు చేసేవారు శివభక్తులు కైలాసం చేరతారు. అయితే జగత్తంతా పరమేశ్వర స్వరూపము. నేనే పరబ్రహ్మను అని తెలుసుకున్న వారికి బ్రహ్మలోకము, వైకుంఠము, కైలాసములతో పనిలేదు. ఆత్మసాక్షాత్కారము పొందిన వాడికి వీటితో ఏ పని ఉంటుంది?

**బ్రహ్మైవ పశ్యతాం సర్వం బ్రహ్మభూతాం తరాత్మనాం ।**

**కో బ్రహ్మ కో ను విష్ణుర్వా కా తల్లోక సుఖప్రదా ॥ 245**

సమస్తము పరబ్రహ్మగానే భావిస్తున్న వాడికి ఇంకా బ్రహ్మ ఎవరు. విష్ణువెవరు? రుద్రుడెవరు. ఆ లోకాలో పొందే ఆనందము ఎంత ?

జీవాత్మ పరమాత్మలకు భేదం లేదు అని తెలుసుకున్నాడు. నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని అని తెలుసుకున్నాడు. ఆనంద డోలికలో తేలియాడుతున్నాడు. అతడి దృష్టిలో ఈ జగత్సృష్టి లేదు. స్థితి లేదు. లయం అంతకన్న లేదు. అసలు జగత్తే లేదు. సర్వము పరబ్రహ్మమయం. అటువంటప్పుడు ఇంకా సృష్టికారకుడైన బ్రహ్మ ఎవరు. సృష్టి ఎక్కడ? అలాగే స్థితి కారకుడైన విష్ణువు, లయకారకుడైన రుద్రుడు ఎవరు. వాళ్ళెక్కడ నుంచి వచ్చారు. ఉన్నది పరబ్రహ్మ ఒక్కడే. నేను సర్వానందమయ రూపుణ్ణి. త్రిమూర్తులు పొందే ఆనందమెంత? అదేదీ బ్రహ్మముతో సరికావు.

# 17. మనోజయము

మనోజయము అంటే మనస్సును జయించటం. దీన్నే మనోనాశనము అని కూడా అంటారు.

**'మనయేన మనుష్యాణాం కారణం బంధమోక్షయోః'**

బంధ మోక్షాలకు కారణం మనస్సు. **మమ** అనుకుంటే బంధం **'నమమ'** అనుకుంటే మోక్షం. మనసుతోనే సంసారం సృష్టించబడుతున్నది. ఏ పదార్థం మీద మనకు ప్రేమ అభిమానం ఉంటుందో దాని స్వరూపంగానే మనసుంటుంది. ఇది మనసు యొక్క లక్షణం. మోక్షం కావాలి అంటే మనసును అదుపులో పెట్టుకోవాలి. మనసు ఎప్పుడూ అదుపులో ఉండదు. ఒక విషయం మీద నుంచి ఇంకొక విషయం మీదకి దూకుతూ ఉంటుంది. పరుగులు పెడుతుంది. ఇంద్రియాలు మనసు యొక్క అధీనంలో ఉంటాయి. మనసు సక్రమంగా ఉంటే ఇంద్రియాలు సక్రమంగానే ఉంటాయి. మనసు సక్రమంగా ఉండటము అంటే అదుపులో ఉండటం. విషయవాసనల యందు చిక్కకుండా ఉండటం. ఎవరి మనసు విషయ వాసనల యందు చిక్కకుండా ఉంటుందో, అతడు మనసును జయించినట్లే. అజ్ఞానాన్ని వదిలి జగత్తంతా బ్రహ్మమయము అని భావన చేయగలిగినవాడే మనసును జయించినవాడు. మనసును జయించటం తేలిక కాదు అంటారు. ఇది అజ్ఞానులు చెప్పే మాట. ఆత్మజ్ఞానం కల పురుషుడికి మనసును జయించటమనేదికళ్ళుమూసి

తెరిచినంత తేలిక. 'సర్వవ్యాపకుడైన బ్రహ్మమును నేనే' అని భావించిన వాడి మనస్సు అతని అదుపులోనే ఉంటుంది. జగత్తంతా పరబ్రహ్మలో కల్పించబడినదే. శబ్దాది విషయాలకు ప్రత్యేకమైన ఉనికి లేదు. అని తెలుసుకోవటమే మనోజయము. చరాచర జగత్తులో వినబడేవి, చూడబడేవి, మనసుతో భావించబడేవి అన్నీ పరబ్రహ్మ స్వరూపమే అని తెలిసిన జ్ఞానిమనసు అదుపులో ఉంటుంది. జీవబ్రహ్మలకు భేదము లేదని తెలిసిన జ్ఞానిమనసు అదుపులో ఉంటుంది.

ఈ రకంగా మనసును లౌకిక విషయాల యందు లగ్నం కానీకుండా కట్టడి చేసి జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే అని భావన చేయగలిగినవాడే మనసును జయించిన వాడు. **మోక్షం కావాలంటే మనోనాశనము జరిగి తీరాలి.**

**యత్రాస క్తిర్మనస్తత్ర తదాకారేణ తిష్ఠతి ।**

**స ఏష మనసో ధర్మః స్వానుషక్తాత్మనా స్థితిః ॥** **246**

ఏ పదార్థము మీద మనకు ప్రేమ ఉన్నదో మనస్సు ఆ పదార్థము యొక్క స్వరూపముతోనే ఉంటుంది. తనయందు ప్రేమ అనే పాశముతో బంధింపబడి ఉన్న వస్తువునందుండుట మనస్సు యొక్క లక్షణము.

మనసును జయించాలి అంటే మనసును వశంలో పెట్టుకోవాలి. మనసు ఎప్పుడూ అదుపులోఉండదు. శాఖాచంక్రమణం చేస్తుంటుంది. ఒక విషయం నుంచి ఇంకో విషయానికి పరుగులు పెడుతుంది. కఠోపనిషత్తులో చెప్పినట్లుగా

**యస్త్వ విజ్ఞానవాన్భనత్య యుక్తేన మనసా సదా ?**

**తస్యేంద్రియాణ్యనశ్యాని, దుష్టాశ్వా ఇవసారథేః ॥**

చంచలమైన మనసు కలిగి సరియైన విజ్ఞానము లేని వాని ఇంద్రియాలు సారథి వశములో లేని దుష్టాశ్వముల వంటివి ఇంద్రియాలు తను ఇష్టానుసారం చరిస్తాయి. పరుగులు పెడతాయి.

**యస్తు విజ్ఞానవాన్భవతి యుక్తేన మనసా సదా ।**

**తస్యేంద్రియాణి నశ్యాని, సదశ్వా ఇవసారథేః ॥**

విజ్ఞానవంతుని ఇంద్రియాలు మంచి సారథి వశంలో ఉన్న గుర్రాల వలె వశంలో ఉంటాయి.

కాబట్టి మనసును బట్టే ఇంద్రియాలు చరిస్తుంటాయి. ఇంద్రియాలు ఎక్కడ ఉంటాయి అంటే వాటికి ఒక స్థానం ఉంది. కాని మనసుకు స్థానం లేదు. మనకు ఏ పదార్ధము మీద ప్రేమ ఉన్నదో ఆ పదార్ధములో మనస్సు ఉంటుంది.

**విషయాకార తాపత్తి వృత్తిర్యేన నిగృహ్యతే ।**

**విపశ్చితా మనస్తేన నిర్జితం నాత్ర సంశయః ॥ 247**

ఏ మహానుభావుడైతే శబ్దాది విషయాలకు చిక్కకుండా మనసును నిగ్రహించుకుంటాడో అతడు మనస్సును జయించిన వాడు.

మానవుడు ఈ జగత్తంతా పరబ్రహ్మ కన్న వేరైనది. నామరూపాత్మకమైనది. అని భావన చేస్తే, మనస్సు కూడా బ్రహ్మకన్న వేరైన ఆకారంగానే జగత్తును చూస్తుంది. అలా కాదు జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే. అని భావిస్తే బ్రహ్మముగానే కనుపిస్తుంది. కాబట్టి ఎవడు మనోనిగ్రహం కలిగి ఉంటాడో, అంటే జగత్తు పరబ్రహ్మ స్వరూపమే తప్ప నామరూపాత్మకం కాదు. దృశ్యమానం కాదు అని నిశ్చయించుకుని విషయ వాంఛల యందు మరలనీయక మనసును నిగ్రహిస్తాడో అతడు మనస్సును జయించినవాడు. దృశ్యమానమైన జగత్తును చూస్తూ కూడా ఇదంతా పరబ్రహ్మ స్వరూపము అని భావన చేసినవాడే మనస్సును జయించినవాడు. వాస్తవస్థితిలో జగత్తుకు నాశనమనేది లేదు. కాబట్టి ఏ పదార్ధము ఎలా కనుపించినప్పటికీ ఇదంతా పరబ్రహ్మమే అని భావన చేసేవాడే మనసును జయించిన వాడు. ఈ కుండ బ్రహ్మము కన్న వేరైనది అనే భావన వదిలి, కుండకు నామరూపాలు మాత్రమే క్రొత్తవై ఉన్నాయి. వాస్తవస్థితిలో సర్వకారణమైన బ్రహ్మముకన్న ఇది వేరు కాదు. అని భావించి ఇది కుండ అంటున్నప్పటికీ, చిత్తములో అలాంటి భావన లేకుండా ఇది కూడా బ్రహ్మమే. అనే భావన కలిగి ఉండటమే తత్త్వజ్ఞానానికి ఫలితము. కాబట్టి అనాదిగా వస్తున్న అజ్ఞానాన్ని వదలి అంతటా బ్రహ్మభావన చేసినట్లైతే, అప్పుడు మనస్సు కూడా బ్రహ్మాకారముతో పరిణమిస్తుంది. దీన్నే **మనోజయము** అంటారు. ఇదే **పురుషార్ధము.**

"ఏ పదార్ధము ఏ స్వభావంతో కనిపించినప్పటికీ అదంతా, ఆ స్వభావంతో కనుపించే పదార్ధమంతా పరబ్రహ్మమే. అంతకన్న వేరైనది లేదు. కాబట్టి కంటికి కనుపించేది, చెవులకు వినిపించేది అంతా పరబ్రహ్మమే" అని తెలుసుకోవటమే తత్త్వజ్ఞానము.

**ఉన్మేషశ్చ నిమేషశ్చ మకరః సాద్యథా తథా ।**

**మనోజయోఽపి సుకరః పురుషస్యాత్మ వేదినః ॥ 248**

కళ్ళు తెరవటం మూయటం ఎంత తేలికో, ఆత్మజ్ఞానము గల పురుషుడికి మనసును జయించటం కూడా అంతే తేలిక.

కళ్ళు తెరవటం, ముయ్యటం అనేది ఇద్దరికే కష్టం. 1.నిద్రలో ఉన్నవాడికి 2.మూర్ఛపోయిన వాడికి. జాగ్రదావస్థలో ఉన్న వాడికి ఇది చాలా తేలిక. తనకు తెలియకుండానే ఈ పని జరిగిపోతుంది. అలాగే చరాచర జగత్తు బ్రహ్మకన్న వేరైనది అనే భ్రాంతిలో ఉన్నవాడు మనసును జయించలేడు. జగత్తుకు బ్రహ్మకు భేదం లేదని తెలిసిన వాడికి మనసును జయించటం చాలా తేలిక.

**బ్రహ్మైవాహం న దేహాది రితి స్వం బోధ విగ్రహం ।**

**పశ్యతో విదుష శ్చితం వద కుత్ర గమిష్యతి ॥ 249**

నేను సర్వవ్యాపకుడైన బ్రహ్మనే. నేను అంటే దేహము ఇంద్రియాలు కాను అని జ్ఞానంతో ఆత్మను చూస్తున్న జ్ఞానిమనస్సు ఇంకా ఎక్కడికి పోతుంది?

నేను అంటే దేహము కాను. ఇంద్రియాలు కాను. నేను పరబ్రహ్మను అనే నిశ్చయంతో ఆత్మను చూస్తున్న వారి మనస్సు ఎక్కడికి పోగలదు? ఎక్కడికీ పోదు.

**విషయాకారతాపత్తి మేవ వృత్తేర్నిరస్యతః ।**

**సర్వతో విదుషః శ్చిత్తం వద కుత్ర గమిష్యతి ॥ 250**

శబ్దాది విషయముల ఉత్పత్తిని అన్ని కాలములందు నిషేధిస్తున్న విద్వాంసుని మనస్సు ఎక్కడికి పోతుంది?

వాస్తవంగా చెప్పాలంటే శబ్దాదులకు ప్రత్యేకమైన రూపం లేదు. ఇవన్నీ కల్పించబడినవి. ఇవి ఆత్మయందు కల్పించబడ్డాయి కాబట్టి ఇవి ఆత్మకన్న వేరు కాదు. ముత్యపుచిప్ప యందు ఆరోపించబడిన వెండి ముత్యపు చిప్ప కన్న వేరు కానట్లు పరబ్రహ్మ యందు ఆరోపించిన జగత్తు బ్రహ్మము కన్న వేరు కాదు. కాబట్టి శబ్దాదులకు ఉనికే లేదు. ఈ రకంగా శబ్దాదుల ఉత్పత్తినే నిషేధిస్తున్నాడు జ్ఞాని. అటువంటి జ్ఞానిమనస్సు లేనటువంటి శబ్దాదులలో చిక్కదు కదా? ఇంకెక్కడికి పోతుంది?

**శ్రుతం దృష్టం స్మృతం పృష్టం సర్వం బ్రహ్మేతి చిద్ధియా ।**

**పశ్యతో విదుషశ్చిత్తం వద కుత్ర గమిష్యతి ॥ 251**

వినబడేవి, చూడబడేవి, మనసుతో భావించబడేవి, అన్ని పదార్ధాలను బ్రహ్మము గానే భావించే జ్ఞానియొక్క మనసు ఎక్కడికి పోగలదు?

ఇంతవరకు చెప్పినట్లుగా మనసుకు కలిగే విషయాకార పరిణామము తొలగించి, తాను వినేది, చూసేది, ఆలోచించేది అంతా పరబ్రహ్మ స్వరూపమే అని భావించే జ్ఞాని మనస్సు ఇంకా ఎక్కడికి పోతుంది?

**అహమిదమితి కల్పనావకాశో**

**యదిమనసోస్తి తదాబహిః ప్రవృత్తిః ।**

**అహమిద మఖిలం సదేవ శుద్ధం**

**పరమితి దృష్టవతః కుతోఽవకాశః ॥ 252**

మనస్సుకు ఇది అది, నేను నువ్వు అనే భేదాలున్నట్లైతే బయట బ్రహ్మకు భిన్నమైన పదార్ధములందు చరిస్తుంది. జీవబ్రహ్మలకు భేదము లేదని తెలిసినప్పుడు మనస్సుకు భేద కల్పనావకాశము ఎలా కలుగుతుంది?

భేదం కల్పించటానికి కొంచెం అవకాశమున్నప్పటికీ మనస్సు అనేక కల్పనలు చేస్తుంది. జీవబ్రహ్మలకు తేడా లేదు. ఇద్దరూ ఒకటే. చరాచర జగత్తులో బ్రహ్మము తప్ప వేరేదీ లేదు అని నిశ్చయంగా తెలిసిన జ్ఞాని మనస్సు బాహ్యాభ్యంతరాలలో ఇంకా ఎక్కడికి పోతుంది? ఎక్కడికీ పోదు. భేదాలు కల్పించే అవకాశం మనసుకు ఉండదు.

**నిరంతరాభ్యాసవశా త్స్వయం పక్వో భవేన్మునిః ।**

**బ్రహ్మానందసుఖాసక్త్యా సతి బ్రహ్మణి తిష్ఠతి ॥ 253**

విచారశీలుడైన మహాత్ముడు. గురువుల దగ్గర జగత్తంతా పరబ్రహ్మమే అనే జ్ఞానము సంపాదించి, దానిని చిరకాలము అభ్యసించటం వల్ల తనంత తానే పరిపక్వ స్థితికి చేరి బ్రహ్మమునందే ఉంటాడు.

ఇక్కడ ఒక చిన్న అనుమానం వస్తుంది. బ్రహ్మము కన్న రెండవ పదార్ధము ఏదీ లేనప్పుడు ఇంకా గురువెందుకు? గురుశిష్యుల సంబంధమే ఉండదు కదా !

ఇక్కడ గమనించాల్సింది ఏమంటే రెండవ పదార్థము నాశనమవుతుందని గాని, లయమవుతుందని గాని ఎక్కడా చెప్పలేదు. ఈ జగత్తు ఎప్పటికీ అలాగే ఉంటుంది. మరి చెప్పేది ఏమంటే దీంట్లో ప్రపంచ భావన, బ్రహ్మకన్న వేరనే భావనను మాత్రమే వదలాలి. దీనివల్ల వస్తు స్వరూపానికి ఏ హానీ ఉండదు. అభేద జ్ఞానము కలిగే వరకు భేదబుద్ధి ఉంటుంది. కాబట్టి గురుశిష్యులు ఉండాలి. భేదాభిప్రాయం లేని జ్ఞాని గురువును ఆశ్రయించవలసిన పనిలేదు. కాని భేదాభిప్రాయమున్న వాడు మాత్రం గురువును ఆశ్రయించి తీరాలి. కాబట్టి సాధకుడు మంచి గురువును ఆశ్రయించి **సర్వంఖిల్విదం బ్రహ్మ** ఇదంతా పరబ్రహ్మమే అని తెలుసుకొని, దాన్ని చాలాకాలం అభ్యసించి తనంత తానే పరిపక్వస్థితికి చేరి సర్వకాలాల యందు బ్రహ్మమునందే నిలచి ఉంటాడు.

**ఏషోఽహమిదమిత్యాది ప్రత్యయో మన ఉచ్యతే ।**
**తదభావోఽమనస్కత్వ మద్ధ్వయం బ్రహ్మ కేవలమ్ ॥ 254**

నేను నువ్వు అది ఇది అనే జ్ఞానము మనసుకు ఉంటుంది. మనసుకు అటువంటి జ్ఞానము లేని స్థితినే అమనస్క స్థితి అంటారు.

ఈ శ్లోకంలో అమనస్క స్థితిని వివరిస్తున్నారు. మనసు కూడా పని చేయని స్థితినే **'అమనస్కస్థితి'** అంటారు. సమాధిస్థితి రెండు రకాలుగా ఉంటుంది. 1.సవికల్ప సమాధి 2.నిర్వికల్ప సమాధి. సవికల్ప సమాధిలో, ఆ స్థితికి చేరిన తరువాత కూడా మనసులో సంకల్ప వికల్పాలు కలుగుతాయి. అంటే ఇతర విషయాలు కూడా తెలుస్తాయన్న మాట. దీన్నే **సుమన** అంటారు. నిర్వికల్ప సమాధిలో మనసు కూడా పని చేయదు. దీన్ని **ఉన్మన స్థితి** అంటారు. సమాధికి కావలసింది ఇదే స్థితి. చాలామంది రాక్షసులు సమాధిస్థితిలో ఉండి తపస్సు చేశారు. అది సవికల్ప సమాధి. ఎందుకంటే భగవత్సాక్షాత్కారము జరిగితే ఏ కోరికలు కోరాలి? ఆయనను ఏ రకంగా స్తుతించాలి అనే విషయాలు ముందుగానే నిశ్చయం చేసుకుని తపస్సు ఆరంభించారు. ఆ ప్రకారమే చేశారు. అందుకే ఇది సుమన.

మార్కండేయుడు తపస్సు చేస్తున్నాడు. శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకోమన్నాడు. తెల్లమొగం వేశాడు. నాకేమీ అక్కర్లేదు అన్నాడు మార్కండేయుడు. విష్ణుమూర్తి బలవంతం మీద "వైష్ణవ మాయను దర్శించాలి"

అని అడిగాడు. ఇది ఉన్మన. ఏం కావాలో కూడా తెలియని, మనసు కూడా పని చేయని స్థితి.

నిర్వికల్ప సమాధిలో అద్వైతాత్మను దర్శించినప్పుడు హృదయంలో ఉన్న అజ్ఞాన గ్రంధులు పూర్తిగా నాశనమవుతాయి. **వేదాంత పరిభాషలో వ్యక్తిత్వ బంధాలను గ్రంధులు అంటారు.** అవిద్య వల్ల కోరికలు పుడతాయి. ఈ కోరికలు బుద్ధిలో అలజడిని రేపుతాయి. ఈ కోరికలు సాధించటానికి కర్మలు చేస్తారు. అజ్ఞానం వల్ల బుద్ధిలో కలిగే కోరికలు, మనసులో అశాంతి, శారీరకమైన కోరికలు ఇవన్నీ కార్యకారణ సంబంధము అంటారు. ఇదే సంసార బంధం. సాధకుడు ప్రయత్నంతో తన మనసును శాంతపరచి, సహజ స్వరూపమైన ఆత్మానుభవం పొందినప్పుడు అవిద్య, కోరికలు, కర్మలు అనే మూడుగ్రంధులు విడిపోయి నాశనమవుతాయి. బుద్ధిలో కొన్ని దోషాలుంటాయి. వాటివల్ల అద్వితీయమైన పరమాత్మలో నువ్వు నేను అది ఇది అనే కల్పనలు జరుగుతాయి. ఇదంతా ఊహ. సమాధిలో బ్రహ్మమును చూడగలిగితే, ఈ కల్పనలు, భేదాలు పూర్తిగా నశిస్తాయి. పరమశాంతంతో, ఇంద్రియ నిగ్రహంతో భోగవస్తువుల నుంచి దృష్టి పూర్తిగా మరల్చాలి. సహనంతో సమాధి కోసం గట్టిగా ప్రయత్నించాలి.

ఈ రకంగా మనసులో సంకల్ప వికల్పాలు లేకుండా ఉండే స్థితి. అది ఇది అనే భేదభావం లేని స్థితి. ఏకాగ్రమైన చిత్తంతో పరమాత్మనే ధ్యానించే స్థితి. మనసు కూడా పనిచేయనిస్థితినే **అమనస్కస్థితి** అంటారు.

**జ్ఞాత్రాదిభేదం స్వయమేవ ధ్వత్వా నానాత్మనా థోమన ఏవజృంభతే ।**
**మనోవినాశే సతి నైవ భేదో యథా సుషుప్తౌ తథానమాధౌ ॥ 255**

అజ్ఞాన రూపమయిన మనసే జ్ఞాత, జ్ఞానము మొదలయిన బేదాలు సృష్టిస్తున్నది. ఈ మనసు గనక నశిస్తే సుషుప్తిలాగానే సమాధిలో కూడా భేదము ఉండదు.

మనసు అజ్ఞాన రూపమని, బంధ మోక్షాలకు అదే కారణమని గతంలో చెప్పుకున్నాం. అజ్ఞానంతో మనసే ఈ జగత్తును కల్పిస్తోంది. ఈ భేదాలన్నీ మనసులోనే ఉన్నాయి. వీటన్నింటినీ కల్పించి, అవి నిజంగానే ఉన్నాయని భావించి, వాటితో తాదాత్మ్యత చెంది ఇంకా ఇంకా అజ్ఞానంలో కూరుకుపోతోంది. మనసున్న వాడికే విషయ భోగాలు తెలుస్తాయి. చిన్న ఉదాహరణ. ఇరవైఐదు సంవత్సరాల

వయస్సు గల అందమైన స్త్రీ ఆకట్టుకునే వస్త్రధారణతో దర్శనమిచ్చింది. అప్పుడు చూసే వారి మనసులో భావాలు ఎలా ఉంటాయో నాకన్న మీకే బాగా తెలుసు. కాని మీరనుకునేది తప్పు. అందరి భావాలు ఒకే రకంగా ఉండవు. పురుషులకున్న భావాలు స్త్రీలకు ఉండవు. పురుషులలో కూడా చిన్న పిల్లలకు ఏ రకమైన భావాలు ఉండవు. వృద్ధులు ఆమెను పట్టించుకోరు. చూసినా ప్రాధాన్యత ఇవ్వరు. సన్యాసులు, సర్వసంఘ పరిత్యాగులు ఆమెవైపు కూడా చూడరు. ఇక ఆమెను చూసేది ఆకర్షణకు గురి అయ్యేది కేవలము యవ్వనంలో ఉన్న పురుషులే. తీపి రుచి తెలిసినవాడే తీపి పదార్థమంటే ఇష్టపడతాడు. కాబట్టి మనసులోని ఆలోచనల వల్ల అజ్ఞానంవల్ల మానవుడు సంసార కూపంలో కూరుకుపోతున్నాడు. ఆ మనసు గనక లేకపోతే, మనసు నశించిపోతే, మనసు సంకల్ప వికల్పాలు చెయ్యకపోతే సుషుప్తిలో ఎలా ఉంటాడో సమాధిలో కూడా అలాగే ఉంటాడు. తేడా ఏమీ లేదు. అందుకే **మోక్షం కావాలంటే మనోనాశనము కావాలి.**

**శ్రుణుష్వ విద్వన్ మన ఏవ జీవో మనో హి విశ్వం మన ఏవ చేశః ।**

**మనోహి మాయామనేవబంధః మనోలయో ముక్తిరయం యథార్థః ॥256**

ఈ శ్లోకంలో శిష్యుడికి బోధ చేస్తున్నారు. ఓ జ్ఞానీ ! ఓ మోక్షగామి! వినవలసింది. అన్నింటికీ కారణం మనస్సు. మనస్సే జీవుడు. మనస్సే జగత్తు. మనస్సే ఈశ్వరుడు. మనస్సే మూలప్రకృతి. సంసారబంధము మనస్సే. **భేదజ్ఞానము లేకపోవటమే మోక్షము.** మోక్షము అంటే ఏమిటో చెబుతున్నారు. భేదజ్ఞానము లేకపోవుట. జీవాత్మ పరమాత్మ ఒకటే అనుకోవటం అదే మోక్షము. భేదజ్ఞానము నశిస్తే మోక్షం వస్తుంది. భేదజ్ఞానము మనసు వల్లనే వస్తుంది. కాబట్టి మనోలయం కావాలి అంటున్నాం. మనోలయం అంటే మనసు పని చేయని అమనస్క స్థితి. అదే మనోజయము. **మనసును అదుపు చెయ్యగలిగితే మోక్షం సిద్ధించినట్లే.**

అన్నింటికీ కారణము మనస్సే. మనసే ఈశ్వరుడు, మనసే జగత్తు, మనసే జీవుడు, మనసే ప్రకృతి, మనసే సంసారము. గతంలో చెప్పుకున్నాం మనసు లేనివాడికి సంసారం లేదు. పిచ్చివాడికి భార్య పిల్లలు బంధువులు ఎవరూ ఉండరు. అలాగే మనసు పని చేయని పసిపిల్లవాడిని ఎవరు ఎత్తుకున్నా ఒకటే. వాడికి కావలసింది ఎత్తుకోవటము ఆకలేస్తే పాలుపట్టటం. ఈ రెండు పనులు ఎవరు

చేసినా అభ్యంతరలేదు. అందుకే పసిపిల్లలు దేవుడితో సమానం అనేది. కాబట్టి బంధ మోక్షాలకు కారణమయిన మనసు, అజ్ఞానంతో దృశ్యమానమైన జగత్తును సృష్టించేమనసు లయమయితే మోక్షం సిద్ధించినట్లే.

**జ్ఞాత్రాది కల్పనా బీజే విలేనే మనసి స్వయమ్ ।**
**తతః కేవల రూపేణ పూర్ణానందాత్మనాస్థితిః ।**
**నాంతరం నాపి వా బాహ్యం విద్వాన్ జానాతి కించన ॥ 257**

జ్ఞాత మొదలైనవి సృష్టించే మనసు నశించగానే విద్వాంసుడు పరబ్రహ్మ స్వరూపమై లోపల బయట ఏమీ తెలుసుకోడు.

జ్ఞాతజ్ఞానము జ్ఞేయముల భేదాలను సృష్టించేది మనస్సు. భేదాలు కల్పించటానికి మూలకారణము మనస్సు. అటువంటి మనసు గనక లయమొందితే, సాధకుడు పరమానందంతో అద్వితీయమైన రూపంతో ఉంటాడు. అప్పుడు లోపల బయట ఏమీ తెలుసుకోడు. అసలు తెలుసుకోవటానికి ఏమీ ఉండదు. భిన్న వ్యవహారము లుండవు. కాబట్టి **మనోలయం కావాలి.**

**సః ఏష పరమో లాభః సైషాస్య పరమాగతిః ।**
**సః ఏష పరమానందో యా స్థితిః కేవలాత్మనా ॥ 258**

అద్వితీయ స్థితిలో ఉండటమే శ్రేష్ఠమైన లాభము. ఇది లోకోత్తరమైన ఆనంద స్థానము.

ఎప్పుడైతే భేదాన్ని నాశనం చెయ్యటం జరిగిందో, అప్పుడు పరబ్రహ్మ సాక్షాత్కరిస్తుంది. బ్రహ్మానికి రూపం లేదు కదా? ఎలా సాక్షాత్కరిస్తుంది? అని అనుమానం. పరబ్రహ్మ సాక్షాత్కారం అంటే నేనే పరబ్రహ్మని అని తెలియటం. అది ఆనందస్థితి. స్వయంగా తానే పరబ్రహ్మ అయిన వాడు బ్రహ్మానందాన్ని పొందుతాడు. బ్రహ్మానందము అంటే ఏమిటో 182వ శ్లోకంలో వివరించటం జరిగింది. దానికి మించిన ఆనందము ఇంకొకటి లేదు.

**విద్వానాత్మతాదాత్మ్యం నిర్దహ్య జ్ఞనవహ్నినా ।**
**జీవన్నేవ వినిర్ముక్తో యతో బ్రహ్మాత్మనా స్థితః ॥ 259**

**బ్రహ్మాత్మనా వసన్ విద్వాన్ ముక్తఃస్థూలాద్యుపాధిభిః ।**

**లోక దృష్ట్యాప్యసౌ జీవన్ ముక్తః ఏవాస్తసంసృతిః ॥** **260**

బ్రహ్మకన్న వేరైన వాటితో ఉన్న సంబంధాన్ని నాశనం చేసి, పరబ్రహ్మ రూపంతో ఉన్నవాడు జీవన్ముక్తుడు.

ఆత్మకు దేహాదులతో ఉన్నది కల్పించబడిన సంబంధము. సాధకుడు జ్ఞానాగ్ని చేత భేదభావాన్ని, కల్పిత సంబంధాన్ని నాశనం చేసి బ్రహ్మరూపుడవుతాడు. అతడే జీవన్ముక్తుడు. జీవన్ముక్తుడి స్థితి. 215 శ్లోకంలో వివరించటం జరిగింది. జీవించి ఉండగానే ముక్తిపొందినవాడు. ఇతడికి దేహపాతము జరగగానే విదేహముక్తి కలుగుతుంది.

**అయమేవ హి సంసారో యాహంమమ మతిస్సతామ్ ।**

**దేహతద్ధర్మ తత్కర్మ తదవస్థాను విభ్రమాత్ ॥** **261**

శరీరము నందు, దాని స్వభావమైన దృశ్యము మొదలగు వాని యందు దర్శనము, స్పర్శల యందు, అవస్థాత్రయము నందు, అజ్ఞానంతో నేను నాది అనే బుద్ధి ఏదైతే ఉన్నదో జనులకు అదే సంసారము.

ఈ శ్లోకంలో సంసారాన్ని వివరిస్తున్నారు. శరీరము మూడు రకాలు స్థూల సూక్ష్మ కారణ శరీరాలు. ఈ శరీరముల యందు, శరీరము యొక్క స్వభావము దృశ్యత్వము, వినాశనత్త్వము మొ॥ వాటి యందు, శరీరము యొక్క కార్యములు అది చేసే పనులు చలనము, దర్శనము, స్పర్శనము మొ॥వి. శరీరానికి అవస్థలు మూడు. జాగ్రస్వప్న సుషుప్తులు వీటియందు, నుంచోవటం, కూర్చోవటం మొ॥ స్థితి భేదాల యందు, అంటే దేహమే ఆత్మ అని భావించి వాటి స్వభావాలు, అవస్థలు, కర్మలు అన్నీ తనవిగా భావించి అజ్ఞానము వలన నేను నాది అనుకోవటం వాటియందు సంచరించటం అనేది ఏదైతే ఉన్నదో అదే లోకంలో సంసారము అనబడుతున్నది. నిశితంగా పరిశీలిస్తే అజ్ఞానంతో కల్పించబడిన సంసారంలో అహంకార మమకారముల కన్న వేరైనది ఏదీ లేదు.

**జీవతా యత్తు కర్తవ్యం జీవంస్తన్న కరోతి యః ।**

**తం వదంతి జనాః సర్వే జీవన్ముక్త ఇతి క్షితా ॥** **262**

జీవించి ఉన్నవాడు చేయవలసిన దానిని చెయ్యని పురుషుడే జీవన్ముక్తుడు. ఈ శ్లోకంలో జీవన్ముక్తుడు అనే పదానికి నిర్వచనం చెబుతున్నారు. సామాన్యంగా జీవించి ఉన్న వారు చేయవలసిన పనులు కొన్ని ఉంటాయి. అవే సంసార బాధ్యతలు. ఇవి ప్రతివారూ నిర్వహించేవే. ఈ బాధ్యతలు నిర్వహించని వారే జీవన్ముక్తులు. అయితే చిన్న అనుమానం వస్తుంది. సోమరిపోతుకు కూడా ఏ పని చెయ్యడు. పిచ్చివాడు, మతిస్థిమితం లేనివాడు వీరుకూడా ఏ పని చెయ్యరు కదా ! మరి వీరు కూడా జీవన్ముక్తులేనా? అంటే కాదు. ఇది సామాన్య మానవులను గురించి చెప్పిన విషయం. జీవించి ఉన్న సామాన్యజనులు. వీరు చేయవలసిన పనులు. అవి సంసార బాధ్యతలు. తత్త్వజ్ఞానం చేత వీటిని చేయనివారు జీవన్ముక్తులు.

**యథా ముక్తస్తథా జీవన్ బ్రహ్మణ్యే వాత్మతాధియా ॥ 263**

**యోఽహంతాం మమతాం దేహే దేహధర్మే పరిగ్రహే ।**

**నకుర్యాత్త మిమం ప్రాహు ర్జీవన్ముక్తం మహర్షయః ॥ 264**

జీవించి ఉండి కూడా శరీరాన్ని శవంలాగా చూసేవాడు, సంసార బంధనాలు లేనివాడు జీవన్ముక్తుడు.

లోకంలో జీవించి ఉన్న ప్రతివారికీ దేహము నందు అభిమానం ఉంటుంది. జన్మమృత్యుజరాదుల యందు నేను అని భావన చేస్తాడు. జన్మించాను. మరణించాను అని భావిస్తాడు. ఈవిడ నా భార్య. ఇతడు నా కుమారుడు. నా స్నేహితుడు, నా బంధువు. ఇలా రకరకాల బంధాలు ఏర్పరచుకుంటాడు. ఇటువంటి అభిమానము, వాసనలు, బంధాలు ఏవీ లేనివాడు. దేహము తనదిగా భావించనివాడు. దేహాన్ని శవంగా చూసేవాడు. కుటుంబ సభ్యులతో ఏ రకమైన సంబంధము లేనివాడు. ఈ లోకంలో జీవిస్తున్నా లోకంతో ఏ రకమైన సంబంధము లేనివాడు. సామాన్యులు చేసే ప్రతిపనిలోను అజ్ఞానం ఉంటుంది. జీవన్ముక్తుడికి ఇలాంటి అజ్ఞానముండదు. అహంకార మమకారాలుండవు. సామాన్యులు చేసే పనులే జీవన్ముక్తుడు చేసినా అందులో అభిమానము, మమకారము, బంధము లాంటివి ఉండవు. జీవించి ఉన్న మిగిలిన వారిలాగా ఇతడు పనులు చెయ్యడు. సంసారంతో ఏ రకమైన బంధాలు లేనివాడు జీవన్ముక్తుడు.

**దేహేంద్రియాదేః (దౌ) కర్తృవ్యే మమాహంభావ వర్జితః ।**

**ఔదాసీన్యేన యస్తిష్ఠే జీవన్ముక్తస్స ఉచ్యతే ॥ 265**

దేహము, ఇంద్రియాలు, అవి చేసే పనులు వీటియందు నేను నాది అనే అభిప్రాయం లేనివాడై ఉదాసీనంగా వ్యవహరించేవాడే జీవన్ముక్తుడు.

దేహాభిమానము ఉండదు. ఈ దేహానికి ఏమైనా పట్టించుకోడు. జ్వరం వచ్చినా, దెబ్బ తగిలినా గాయాలైనా, కాలు చెయ్యి తెగిపోయినా పట్టించుకోడు బాధ పడడు. దేహము ఇంద్రియాలు చేసే పనులతో అతడికి సంబంధం లేదు. నేను నాది అనే అహంకార మమకారాలు లేకుండా ఏ పురుషుడు ఉదాసీనంగా ఉంటాడో, ఏమీ పట్టించుకోకుండా ఉంటాడో, పనిచేస్తాడు దాని ఫలితంతో అతనికి సంబంధం ఉండదు. అటువంటి పురుషుడు జీవన్ముక్తుడు.

**బ్రహ్మైవేదం సర్వమిత్యేవసమ్య క్పశ్యన్ మన్వానో విజానన్ మహాత్మా ।**

**బ్రహ్మణ్యేవ బ్రహ్మరూపేణ తిష్ఠన్ బ్రహ్మానందం బ్రహ్మవిదేష భుజ్తే ॥266**

ఇటువంటి బ్రహ్మజ్ఞాని జగత్తంతా పరబ్రహ్మమే అని భావించి, గొప్పదైన బుద్ధి గలవాడై పరబ్రహ్మ రూపంతో బ్రహ్మమునందే ఉండి బ్రహ్మానందము అనుభవిస్తాడు.

జీవన్ముక్తుడి పరిస్థితిని వివరిస్తున్నారు. ఇతడు జగత్తంతా పరమేశ్వర స్వరూపము అని భావిస్తాడు. **సర్వంఖిల్విదం బ్రహ్మ.** ఇక్కడ బ్రహ్మము తప్ప వేరే ఎవరూ లేరు అని తెలుసుకుని తానుకూడా బ్రహ్మము అవుతాడు. **బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి** పరబ్రహ్మను గురించి తెలుసుకున్న వాడు కూడా బ్రహ్మమే అవుతాడు అనే వేదవాక్యాన్ననుసరించి తానుకూడా బ్రహ్మము అయి, బ్రహ్మాకారముతో ఉండి. తనకు రూపం ఉన్నా లేనట్లుగా **నేనే జగత్తు, జగత్తే నేను** అని భావిస్తూ బ్రహ్మానందం పొందుతాడు. **జీవన్ముక్తుడు నిరంతరము ఆనందడోలికలలో తేలియాడతాడు.**

**ఏష విద్వానాత్మరతి రాత్మజ్యోతి రశేషదృక్ ।**

**ఆత్మక్రీడాత్మమిథున ఆత్మానందస్సదా మునిః ॥ 267**

**ఆత్మ తృప్త ఆత్మ సుఖ ఆత్మారామో వినిష్క్రియః ।**

**జీవన్నేవ విముక్తస్సన్ ఖేలత్యానంద వారిధౌ ॥ 268**

జ్ఞాని తనయందే ప్రీతిగలవాడు, స్వస్వరూపమే ప్రకాశముగా గలవాడు, అన్నింటినీ చూసేవాడు, తన యందే క్రీడించువాడు, తానే తోడుగా గలవాడు, అన్ని కాలముల యందు స్వస్వరూపమే ఆనందముగా గలవాడు, తనయందే తృప్తి చెందినవాడు, స్వస్వరూపమందే ఆనందించేవాడు, ఏ పనులు చెయ్యనివాడు, జీవన్ముక్తుడై బ్రహ్మానందంలో తేలియాడుతాడు.

బాగా విచారించి మహాజ్ఞానియైన వాడు తనయందే ప్రీతి గలిగి ఉంటాడు. తన స్వరూపమే ప్రకాశముగా కలిగి ఉంటాడు. అన్నింటినీ చూస్తుంటాడు. తనకు తానే తోడుగా ఉంటాడు. తనలోనే క్రీడిస్తుంటాడు. భూతభవిష్యద్వర్తమానాలలో స్వస్వరూపమే ఆనందంగా కలిగి ఉంటాడు. స్వస్వరూపమందే ఆనందిస్తుంటాడు. ఏ పనులు చెయ్యకుండా, జీవించి ఉండగానే ముక్తుడై బ్రహ్మానందము అనే సముద్రంలో ఓలలాడుతుంటాడు. ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. అంత ఆనందం ఎలా వస్తుంది? ఎక్కడ నుంచి వస్తుంది? అని. ఏ రకమైన బంధాలు బాధ్యతలు లేకపోవటమే మహదానందం. చిన్ని ఉదాహరణ చూడండి. ఒక బిచ్చగాడు. రోజంతా అడుగుతున్నాడు. మధ్యాహ్నం అయింది. ఊరిచివర చెరువు వద్దున చెట్టుక్రింద చల్లని గాలి ప్రశాంతమైన వాతావరణంలో తన దగ్గర ఉన్న దితిని హాయిగా నిద్ర పోతున్నాడు. అతడి దగ్గర ఏమీ లేదు. ఏదో పొతుందనే దిగులు లేదు. తన వారంటూ ఎవరూ లేరు. వారికేమయినా అవుతుందనే బాధ అంతకన్నా లేదు. చీకుచింతా లేకుండా నిద్ర పోతున్నాడు. అప్పుడు అతడు పొందే ఆనందం త్రిలోకాధిపతి అయిన ఇంద్రుడికి కూడా ఉండదు. కాబట్టి బంధాలు, బాధ్యతలు, అహంకార మమకారాలు లేనివాడు బ్రహ్మానందం పొందుతాడు.

**అహం మమేతి వ్యవహారతో యో ముక్తస్స జీవన్యది ముక్త ఇష్యతే ।**
**ముక్తస్య బద్ధస్య విశేష ఏష దేహో ద్యహంభావనివృత్తి రేవ ॥ 269**

భ్రాంతి సిద్ధమైన వ్యవహారము నుంచి విడివడిన వాడు జీవించి ఉండగానే మోక్షం పొందినవాడు. అన్నప్పటికీ బంధాలున్న వాడికి, మోక్షం పొందిన వాడికి తేడా అహంకారము లేకపోవటమే.

నేను నాది అనే వ్యవహారము లేనివాడు జీవన్ముక్తుడు. మిగిలిన పనులన్నీ సమానమే అయినా ఇక్కడ అహంకార మమకారాఆలు లేకపోవటమే చెప్పతగిన భేదము.

**వర్తమానేఽపి దేహేఽస్మిన్ ఛాయా వదను వర్తతే ।**

**అహంతా మమతా భావో జీవన్ముక్తస్య లక్షణమ్ ॥** 270

నేను నాది అనే సంకల్పం ప్రస్తుతము ప్రవర్తిల్లుతున్న జ్ఞాని దేహమందు నీడ మాత్రంగా అయినా ఉంటుంది. ఇది బంధం కాదా అని అనుమానం. దీనికి సమాధానం చెబుతున్నారు. నేను నాది అనే వ్యవహారం లేకుండా అసలు పనులు జరగవు. అయినప్పటికీ బద్ధుని అహంకారానాకీ, ముక్తుని అహంకారానికి తేడా ఉంది. జ్ఞానశూన్యుడైన బద్ధుడు తనకు దేహం లేదని కాని, దేహము ఆత్మ వేరని కాని, తనకు దేనితోను సంబంధం లేదని కాని అనుకోడు. జ్ఞాని అలా కాదు. అజ్ఞాని అయితే ఈ శరీరమే నేను. భార్యాపుత్రులు, బంధువులు అందరూ నావారే అని భావిస్తాడు. జ్ఞానియైన వాడు "నేను బ్రహ్మ స్వరూపుడను నాకు దేనితోను సంబంధం లేదు. కేవలము వ్యవహారంకోసమే ఈ అహంకారాన్ని ఉపయోగిస్తున్నాను" అనే యధార్థ జ్ఞానంతో వ్యవహరిస్తాడు. దీనివల్ల జ్ఞానికి అహంకార మమకారాలు ఛాయామాత్రములు అవుతాయి. అంతేకాని బంధాలు కావు. మనసులో ఉన్న కర్మవాసనీలన్నీ అహంకార మమకారాలకు సంబంధించినవే వీటినే వాసనలు అంటారు.

**వాసనాద్వివిధాప్రోక్తా శుద్ధాచ మలినాతథా ।**

**మలినాజన్మనోహేతుః శుద్ధాజన్మవినాశినీ ॥**

వాసనలు శుద్ధము, మలినము అని రెండు రకాలు. వీటిలో మలిన వాసనలు పునర్జన్మ కారకాలు. కాగా శుద్ధవాసనలు పునర్జన్మను నాశనం చేస్తాయి.

ఈ అహంకార మమకారాల గురించి వాల్మీకి భరద్వాజుడికి చెప్తాడు. ఈ అహంకార మమకారాలు జీవన్ముక్తుడికి ప్రస్తుత దేహం ఉన్నంతవరకే ఉంటాయి. తరువాత అతడికి పునర్జన్మ లేదు కాబట్టి నశించిపోతాయి. జ్ఞానం రాగానే జగత్తు కనుపించకుండా పోదు. జగత్తుకు జ్ఞానంవల్ల బాధయే కాని ధ్వంసం లేదు.

ఈ విషయాలను పరిశీలిస్తే జీవన్ముక్తుడికి అహంకార మమకారాలున్నా అవి లేశమాత్రమే అవుతాయి. వాటివల్ల ముక్తి పొందటానికి ఏ అడ్డంకి ఉండదు.

ఇక్కడ మళ్ళీ అనుమానం. జీవన్ముక్తుడికి గల అహంకార మమకారాలు అతనికి బంధం కలిగించవు. అన్నారు కదా? ఇది ఎలా తెలుస్తుంది? వ్యవహారము ఇద్దరికీ

సమానమే. అయినప్పుడు అది ఒకరికి బంధకారకము ఇంకొకరికి మోక్షకారకము ఎలా అవుతుంది? దీనికి సమాధానం చెబుతున్నారు.

**అతీతాననుసంధానం భవిష్యద విచారణమ్ ।**

**ఔదాసీన్యమపి ప్రాప్తే జీవన్ముక్తస్య లక్షణమ్ ॥ 271**

జరిగిపోయిన విషయాలను గుర్తు చేసుకోకుండా ఉండటము, రాబోయే ఆలోచించకుండా, జరుగుతున్న విషయాలను పట్టించుకోకుండా ఉండటమనేది జీవన్ముక్తుని లక్షణము. ముందుగా జీవన్ముక్తుకి లక్షణాలు వివరిస్తున్నారు. గడచిపోయిన వాటిని గురించి మాట్లాడడు. అతని దృష్టిలో భూతకాలం లేదు. రాబోయే విషయాలు ఆలోచించడు. భవిష్యత్తును గురించి ఆలోచన లేదు. జరుగుతున్నవి పట్టించుకోడు వర్తమానం పట్ల ఉదాసీనత. ఇవి జీవన్ముక్తుని లక్షణాలు.

**గుణదోషవిశిష్టేఽస్మిన్ స్వభావేన విలక్షణే ।**

**సర్వత్రసమదర్శిత్వం జీవన్ముక్తస్య లక్షణమ్ ॥ 272**

గుణదోషములతో తనకన్న భిన్నమైన అంటే జడమైన ఈ సమస్త జగత్తును సమానంగా చూస్తాడు.

జీవన్ముక్తుని ఇంకో లక్షణం. తనకన్న వేరైనది జగత్తు. అలాంటి జగత్తును అంతటినీ సమానంగా చూస్తాడు. వీరు తనవారని వీరు పరులనీ భావించడు. దేనిమీద ప్రేమ అభిమానము ఉండవు. **పండితాసమదర్శనః** ఇక్కడ పండితుడు అంటే శాస్త్రపండితుడు కాదు జ్ఞాని అని అర్థం. భగవానుడు గీతలో చెప్పినట్లుగా జ్ఞాని బ్రాహ్మణుణ్ణి, గోవును, ఏనుగును, ఛండాలుని అందరినీ సమానంగా చూస్తాడు. అంటే బ్రహ్మజ్ఞానంగల వాడినీ, ఛండాలుణ్ణీ కూడా వేరువేరుగా చూడడు. అందరినీ సమానంగానే చూస్తాడు.

**ఇష్టా నిష్టార సంప్రాప్తౌ సమదర్శిత యాత్మని ।**

**ఉభయత్రా వికారిత్వం జీవన్ముక్తస్య లక్షణమ్ ॥ 273**

తనకు నచ్చినది నచ్చనిది అనేది ఏదీ ఉండదు. అన్నింటి యందు సమాన దృష్టిలోనే ఉంటాడు.

సామాన్య మానవుడు కష్టం కలిగితే బాధపడతాడు. సుఖం కలిగితే దుఃఖిస్తాడు. కాని జ్ఞానియైనవాడు జీవన్ముక్తుడు ఏ రకమైన భావోద్రేకాలు లేకుండా అలాగే ఉంటాడు. ఇలాంటి వారు ఉంటారా అనే అనుమానం వస్తుంది. శ్రీకృష్ణ పరమాత్ముడు ఇందుకు మంచి ఉదాహరణ. ఆయనకు ఎవరిమీదా ప్రేమ లేదు ద్వేషం లేదు. ఆసక్తి లేదు అనాసక్తి. అంతకన్నా లేదు. అందుకే శ్రీకృష్ణుడు పరమాత్ముడు.

**యస్యాంశ లేశలవ విస్ఫురణేన విశ్వ**

**ఆమానందతిప్రచురసౌఖ్యవ దావిరించం ।**

**తద్బ్రహ్మ పూర్ణసుఖమాతత్మ యోపలభ్య**

**కస్తత్త్వవిద్భ్రమితుమిచ్ఛతి శూన్యకల్పే ॥ 274**

బ్రహ్మానందంలోని ఒక అణువు యొక్క కాంతితో ఈ జగత్తు సత్యలోకందాకా ప్రకాశిస్తోంది. అటువంటి బ్రహ్మానందాన్ని పొందుతున్న పురుషుడు శూన్యమైన ఈ జగత్తును ఎందుకు కావాలనుకుంటాడు?

పరబ్రహ్మ పరమానంద స్వరూపుడు. ఆనందంలోని ఒక అణువు వల్లనే చరాచర జగత్తంతా ప్రకాశిస్తోంది. బ్రహ్మానందంలోని ఒక అణువుతో జగత్తు ప్రకాశిస్తున్నది అంటే అసలు బ్రహ్మానందము అంటే ఎలా ఉంటుంది. పరబ్రహ్మ నుంచి వచ్చే కాంతి కిరణాలు ఎన్ని ఉంటాయో ఊహించటం కూడా కష్టం. అటువంటి బ్రహ్మానందాన్ని పొందుతున్న పురుషుడు శూన్యమైన, భ్రాంతితో కూడిన ఈ జగత్తును ఎందుకు ఇష్టపడతాడు? ఇష్టపడడు.

**బాలోఽపి శర్కరాం లబ్ధ్వా తయా నందతి నో మృదా ।**

**కథం ను బ్రహ్మవిద్బ్రహ్మ హిత్వా నందేత్ మృషాత్మని ॥ 275**

ఏమీ తెలియని పిల్లవాడు కూడా పంచదారను ఇష్టంగా తింటాడు అంతేగాని మట్టిని తినడు కదా? అలాగే బ్రహ్మజ్ఞాని ఆనందరూపుడైన బ్రహ్మను వదలి ఈ జగత్తును ఎలా కోరతాడు?

పిల్లలైనా పెద్దలైనా తీపి అంటే ఇష్టం లేని వారుండరు. పసిపిల్లవాడు కూడా ఏడుస్తున్నప్పుడు నోటిని తీపి చేస్తే ఏడుపు మానేస్తాడు. అంతేగాని ఇతర పదార్థాలను

ఇష్టపడడు. అలాగే బ్రహ్మజ్ఞాని బ్రహ్మానందము ఎలా ఉంటుందో తెలిసినవాడు, ఆ బ్రహ్మానందాన్ని వదలి అసత్యరూపమైన జగత్తులో సంచరించటానికి ఇష్టపడడు కదా?

**స్వాత్మానమేవ విషయేషు విభావ్య తత్రా**
**నందంవహోమ ఇతి చాత్మని భావయేద్యః ।**
**క్షీరం స్వకీయ ముపగృహ్య పరస్యగేహె**
**పాతుం స ఇచ్ఛతి జనోగురులాఘవాజ్ఞ ॥ 276**

బ్రహ్మజ్ఞానము కలిగిన పురుషుడు నాకు విషయభోగముల యందు ఆసక్తి. అవి ఆనందకరములు అని భావించినట్లైతే అంతకన్న మూర్ఖుడు ఇంకొకడు ఉండడు.

ఆత్మయే పరమానంద స్వరూపుడు. ఈ ఆత్మ సుఖము అని తలచే శబ్దాది విషయాల యందుండి వాటికి ఆనందం కలిగించే శక్తినిస్తున్నాడు. ఈ విషయం గతంలో చెప్పుకున్నాం. ఈ విషయం తెలిసికూడా అంటే బ్రహ్మజ్ఞానము కలిగిన పురుషుడు విషయభోగాలు శబ్దాదుల యందు నాకు మక్కువ ఎక్కువ. అవి ఆనందకరములు. ఈ రోజు నేను తింటున్న పదార్థాలు రుచిగా ఉన్నాయి. ఈ స్త్రీ చాలా అందంగా ఉన్నది. ఈ వస్తువు బాగున్నది అని తనకన్న వేరే రూపం గలిగిన వస్తువుల నుండి ఆనందం పొందాలి అనుకుంటే అంతకన్న మూర్ఖుడు ఇంకొకడుండడు. తానే పరమానంద స్వరూపుడై ఉండి, శక్తిమంతుడై ఉండి, తన వలన శక్తి పొందిన వాటిని ఆశ్రయించటం కన్న పిచ్చితనము ఇంకొకటి లేదు.

**సంసారకారణం విద్వాన్ వాసనేవాత్ర దేహినాం ।**
**శక్తి స్సా ప్రకృతిస్సైవా విద్యావిక్షేపనామికా ॥ 277**

ఈ ప్రపంచానికి, జీవులకు మనసుతో కల్పించబడిన భేదసంస్కారమే సంసారానికి కారణము. ఆ వాసననే మాయ, మూలప్రకృతి, అవిద్య, విక్షేపము అంటారు. గతంలో చెప్పిన విషయాలే మళ్ళీ చెబుతున్నారు. మనసులో ఉన్న భేదవాసనలే ఈ సంసారానికి కారణము. దాన్నే మాయాశక్తి మూలప్రకృతి విక్షేపశక్తి అవిద్య అని కూడా అంటారు.

**సుషుప్తేః పునరాయాంతి న త్సంప ద్యాపి జంతవః ।**
**అవృతేర్వాసనాయాశ్చ బలేనైవచకర్మణా ॥ 278**

వాసనలతోనే ప్రపంచము సృష్టించబడింది. ఇందులో అనుమానం లేదు. సుషుప్తి నుంచి జాగ్రదావస్థకు వచ్చినట్లుగానే, జీవులు బ్రహ్మైక్యము పొంది మరల జాగ్రదావస్థకు వస్తున్నారు.

గతంలో చెప్పినట్లుగానే వాసనల వల్లనే ఈ జగత్తు సృష్టించబడుతోంది. సుషుప్తిలో జీవుడు స్వస్వరూపంలో ఉంటాడు. ఇది బ్రహ్మైక్యము. ఈ స్థితి కలిగిన తరువాత మళ్ళీ దీనికి విరుద్ధమైన జాగ్రదావస్థ రాకూడదు. నిరాకారుడు, నిర్వికారుడు అయిన బ్రహ్మము నుంచి జగత్తు సృష్టించబడింది అనటం ఎంత నిజమో, బ్రహ్మైక్యము పొందిన జీవుడు మళ్ళీ జాగ్రదావస్థకు రావటం అంతే నిజము. వాస్తవంలో జరిగేదిదే. ప్రతిజీవి సుషుప్తి నుంచి మళ్ళీ జాగ్రదావస్థకు వస్తాడు. దీనికి కారణం ఏమిటి అంటే వాసన. జీవుడికి ఆత్మజ్ఞానము పూర్తిగా లేకపోవటం చేత బ్రహ్మతో ఐక్యమైనను అది తాత్కాలికమే. వారి ఆవరణ అజ్ఞానము అప్పటివరకే లీనమవుతుంది. కాని పూర్తిగా నశించదు. కాబట్టి ఆవరణ బలంతో, కర్మఫలము వల్ల జీవుడు మళ్ళీ జాగ్రదావస్థకు వస్తాడు. ఈ రకంగా బ్రహ్మైక్యము పొందిన జీవి మళ్ళీ జాగ్రదావస్థకి వచ్చినట్లే, నిర్వికార బ్రహ్మము నుండి సంసారము ఏర్పడుతున్నది.

## 18. మోక్షము

ముక్తి, మోక్షము, జన్మరాహిత్యము, సాయుజ్యము ఇవన్నీ పర్యాయపదాలు ఐహిక బంధాల నుంచి విముక్తి పొందటమే ముక్తి. అదే మోక్షము. చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. జగత్తేపరమేశ్వరుడు, పరమేశ్వరుడేజగత్తు. ఈ విషయం తెలిసినవాడు మహాజ్ఞాని. అతనిజీవాత్మ పరమాత్మలో లీనమవుతుంది. అతనికి పునర్జన్మఉండదు. అయితే ఇక్కడ చిన్నఅనుమానంవస్తుంది. ఇప్పుడు చెప్పిన విషయం మనకందరికీ తెలుసుకదా? పుస్తకాలుచదివి, ఉపన్యాసాలువిని తెలుసుకోవచ్చు. అదిచాలదు. మనసావాచాకర్మణా తెలుసుకోవాలి. అనుభవ పూర్వకంగా తెలుసుకోవాలి. అటువంటివాడే మహాజ్ఞాని. అతడే ముక్తపురుషుడు. ఇతడికి పిపీలికాదిబ్రహ్మపర్యంతము తనలానే కనిపిస్తుంది. ప్రతి వస్తువునందు, ప్రతిజీవియందు ఇతడు పరమాత్మనిచూడగలుగుతాడు.

అయితే పూర్వకాలంలోలాగా ఈరోజుల్లో ఎక్కువమంది ఈజ్ఞానాన్ని పొందలేక పోతున్నారు. ముక్తులు కాలేకపోతున్నారు. కొందరైతే అనుకోని పొరపాట్లు,

చేయకూడని పనులుచేసి అవమానాలుకూడా పొందుతున్నారు. దీనికి కారణం ఏమిటి? నిశితంగాఆలోచిస్తే భవబంధాలే కారణము అనిపిస్తోంది. మమ అనుకుంటే బంధము. నమమ అనుకుంటే మోక్షము. మోక్షంకావాలనుకున్నవాడు రాగద్వేషాలు, అహంకారమమకారాలు, అరిషడ్వర్గాలు అన్నీ జయించాలి. వీటిని జయించకుండానే సన్యసించటం, మోక్షంకావాలనుకోవటం జరుగుతోంది. అగ్ని చాలా గొప్పగా, బ్రహ్మాండంగా మండుతోంది. అయినప్పటికి మణి, మంత్ర, ఔషధాదులచేత కట్టడిచేయబడినట్లైతే, ఆఅగ్ని గడ్డిపోచనుకూడా దహించలేదు. అలాగే ఆత్మజ్ఞానము ఉన్నప్పటికీ బంధాలను వదలించుకోకపోయినట్లైతే అతడికి మోక్షం సిద్ధించదు.

**ప్రతిబంధో వర్తమానో విషయాసక్తి లక్షణః**

**ప్రజ్ఞామాంద్యం కుతర్కశ్చ విపర్యయ దురాగ్రహః ॥**

1. **విషయాసక్తి** – విషయముల యందు ఆసక్తి, కోరిక
2. **ప్రజ్ఞామాంద్యం** – బుద్ధి పరిశుద్ధం కాకపోవటం
3. **కుతర్కము** – ప్రతిదానికి విపరీతార్థాలు చెప్పటం
4. **విపర్యము** – అనాత్మ పదార్థాల యందు ఆత్మబుద్ధి కలిగి ఉండటం.
5. **దురాగ్రహము** – అనవసరంగా కోపం తెచ్చుకోవటం.

ఇవన్నీ రజోగుణ, తమోగుణ లక్షణాలు. మోక్షానికి ప్రతిబంధకాలు. ఇవి పోవాలంటే విపరీతమైన తపస్సు చెయ్యాలి. అగ్నిలో కట్టెలుదహించబడినట్లే, ఈ గుణాలు తపస్సువల్ల దహించబడతాయి.

ఈ విషయాల గురించి అనేకసార్లువినచ్చు. వినటంచాలదు. విన్నదాన్ని మననంచెయ్యాలి. విచారణచెయ్యాలి. ధ్యానంచెయ్యాలి. అప్పుడే విషయం గట్టి పడుతుంది. ఈ కారణంచేతనే నిరంతరము ధ్యానం చెయ్యాలి. ఇలా ధ్యానం చెయ్యగా చెయ్యగా, సముపార్జించిన జ్ఞానం బలపడుతుంది. ఒకచెట్టుకు పూలు, పిందలు, కాయలు, పండ్లు ఉన్నాయి. ఇప్పుడు మనకు కనిపిస్తున్న పండు కొన్ని రోజుల క్రితం కాయ, ఇంకొన్ని రోజుల క్రితం పింద, ఇంకొన్ని రోజుల క్రితం పూవు. అంత క్రితం మొగ్గ. ఆ మొగ్గే ఇప్పుడు పండు అయింది. ఇదే ముక్తావస్థ. పండుకు పులుపు, వగరు, చేదు అనేవి ఉండవు. అందులోని దోషాలు అన్నీ నశించిపోయి

వేపకాయ అయినా సరే పండితే తియ్యగా ఉంటుంది. అలాగే **మానవుడిలో ఎన్ని దోషాలు ఉన్నా నిరంతర ధ్యానం వల్ల అవన్నీ నశించి ముక్తుడవుతాడు.** ఒకవేళ పండు ఇంకా పుల్లగా ఉన్నది అంటే, అది ఇంకా బాగా పండలేదు అని అర్థం. అలాగే మానవుడిలో ఎంత ధ్యానం చేసినా ఇంకా గుణదోషాలున్నాయి అంటే అతడికి ఇంకాపరిపక్వత సిద్ధించలేదని అర్థం.

మోక్షాన్ని వెతుక్కుంటూ మనం పరుగులు పెట్టవలసిన అవసరం లేదు. మోక్షార్హత సాధించిన వారిని అదే వెతుక్కుంటూ వస్తుంది. కావలసిందల్లా అర్హత సాధించటమే. కలెక్టరుకావాలి అంటే దానికికావలసిన అర్హత మనంసాధించాలి. ఐఎఎస్ ప్యాసయినప్రతివారు కలెక్టరుఅవుతారు. ఇందులో సందేహంలేదు. ఐఎఎస్ ప్యాసవకపోతే ఎన్ని ప్రయత్నాలు చేసినా కలెక్టరు కాలేరు. అలాగే మోక్షానికి కావలసిన అర్హతఏమంటే బంధవిముక్తి. ఐహికబంధాల నుంచి విముక్తి పొందినవాడు, చరాచరజగత్తంతా పరమేశ్వరమయమనే జ్ఞానాన్ని అనుభవ పూర్వకంగా పొందిన వాడు మోక్షం పొందుతాడు. అతడికి మాత్రమే పునర్జన్మ ఉండదు అంటున్నాడు పార్థసారథి.

ఇక్కడ గుర్తించాల్సిన విషయం ఇంకోటుంది. సామాన్యంగా అందరూ "నాకు ఇదే ఆఖరు జన్మ కావాలి. నాకు మోక్షం రావాలి' అంటుంటారు. మోక్షం అనేది బస్సులోనో, రైల్లోనో, విమానంలోనో ఎక్కడినుంచో రాదు. అది మన దగ్గరే ఉంది. దాన్ని గుర్తించటమే మోక్షం.

**ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా మానవదేహాన్ని సృష్టించిన తరువాత ఆత్మపురుషుడు ఈ దేహంలో బ్రహ్మరంధ్రం గుండా ప్రవేశించి, నవరంధ్రాలతోను అన్ని సుఖాలు అనుభవిస్తూ, తానువేరు, దేహంవేరు అనే మాట మర్చిపోయి, వచ్చిన దారికూడా గుర్తులేక, తానేదేహము అనే అజ్ఞానంలో కూరుకుపోయి జీవాత్మవేరు, పరమాత్మవేరు అనుకుంటున్నాడు. అజ్ఞానంగనక వదలిపోతేజీవాత్మ పరమాత్మ రెండూఒకటే అనేవిషయం తెలుస్తుంది. తానే పరమేశ్వర స్వరూపం అనితెలుసుకుంటాడు. అదేమోక్షస్థితి. కాబట్టి మోక్షమనేది ఎక్కడినుంచో రాదు. తనను తాను తెలుసుకోవటమే మోక్షము. స్వస్వరూపజ్ఞానమేమోక్షము.

కాబట్టి ఓ సాధకుడా ! **మోక్షమనేది క్రొత్తగా ఎక్కడినుంచోరాదు. అది నీ దగ్గరేఉన్నది. నిన్ను నువ్వు తెలుసుకోవటమే మోక్షము అంటున్నారు పరమానందనాథులు.**

మొత్తం మీద సాకారోపాసన గాని నిరాకారోపాసన గాని చేసిన వారందరూ పరబ్రహ్మలో లీనమవుతారు. వీరికి మరుజన్మలేదు ముక్తుడు జగసృష్టి తప్ప అన్నీ చేయగలడు అని చెబుతున్నాయి బ్రహ్మసూత్రాలు.

సాకారోపాసన చేసిన వారు బ్రహ్మలోకం చేరతారు. ఎక్కడైతే అరము, ణ్యము అని రెండు సముద్రాలుంటాయో, ఎక్కడైతే ఇరం మదీయమనే సరస్సు ఉంటుందో, ఎక్కడైతే విరజానది ఉంటుందో, ఎక్కడైతే ఈల్య అనే వృక్షము, సాయుజ్యము అనే పట్టణము, అపరాజిత అనే సౌధము ఉంటాయో అదే బ్రహ్మలోకము. అని చెబుతోంది **కౌశీతకీ బ్రాహ్మణము.** అక్కడికి చేరిన వారిలో కూడా చరాచర జగత్తంతా పరమేశ్వరి స్వరూపమే. ఆమె తప్ప ఈ జగత్తులో ఇంకేదీ లేదు. అని తెలిసిన వారికి మాత్రమే పునరావృత్తి లేదు. సాకారోపాసనలో సాధకుడు బ్రహ్మలోకంలో పొందే మహదైశ్వర్యమే బ్రహ్మానందం.

పరమేశ్వరిని మంత్రంచేతగాని, అర్చనచేతగాని, యజ్ఞాలు, యాగాలు, జపాలు, తపస్సు, యోగం చేతగాని పరమమైన భక్తిశ్రద్ధలతో అర్చించిన వారు మరణానంతరము బ్రహ్మలోకం చేరతారు. వారు చేసిన సాధనను బట్టి వారికి ఐదు రకాల ముక్తి లభిస్తుంది.

1. సార్ష్టిరూపముక్తి 2. సాలోక్యముక్తి 3. సామీప్యముక్తి 4. సారూప్యముక్తి 5.సాయుజ్యం

1. **సార్ష్టిరూపముక్తి** పొందిన వారు బ్రహ్మలోకానికి దగ్గరగా ఇంకొక పురము నిర్మించుకుని ఉంటారు.

2. **సాలోక్యముక్తి** పొందిన వారు బ్రహ్మలోకంలోనే నివసించగలుగుతారు.

3. **సామీప్యముక్తి** పొందిన వారు బ్రహ్మకు అతిదగ్గరగా సేవకులుగా ఉంటారు. పంచబ్రహ్మలు దేవికి అతిసమీపంగా ఉండి ఆమెను సేవించాలనే కోరికతో ఆమెను విశుద్ధి చక్రంలో అర్చించి, మొదటి నలుగురు ఆమె కూర్చునే ఆసనానికి కోళ్ళు కాగా, సదాశివుడు దేవి కప్పుకునే దుప్పటి అయినాడు అని శంకర భగవత్పాదుల వారు సౌందర్యలహరిలోని 92వ శ్లోకంలో వ్రాశారు. అలాగే ఇంద్రుడు తమ్మిపడగ (ఉమ్మిపాత్ర) అయినాడు.

4. **సారూప్యముక్తి** పొందినవారు బ్రహ్మతో సమానమైన రూపం ధరించి, ఆవిడ చేసే కొన్ని పనులు చేస్తుంటారు. భక్తుల యొక్క కోరికలు చాలావరకు తీరుస్తారు. మనం ఏవైనా మంచిపనులు చెయ్యాలని సంకల్పించినప్పుడు వారు దగ్గర ఉండి ఆపని పూర్తిచేయిస్తారు. నేను ఈ పుస్తకంవ్రాస్తున్నాను అంటే దీనికికారణం ఆ పవిత్రాత్మలే. వీరంతా బ్రహ్మలోకంలో ఉంటూ మహదైశ్వర్యాన్ని అనుభవిస్తారు.

5. **సాయుజ్యం :** పైనచెప్పిన నాలుగురకాలవారు తమ కర్మఫలంఉన్నంత వరకు అక్కడఉండి ఆతరువాత కర్మశేషం అనుభవించటానికి ఈలోకంలో ఉత్తమ యోనులయందు జన్మిస్తారు. పరమేశ్వరుణ్ణి అంతర్ముఖంగా ఆరాధించేవారు, తామే పరమేశ్వర స్వరూపమని త్రికరణశుద్ధిగానమ్మేవారు, జగత్తులో పరమేశ్వరుడు తప్ప ఇంకెవరూ లేరు. జగత్తేపరమేశ్వరుడు. పరమేశ్వరుడే జగత్తు అని తెలుసుకుని రాగద్వేషాలు, అహంకారమమకారాలు వదలి నిస్వార్థమైన జీవితం గడుపుతూ సర్వకాలసర్వావస్థలయందు ఆపరాశక్తినే ఉపాసించేవారు మాత్రమే సాయుజ్యం పొందుతారు. వీరికి పునర్జన్మలేదు. బ్రహ్మసూత్రాలలో వ్యాసభగవానుడు చెప్పిన 555వ సూత్రం వీరి గురించే అంటున్నాడు పార్థసారథి. వీరు సాకారోపాసకులైనాసరే, నిరాకారోపాసకులైనా సరే సాయుజ్యం పొందుతారు. పైన చెప్పిన నాలుగు రకాల ముక్తులు పొందినవారికి జగత్తును సృష్టించే అధికారంలేదు. శక్తికూడా లేదు. సాయుజ్యం పొందిన వారు పరాశక్తిలో లీనమవుతారు. వారికి ప్రత్యేకమైన అస్తిత్వం లేదు. కాబట్టి వారు జగసృష్టి చెయ్యలేరు. ఈరకంగా పరమేశ్వరితప్ప ఎవరూ జగసృష్టి చెయ్యలేరు.

## 19. అర్చిరాది మార్గం

అర్చిరాది మార్గం ద్వారా బ్రహ్మలోకం చేరిన వారికి పునరావృత్తి లేదు అని చెబుతోంది కౌషీతకీ బ్రాహ్మణం. సగుణోపాసకులంతా ఈ మార్గం ద్వారానే వెడతారు. వైష్ణవులు, శైవులు, శాక్తేయులు, అమ్మవారిని అర్చించే వారు వీరందరూ సగుణోపాసకులే. అందరూ ఇదేమార్గంద్వారా బ్రహ్మలోకం చేరతారు. అక్కడ కార్యబ్రహ్మ (ఇతడే సగుణబ్రహ్మ) తాను అనుభవించే ఐశ్వర్యాన్నే అనుభవిస్తూ వారినికూడా అక్కడేఉండమంటాడు. ఆయనమాటలు తలదాల్చి వారంతా

అక్కడేఉంటూ, అక్కడజరిగే నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవాది వివిధోత్సవాలు తిలకిస్తూ, పరమానందాన్ని పొందుతారు. అదే బ్రహ్మానందం. ఇదే కైవల్యము అని, వీరికి పునరావృత్తి లేదని అంటారు. కాని అది నిజం కాదు. ఎందుకని అంటే?

పరబ్రహ్మను గూర్చిన భయంతోనే గాలి వీస్తోంది. సూర్యుడు ఉదయిస్తున్నాడు ఇంద్రాదిదేవతలు తమ విధులను సక్రమంగా నిర్వహిస్తున్నారు. దేవతలు కూడా సక్రమంగా తమ విధులు నిర్వర్తించటానికి కారణం బ్రహ్మ ఉండటమే. బ్రహ్మమే ఆనందము. ఇది క్షణికానందం కాదు. శాశ్వతానందం. విషయవాంఛలవల్ల కలిగేది లౌకికానందం. ఇది క్షణికం. అనుభవించగానే ఆ ఆనందం తగ్గిపోతుంది. అవిద్య అంటే అజ్ఞానము, విషయ వాంఛలు తగ్గిన కొద్దీ ఆ ఆనందం పెరుగుతుంది. అదే మానవుల, మనుష్య గంధర్వుల, దేవగంధర్వుల ఆనందంగా అభివృద్ధి చెంది స్వాభావికమైన పరిపూర్ణానందంగా మారుతుంది. అదే అద్వైతానందం.

ఈ ఆనందం శ్రోత్రియుడు, (వేద కర్మలనాచరించువాడు) సదాచార సంపన్నుడు, నిష్కాముడు అయిన బ్రహ్మవేత్తయే అనుభవించతగ్గది. ఈ మూడు గుణాలు లేనివాడికి ఈ ఆనందం లభించదు.

ఈ లోకంలోని సంపద అంతా యువకుడు, సదాచార సంపన్నుడు, వేదాధ్యాయి, బలమైనవాడు అనుభవించటానికే ఉన్నది. దీన్ని అనుభవించటం వల్ల కలిగే ఆనందము మానుషానందము. మానుషానందునికి నూర్రెట్లు మనుష్య గంధర్వానందము. మనుష్య గంధర్వులంటే మానవులై ఉండి పుణ్యకర్మలచేత గంధరత్వం పొందినవారు.

మనుష్య గంధర్వానందానికి నూరురెట్లు దేవగంధర్వానందం. సృష్టికాలంలో దేవలోకంలో గంధర్వుడుగా పుట్టినవాడు దేవగంధర్వుడు. దేవగంధర్వానందానికి నూరురెట్లు చిరలోక పితరానందము. చిరకాలం ఉండే లోకంలో ఉన్న పితృదేవతలు చిరలోక పితరులు.

దానికి నూరురెట్లు అజానజదేవానందము. ఈ లోకము దేవలోకానికి పైన ఉన్నది. అక్కడి వారు అజానజ దేవతలు, దానికి నూరురెట్లు కర్మ దేవానందము. వైదిక కర్మలు చేసి దైవత్వం పొందిన వారు కర్మదేవలు.

దానికి నూరురెట్లు దేవానందము. యజ్ఞంలో హవిర్భాగము తీసుకునే 33 మంది దేవతలు.

దానికి నూరు రెట్లు ఇంద్రానందము

దానికి నూరు రెట్లు బృహస్పతి ఆనందము.

దానికి నూరురెట్లు ప్రజాపతి ఆనందము (విరాట్పురుషుడు)

దానికి నూరు రెట్లు బ్రహ్మానందం. అతడే మానవులందరిలోనూ ఉన్నాడు.

బ్రహ్మలోకంలో ఈ ఆనందాన్ని పొందేది సగుణోపాసకుడే. అతడు మరణానంతరము బ్రహ్మలోకం చేరి మహదైశ్వర్యాన్ని అనుభవిస్తాడు. అక్కడ కష్టాలు, దుఃఖాలు, రాగద్వేషాలు, అహంకార మమకారాలు ఏవీ ఉండవు. అంతా ఆనందమే. అది అనిర్వచనీయము అనుభవైకవేద్యము. అదే బ్రహ్మానందము.

నిర్గుణోపాసకుడికి దేహపాతం కలగగానే ఘటాకాశం మహదాకాశంలో లీనమైనట్లుగా సాధకుని జీవాత్మ పరమాత్మలో లీనమవుతుంది. అతడు ప్రత్యేకంగా ఏ లోకానికి పోడు కాబట్టి అతడికి ఈ ఆనంద స్థితి ఉండదు. కాని దేహాభిమానం లేని జ్ఞాని తానే పరబ్రహ్మ స్వరూపము అని భావిస్తాడు కాబట్టి జీవించి ఉండగానే బ్రహ్మానందాన్ని ఈ లోకంలోనే పొందుతాడు.

ముక్తి నాలుగు విధాలు అని చెప్పింది ముక్తికోపనిషత్తు. ఈ ముక్తిలో తేడా ఉంది.

1. సాలోక్యము 2. సామీప్యము 3. సారూప్యము 4. సాయుజ్యము.

ఇది క్రమముక్తి. పరమపదం చేరటానికి అర్హత సంపాదించినవారంతా అర్చిరాది మార్గం గుండా అక్కడికి వెడతారు. వారిలో పూర్తిగా జ్ఞానంఉన్నవారికి అంటే **'నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని'** అని భావించిన వారికి మాత్రమే సాయుజ్యంసిద్ధిస్తుంది. అటువంటి వారు పరబ్రహ్మలో లీనమవుతారు. మిగిలినవారు అలా లీనం కావటానికి అవసరమయ్యే జ్ఞానంవచ్చేదాకా వేచిఉండి, జ్ఞానసముపార్జన చేసి, ఆ తరువాతనే సాయుజ్యం పొందుతారు.

**స్వవాసనాప్రేరిత ఏవ వర్తతే సర్వోఽపి లోకః సకల క్రియాసు ।**

**సంసారబంధః ఖలు వాసనాకృతః తన్ముక్తిరేవాత్మ విదాం విముక్తిః ॥279**

ఈ జగత్తంతా అన్ని కార్యముల యందు తమ యొక్క మనోగత సంస్కారములచే ప్రేరేపించబడినదై ప్రవర్తిల్లుతున్నది. ఆ వాసనలను వదలి వేయటము లేదా వాటి నుంచి బయటకు రావటమే **మోక్షము.**

ప్రతి మానవుడు తన సంస్కారము వలన దానికి అనుగుణంగా పుణ్యపాప కర్మలు చేస్తున్నాడు. కాబట్టి సంసారానికి కారణము ఈ వాసనలే. సంసార బంధానికి వాసనలకన్న వేరైన స్వరూపము ఇంకొకటి లేదు. అందుచేత వాసనలు నశించటమే **మోక్షము.**

**"వాసనాతానవం రామ ముక్తి" రిత్యాత్మ విత్తమః ।**

**వసిష్ఠః ప్రాహ యత్తస్మా త్కర్తవ్యో వాసనాక్షయః ॥ 280**

వాసనాక్షయమే మోక్షము అని వశిష్ఠ మహర్షి శ్రీరాముడికి చెప్పాడు. కాబట్టి సంస్కారాలు నాశనం చెయ్యాలి.

యోగవాసిష్ఠముతో వశిష్ఠ మహర్షి వాసనాక్షయమే మోక్షము అని శ్రీరాముడికి చెబుతాడు. ఈ మాటను మళ్ళీ మనం విచారించనవసరం లేదు. ముక్తిని కోరేవారు వాసనలను నశింపజెయ్యాలి.

**బ్రహ్మాత్మైకత్వ బోధేన వినిష్టావరణస్య తు ।**

**వాసనానాం క్షయః కర్తుం శక్యతే బ్రహ్మనిష్ఠయా ॥ 281**

జీవబ్రహ్మైక్యజ్ఞానంతో వాసనలు నశించిన వాడికి బ్రహ్మమునందు నిలచి ఉండుట చేత అన్ని వాసనలు నాశనము చేయటం సాధ్యమవుతుంది.

వేదప్రమాణము, యుక్తి, అనుభవముల చేత జీవుడికి బ్రహ్మమునకు భేదము లేదని తెలిస్తే మూలాజ్ఞానము నశిస్తుంది. బ్రహ్మనిష్ట కూడా కుదురుతుంది. ఇలా జరిగినప్పుడు వాసనలు సంపూర్ణముగా నాశనము చేయవచ్చును. కాబట్టి వాసనాక్షయము కావాలంటే ఆత్మజ్ఞానమే ఉపాయము.

**నిశ్శేషావృతివిధ్వంసే వాసనాసంతతిక్షయే ।**

**యతేర్విదేహకైవల్యం స్వయం సిధ్యతి నాన్యథా ॥ 282**

సాధకుడికి అజ్ఞానం, వాసనలు పూర్తిగా నాశనం అయితే విదేహముక్తితో బ్రహ్మైక్యం కలగటానికి ఇతర ప్రయత్నాలేవీ అవసరం లేదు.

అజ్ఞానం పూర్తిగా నశించింది. దాంతోపాటుగా వాసనలు కూడా నశించాయి. ఇప్పుడు జీవన్ముక్తుడవుతాడు. ఆయుష ఉన్నంత వరకు జీవించి దేహపాతం జరిగిన తరువాత విదేహముక్తి పొందుతాడు. ఇంకా ఏ రకమైన ఇతర ప్రయత్నాలు చేయవలసిన అవసరం లేదు.

**స్థూలశ్యాపి చ సూక్ష్మస్య కారణ స్యాపి వర్ష్మణః ।**

**సమ్యగ్వి నాశః కర్తవ్యః తత్త న్నియత సాధనైః ॥** **283**

శరీరత్రయము యొక్క వాసనలను నశింపచెయ్యాలి. అప్పుడే మోక్షం సిద్ధిస్తుంది.

ఈ శ్లోకంలో వాసనాక్షయానికి వివిధ ఉపాయాలు చెబుతున్నారు. శరీరాలు మూడు 1.స్థూలశరీరము 2.సూక్ష్మశరీరము 3.కారణశరీరము. ఈ జగత్తంతా వాసనారూపమే. అజ్ఞాని ఆత్మగా భావించే స్థూలసూక్ష్మకారణ శరీరాలు కూడా వాసనలతోనే ఏర్పడ్డాయి. అందుచేత ఈ వాసనలను నశింపచెయ్యటానికి మూడు శరీరాలకు విడివిడిగా ఉపాయాలు చెబుతున్నారు. ముందుగా మూడు శరీరాలను వివరిస్తున్నారు.

**స్థూలస్త్వన్నమయో దేహ స్సూక్ష్మః స్యా ద్వాసనామయః ।**

**మూలాజ్ఞానం యత్తదేవ శరీరం కారణాభిధమ్ ॥** **284**

అన్నం వలన జనించి, అన్నం వల్లనే వృద్ధి చెందేది స్థూలశరీరము. సంస్కారాలే స్వరూపంగా గలది సూక్ష్మశరీరము అజ్ఞానము కలిగినది కారణ శరీరము.

**1.స్థూలశరీరము :** పంచీకరణ చేయబడిన పంచమహాభూతాల వల్ల ఏర్పడి ఆగామి, సంచిత, ప్రారబ్ధములు కలది స్థూలశరీరము. అన్నం వల్ల జన్మించి అన్నం వల్లనే వృద్ధి చెందుతుంది. మానవుడు చేసిన కర్మఫలాన్ని ఈ దేహంతోనే అనుభవిస్తాడు.

**2.సూక్ష్మశరీరము :** పంచప్రాణాలు, మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు, ఈ పదిహేడింటితోను కూడినది. అపంచీకృత మహాభూతాల వల్ల ఏర్పడినది సూక్ష్మశరీరము. దీన్నే లింగశరీరము అంటారు. సుఖదుఃఖాలు అనుభవించేది దీనితోనే. ఇది పూర్తిగా వాసనలతో నిండి ఉంటుంది.

**3.కారణశరీరము :** మాటలతో చెప్పలేనిది, ఆది లేని అజ్ఞానమే కారణశరీరము. ఇది సుషుప్తిలో ఉంటుంది. ఈ రకగా మూడు శరీరాలను చెప్పి ఇప్పుడు వీటిని జయించే ఉపాయాలు చెబుతున్నారు. కారణ శరీరంతో ప్రారంభం చేస్తున్నారు.

**బ్రహ్మాత్మైకత్వ విజ్ఞాన శక్త్యైవ బ్రహ్మవిద్యతిః ।**

**నాశయేత్కారణం దేహ మకుర్వన్ కించిదంతరమ్ ॥ 285**

బ్రహ్మవేత్త అయినవాడు పరబ్రహ్మకు ప్రత్యగాత్మకు గల ఐక్యతను తెలుసుకుంటే, జీవాత్మ పరమాత్మల మధ్య అభేదం తెలుసుకుంటే కారణదేహం నశిస్తుంది.

కారణశరీరము అంటే అజ్ఞానము అని చెప్పుకున్నాం కదా. కారణ శరీరాన్ని నాశనం చెయ్యాలంటే అజ్ఞానం నశించాలి. దేహమే ఆత్మ అనేది అజ్ఞానం. జీవాత్మ వేరు పరమాత్మ వేరు అనేది అజ్ఞానం. జగత్తు వేరు పరబ్రహ్మ వేరు అనేది అజ్ఞానం. ఈ అజ్ఞానం నశిస్తే జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే. జగత్తే బ్రహ్మము, బ్రహ్మమే జగత్తు. దేహం వేరు ఆత్మ వేరు. ఈ విషయాలు తెలుసుకుంటే అజ్ఞానం నశిస్తుంది.

**విశ్వం బ్రహ్మాత్మనా వశ్య న్న జస్రం వాసనాతమం।**

**నిర్మాల్య బ్రహ్మ విద్యాతి ముక్తిం నిర్వాణలక్షణమ్ ॥ 286**

జగత్తే పరబ్రహ్మ అని తెలుసుకుంటే సంకల్ప రూపమైన సూక్ష్మశరీరము నాశనమయి చిత్తశాంతి కలుగుతుంది.

కారణ శరీరం నశించింది. జగత్తే బ్రహ్మ. బ్రహ్మమే జగత్తు అని తెలుసుకున్నాడు. జగత్తంతా బ్రహ్మరూపమే అని తెలిస్తే సూక్ష్మశరీరం నాశనమవుతుంది. సూక్ష్మశరీరానికి సంకల్పాలే ఆధారము. ఈ సంకల్పాలతో జగత్తును వివిధ రూపాలుగా ఘటము, పటము, పులి, మేక ఊహిస్తున్నాడు. అంటే మనసుతో సంకల్పం చేస్తున్నాడు కాబట్టే జగత్తు పుడుతోంది. ఈ సంకల్పాలు లేకపోతే జగత్తు ఆవిర్భవించదు. జ్ఞానియైన వాడికి జగత్తంతా పరబ్రహ్మ స్వరూపము. జీవాత్మ పరమాత్మ ఒకటే అనే విషయం తెలుసు. అతడికి మనోనాశనము జరిగింది. మనసును జయించాడు. కాబట్టి సంకల్ప వికల్పాలు చేయడు. ఎప్పుడైతే సంకల్పాలు లేవో, అప్పుడు జగదావిర్భావం కాదు. దీంతో సూక్ష్మశరీరము నాశనమవుతుంది. సంకల్పాలు లేకపోతే మనసు ప్రశాంతంగా ఉంటుంది.

**అక్షర్రాత్మజ్ఞానవహ్ని జ్వాలాయాం త్రివిధం స్ఫుటమ్ ।**

**కర్మ దగ్ధ్వా స్వయం తస్మా న్ముక్తః స్థూలం వినాశయేత్ ॥ 287**

'నేను కర్తను కాను' అనే భావనతో స్థూలశరీరాన్ని నశింప చేయవచ్చును.

కర్మలు మూడు రకాలు

**1.సంచితకర్మ :** గత జన్మలలో చేసిన మొత్తం కర్మల ఫలితం ఇందులో పుణ్యకర్మలు పాపకర్మలు అన్నీ ఉంటాయి. వీటన్నింటి ఫలితము జీవుడే అనుభవించాలి. దీనిలో కొంత ఫలితం ఈ జన్మలో అనుభవిస్తే మిగిలినది నిల్వ ఉంటుంది. ఈ జన్మలో చేసిన ఫలితం మళ్ళీ ఆ నిల్వకు తోడవుతుంది. ఈ రకంగా సంచితకర్మ ఎప్పటికప్పుడు పెరుగుతూనే ఉంటుంది. అనుభవించటం వల్ల ఎన్నటికీ తరగదు. ఇది కేవలము జ్ఞానాగ్ని వల్లనే నాశనం కావాలి.

**2.ఆగామికర్మ:** ఈ జన్మలో చేసే కర్మ ఇది. ఈ కర్మ ఫలితమంతా నిల్వ ఉన్న సంచితకర్మకు కలుస్తుంది. అప్పుడు సంచితకర్మ పెద్దకొండలా పేరుకు పోతుంది.

**3.ప్రారబ్ధ కర్మ:** ఇది ఈ జన్మలో అనుభవించవలసిన కర్మ. ఎక్కుపెట్టి వదలిన బాణం లాంటిది. దీన్ని ఎవరూ తప్పించలేరు. ఇది మూడు రకాలుగా ఉంటుంది.

**1.ఇచ్ఛా ప్రారబ్ధము :** మన ఇష్ట ప్రకారము అత్యంతమైన ప్రేమతో అనుభవించేది. భార్యాబిడ్డలు మనవలు వీరియందు మమకారం. ఇవి బంగారు సంకెళ్ళు. పట్టుత్రాడుతో వేసిన బంధనాలు. మానవుడు చాలా ఇష్టంతో ఈ బంధాలు తగిలించుకుంటాడు.

**2.అనిచ్ఛా ప్రారబ్దము :** ఇష్టం లేకపోయినా బలవంతంగా నైనా తప్పనిసరి పరిస్థితులలో అనుభవించేది. ఎద్దు బండి లాగాలి అనుకోదు. బండి లాగకపోతే రైతు కొడతాడు. తినటానికి తిండి ఉండదు. అలాగే మానవులు కూడా కొన్ని సందర్భాలలో తప్పనిసరిగా ఈ కర్మఫలితాన్ని అనుభవిస్తారు. ఇవి ఇనుప సంకెళ్ళు. కొబ్బరిత్రాడుతో వేసిన బంధాలు. ఇష్టం లేకపోయినా బలవంతంగా బాధపడుతూ అనుభవిస్తాడు.

**3.పరేచ్ఛా ప్రారబ్ధము :** ఇతరుల తృప్తికోసం చేసే పనులు. భార్యకు ఇష్టమనో, పిల్లలకు ఇష్టమనే ఈ పనులు చేస్తుంటాం. వీటివల్ల మనకు సంబంధించిన అవతలి వ్యక్తి ఆనందిస్తాడు. ఇవి వెండి సంకెళ్ళు. నూలు త్రాడుతో వేసిన బంధాలు.

ఏది ఏమైనప్పటికీ ఇవన్నీ బంధనాలే. సంకెళ్ళు బంగారం అయితే ఏమిటి? వెండి అయితే ఏమిటి? ఇనుపవి అయితే ఏమిటి? ఏవైనా కదలటానికి వీలుండదు. బంధనం బంధనమే. ఈ రకంగా వచ్చిన బంధాల వల్లనే జగత్తు ప్రవర్తిల్లుతున్నది. ఈ బంధాలు గనక నాశనం అయితే స్థూలశరీరం నాశనమవుతుంది. కాబట్టి ఈ కర్మలకు 'నేను కర్తను కాను' అనే భావనతో స్థూలశరీరాన్ని నశింప చేయవచ్చును.

**బ్రహ్మైవాహమిదం విశ్వం ఇతి విశ్వస్య చాత్మనః ।**

**బ్రహ్మమాత్రత్వ విజ్ఞానం నిరర్గళ మనారతమ్ ॥ 288**

నేను పరబ్రహ్మని. జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే. అని తెలిస్తే సంసారం పూర్తిగా నాశనమవుతుంది.

జగత్తుకు నాశనం లేదు అని గతంలో చాలాసార్లు చెప్పుకున్నాం. అజ్ఞానంతో సృష్టించబడింది ఈ జగత్తు. అజ్ఞానం నాశనమయితే జగత్తు నాశనమవుతుంది. అజ్ఞానం వ్యష్టిగా నాశనమయింది కాబట్టి జ్ఞానిదృష్టిలో మాత్రమే ఈ జగత్తు లేదు. ఇక్కడ జగత్తు లేదు అంటే జగత్తే పరబ్రహ్మ. పరబ్రహ్మమే జగత్తు అని జ్ఞాని భావన చేస్తాడు. అదే జగత్తు నాశనము. అంటే సమిష్టి దృష్టిలో గనక అజ్ఞానం నాశనమయితే, అప్పుడు సమిష్టిగా జగత్తు నాశనమవుతుంది. అప్పుడు జగత్తే ఉండదు. కాని ఇది ఎప్పటికీ జరగదు. నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని అని తెలిసిన వాడికి ఈ జగత్తు లేదు. బంధాలు అంతకన్నా లేవు. నాకన్న వేరైన వస్తువు ఏదీ లేదు అని తెలిసిన వాడి దృష్టిలో ఈ సంసారము కాని ఈ జగత్తు గాని లేవు. అతడే ముక్తపురుషుడు.

**యదా తదా మృతేర్నాశో నిశ్శేష ఇతి బుధ్యతాం ।**

**వాహం మమేద మిత్యాది ప్రత్యయః పరబోధనాత్ ।**

**యదా భవతి "సూక్ష్మస్య తదా నాశ" ఇతీష్యతాం ॥**

**కారణస్యాపి సూక్ష్మస్య వినాశే సతి వర్ష్మణః ॥ 289**

ఎప్పుడైతే నేను నాది అనే సంకల్పాలు ఒకసారి కలుగుతూ, ఒకసారి కలగకుండా ఉంటాయో, అప్పుడు సూక్ష్మశరీరము నాశనమైనట్లుగా భావించాలి. సూక్ష్మశరీరం నశిస్తే కారణ శరీరము కూడా నశించినట్లే.

నేను నాది అనే సంకల్పాలు స్వాభావికంగా ఎప్పుడు కలగవో, ఇతరులు చెప్పినప్పుడు కూడా నియతముల గలగవో, నేను నాది అనే సంకల్పాలు స్వాభావికంగా కలగవు. వాటిని గురించి ఇతరులు చెప్పినా సంకల్పాలు కలగవు. అప్పుడు సూక్ష్మశరీరం నశించింది అనుకోవాలి. వీటిని బట్టి సూక్ష్మశరీరం నశించింది అని ఖచ్చితంగా తెలిస్తే, కారణ శరీరము కూడా నశించిందని చెప్పవచ్చు.

**ప్రతిక్రియాం వినా భోగః ప్రాప్తయోఃస్సుఖదుఃఖయోః ।**

**యదా సమాప్తః స్థూలస్య తదాంత ఇతి మీయతామ్ ॥ 290**

పూర్వకర్మానుసారంగా వచ్చిన సుఖం పెంచుకోవటానికి, దుఃఖాన్ని తగ్గించుకోవటానికి ప్రయత్నం చెయ్యకుండా ఉంటే స్థూలశరీరము నాశనమైనట్లే.

జీవితంలో సామాన్యంగా సుఖాలు పెంచుకోవటానికి దుఃఖాలు తగ్గించు కోవటానికి ప్రయత్నిస్తుంటారు. దానికోసమే జపాలు, తపాలు, పూజలు, అర్చనలు, యాగాలు, హోమాలు చేస్తుంటారు. వేదంలో కూడా ఇవి చెప్పబడ్డాయి. ఇష్టప్రాప్తికి, అనిష్ట పరిహారానికి చెప్పిన అలౌకిక విధానమే వేదము. ఏ జీవి అయితే నాకు సుఖాలే కావాలి అని వాటికోసం ప్రయత్నం చేయడో, అతని దృష్టిలో స్థూలశరీరము నశించినట్లే ప్రారబ్ధాన్ని అనుభవిస్తూ, శరీరము నందు అపేక్ష లేనివాడికి స్థూలశరీరము నశించినట్లే అందుకే జ్ఞాని అయినవాడు శరీరాన్ని శవంలాగా చూస్తాడు. అంటే అతడి దృష్టిలో స్థూలశరీరము నాశనమయింది. ఉన్నా లేనట్లే లెక్క. ఈ శరీరము పట్ల ఉదాసీనంగా వ్యవహరించే వాడికి స్థూలశరీరము నాశనమయినట్లే.

**స్థూలకారణ సూక్ష్మాణాం త్రయాణాం యస్య కస్యచిత్ ।**

**యత్కించి దవశిష్టత్వే సతాం ముక్తి ర్దవీయసీ ॥ 291**

స్థూల సూక్ష్మ కారణ శరీరాలలో ఏదైనా ఒకటి మిగిలి ఉన్నప్పటికీ మోక్షంరాదు.

దేహత్రయము పూర్తిగా నశిస్తేనే మోక్షం వస్తుంది. దేహంలో వాసన అనేది ఏదీ ఉండరాదు. ఏ మాత్రం ఉన్నా వాసనా లేశము ఉన్నప్పటికీ మోక్షం సిద్ధించదు. పైకి ఎగిరేవాడి కాలు పట్టుకుని లాగినట్లౌతుంది.

**తస్మాద్దేహత్రయం సద్భి స్తత్తత్సాధననిష్ఠయా ।**

**విధ్వంస్యతాం ప్రయత్నే న నిర్వాణసుఖ సిద్ధయే ॥ 292**

అందుచేత సత్పురుషులు దేహత్రయంలో వాసనలు పూర్తిగా నశించేదాకా ప్రయత్నం చెయ్యాలి.

మోక్షం కావాలంటే వాసనాక్షయం జరగాలి కాబట్టి మోక్షగాములైన వారు స్థూలసూక్ష్మ కారణ శరీరాలు మూడింటిలోను ఏ మాత్రము వాసన ఉండరాదు. కాబట్టి సాధకుడు అన్ని రకాల ప్రయత్నాలతోను వాసనలను పూర్తిగా నాశనం చెయ్యాలి.

**అసత్ప్రవృత్తి మేవాహు ర్నిష్ఠాయాః ప్రతిబంధకం ।** **293**

**అసత్ప్రవృత్త్యాహంభావ ఇచ్ఛాదోషోఽపి వర్ధతే ।**

**విద్వానపి చ తద్వృద్ధ్యా పతత్యేవ న సంశయః ॥** **294**

సాధన అనుష్టానాలకు భేదదృష్టి ఆటంకం కలిగిస్తుంది. భేదదృష్టి వల్ల అహంకార మమకారాలు పెరుగుతాయి. ఇవి పెరిగితే ఎంతటి జ్ఞానియైనా పతితుడౌతాడు.

జీవాత్మ పరమాత్మ వేరు. జగత్తు వేరు బ్రహ్మము వేరు ఇటువంటి భేదదృష్టి రాకూడదు. సామాన్య మానవులకు ఇది సహజం కాని మోక్షగాములకు ఈ దృష్టి ఉండకూడదు. భేదదృష్టి ఉన్నట్లైతే ఎంతటి జ్ఞాని అయినా పతితుడౌతాడు. ఇది నిశ్చయము. **కాబట్టి భేదదృష్టి ఏ మాత్రము పనికిరాదు.**

**ఆత్మానం చ జగచ్చాపి పూర్ణం బ్రహ్మైవ పశ్యతః ।**

**యతేరేవ విముక్తిస్స్యా న్నకించిద్భేద దర్శినః ॥** **295**

ఈ జగత్తును పరిపూర్ణమైన పరబ్రహ్మాగా చూసినవాడికే మోక్షం కలుగుతుంది. ఏ మాత్రం భేదభావమున్నా మోక్షం సిద్ధించదు.

భేదదృష్టిని పూర్తిగా నాశనం చేసి, జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమని భావన చేసిన వారికే ముక్తి కలుగుతుంది. ఈ **భేదభావము అణుమాత్రం ఉన్నా మోక్షం సిద్ధించదు.**

**యదా హ్యేవైష ఏతస్మి న్నుదరమిత్యేవ హి శ్రుతిః ।**

**ముక్త్యభావం జ్ఞానినోఽపి ప్రబ్రూతే భేదదర్శినః ॥** **296**

పరబ్రహ్మమందు భేదదృష్టి కలిగి ఉన్నట్లైతే సంసారము అంటే భయం కలుగుతుంది. మోక్షం కలగదు.

ఇంతవరకు చెప్పుకున్న దాన్ని బట్టి బ్రహ్మము జగత్తు రెండూ ఒకటే. కాని ఆ రెండింటి మధ్యన భేదమున్నదని భావించినట్లైతే, అంటే అజ్ఞానం ఉంటే సంసారం కలుగుతోంది. జగత్తంతా వేరుగా కనుపిస్తుంది. జగత్తు యధార్ధం అనిపిస్తుంది. బంధాలు గట్టి పడతాయి. మళ్ళీ లంపటంలో కూరుకుపోతాడు. సంసారమంటే భయం వేస్తుంది. అంతేకాని **అజ్ఞానం ఉన్న వారికి మోక్షం కలగదు.**

## ౨౦. వాసనాక్షయము

మోక్షం కావాలంటే వాసనాక్షయం కావాలి. అన్ని రకాల సంస్కారాలు నాశనం కావాలి. లౌకిక వాసనలు పూర్తిగా నాశనం కావాలి. దేహత్రయం పూర్తిగా నశించాలి. స్థూల సూక్ష్మ కారణ శరీరాలతో ఏ ఒక్కటి మిగిలి ఉన్నప్పటికీ మోక్షం రాదు. వాసనలు పైకి వెళ్ళేవాడిని క్రిందికి లాగుతాయి. సాధకుడు అన్ని రకాల ప్రయత్నాలతోను వాసనలను పూర్తిగా నాశనం చెయ్యాలి. అజ్ఞానం వల్లనే వాసనలు వస్తాయి. అజ్ఞానం ఉన్నవారికి మోక్షం రాదు. ఏ పురుషుడైతే జగత్తులోని అన్ని పదార్ధాలను పరబ్రహ్మ స్వరూపంగానే చూడగలుగుతాడో, అనేక రూపాలలో ఉన్న జగత్తును పరబ్రహ్మగా భావించగలుగుతాడో అతడి సంస్కారాలన్నీ నాశనమయి పోతాయి. వాసనలు శించగానే కర్మలు కూడా నశించిపోతాయి. సాధకుడు ముక్తి పొందుతాడు. సాధకుడు వాసనలను నాశనం చేసి, జీవాత్మకు పరమాత్మకు బేదం లేదని తెలుసుకుంటే ముక్తి పొందుతాడు. వేదాలు చదివినా, శాస్త్రాలు చదివినా, సద్గురువును సేవించినా వ్యవహారంలోకి వచ్చేసరికి నువ్వు నేను అనే తేడాలుంటాయి. ఇదంతా అజ్ఞానం యొక్క పని. తీవ్రమైన ప్రయత్నంతో అజ్ఞానాన్ని నాశనం చేస్తే సర్వమయుడౌతాడు.

సంస్కారాలు పూర్తిగా నశించాలి. ఇదంతా జగత్తు అనే భావన వదలి ఇదంతా పరబ్రహ్మము అని భావించాలి. వాసనాక్షయానికి ఇంతకన్న మంచి ఉపాయం లేదు. **వాసనాక్షయమైన వాడు మోక్షం పొందుతాడు.**

**యః సరవత్ర బ్రహ్మదృష్ట్యా సర్వం బ్రహ్మైవ పశ్యతి ।**

**వాసనాస్తస్య లీయంతే స్వకార్యైః సహసా సహ ॥** **297**

ఏ పురుషుడైతే అన్ని పదార్థముల యందు పరబ్రహ్మనే చూడగలుగుతాడో, అనేక రకాలయిన ఈ జగత్తును బ్రహ్మముగా భావించగలుగుతాడో అతడియొక్క సంస్కారములన్నీ నాశనమయి పోతాయి.

భేదదృష్టి గలవాడికి మోక్షం సిద్ధించదు. అతడి సంస్కారములు నాశనము కావు. ఏ మానవుడైతే జీవాత్మ పరమాత్మల మధ్య భేదం లేకుండా, జగత్తు బ్రహ్మముల మధ్య భేదం లేకుండా అంతా పరబ్రహ్మ స్వరూపమే అని భావన చేస్తాడో, వ్యవహారంలో తనకు ఏ పదార్థము ఎలా కనుపించినప్పటికీ వాటిని బ్రహ్మముగానే చూస్తాడో, అతడికి వాసనాక్షయమవుతుంది. **వాసనలు నశించగానే వాటి కర్మలు కూడా నశించిపోతాయి. సాధకుడు ముక్తి పొందుతాడు.**

**త్వమహ మిదమితీవ భేదదృష్టిః ప్రభవతి వాసనయా విపశ్చితోఽపి ।**
**తదపనయతోఽఖిలాత్మ భావో భవతి తదా ప్రతిబద్ధబోధసిద్ధిః ॥ 298**

పూర్వజన్మల సంస్కారాన్ని బట్టి నువ్వు నేను అది ఇది అనే భేదజ్ఞానము కలుగుతుంది. ఈ భేదజ్ఞానాన్ని నశింపచేస్తే సర్వమయత్వము కలుగుతుంది.

వేదాలు చదివినా, శాస్త్రాలు చదివినా, గురువు దగ్గర శిష్యరికం చేసినా, ఎంత అనుభవం ఉన్నా వ్యవహారంలోకి వచ్చే సరికి నేను నువ్వు అది ఇది అనే తేడాలు ఉంటాయి. దీనికి కారణము 'మూలాజ్ఞానము'. కాబట్టి తీవ్రమైన ప్రయత్నంతో అజ్ఞానాన్ని నాశనం చెయ్యాలి. అప్పుడు సాధకుడికి 'సర్వమయత్వము' సిద్ధిస్తుంది. జ్ఞానం కూడా ప్రతిబంధాలు లేకుండా స్థిరపడుతుంది.

**అప్రతిబద్ధే బోధే సర్వం బ్రహ్మైవ చేతసో భవతి ।**
**నాస్తి తదా సంసారో భవతి సదానంద సౌఖ్య విస్ఫూర్తిః ॥ 299**

జ్ఞానానికి ప్రతిబంధత్రయము లేకపోతే మనసుకు అన్ని పదార్థాలు బ్రహ్మముగానే కనుపిస్తాయి. అప్పుడు సంసారము ఉండదు. బ్రహ్మానందమే కలుగుతుంది.

జ్ఞానము ప్రతిబంధాలు లేకుండా ఉండాలి. ఈ ప్రతిబంధాలు మూడు రకాలు 1. భూతప్రతిబంధనము 2. వర్తమాన ప్రతిబంధనము 3. భవిష్యత్ప్రతిబంధనము.

1. తన అనుభవంలో ఉన్న పదార్థాలు సంకల్ప ప్రభావంతో గుర్తు వస్తుంటాయి. అంటే గతంలో ఎప్పుడో జరిగినవి గుర్తుకు వస్తాయి. దీనివల్ల బ్రహ్మనిష్ట సాగదు. ఇది భూతప్రతిబంధనము.

2. విషయ వాసనల యందు కోరిక, వేదాంత వాక్యాలకు అర్థం తెలియక పోవటం, విషయాన్ని సరిగా ఆకళింపు చేసుకోకపోవటము, కుతర్కాలు చెయ్యటము దేహధర్మాలు ఆత్మలో ఆరోపించి అభిమానించటము అనేవి వర్తమాన ప్రతిబంధనాలు.

3. ఒక చిన్న పాపపు ఆలోచన, సంస్కారముతో మనసులో మిగిలిపోతే, అది ఏదో ఒక వస్తువు మీద అభిమానంగా అవుతుంది. దానివల్ల జన్మపరంపర కొనసాగుతుంది. ఇది భవిష్యత్ప్రతిబంధము.

కాబట్టి ఈ మూడు కాలములందున్న ప్రతిబంధాలు పూర్తిగా నాశనం కావాలి. అప్పుడు జగత్తంతా పరబ్రహ్మమే అనిపిస్తుంది. సంసారముండదు. **బ్రహ్మానందం కలుగుతుంది.**

**జగద్భావం పరిత్యజ్య బ్రహ్మమాత్రత్వ భావనా ।**
**వాసనాప్రక్షయోపాయః సులభస్సూరిసమ్మతః ॥ 300**

ఇదంతా జగత్తు అనే భావన వదలి ఇదంతా పరబ్రహ్మము అని సంకల్పించాలి. దీనివల్లనే సంస్కారాలు నాశనమవుతాయి.

సంస్కారాలు నశించాలి. జగత్తంతా బ్రహ్మమే అనే జ్ఞానం బలపడాలంటే 'జగత్తంతా పరమేశ్వరమయం' అని భావించాలి. ఇదే మంచి ఉపాయము **వాసనాక్షయానికి ఇంతకన్న వేరే ఉపాయం లేదు.**

**సన్మాత్ర త్వావ లోకేన సదా సర్వత్ర సర్వతః ।**
**వాసనా క్షయ మాయాతి సత్యమత్ర న సంశయః ॥ 301**

అన్ని కాలాలలోను, అన్ని పదార్థములందు ఉన్నదంతా పరబ్రహ్మ స్వరూపమే అని భావించటం చేత సంస్కారాలన్నీ పూర్తిగా నశిస్తాయి. అనుమానం లేదు.

భేదదృష్టిని ఆశ్రయించకుండా, జగత్తును బ్రహ్మముకన్న వేరుగా భావించకుండా, **అన్ని కాలాలలోను అన్ని పదార్థాలు పరబ్రహ్మకన్న వేరు కాదు అని నిశ్చయించుకున్న మరుక్షణంలోనే సంస్కారాలన్నీ నశిస్తాయి.** ఇందులో ఇసుమంతైనా అనుమానం లేదు.

**చండాల స్పృష్టవ ద్దేహ తాదాత్మ్యం దూరత స్త్యజన్ ।**

**సత్తా మాత్ర తనూర్ధ్యాత్వా స్వరూపే నివసేన్మునిః ॥ 302**

దేహంతో ఉన్న తాదాత్మ్యతను వదలిన సాధకుడు స్వస్వరూపమందు నివశిస్తాడు.

అజ్ఞాని దృష్టిలో నేను అంటే దేహము అని అర్ధం. దేహమే నేను అనుకుని అజ్ఞానంలో ఇంకా కూరుకుపోతున్నాడు. కాబట్టి **అజ్ఞానంతో వచ్చిన బంధాలను పూర్తిగా వదలినవాడు. జగద్బ్రహ్మాలు ఒకటే అని నిశ్చయించుకున్నవాడు, స్వస్వరూపంలోనే ఉంటాడు.** నిశ్చయము. జరిగి తీరుతుంది.

**బ్రహ్మైవాహమిదం సర్వ మితి విజ్ఞానవహ్నినా ।**

**దగ్ధ్వా ద్వైతవనం సమ్య గద్వితీయో భవేన్మునిః ॥ 303**

నేను, సమస్త జగత్తు అంతా పరబ్రహ్మ స్వరూపమే. అని జ్ఞానాజ్ఞిచేత అజ్ఞాన మయమైన భేదారణ్యాన్ని దహించిన జ్ఞాని రెండవ పదార్ధము లేనివాడవుతాడు.

జ్ఞానియైన సాధకుడు జగత్తే బ్రహ్మ, బ్రహ్మమే జగత్తు అని భావించి, నేను, **ఈ చరాచర జగత్తు అంతా పరబ్రహ్మ స్వరూపమే, జగత్తుకు బ్రహ్మకు భేదం లేదు అని ఖచ్చితంగా తెలుసుకుని జ్ఞానాగ్నిలో భేదభావాన్ని పూర్తిగా దహించి అద్వితీయుడు అవుతాడు.**

**బ్రహ్మైవాస్మీతి బోధేన దేహోఽహమితి ధీపశుం ।**

**కృత్వా పూర్ణా హుతింబ్రహ్మ ణ్యశరీరో భవేన్మునిః ॥ 304**

నేను పరబ్రహ్మను అనే జ్ఞానంతో 'నేను అంటే దేహము' అనే సంకల్పమనే పశువును, జ్ఞానాగ్నిలో హోమం చేసి శరీరం లేనివాడు కావాలి. 'నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని' అనే జ్ఞానంతో 'దేహమే ఆత్మ' అనే అజ్ఞానమనబడే పశువును పరబ్రహ్మ అనే అగ్నిలో పూర్తిగా దహించి జ్ఞాని అయినవాడు శరీరం లేనివాడు కావాలి. **దేహాత్మాభిమానం తొలగిపోగానే దేహం కూడా తొలగిపోతుంది.**

**స్వప్నార్ధవ జ్జగత్సర్వ మపశ్యన్నేవ సర్వదా ।**

**శాంతాత్మా బ్రహ్మరూపే సర్వదా నివసేన్మునిః ॥ 305**

సమస్త జగత్తును కలలోని పదార్ధంలాగా అన్ని కాలాల యందు చూడకుండా, జ్ఞాని పరబ్రహ్మతో అన్ని కాలాలయందు ఉంటాడు.

కలలోని విషయాలు, పదార్ధాలు కలవచ్చినప్పుడే కనుపిస్తాయి. లేకపోతే ఉండవు. సర్వకాల సర్వావస్థల యందు కలలోని పదార్ధాలు కనుపించవు. జ్ఞాని ఈ జగత్తును కలలోని పదార్ధం లాగానే చూడకుండా, అన్ని కాలాలయందు పరబ్రహ్మతోనే ఉంటాడు. జగత్తును చూసినప్పటికీ అది సత్యము అని భావించడు.

**విద్వానహంతాం మమతామిదంతాం త్యక్త్వా పరంబ్రహ్మ సమీక్ష్య సర్వం।**
**తదేక వృత్త్యా స్వయమేవ తూష్ణీ మాస్తే సథై వైష సమాధి నిష్ఠః ॥306**

అహంకార మమకారాలను వదలి, వీటికి ఆధారమైన సమస్తము బ్రహ్మమని తెలుసుకుని, బ్రహ్మమునందే ఉండటం చేత, సర్వకాలములందు నిర్వికల్ప సమాధిలో వికారాలు లేకుండా ఉంటాడు.

జ్ఞాని నేను నాది అనే అహంకార మమకారాలను అది ఇది అనే భావనను పూర్తిగా వదలి సమస్తాన్ని బ్రహ్మముగానే చూస్తాడు. ఏ రకమైన పనులు చేయకుండా బ్రహ్మమునందే ఉంటాడు. అటువంటి జ్ఞాని నిర్వికల్ప సమాధిలో నిర్వికల్పుడై ఉంటాడు.

## 21. ప్రకృతి నిలయం చెయ్యటం

ప్రకృతి అంటే చరాచర జగత్తు అని అర్థం. ప్రకృతిని లయం చెయ్యటం అంటే జగత్తును లయం చెయ్యటమే. ఈ జగత్తంతా యధార్థంలాగానే కంటికి కనుపిస్తోంది. చేతులతో తాకుతున్నాం. నోటితో తింటున్నాం. నాలుకతో రుచి చూస్తున్నాము. ముక్కుతో వాసన చూస్తున్నాం. మనసుతో ఆస్వాదిస్తున్నాం. అంటే ఇంద్రియాల ద్వారా ఈ జగత్తును, అందులోని విశేషాలను అనుభవిస్తున్నాము. ఇప్పటి వరకు చెప్పిన తత్త్వజ్ఞానంతో విచారణ చేసి జగత్తు అసత్యము అని తెలుసుకున్నాం. కాని ఈ జగత్తంతా కంటికి కనుపిస్తోంది. ఇంద్రియాల ద్వారా దీన్ని చూస్తున్నాము. అలాంటప్పుడు ఈ జగత్తును లేదా ఈ ప్రకృతిని లయం చెయ్యటం ఎలా? అనే అనుమానం వస్తుంది.

నిజానికి జగత్తు దేనిలోను లయం కాదు. ఈ జగత్తంతా ఇక్కడే, ఇప్పుడు ఉన్నట్లుగానే అనేక మార్పులు చెందుతూ ఇలాగే ఉంటుంది. నీకు జ్ఞానం కలిగింది కదా అని జగత్తు ఎక్కడికీ పారిపోదు. నాశనం అయిపోదు. దేనిలోను లయం అంతకన్నా కాదు. ఒకవేళ ఈ జగత్తు నీ దృష్టిలో లయం అయిపోయింది అనుకున్నా, మిగిలిన వారి దృష్టిలో అలాగే ఉంటుంది. కాబట్టి ఇక్కడ గుర్తించాల్సిన విషయం

ఏమంటే జగత్తు ఎప్పుడూ లయం కాదు. దేనిలోనూ లయం కాదు. ఉన్నది ఉన్నట్లుగా అలానే ఉంటుంది. మరి లయం అయ్యేదేమిటి? అంటే నీ భావన. అసలు ఇక్కడ జగత్తే లేదు. ఉన్నట్లుగా నువు మనసుతో భావన చేశావు. గతంలో చెప్పినట్లుగా ఇది సమిష్టి భావన. అందుకే జగత్తు అందరికీ ఒకేలాగా కనుపిస్తోంది. ఇప్పుడు జగత్తును లయం చెయ్యటము అంటే నీ మనోభావాలని నాశనం చెయ్యటమే. జగత్కారణమైన చిత్తవృత్తులను కూడా పరబ్రహ్మ స్వరూపంగా భావించటమే. భ్రాంతి వల్ల త్రాడులో కనుపించిన పాము, భ్రాంతి పోయినవారికి త్రాడులాగానే కనుపిస్తుంది. అలాగే మనోభావనలు లేనివారికి ఈ జగత్తు కనుపించదు. దానికి అధిష్ఠానమైన బ్రహ్మమే కనుపిస్తుంది. వ్యావహారిక భాషలో చెప్పాలంటే జగత్తు పరబ్రహ్మలో లీనమై పోతుంది. **జగత్తు నాశనమైతే సాధకుడికి మోక్షం సిద్ధిస్తుంది.**

మనోభావనతో ఏర్పడిన జగత్తు, ఆ మనోభావాలు గనక నాశనమైన కంటికి కనుపించదు. మిగిలేది అంతా బ్రహ్మమే. దీన్నే ప్రకృతిని లయం చెయ్యటము అంటారు. **జగత్తును లయం చెయ్యటానికి జగత్కారణమైన చిత్తవృత్తులన్నీ పరబ్రహ్మగా భావించటమే మార్గము.** ఈ విషయాన్ని ఇక్కడ వివరిస్తున్నారు.

**యత్తు పృష్ఠం త్వయా పూర్వం ప్రకృతి ప్రవిలాపనం ।**
**తదిదానీం ప్రవక్ష్యామి సమానేనైవ సాదరమ్ ॥** **307**

ఓ సాధకా ! ఇంతకుముందు ప్రకృతిని లయము చేయుటను గురించి అడిగావు. ఆ విషయం ఇప్పుడు చెబుతున్నాను.

ఓ శిష్యుడా! ఓ మహాజ్ఞానీ ! 'ఈ జగత్తంతా ప్రత్యక్షంగా కనిపిస్తోంది కదా? ఇది ఎలా నశిస్తుంది?' అని గతంలో నువు అడిగావు. ఇప్పుడు దాన్ని నీకు వివరిస్తాను.

**సర్వాసాం దృశ్యవృత్తీనాం తత్త ద్వాసనయా సహ ।**
**బ్రహ్మాత్మ దర్శనం యత్తు ప్రకృతేర్లాపనం హి తత్ ॥** **308**

దృశ్యమానమైన సమస్త పదార్థాలను భావించే చిత్తవృత్తులను, ఆయా సంస్కారములతో సహా బ్రహ్మరూపంలో చూడటమే మాయను లయం చెయ్యటం. జగత్తును లయం చెయ్యటమంటే ఇదే.

జగత్తులో దృశ్యమానమైన పదార్థాలనీ చిత్తవృత్తులచేతనే కలుగుతున్నాయి. ఇప్పుడు ఆ చిత్తవృత్తులు అన్నీ పరబ్రహ్మ స్వరూపమే. అని భావిస్తే మాయ కాస్తా లయం అయిపోతుంది. ఎప్పుడైతే మాయ లేదో అప్పుడు జగత్తు కూడా లయం

అయిపోతుంది. కాబట్టి **జగత్తును లయం చెయ్యటం అంటే జగత్తుతో పాటుగా జగత్కారణమైన చిత్తవృత్తులను కూడా పరబ్రహ్మ స్వరూపంగా భావించటమే** మార్గము.

**రజ్జ్వా ప్రతీతో భుజగో వివేకా ద్బుద్ధైర్యథా రజ్జుతయైవ గృహ్యతే ।**
**విలాపనం తజ్జగత స్తథాయం ప్రత్యగ్దృశా బ్రహ్మతయాపధారణమ్ ॥309**

త్రాడులో భ్రాంతి వల్ల కనుపించిన సర్పము జ్ఞానులైన వారితో త్రాడుగానే ఎలా భావించబడుతున్నదో, అలాగే జగన్నాశనము అంటే అంతర్ద దృష్టితో పరబ్రహ్మ స్వరూపంతో నిర్ణయించటమే.

యధార్థమైన జ్ఞానంతోనే కొన్ని వస్తువులు నశిస్తాయి. భ్రాంతిచేత కనుపించిన శుక్తి రజితాది పదార్థాలు ఇలాంటివే. ముత్యపు చిప్పను వెండి గిన్నె అనుకున్నారు. ఇది భ్రాంతి. భ్రాంతి గనక నశిస్తే ఈ భావన కూడా నశిస్తుంది. భ్రాంతిచేత త్రాడులో పాము కనుపిస్తోంది. భ్రాంతి పోగానే ఇది త్రాడు అని తెలుస్తుంది. యధార్థ జ్ఞానము కలగగానే అజ్ఞానము నశిస్తుంది. అలాగే బ్రహ్మమునందు మూలాజ్ఞానముతో ఈ జగత్తు కనిపిస్తోంది. అయితే ఈ జగత్తంతా బ్రహ్మమయమే అని తెలియగానే జగత్తంతా శూన్యమవుతుంది. బ్రహ్మము ఒక్కటే ఉంటుంది. కాబట్టి జగన్నాశనము పరబ్రహ్మ రూపంతోనే నిర్ణయించబడుతుంది. **జగత్తు నాశనమయితే సాధకుడికి మోక్షం సిద్ధిస్తుంది.**

కాబట్టి జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే. జగత్తేబ్రహ్మ బ్రహ్మమేజగత్తు. **'సర్వం ఖల్విదం బ్రహ్మ'** జీవాత్మ పరమాత్మ రెండు ఒకటే. జగత్తులో ఉన్నది పరబ్రహ్మము ఒక్కటే. **'బ్రహ్మసత్యం జగన్మిథ్య'** ఆ బ్రహ్మమే నీవు ఓ సాధకుడా! ఆ బ్రహ్మమే నీవు. **తత్త్వమసి** అంటూ గ్రంథాన్ని పూర్తి చేస్తున్నారు. వెలనాటి బ్రాహ్మణుడు, హరితస గోత్రీకుడు, శ్రీ క్రోవి పురుషోత్తమ శర్మ, శ్రీమతి లక్ష్మీనరసమ్మ గార్ల పౌత్రుడు, శ్రీ క్రోవి కృష్ణమూర్తి శర్మ, శ్రీమతి సత్యపర్వతవర్ధనమ్మ గార్ల జ్యేష్ఠపుత్రుడు అయిన క్రోవి పార్థసారథి. సర్వజనామోదము పొందునట్లుగా సులభశైలిలో వ్రాసిన **'మహావాక్యదర్పణము'** వ్యాఖ్యానము సమాప్తము.

**ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య మదశ్రీద్వైత విద్యాచార్య**
**శ్రీ భాష్యకార శంకర భగవత్పాద విరచితం మహావాక్యదర్పణం సమాప్తమ్**

సర్వేజనాః సుఖినోభవంతు సమస్త సన్మంగళానిభవంతు

ఓం తత్సత్